వశతఁ గృశించుతండ్రిఁ బితృవత్సల కానఁగ రాఁగ దయ్యె యీ
ర్ష్య శమదమాదిసద్గుణగరిష్ఠ నీసరి గారు మౌనులున్. 107

క. భీకర మమితవినష్టశ్రీకరము గరీంద్రహస్తశీకర మురుద
ర్వీకరము గానము ఘృతాగ్రీకరము మృగాకరము భరము చరియింపన్. 108

వ. మఱియును. 109

లయగ్రాహి.

ఘూకము సముచ్ఛ్రితమధూకము భయంకరశమీకము మహాద్రుపదనేకము జలన్ని
ర్మోకము సమావృతవనౌకము ప్రభూతరుతకాకము ద్వీపివ్రజసమీకము గరీంద్రో
ద్రేకము హయద్విపదనీకము భుజంగయుతరోకముఁ బ్రచంక్రమణకోకము విరహా
లోకమురుకాననము నోకముగఁ జేసి యిటుశోకముల ముంచి జనలోకము గృశింపన్.

సీ. కటకటా కంటకోత్కటకుటోత్కరములు, పాదలు మవ్వంపుఁబూఁబొదలె నీకు
నుష్ణకరోష్ణకరోచ్ఛాదితాశ్మము, ల్బఱపైన పఱుపులే పట్టి నీకు
ననవొంద మంగళహారతు లాసఁగెడు, గోతులే కోఁతులు కుఱ్ఱ నీకు
దుష్టచేష్టాప్రతికృష్టాశరుల కోడిగములు నిద్దపుటూడిగములె నీకుఁ

గీ. బాయుఁడు తోలంగుఁ డని బరాబరులు సేయు, బంట్లె కడుదుండగపుటెల్గుబంట్లు నీకు
డంబుమీఱిన మణిఖచితంబులైన, గృహములే నిండితపుగొండగుహలు నీకు. 111

క. వినుతగుణ నీకుఁ దళవే, శ్మనివాసముఁ గూర్చెఁ గడు నసాధ్యము గలదే
విను శర్కర మెసఁగిననోటను చేదు భుజింపఁజేయు టక్కరివిధికిన్. 112

సీ. ఘనశివాలాపము ల్విని సంతసిలు నీవు, ఘనశివాలాపము ల్వినియె దింక
మావుల నెక్కి క్రుమ్మరుదు నీవు పండ్లకై, మావుల నెక్కి క్రుమ్మరియె దింక
గోపురంబులనీడఁ గూడియుండెడి నీవు, గోపురంబులనీడఁ గూడె దింక
స్వర్ణోటజంబులఁ జరియింపఁ దగు నీవు, పర్ణోటజముల పాల్పడియె దింక

గీ. నాకులమెకించుకయు లేక రాకుమారు, లెలమి సేవింపఁ బెంపు వహించు నీవు
నాకు లాగిరాల భయదప్రాకువార, మలమికోనఁ గంపము వహింతు వనఘ యింక

ఉ. నీముఖచంద్రమండలవినిర్గతసుస్మితకౌముదీరుచి
స్తోమము నీమృదూక్తిపరిశుద్ధతయున్ భవదంగకస్ఫుర
చ్ఛ్యామలిమం ద్వితీయజలజాతవిలోచనసౌష్ఠవంబు శ్రీ
రామ సుమంబు గొన్న మునిరాజియు మోహము నొందకుండునే. 114

క. వాత్సల్యమహిత నిను సాంవత్సరికులు దొల్లి చక్రవర్తి వగుదు నా
వత్సముని వై చతుర్దశవత్సరములు నడవిఁ దిరుగవలసెనె నీకున్. 115

క. అన్న సుమిత్రాసుత మీ, యున్న ధరిత్రీసుతాసహాయత వనమం
దున్న యపుడే మఱక కొలు,వన్ని వరిగెదవు ధైర్యవంతుఁడ వగుటన్. 116

వ. అనిపలికి కోడలిం జేర్కొని. 117

క. రాలచ్చి విడచి యేసుకు,బాలవజీయుండు గ్రాల బాలనునిప్పు
డ్రాలను విహరింపను జవ,రాలా నీ వేమి పేదరాలవె చెపుమా. 118

వ అని మఱియుం బరిభ్రమితాంతరంగుం డగువమ్మహీకాంతుండు. 119

ఉ. వేగము గాఁగ నేగురఘువీరుని తేరగపాటు లేమిఁ జిం
తాగళితాంతరంగగతిఁ దద్రథకేతనదీప్తిఁ గాంచుఁ ద
చ్ఛ్రీ గనరామి వేదనను జెంది తదుద్ధితధూళిఁ గన్గొను
న్రాగముమీఱఁ దద్రథపరాగము గానక వంతఁ జేడ్పడున్. 120

గీ. మఱియుఁ బెక్కుగుగతుల నమ్మనుజనాథుఁ, డగ్రభార్యావరసతీసహాయుఁ డగుచుఁ
జిత్తమున నుత్తలము గడుఁ గ్రొత్తసేయ, నుల్ల ముడుకఁ బ్రలాపించుచుండునంత

మ. ఉదయంబుం డేటికిఁ బౌరులార వనవాసోద్యోగమంచుం గడు
న్నడువ న్మానక వెంబడింపఁగ సుమంత్రుం డెంతయు న్వంతఁ బెం
పడరం జయ్యనఁ దేరు దోల రఘువంశ్యస్వామి శ్రీరాముఁ డ
ప్పు డరణ్యంబున కేగె సానుజుఁడు భూపుత్రీసమేతంబుగన్. 122

చ. చనునెడ సౌరభంబు వెదచల్లఁగఁ జల్లనిగాలి తమ్మెదు
ర్కొనఁ గొనలేనివార్గ మునకు న్నిలయం బగుదాని మీనపా
కనిబిడపుండరీకజలకాకబలాకసమీకచంచరీ
కనినదకోకకోకనదక్రమతగం బగుదాని నెంతయున్. 123

ఉ. పావనచారుజీవనశుభం బగుదాని సమస్తజంతుసం
జీవన మైనదాని మునిసేవిత మైనతటంబుదాని రా
జీవనటన్మధువ్రతవిశేషరుతాకవితోల్లసద్ద్రుమా
విష్కృత మైనదాని సరసీమణి నుత్తమసాతరంగిణిన్. 124

వ. కనుంగొని తత్తీరలతాకుంజపుంజంబు లవనిజకుం జూపుచు రాముండు వెండియు.

సీ. అవలోకనము సేయు కువలయానందంబు, లీవనతమసానదీవనములు
చూడు ప్రవాళసంశోభితంబులు దగు, నీవనతమసానదీవనములు
గనుఁగొను మెంతయుఁ గమలామనోజ్ఞము, లీవనతమసానదీవనములు
సుదతి వీక్షింపుము సుస్వాదుఫలదంబు, లీవనతమసానదీవనములు

గీ. గుసుమమృదుగాత్రి విపులసారసహితములు, తెలియు మీవనతమసానదీవనమ్మ
లనుచుఁ గాంతకుఁ దెల్పుచు నచట విశ్రమించెఁ బౌరసుమంత్రసౌమిత్రు లలర.

వ. అంత.

అ. కాంతతోడ భయద కాంతారమున నిజాన్వయుఁడు తిరుగఁ జూడ వచ్చునెట్టు
లని యద్భుతుఁ డయ్యె నవఁ గ్రుంకెఁ బద్మినీకాంతుఁ డంశుమాలి కాంతిమాలి.

క. అట్టియెడఁ దమమనంబుల, ముట్టిన శోకాంధకారమునకు మెఱుంగు
ల్వెట్టి తమ మదరఁ జీఁకటి, చెట్టులక్రియఁ దోఁచెఁ దరువిశేషము లెల్లన్. 129

వ. ఇట్లు నిశాసమయం బగుటయుం గృత్యంబులు దీర్చి తత్తరంగిణీపయఃపానంబునం
బరమానందంబు నొందుచు లక్ష్మణసంకల్పితం బగుపర్ణపర్యంకంబున నాయంతః
ప్రియాసహితుండై సుఖనిద్రితుం డయ్యె సుమంత్రుండును దక్కిన పౌరులును
దృణపాషాణపర్ణ నిజబాహుదండంబులు శయనోపధానంబులుగా శయనించియు
న్నంత నంతరాత్రంబున నరేంద్రుండు మేల్కని సీతాలక్ష్మణసుమంత్రులఁ బ్రబో
ధించి వారలతో రహస్యవచనంబుల నిట్లనియె. 130

చ. మనము సమస్తపౌరజనమాన్యుల మై యడవి న్వసించిన
న్మనమున నొందు గాఁక ననుమానము నొందెదుఁ గాక గాన ని
వ్వనమున వీరి డించి పెనువంచన నేగుద మొండుచోటు కీ
జనులు నయోధ్య కేగుదురు సత్వరులై మనచొ ప్పెఱుంగమిన్. 131

వ. అని తనమనోనిశ్చయంబు వారల కెఱింగించి యప్పుడ. 132

క. దీర్ఘాధ్వరులు పౌరులు, గాఢతరసుషుప్తి నున్నకాలమున రథా
రూఢుఁ డయి రాఘవుండు ని, గూఢస్థితి నేగ నంతఁ గొంతతడిలోనన్. 133

చ. తొగ రగుఱేఁడు దమ్ములకుఁ దోడు నివంబులఁ దోలువాఁడుఁ గా
దొగలకు సూడు జక్కవలదోయికి నెంతయు నింతనెయ్యపుం
బగ లొనరించువాఁడు గడుఁ బచ్చనితేజులవాఁడు వేడుకం
బగ లొనరించువాఁడుఁ గనుపట్టెను తూరుపుమెట్టుపట్టునన్. 134

చ. పురజను లంత మేలుకని భూతనయాపతి లక్ష్మణాగ్రజుం
డరిదముతో సుమంత్రయుతుఁడై తము వంచనఁ బాసిపోవుటం
బురపురఁ బొక్కి పంక్తిరథపుత్రుఁ డయోధ్యకుఁ బోయె నంచు నే
బురమున కేగుదెంచిరి ప్రభూతఘనార్తరవంబు లిచ్చుచున్. 135

క. విపరీతస్థితి మెలఁగక, నపగతరోషుఁ డయి ప్రజల నందఱఁ బ్రజలా
గృపఁ బ్రోచినక్రియఁ గాచిన, నృపతిం బాయంగనేర్తు రెట్లు జనంబుల్. 136

ఆ. ఇట్లు వచ్చి మిహిరహీనాంబరమువోలె, రామరహిత మగుపురంబు సొచ్చి
యేమిసేయు దింక నెవ్వరు మనకుది, క్కనుచు వగచుచుండి రంత నచట. 137

మ. నిజమాయాపిహితాంతరంగు లగుచు న్నిద్రాసమాసక్తిఁ బౌ
రజనంబు ల్శయనించియున్నతఱి శ్రీరాముండు గోత్రాసుతా
నుజసంయుక్తముగా రథస్థుఁ డయి మాన్యుం డాసుమంత్రుండు వా
యుజవస్ఫూర్తి హయంబులం దఱుమ నయ్యుగ్రాటవిం బోవుచున్. 138

ఉ. అంతట నంశుమంతు నుదయంబున సంతమసం బదృశ్య మై
సంతస మావహింప నృపచంద్రుఁడు రాముఁడు చారుసౌరభా
త్యంతలతాంతకాంతగహనాంతరసంచరితాళిపాళికా
క్రాంతసరస్సరోజనికరంబులు చూచుచు నేగి ముందటన్. 139

మ. అవలోకంబులకుం బ్రియం బెసఁగు గోష్ఠాభీరపల్లీస్ఫుర
న్నవవల్లీగిరిపక్కణంబులు నరణ్యంబు ల్గనుంగొంచు సీ
త విలోకింపుము నీవటంచు విలసత్కంజాతసంజాతమో
దవతి స్వేదవతిం గనుంగొనియె నుత్కంఠం బకుంఠంబుగన్. 140

క. కని తత్స్రవంతి సత్తీరనిరూఢలతాలతాంతరమణీయతకు
న్మనమునఁ బొంగుచు నటఁ గడ, చని సరయువు దాఁటి రామచంద్రుం డవలన్.

వ. అభంగరంగత్తరంగాధారం బగుగంగాతీరంబున విఖండితదుష్టమృగాస్పక్కణం
బగు నొక్కపక్కణంబు గనుంగొని తత్సమీపంబునకుం జని. 142

క. బహునియమాయాసవహు, న్మహున్మహుగ్గతముద్రశుముక్తానివహుం
గుహుఁ గని రఘోచ్చవిక్రమ,గుహు సద్గుణగణగుహు రఘుప్రవరు లాగిన్. 143

వ. ఇట్లు కనుంగొని రయ్యవసరంబున. 144

చ. రభసములో నిషాదపతి రాము నెదుర్కొని సద్వినీతిభ
క్తిభరితమానసుం డగుచుఁ దియ్యనిమాటల నాదరించి త్వ
చ్ఛుభతరదర్శనంబున విశుద్ధమనస్కుఁడ నైతి నంచు వీ
తభయుఁ డెసంగ నర్ఘ్యసహితం బగుపాద్య మొసంగి వేడుకన్. 145

క. నీపదశౌచజలమునకు, నాపదలం బాపుహరజటాంతరపదసం
దీపితవర్తన యైనసు,రాపగకును వేఱు గలదె యని తజ్జలమున్. 146

వ. శిరంబునం జల్లికొని వెండియు. 147

చ. గుహుఁడు నమస్కరించి నృపకుంజర కుంజరకుంజరమ్య మీ
గహనమునం బ్రియానుజులఁ గైకొని యిట్లు చరింపఁగా మహా

మహాత్ముఁడవు నీకుఁ జన్నె గుణమండన నావుడు వానికి రఘూ
ద్వహుఁడు నిజప్రవృత్తి విదితంబుగఁ దెల్పి సంతసించుచున్. 148

తే. రామచంద్రుఁడు నాఁ డారాత్రి మధుర, వివిధ వనరసఫలముల విందొనర్చి
వరధనుర్ధరుఁ డగు సోదరుఁడు గొలువ, నధికకృప సీతతో నట నధివసించి. 149

క. గుహుఁడును సుమంత్రుఁడును దను, బహువిధములఁ గొలువఁ బర్ణపర్యంకమున
ప్రవహి నిదుర జెంది రాముఁడు, మిహిరోదయమునను మున్న మేల్కాని సరగన్. 150

వ. సమయసముచితకృత్యంబులు నిర్వర్తించి నిజసేవాపరతంత్రుఁడు సుమంత్రుఁ గనుంగొని.

క. సముచితము గాదు రథయానము మాకిట మీఁదఁ గావున మరల సాకే
తమునకుఁ గొని చనుమీ యరదము నీ వను నతఁడు దత్తహ్లాదయుఁడై.

చ. అటువిని మిన్నుమడించి పురి కారడి శూన్యరథంబుతోడ నే
నెటువలెఁ బోవువాఁడ మును చేరని పఙ్క్తిరథుండు సాదరో
త్కటహృదయంబుతో నడుగఁ దత్పతి కేమని తెల్పువాఁడ నీ
కిటుగతిలేనివాఁడ ధర్మ మగునే విడనాడకు మిందె యుండెదన్. 153

చ. అనవుఁడు రాఘవుండు భవదగ్రసుతుండు సతీసహోదరు
ల్దనుఁ గొలువంగ నెంతయు ముదంబున నిష్కలిఁ బోలెఁ గానసం
బున నొకయింతవింతయును బొందనిడెందముతోడ నున్నవాఁ
డని వినిపించి మజ్జనకునార్తి హరింపఁగ నీవు పోవవా. 154

గీ. అనిన నేమియు ననుటకు ననువులేమి, నాసుమంత్రుఁడు శ్రీరామునకును మ్రొక్కి
కొని యయోధ్యకు నేగ నెక్కొనినచింత, రథముతోడ విపులమనోరథముతోడ.

వ. తదనంతరంబున. 156

మ. విలసద్వేషులు వీతదోషులు జగద్విద్వేషవిద్వేషు ల
జ్జ్వలసంతోషవిశేషభూషితమనీషాశ్లేషు లానందభా
షులు నిర్దోషులు ముఖ్యసత్త్వగుణమంజూషుల్ జిగీషుల్ హితై
షులు సత్పోషులు రామలక్ష్మణులు సంస్తుత్యాభిలాషుల్ గడున్. 157

వ. చని చని. 158

మ. ఘనసౌగంధికగంధవాహచలితక్ష్మాభృల్లతావాలము
న్వినుతాభంగతరంగశీకరసమావిర్భూతశైత్యోల్లస
న్మునిసంకల్పితపర్ణవేశ్మసువిధామోదైణశార్దూలము
న్గని రస్తోకవిశాలము న్మహితగంగాప్రోదినీకూలమున్. 159

క. కని జనకసుతాయుతుఁ డై, చని మధుకరమధురనినదసంభృతవికచా
బ్జాటన్మరాళసితగరు,దనుపమధౌతపరిధాన యై తగుదానిన్. 160

క. ఖ్యాత మగు దాని గంగా, ఖ్యాతం బగు దానిఁ గుముదఘనకమలాసం
ఖ్యాత మగు దాని జనసౌ, ఖ్యాతతశీతలజలప్రియం బగు దానిన్. 161

సీ. తలఁచినయంతమాత్రన జగజ్జనముల, కానందసంధాయి యైనదాని
బ్రహ్మహత్యాదిపాపంబులనైన భస్మంబు గావించెడు మహిమదాని
హరజటాస్థలినుండి యవతరించినదాని, రమణీయబహుళతీరముల దాని
సగరవంశజులఁ బుణ్యగతి కనిచినదానిఁ, బరమపవిత్ర నాఁ బరఁగు దాని

గీ. సర్వతోముఖ యనుట నిజంబు గాఁగ, నలిమలసమావృతము లగునంబుజంబు
లలరఁగ సుగుణనడి మించు నలికములను, నొప్పుచుఁ లికెడు జాహ్నవి నొనరఁ గాంచి.

వ. తత్స్వవిధవిధవిశేషంబులకు సంతోషంబు నొందుచున్న యవసరంబున రాముం
గనుంగొని లక్ష్మణుండు. 163

క. గంగాసరసి నిరంగ కని, భంగజశరకుముదభంగ యై సుడివడఁ జ
ల్లంగడఁగిరి శశిరత్నై, భృంగీకాంతలు పరాగరేణువు లనిశమ్. 164

క. నిజభావంబునఁ బొంగి మనుజనాయకుఁ డపుడు లక్ష్మణున కిట్లనియెం
ద్రిజగత్పావని యీగంగ, కుజనుల కీచెంత నిలువఁ గొఱగాదు సుమీ. 165

వ. అని మఱియు ననేకవిధంబుల నన్నదీమచర్చికఁ జర్చింపుచుం జనకసుతాలక్ష్మణ
సహితుం డై రఘునాయకుండును గుహుండును నావియందుగా నోడ యెక్కి సితగరుద్ద
రుత్పంథనంబు గాంచి బంధురకమలకైరవసుగంధం బాస్వాదించి తుంగతరంగఘట్టన
నించుక పొడవి శీతలశీకరంబుల యూతఁగొని మందమందగమనంబున నెదురొ
ను మరుత్కిశోరస్పర్శనంబున మ్మోదంబు నొందుచుం దనకనూతనతనూవిలసనంబు
నిశాంతిరస్ఫురదాత్మీవశోకన దీక్షణంబుల నిరీక్షించియుం దనివిసనక తనువెల్ల నయ
నంబులు గావించికొన్నవనువుసం గండుగండకంబుపిండులమండిత యగు భాగీరథి
ను తరించి పంచుటారులను కోకలు వటిచి కేకీకేకారవవ్యాజంబునం బిల్చుచున్న
యవ్వలియొడ్డునం దరణిడిగి కొమ్మలను కొమ్మలు ముమ్మరమ్మునం గ్రుమ్మరించు
సుమమ్ములను నాచారలాజమ్ములకు సమ్మతించుచు గుహునిం బహుమానపూర్వకం
బుగా వీడుకొని ఛాయామూలంబులునుఁ బుచ్ఛశలాటుకంబులునుం బత్రపత్రంబు
లును ముఖకోరకంబులునుం గలిగి జంగమకింశుకంబు లనం గగనంబునం బారు తె
పాఱుశుకనికరంబుల నాలోకించుచు విశీర్ణజీర్ణపర్ణంబుల నించుకించుక గనుపించు
పాషాణంబులయందు ఘలకలు వెట్టుకొని నిద్రించు కొండచిలువలకును విభేదంబు

పరిశోధించుచు సుమిత్రానేకాశోకానోకహమండంబు దవదవసమావృతస్థలంబు గా
శంకించుచు మొట్టమొదలులం బుట్టలు దిట్టలుగ దొట్టినం బట్టుపుట్టంబులు చుట్టు
గట్టికొన్నట్లు గన్పట్టు ఓడలఁ జెట్టులతిట్టలకడ నిలువక దుస్తరంబు లగుకంటకప్రస్త
రంబులవలనను జాయసౌరభలతాంతలతావితానంబులవలనను భయంకర ఫుంఫ
రీక భల్లూక సమీకంబులవలనను సారకృష్ణసారకకిశోరవారభసలకిసలవిసరంబులవల
నను మనోభిరామభీమంబగుగహనకదధ్వగమనపరిశ్రాంత యగు నిజకాంత నుద్దే
శించి లక్ష్మణుం డనుంగొని. 166

చ. అడవి భయంకరోరగసమావృత మెంతయు సంకటంబు న
య్యెడ విహరింపఁజాలవు చుమీ వలదంచుఁ గడు న్వచించు నా
నుడి విన కిందు వచ్చి యతనశ్రమపాల్పడి కంది కుందె వె
న్నడివిధి యేఁచ నేరికయినం దలమే దలఁగంపలంపఁగన్. 267

క. నడికెతుఁ జిత్తములో నెన్నఁ డెఱుంగని యట్టి యడవినడుమం ద్వరతో
నడువంజాలదు జానకి, నడుమల్పము గచభరం బనల్పం బగుటన్. 168

క. ఫుల్లాబ్జనేత్రపదముల, నల్లికొని తీవ లొప్పె నతివ మృదుతనూ
వల్లికి నోడి కడుం బ్రణ,మిల్లి పదద్వయము పట్టి మిడికెను కరణిన్. 169

వ. అని పల్కి మఱియు నమ్మహారణ్యమార్గంబునం జనునవసరంబున. 170

సీ. క్రోడవిదారితక్షోణితలముఁ గనుం,గొన్న నిపాతులు దున్నిరనుచు
శల్యకప్రఖనితస్థలములు గనుఁగొన్న, మునులు మంపలు ద్రవ్వికొనిరటంచు
ద్విరదనిపాతితోర్వీజము ల్గనుఁగొన్న, నురుఫలభారత నొరగె ననుచుఁ
బొదలనిద్రించుబెబ్బులులశరీరంబు, లరసిన బర్హిబర్హంబులనుచుఁ

గీ. కలభములఁ గన్నఁ బెనుగండశిలలటంచు, గుహలు గనుఁగొనఁ దపసులగృహములనుచు
నెఱుఁగకుండ వచించుఁ దా నెఱిఁగియేని, సీత భయమందు ననియెడు చింతకతన.

వ. తదనంతరంబున నయ్యన్నదమ్ములు. 172

క. ఘనకలుషపిశాచసువ్య,ర్శనము సుదర్శన మనం బ్రశస్తము గుసుద
ర్శనతీర్థముఁ గని యచ్చట, ననఘులు నివసన మొనర్చి రా రేయిఁ దగన్. 173

వ. మఱునాఁ డరుణోదయంబునం గృతకాల్యకరణీయులై సీతాసమేతంబుగా నయ్యు
సహోదరులు ధనుర్బాణంబులు సహాయంబులుగా నాఁడు మూఁడుయోజనంబు
లరిగి. 174

క. పటువిషమస్థలభయదా,నటమము ఖపురసాలతాలవటముఖతరుసం
కటమగు నటవిం జని యయ్యుత్కటము నల ప్రయాగవటముఁ గని దాశరథుల్. 175

ఉ. భూజనవంద్యుఁ జాపసవిభుం జతురాననసన్నిభుం భర
ద్వాజుని సంశ్రితాంగణవివర్ధితకల్పమహీజు నిందిత
వ్యాజుని ధిక్కృతేంద్రియమహారిసమాజుని భాస్కరోల్లస
త్తేజునిఁ గాంచి చేరఁ జనుదెంచి నతించి నమస్కరించినన్. 176

శా. వారి న్సాదరబుద్ధి మీఱఁగ భరద్వాజుండు మన్నించి త
ద్ఘోరారణ్యపటుప్రవర్తనకు హేతుత్వంబు నిత్యాత్మబో
ధారమ్యంబు దనంతటం గని సమాధానార్ఘ్యపాద్యాదిస
త్కారంబు ల్పచరించి మూలఫలశాకంబుల్ సమర్పించుడున్. 177

క. అవియన్నియు నవిఘ్నస్వాయు, లవిరళసంతోషు లగుచు నందికొని మనో
జ్ఞవచోరచనలఁ గడు న య్యవనీసురవర్యుఁ బొగడి యమ్మాత్మపుత్రతిన్. 178

క. తలఁగడలు గాఁగఁ దమకరతలములు గావించి యొండుతలపు లుడిగి వెం
దలమగు దలకృతశయ్యాతలముల నిదురించి రొక్కతలముని వొగడన్. 179

వ. అంత. 180

క. మిహిరాని కాయ మడుపుచు, మిహిరోదయ ముదయశిఖరి మెఱయు మనిస్వా
మిహితాదేశంబున న మ్మహితాత్మకు లరిగి యరిగి మార్గములోనన్. 181

చ. కని రలచిత్రకూటము నగాధరఘూర్ణిభయపార్శ్వరోధరూ
ఘనిబిడవల్లరీపటునటన్మధులిణ్మృదుగానభాసమా
ననవలతావితాన లలనాకృతిచారుతరోపగూహనో
జ్జ్ఞితనిరంతరప్రమదసద్విటసవ్రజచిత్రకూటమున్. 182

గీ. కాంచి యట పర్ణశాల నిర్మించి చిత్రకూటకూటమహోత్కటకటనికటగు
హోగృహావిహారకిన్నరీహారితరసు,గాననిస్స్వానసమ్యగాకర్ణు లగుచు. 183

చ. వలసినకందమూలరసవత్ఫలపుష్పరసత్ప్రవాళము
ల్ప్రాలఁ బుగ సంగ్రహించి మహిపుత్రి కొసంగుచు దుష్టదంష్ట్రిలం
బులులను దుర్వృకంబులను బొబ్బమెకంబులఁ బింగదృష్టులం
బులుఁగులఁ దోలుచు న్ముదముఁ బొందుచు నందు వసించియున్నెడన్. 184

క. రహితనయుఁ డొక్కదనుజుఁడు, మహితనయానయముఁ గాంచి మాకశివపువు
స్వీకరించి నిజనిశాతనఖవాతిఁ గుచాంతరముఁ జీరెఁ గాముకవృత్తిన్. 185

సీ. జీవితేశ్వరి నిటు చిరజీవి సేయు, దండగంబుల రామవిభుండు చూచి
కనలి మంత్రించి యొకయిషీకంబు వైవ, నది భయంకరతరశర మగుచు నిగిడె. 18

శా. మంటల్ మండుచు విస్ఫులింగములు వోడ్కం దక్కాలంబంబు వె
న్వెంటం గెంటు శరణ్యశూన్య మగుచు న్విభ్రాంతహృద్గ్రంథి యై
మింటం బర్వులువాఱుచుం గహనవల్మీకంబులం డాగుచు
న్మంటిం జేరుచు నొచ్చె నిట్లు శ్రమక్రమ్మం గాకి యేకాకి యై. 187

క. దిక్కులు పదియును గ్రుమ్మరి, దిక్కెవ్వరు లేక రామదేవునిపదము
ల్దిక్కనుచుఁ దలఁచి యాతని, దిక్కెమొగం బరుచు నేకదృష్టి మరలుచున్. 188

క. ప్రేమసి నిట్లు లలంచిన, వాయసముం గాంచి దీనవరదుఁడు రాముం
డాయెడఁ ద్వన్న యనము మ,త్సాయకమున కొసఁగు మిది ప్రశాంత మగుననన్.

గీ. నెమ్మనమ్మున వాష్పమ్ము గ్రమ్మికొన ఘ,నమ్ముగానమ్మనకు నయనమ్ముసంగి
యత్యరిష్టంబు నొందుచు వరిగెనయ్య,రిష్ట మప్పు డరిష్టంబు రిష్టమగును. 190

వ. తదనంతరంబున. 191

క. చక్షుశ్శ్రవ దారుణవా,ర్యక్షహాయవిపక్షయక్షరక్షోగణదు
ర్వృక్షశరవృక్షుబుక్షత,రక్షక్షుభిత మగునయ్యరణ్యక్షోణిన్. 192

వ. సీతారామలక్ష్మణులు నివసించి రంత నక్కడ. 193

ఉ. దైన్యరసాశ్రయాననుఁ డధైర్యుఁడు నైనసుమంత్రుఁ డంతయున్
శూన్యరథంబుఁ గొంచుఁ బురిఁజొచ్చిన వచ్చినవాఁడు లోకస
న్మాన్యుఁడు రామచంద్రుఁ డని నాగరిక ల్గనుఁ జట్టుముట్టి రా
జన్యనిలేమిఁ గాంచి సవిషాదము నొందుచుఁ దన్నదూఱుచున్.

క. వగపున రాముని వార్తలడిగిన, బ్రత్యుత్తరము లుడిగి తేఱ వడిం
డిగి చెక్కులు గన్నీటఁగ,డిగి పొరలెను రాజుఁ గని కడింది యలంతన్. 195

చ. దశరథమేదినీరమణ తావకపుత్త్రులు రామలక్ష్మణు
ల్విశదమనస్కులై విపినవీధి ధరాతనుజాసహాయులై
కుశలత నున్నవారు నృపకుంజర వారు వనంబునం జతు
ర్దశసమయాబ్దముల్ త్రుటివిధంబునఁ బుత్తురు వత్తు రొప్పుగన్. 196

వ. వారిం దలంచి విషాదంబు నొందం బనిలేదు. సుఖంబున నున్నవారని పల్కి వెండియు.

క. అవనీశ వినుము పదినాల్గవది యైనయేఁటికడపల న్నిజముగ ని
న్నవలోకించెద మనుచున్, భవదీయతనూజు లనినపల్కులు వింటే. 198

చ. అనవుడు గుండె ఝల్లుమన నన్నరనాయకుఁ డగ్రపుత్రుఁ జే
రొకని తరుణీసహోదరులఁ గూడి వనంబు మనంబునన్ ఘనం

జనితలపోసి తండ్రి మృతుఁ డయ్యెడు నాదెసనైన శోక వే
దనని చింతసేయవుగదా తగదా దయ దానవాంతకా. 199

క. విను తనయ మునివినుతనయా, నినుఁ గనుభాగ్యంబ కాని నిరతము నను దగ
న్నినుఁ గనుభాగ్యము నోఁచను, మునుఁ గను పాలైతి దుఃఖమున మునుఁగంగన్.

చ. నను విడనాడ నీకుఁ దగునా తగు నాదగునార్తి దీర్ప నే
యనువున నైన నిన్ను తనయా తనయా తనయాత్మజన్ము చే
త నణఁచుదండ్రి నేరుప సదాపసదాపసదాసకోటుల
న్వనిగనబోదు వీవు. సుమనస్సుమనస్సుమన ర్తనాళివై. 201

వ. అని మఱియు ననేకవిధంబులం బలవించి వెండియు రామలక్ష్మణులం దలంచి.

చ. నిమిసము తాళఁజాలఁగల నే కలనేనియుఁ గానరాయ దై
న్యమున వనిం జరింపనవునా నవునా నను లొచుఁ గన్నదో
యిమిద మొనర్పకున్న మెయి నేమెయి నేధరియింతుఁ బ్రాణమో
కమలదళాక్షులార మిముఁ గన్గొనుకందయ రాదు నామదిన్. 203

క. పాపాత్ముఁడ నిక్కమునుఁడు, గాపురుషుఁడు ననుచు నగుమొగంబులు నాకుం
జూపర చూపఱ చూపఱ, శాపదలకు నోర్చి యడవి కరుగం జనునే. 204

వ. తదనంతరంబునం గోడలిఁ దలంచి. 205

క. తరణికరతప్త మగువన,ధరణి న్నడువంగలేక తాపము మిగులం
దరుణీ తరునీడలఁ గా,తరునింతియుఁబోలె మెలఁగదవె విధిచెయిదిన్. 206

వ. అని పలవించి వెండియు. 207

ఉ. డాయను రారదేమి చెప్పడా యనుఁ గానమె కాలు మీకుఁ దో
డా యను నొండ్లు మీకుఁ బురుడా యను నావెతఁ దీర్చువాఁడు లేఁ
డా యను రామ నీకయిన నక్కటికం బొకయింత లేదు నా
డా యనుఁ దమ్ముఁ డాయను మహాటవి కేగితె పుత్రుఁడా యనున్. 208

క. అని మఱియుఁ జెక్కభంగులఁ, దనయులఁ గోడలిఁ దలంచి దశరథుఁ డతిశో
కనిమగ్నుఁ డైనఁ గనుఁగొని, యనియెం గౌసల్య శోకసామగ్ర్యమునన్. 209

ఉ. నీకు విచారమేల ధరణీవర మేలతలంచి నాఁడ వ
శ్యైకమనంబు నొచ్చ మముఁ గన్గొన నీపిపు డిందువచ్చుట
న్నీకు విచార మీకరణి నీరుగఁ జేసెఁ గులంబు నెల్ల నా
హా! కరుణంబు దక్కి భవదగ్రసుతుం బెడబాయ టర్హమే. 210

చ. కలలోఁ దోఁచుసమస్తవస్తువులు నిక్కంబంచు భావించు మొ
క్కలువందంబున రాజ్యభోగములు వేక్కన్ నమ్మి నాపుత్రు నీ
కలుగం ధర్మమె పుణ్యకర్మమె దురాత్మా యీఁగఁ గా గాసి న
క్కలపాల్సేసినచందమయ్యె భవదాజ్ఞాగౌరవం బియ్యెడన్. 211

వ. అను నప్పలుకులు ములుకులక్రియం జెవిసోకుట యు నప్పుడమిఱేఁడు. 212

క. నాకడఁ బుత్రులు మెలఁగమి, నా కడలు విశేష మగుచు నాత్మకొనియె నా
హా కమలపత్రనేత్ర మ,హాకష్టం బుత్రశోక మన మును వినవే. 213

ఉ. అనఁగుమోముసొంపు మెఱుఁగారెడు చెక్కులపెంపు గెంపుఁడా
లూనినమోవియింపు మధువొల్కెడు పల్కులతెంపు దీనసం
తానముపైఁ దలంపు సుఖదంబులవై నిటులేవగింపు మ
త్సూనుని యందకాని మఱి చూడఁగ నెయ్యెడనైనఁ గల్గునే. 214

క. ఓరుగువ యనుశ్వసనము, నా మేన వసిపజేయు నాకవళమగు
ప్రాణద్రోహికిఁ బ్రాణముతో మనఁగా నెట్లువచ్చుఁ దోయజవదనా. 215

గీ. హృదయము గలంగి నాముఖ మివురఁ జొచ్చె, శయ్యదలపోయఁగానంపశయ్యయయ్యె
గాయ మగ్గిఁబొరల్చినకరణి యయ్యె, నింతి బలవంత మగు పెనువంతకతన. 216

చ. అదియటులుండె విన్ము జలజాసన నాచిననాఁడు వేఁటకై
యదురితహేతుఘోరమృగయావ్యసనగ్రసనాత్మకుండనై
సదమలచారుశ్రీరతమసానదిచెంత నెసంగు కాననం
బు దరిసి యొక్కయంధసతమోనివహంబునకుం దలంకకన్. 417

ఉ. అంబుజపత్రనేత్ర శరభాదిమృగంబుల వేఁటలాడు కా
లంబున మాతులాపక జలంబులకై యొకబాలకుఁడు వే
గంబున వచ్చి కుండ నుదకంబులు ముంపఁగ శబ్దభేదిబా
ణంబునఁ దద్రణంబుఁ గరిఘోషణం బని కూలనేసితిన్. 218

క. కటకట తలిదండ్రుల నగ్రకటు నిడికొని మోచితెచ్చి కడునంధుల కు
త్కటముగ నొదవినతృషఁ దీర్పట కచ్చోటు కరుగుదెంచుచోఁ బేర్వెఱుఁగన్

వ. ఇట్లు వచ్చి మద్బాణవినిహతుం డగుమునిసుతుండు. 220

గీ. బాణహతి నిప్డు వెడలుప్రాణములకు, వగవఁ గన్నులు గానక వార్ధకదశ
నున్న మీదగుపుత్రశోకోపహతిని, దలఁచి పొక్కెద నోతలిదండ్రులార. 221

క. అని వగచుచుఁ గూలినఁ దన్మనుజధ్వని కెంతయు న్మనం బవియఁగ నేఁ
జని కాంచితిఁ దత్తటమ్మున, మ్మునిసుతు మద్బాణనిహతు మోహావిరహితున్. 222

వ. కని శీతలజలంబులం దన్నయనముఖప్రక్షాళనంబు గావించుటయు. 223

చ. ననుఁ గనువిచ్చి చూచి నరనాథ యెఱుంగమిఁ దప్పుచేసితి
వ్వని మదిలోఁ గ్రహించినఁ గృపారహితాత్ములై రయంబున
న్నినుఁ బొలియ న్మదీయజననీజనకు ల్శపియింతు రిప్డు నే
ర్పునఁ జని నీవు దెల్పుము తపోమహితవ్రతు లైనవారలన్. 224

వ. అని యిట్లు. 225

క. తనతలిదండ్రుల సంప్రార్థన మొనరింపు మని చెప్పి తత్తనయుఁడు వేఁ
దనువు విడచి చనియెఁ బ్రాక్తనజన్మకృతంబు లెట్లు తప్పింపఁగన్. 226

వ. అంత. 227

క. వమ్మగు నాముభవమ్ము ధ్రువమ్మను వెనుచింతతో జనమ్మున మద్భా
గ్యమ్మన నుడుకుచు శిశు కళవమ్మును గొనిపోవఁ బడసినమ్మై విని వెసన్. 228

క. అమ్మునివృద్ధులు సుతుఁ డని, నెమ్మనముల దలఁచి పుత్ర నీవిటుఁ దడయం
గ్రమ్మిన వగపెల్లను మా, యమ్మయు నేమను భయంబు నందితిమి గదా. 229

చ. కడుముదుసళ్ళముం గనులు గానని వారము నైనమమ్ము ని
య్యడవి విడిచి విన్మ తనయా సలిలార్థము వోయి యెంతయు
న్నడుమగలేచి వారల వనంబున నొక్కటఁడించి వచ్చితో
దడయఁగరాదటంచును మనంబు చలింపక ధైర్యమొందెనే. 230

క. మాకన్నులు గర్ణంబులు, మాకరచరణములు బుత్త్రి మాప్రాణంబు
ల్మాకుఁ గలసుతుఁడవు నీ, వేకద నీవిట్లు మసలుదే నడురేయిన్. 231

ఉ. పాపఁడ దూపవాపుమని పల్కిన నుల్కి దయాత్ములార మీ
పాపఁడఁ గాను పాపినగు పఙ్క్తిరథుండను పేరి క్షత్రగో
త్రాపకుఁడండ దుష్టమృగయావ్యసనోగ్రుఁడ దగ్ధుఁ జేయుఁడీ
శాపకరాగ్ని నిద్భుతపశాపలబ్ధికి మీర లర్హులే. 232

క. తమతమపూర్వకృతములు, త్తమతములకు మాన వెట్లు తమకులకుఁ గుఁగన్
తమసానదియొద్దున సంభ్రమసంబున వేఁటలాడ తటి మీసుతుఁ గన్. 233

గీ. ద్రుపదనియమిలార మీతృష దీర్చుటకును, గట్టికిచీఁకటి నెక్కటి నిటుకువచ్చి
యల్లనల్లన సంతస మగ్గలింప, మొనసి కలశంబు నీరిలో ముంచుటయును. 234

క. బుడబుడ యను చప్పుడు చప్పుడు వెడలిన సామజ మనుబుద్ధిం గరుణం
బుడిగి శరముఁ దొడిగి పడ, నడుమడ జేసితిని నిర్మతి గడువ న్వశమే. 235

చ. అని యిటు మీకుమారకవ మారయుఁ డే నపరాధి నంచుఁ దె
ల్పిన వదనంబు లెత్తి విలపించుచు హా సుత పల్కుమంచుఁ బు
త్త్రునిమృతదేహ మంటికొని తోఁచెడుశోకభరంబుపేర్మిఁ జ
చ్చిరిక్రియ మూర్ఛనొందిరి కృశించి సధైర్యమున న్మరి వ్రతుల్. 236

ఉ. ఎచ్చటికైన మోసికొని యేగెడునట్టికుమారుఁ డొక్కఁడుం
జచ్చిన నట్టి వార్ధకదశ న్నయనంబులు లేనివారికిన్
హెచ్చదె శోక మాక్రియ మహింబడి కొండొకమూర్ఛదేఱి న
న్మెచ్చక క్రోధశోకములు మిక్కుటమై తము హెచ్చరింపఁగన్. 237

వ. నన్నుం గనుంగొని 238

క. అపరాధరహితు మత్సుతుఁ, గృప యింతయు లేక యిట్లు గీటడఁచితి వి
య్యపరాధంబునకు న్నిన్, న్నపగతజీవునిఁగఁ జేయుటర్హమ య్యెన్. 239

ఉ. కానమిఁ దప్పుచేసితివి కాన మితం బగుశాపవహ్నికి
న్మానవనాథ యర్హుఁడవు మానవనాథుల నేచుపాపము
ల్హానినొనర్పఁ గాని యహహా! నినుఁ జూడఁగ రాదు పుత్త్రశో
కానలతప్తులై వినను కానలఁ దాపసు లైనసాధువుల్. 240

క. అని కవలి పుత్త్రశోక,మ్మున మృత్యువుఁ జెందు మనుచుఁ బొల్పుఱఁ శపిం
చి నితాంతపుత్త్రవిరహ,మ్మునఁ జచ్చిరి వృద్ధమునియు మునిమానినియున్. 241

వ. ఇట్లు శపించుటయు. 242

చ. అవికులవార్ధిచంద్రు లగునాత్మజు లుద్భవమొందు దింతెచా
లు విధి దయాత్మఁ డంచు మదిలో ముదమందుచు నుంటిఁ గాని పు
త్రవిరహమాత్రిఁ గూర్చునని తత్సమయంబునఁ దోఁపదయ్యె నిం
తవిషమమంచుఁ దోఁచినఁ బదంపడి ప్రాణము లప్డు వీడనే. 241

వ. అని తనకుఁ బూర్వంబునం గలమునిశాపంబు తెఱంగెఱింగించి, 244

క. రామాభిరామ భార్గవ,రామమహామదవిరామ రవివంశమహో
ద్దామ సుగుణధామా శ్రీ,రామా రామా యటంచుఁ బ్రాణము వీడెన్. 245

క. వసుధేశున కసుతత ని,ట్లసుతతి వెడలుటయుఁ దన్నిరాలాపతగాం
చి యుదంతి కోసలాత్మజ,యు సుమిత్రయు నిద్ర గాఁగ నూహించి కడన్. 246

గీ. తామఁ బుత్త్రిలఁ గోడలిఁ దలఁచి తలఁచి, నిండువేదనఁ గుత్తుక లెండ వెడ్చి
యుల్లములు దల్లడించుచునుండ నపుడు, వెడవెడ నుషస్సి నొందిరి నేద్క్కడక్కి 247

వ. అంత. 248

మ. కరవారంబులఁ బద్మినీరమణి యుత్కంఠంబు దీపింపఁ జె
స్వైరవారం గడుఁ గౌఁగిలించికొని పృథ్వీధ్వాంతవిచ్ఛేదమై
పురివారిం దగ మేలుకొల్పికొనుచుం బూషోదయం బైన నా
ర్తరవారింభకవైరిమాగధసుతా కౌసల్య లోకుమ్మడిన్. 249

వ. ఇట్లు మహారోదనంబు గావించుచు. 250

ఉ. అంగవికార మారయుచు నంగన లంతిభయాంతరంగ లై
పొంగెడు పుత్త్రశోకమున భూమివిభుండు శరీరవాయువి
స్సంగతి నిట్లు దేవపరిషన్నివసత్వముఁ గాంచె దిక్కు మా
కుం గలదే యటంచు నృపకుంజరుపైఁ బడి యార్తనాదలై. 251

చ. ఇటు విను మొక్కవింత విపులేశ్వరపుత్త్రవియోగశోక ము
త్కటమగుడున్ శరీరమునఁ బాల్పడు ప్రాణము లీవు మేము ని
ష్కటమగు పుత్త్రశోకమునఁ గూరియు భర్తృవియోగ మొందియుం
బటుగతి నున్నవారలము పాపము రూపములొందెనో యనన్. 252

క. వసుధాసుధాశనులు గొల్వఁగ సుధర్మసభానివాసి వరవిబుధపనీ
వసుధారణశక్తిం గడు, నసదృశుఁడ వైతి విట్టు లాశ్చర్యముగన్. 253

వ. అని మఱియుం బెక్కుభంగుల విలపించి రందుఁ గౌసల్య. 2 4

సీ. జననాథ నినుఁ బరుసంబులు పలికిన, ఫల మిప్పు డనుభవింపంగఁ గలిగెఁ
గఠినని ర్ఘాతప్రఘాతంబునఁ దపించు, జననకుఁ గొఱవి మోఁదినవిధమున
బుత్త్రవియోగశిఖిఁ బొరయుచునుండఁగ, భర్తృవియోగసంప్రాప్త మయ్యె
వనవాసమున కేగుతనయునిఁ గాంచిన, మందభాగ్య నటంచు మదిజనించుఁ

ఆ. గోపమో మదీయ పాపవిశేషమో, యెట్టినోముఫలమొ యే నెఱుంగ
నాగుణంబుఁ బిన్ననాఁటనుండియు నెఱింగియును బలుక వేమి కృపవలిర్ప. 255

వ. అని మఱియుం బరిచారికాసహస్రంబులుం దానునుం బలవించు నెలుంగులు నింగి
ముట్టె నయ్యవసరంబున. 256

ఆ. పుత్త్రిఁ గుఱిచి భూమివిభుండు లోకాంతరగవాసి యగుట విని సువాసినీత్వ
హాని కోర్వలేక నడలుచుఁ జనుదెంచె, భరితదురితజాత భరతమాత. 257

ఉ. నెవ్వగ నిట్టు వచ్చి ధరణీపతిఁ గాంచి మనంబు నొవ్వఁగా
నెవ్వరు దప్పు దూఱిన సహించి విలాసము సేయఁ జొచ్చె నా
జవ్వని హా దినేంద్రకులసాగరచంద్రమహేంద్రతుల్య నీ
కివ్విధి నవ్విధాత లిఖియించెనె పాపపుఁ జావు జావఁగన్. 2 8

ఉ. కోరినకోర్కు లెల్ల నొసఁగూర్చెద విప్రున కు మాటలాడఁగాఁ
గోరిన నూరకున్కి నృపకుంజర ధర్మము గాదు కైక పా
పోయచరిత్రి గానఁ గృప యుల్లమునం జనియింప దాప్తులో
వారలతోడ నైన గరువంబుగఁ బల్కకయుండఁ జెల్లునే. 259

వ. అని యిట్లనేకవిధవినాలాపంబుల నారాజశవంబుఁ గౌఁగిలించుకొని దుఃఖించు
చున్న యవసరంబున. 260

క. విప్రప్రతిమానుఁడు వి,ప్రప్రభుఁ డప్రతిహతప్రభావుఁడు ప్రతి ను
త్న ప్రమదవనానలుఁడు య,తిప్రవరప్రభుఁ డరుంధతీప్రియుఁ డంతన్. 261

ఉ. కాలవిధిజ్ఞత న్సదయకంప మొకింతయు లేమిఁ బెక్కుచం
దాలఁ బరిభ్రమించు నృపదారలఁ గాంచి గురుండు పల్కె ని
ట్లేల విలాపము ల్సలుప నిన్నరనాథుని కీక్రమంబునం
గావశంబు నొంద మును గల్గినకర్మఫలంబు దప్పునే. 262

గీ. జన్నము లనేకము లొనర్చి సత్సుతులను, గన్నవాఁ డురుకాలము మన్నవాఁడు
సహితరాజన్యసైన్యవనాగ్నిహోత్రుఁ, డవని యీతనిమృతికి నింతవిలపింప 263

క. వగవకుఁ డేలవగ చెదరు, వగచిన మృతులైనవారు వత్తురె యనుచుం
దగుసంభాషణముల నృపమ్మగువల నూరార్చి బోధమహితుఁడు మఱియున్. 264

గీ. తనయు లియ్యెడ లేమి నిద్ధాత్రిపునకు, దహనకర్మము నడుపుట ధర్మ మగుట
భరతశత్రుఘ్నులనుఁ బిలువంగ నిపుడ, బంపవలయును జాంఘికప్రవరభటుల. 265

వ. అని పలికి సచివస్వజనానుమతంబు వడసి దశరథుకళేబరంబుఁ దైలపక్వంబున సుగు
ప్తంబునుం గావించి. 266

సీ. పటుజవసత్త్వసంపన్నుల భటులఁ గన్గొని వసిష్ఠుం డిట్టులని చెప్పె మీరు
కృతమతి కేకయక్షితిపతిపురి నున్న, భరతశత్రుఘ్నులఁ బరితయుతులఁ
గాంచి మి మ్మొకమహాకార్యంబు గల్గి తో,డ్కొని రండటంచు మీకులగురుండు
మముబంపెనని వానిమామ యనుమతి నొంది, వారును మీరును వడిగ నిటకుఁ

గీ. గదలిరం డనిపలుక నాక్షణము వారు, వసిష్ఠునకు మ్రొక్కి వీడ్కొని చేరఁజనిరి
సప్తరాత్రంబులకు సుదక్షుప్రధాని, రమణమగు దానిఁ గేకయరాజధాని. 267

క. ఈకరణి చేగి లోపలి,శోకము వెలిఁ దోఁపనీక సుయశోధను న
క్కేకయభూపతిఁ గని మఱి, కైకాసుతుసోదరయుతుఁ గని నతులగుచున్. 268

క. చెడుకలలు గాంచి చింతిం,చెడుభరతుఁడు వారిముఖకుశలములఁ దోఁ
చెడు దైన్యముఁ గనుఁగొని నొ,చ్చెడుచిత్తముతోడ మిగులఁ జిడిముడిపడుచున్. 269

వ. ఉన్నంత సబ్భటపుంగవులు 270

ఉ. హృదయవికారము ల్దెలియనీయక యాతనిఁ గాంచి గూఢగా
ఢ్గదిక నెలుంగు లొప్ప నెదఁగా ధరణీశతనూజ మీఁగురుం
డు దహనతేజుఁ డార్యుఁడు గడు న్వెసఁ దోడ్కొని రండు శాత్రవో
న్మదహృతిచారుకీర్తిపరిణాహరతు న్భరతు న్ససోదరున్. 271

క. అని చెప్పి వారు పని యిది, యని చెప్పం దవ్వసిష్ఠుఁ డనిన విని భయం
బున రాముని కేమాయె, గ్గోరించిరొ తండ్రి యెట్టులుండెనొ యనుచున్. 272

ఉ. మేను వడఁక సోదరసమేతుఁడు కేకయరాజపుత్రికా
సూనుఁడు దివ్యనూజనకచోపరిశోభితకీర్తిసూనుఁ డా
స్థానము సొచ్చి మామఁ గని తద్విధమంతయుఁ దెల్పి బంధుసం
తానము సంభ్రమింప విశదస్థితి నిట్లనియె న్భయంబునన్. 273

క. మామనవి పాలకింపుము, మామనము గలంగె నీక్షణంబ యయోధ్యా
ధామనగరి కేగఁ దగు, నా మనవారలను జూడ నరిగెద ననఘా. 274

క. అని తనమామ యుధాజి జ్జనపాయకు వీడుకొని లసద్వ్యజనమున
స్సుత్రాయ మాతఁ డొసఁగినఁ, గొని భరతుం డనుజుఁ గూడికొని పరయామున్. 275

క. సముచితపరివారసమేతముగా సాకేతరాజధానికిఁ బురుషో
త్తముఁ డబ్జాప్తుఁడు సనియె, భ్రమితహృదయుఁ డగుచు వేగిరపుబయనములన్ 276

వ. ఇట్లు చని. 277

గీ. రమణి లేనిగృహము నంబరమణి లేని, యాహము శూన్యయు నిస్తేజ మైనభంగి
నున్న పురి గాంచి విప్రలంబన్నహృదయుఁ, డగుచు నిట్లని తలపోసె నాత్మలోన. 278

చ. తనపతి లేని మానినివిధంబునఁ జాలనమంగళంబునొం
దినయది యిప్పురంబు గడు దీనమనస్కులు పౌరు లెవ్వరిం
గనినను మేలువల్కరనఘుం బగు వేదనినాద మింతయు
న్వినఁబడ దేమియొక్కొ పృథివీపతి మేనుఁ దొలంగ నేమొకో. 279

వ. అని వితర్కించుచుం జని చని. 280

శా. సత్రాసస్థితినార్తి మూర్తి నిశరించంబోలునా నొప్పి దై
న్యత్రాతావశహృత్ప్రవృత్తి యయి దైన్యస్తోమసంస్థాయియై
శత్రుఘ్నుం డగులక్ష్మణానుజుఁడు పశ్చాద్భాగసంవర్తిగా
మాత్రాగారముఁ జేరఁబోయె భరతక్ష్మాపాలుఁ డత్యాతృతిన్. 281

ఉ. కేకయరాజనందన కకృత్రిమభంగి నమస్కరించి య
క్కేకయరాజసేవ మెఱిఁగించి యొకించుక తాల్మి లేమి న
క్కాకర మూర్తి కాకరము గాఁ గత మేమి పురంబు నామదిన్
శోకము సేయఁజొచ్చెఁ గలచొప్పు సమస్త మెఱుంగఁ జెప్పుమా. 282

క. వనమున భయసంభ్రమములు, బెనఁగొన నిట్లడుగుచున్న ప్రియనందను మో
మునఁ జూడ్కి నిలిపి కేకయ, తనూజ యిట్లనియెఁ గాఢధైర్యస్ఫూర్తిన్. 283

ఉ. మీ జనకుండు దొల్లి నను మెచ్చి వరద్వితయంబొసంగెఁ బు
త్రా జటిలాని యగ్రవనితాసుతుఁ డబ్దచతుర్దశంబు న
వ్యాజమునుస్థితి న్వనవిహార మొనర్పఁగ నీవు సర్వధా
త్రీజనమాన్యత న్వసుమతీపరిపాలన మాచరింపఁగన్. 284

క. అగ్రసతీసుతు విభవో, దగ్రునిఁ గావింప నాత్మఁ దలఁచు దురాశా
పగ్రహానిబద్ధబుద్ధిన్, బాగ్రణి నడిగితిని యోగ్యమగుసమయమునన్. 285

క. ఏ నర్థించిన వరయుగ, మీ నసమర్థుఁ డయి మానవేంద్రుఁడు మానం
బూనినఁ దనాజ్ఞ సెలవఁ, బూనినడచె రాముఁ డడవిపాలకులఁ దిరుగన్. 286

చ. తనప్రియపుత్రుఁ డగ్రవనితాభవుఁ డాత్మసతీసహోదరుల్
వెంటనుకొన బ్రహ్మచర్యమునివృత్తము లూని చతుర్దశాబ్దము
ల్వని నివసింపఁబోయిన భవజ్జనకుం డిటుఁ దద్వియోగసం
జనితపృథువ్యథాక్వథితసన్మనుఁడై మృతినొందెఁ గావునన్. 287

క. విక్రమసమృద్ధి ధరణీ, చక్రావన మాచరింప జనకుని పిత్ర్యాలో
కక్రియ లుపక్రమింప శ, తక్రతునిభతేజ నీవుఁ దగుదువు లనిన్. 288

వ. భరతుండు మహింబడి మూర్ఛిల్లి కొండొకవడికిం దెలిసి. 289

క. రాముని సద్గుణవితతుఁ, బ్రాముని లోకప్రియాభిరాముని నాత్మా
రాముని వనములఁ దిరుగఁగ, నేమని పొమ్మంటి బుద్ధిహీనతఁ దల్లీ. 290

క. క్షితిపతిఁ జంపితివి వన, క్షితి కంపితి సుతుని రాముని గాక యనిం
దితి కేకయాన్వవాయో, దిత యగుసతి కింతదుర్మతిత్వము గలదే. 291

శా. చేతోజాతసమాను రాము వనవాసిం జేయు దుశ్చింత త్వ
చ్చేతోజాతమొ రాక్షసీకులితదాసీశిక్షితమో కాక వా
ష్టైతాప్రేరితమో మదీయసుయశోనిర్వాపణాయాతమో
మాతా మత్పితృమృత్యుహేతు విది సామాన్యంబు గా దారయన్. 292

సీ. నను రాజ్యకాంక్షిఁగాఁ దనమనంబున నవ్వ,సిష్ఠుఁడు గనునాహా సేయునొక్కొ
యతివ నీగర్భమం దావిర్భవించుట, కకట నాపూర్వజన్మకృత మొక్కొ
మద్దులుగుల్కు రామునిముఖాంభోజంబుఁ, గనుఁగొన నాకింకఁ గలుగదొక్కొ
మాత నీకపటంబు మనమున నిడికొని, కౌసల్య నసుఁగని కనలునొక్కొ
ఆ. యొక్క యడుగు నడువ నోపను జానకి, యెట్టు లడవి సంచరించునొక్కొ
జనులు భరతుఁ డమితసౌజన్యనిధి యని, పొగడుదురువు లింక నేఁడవొక్కొ 293

వ అని పలికి కినుకవొడమి. 294

ఆ నిన్నుఁ జూడరాదు నీతోడ భాషింపఁ, గాదు నిన్నుఁ జంపరాదు నాదు
నిచట నుండరా దహీనపాపమతీ యంటంచు వెడలి భరతుఁ డనుజుఁగూడి. 295

వ. అత్యంతచింతాక్రాంతాంతఃకరణుండై దీనమనస్కు లగు కౌసల్యాసుమిత్రాదేవుల కడ
కుం జని నమస్కరించి కన్నీరుమున్నీరుగా నేడ్చుచున్నం గనుంగొని. 296

క. చిత్తంబుల నుత్తలములు, క్రొత్తలుగుడు నత్తరుణులు గొడుకుల దుఃఖా
యత్తులై నెత్తి పదంపడి మొత్తంబుఁ నేడ్చి సొక్కి మొగి సభ్రమదువన్. 297

వ. మఱియు ననేకవిధంబులఁ బలవించునెడఁ గౌసల్య. 298

చ. భరతుఁడె రాముఁ డుగ్రవనవాసము సేయఁగఁ జేయె సద్యశో
భరతుఁడు రాజముఖ్యుఁడు భవజ్జనకుం డమరత్వ మొందె దు
ర్భరతరపుత్రశోకమునఁ బట్టణ మాయె నరాజకంబు సం
భరితమనఃప్రమోది నిరపాయతఁ దాల్పుము పూజ్యరాజ్యమున్. 299

వ. అనుటయు సహింపక. 300

చ. చరితజ్ఞుఁడై పురుషసత్తముఁ డబ్జగతుండు వెచ్చనూ
ర్చి కినుకఁదిక్కి విన్మతగఁ జెప్పెద నామది రాజ్యవాంఛతే
మికి ఘనసాదభూతములు మిత్రశశాంకులు సాక్షు లీవెలుం
గకిటుల నొవ్వఁబల్కి దనుకంపఁ దలంపవు కోసలాత్మజా. 301

క. అన నితఁడు రామభక్తుఁ, డనూనపుణ్యాత్ముఁ డిమ్మహాత్ముఁడు భరతుం
డనిన యది తథ్య మనుచుఁ గ,గనవాణి వచించెఁ దగ సకలజనులు వినన్. 302

వ. ఇట్లు వచించుటయు నెల్లజనంబులు నచ్చెరువుఁబొంది భరతుం బ్రశంసించి రంత. 303

క. భరతుని గాఢానంతత్వరతం గౌసల్య మెడలు వట్టుకొని విశే
షరవంబున నేడ్చెం దత్పరిచారిక లధికశోకభరమున నేడ్వన్. 304

వ. తదనంతరంబున భరతుం డనుజసహితుండై తైలద్రోణి నిమ్ముగా సంగ్రహించియున్న

ధనధృతమృఖ్యసౌరభపదార్థచయంబులు గూర్చి తండ్రికిం
దనరఁగ నగ్ని యిచ్చె విదితంబుగ నబ్జహితుండు సద్విధిన్. 316

వ. ఇట్లు పితృమేధంబు యథావిధిక్రియాకలాపంబుగా నిర్వర్తించి. 317

క. భూదానంబులు హేమకన్యాదానంబులును గోసహస్రంబులును
ర్వీదేవతలకుఁ గడునేకాదశదివసంబునందు ఘనుఁ డతఁ డొసఁగెన్. 318

వ. మఱియు సద్ధర్మమున కమరలోకనివాసప్రాప్తికరంబులు దమకు నశుచిత్వనిరాసకంబులు నగు క్రియాకలాపంబు లెన్ని యేని నడపి సమస్తజనంబులన్ భోజనదానంబునం దృప్తులం గావించి సుహృద్బాంధవామాత్యబ్రాహ్మణపౌరజనపదనికరపరివృతుం డగుభరతుం గనుంగొని యరుంధతీప్రాణవల్లభుం డిట్లనియె 319

ఆ. సమయరతుఁడు రామచంద్రుఁ డిచ్చటు లేమిఁ, బూజ్యరాజ్యభరముఁ బూను మిఁకఁ
గుకలయంబు వేడ్కఁ గూరునే రాజు లేకున్న భరత సూనృతోక్తినీత. 320

వ. అనుటయు సవిషాదమనస్కుండై. 321

క. నీ వఖిలమెఱిఁగియు న, న్నీవిధమున ననుట యెల్ల నేనెఱుఁగుదు మ
ద్భావము సమస్తజనసం,భావితముగ నిప్పు డెఱుక పఱుతుఁ గాదే. 322

మ. ఫలమూలాశనుఁడై కుశాసనుఁడునై పర్ణోటజావాసియై
బలవద్దైవకుశాసనుం డయి మహాపాషాణపర్యంకవ
ల్కలచేలాన్వితుఁడై మదగ్రజుఁడు బల్కానం దపంబూన ను
జ్జ్వలభోగాస్పదపట్టణంబునను నిల్వన్నాకు సద్ధర్మమే. 323

చ. పలుకులు వేయు నేల మహిపాలనమే నొనరింపఁజాలఁ బె
న్మొలకులమీఁదఁబోలెఁ బదము ల్గ నిల్వవు నేల నామనం
బులుకుచుఁ దత్తరించెడు ద్విజోత్తమ యిప్పుడ పోయి మేనఁ గ్రొం
బులకలు గ్రమ్మ శ్రీరఘుపుంగవుఁ జూడక యుండఁ దీరునే. 324

క. అవనీరక్షణకై రాఘవునిం బ్రార్థింతు నతఁడు గాదనునేని
న్రవివంశాచార్య మహోగ్రవనీవిహరణము నాకుఁ గర్తవ్య మగుఁజూ. 325

చ. అని తనవిశ్చయంబుఁ దగ నందఱకు న్వినిపించి వారలె
ల్లనుఁ దనుఁ జుట్టిరా నపుడ లక్ష్మణపూర్వజుఁ దవ్వసిష్ఠుఁడుం
జననులు మువ్వురు న్సచివసత్తములు న్హితులు న్మహారథ
ఘనిఖిలసద్భటోద్భటజనప్రబలాశ్వములు న్వెనుంబడన్. 326

వ. ససోదరుండై యయోధ్యాపురంబు వెలువడి వేగిరంపుఁ బయనంబులం జని చని. 327

ఉ. సాధునికాయసేవ్యుఁ దమసాధునిఁ గాయము వొంగఁ గాంచి త
ద్రోధవిభాస్వదాతపనిరోధవిశాలరసాలభూరుహ
శ్రీధను వేడ్కఁ గూర్చి నృపశేఖరుఁ డా భరతుండు మానసీ
వ్యాధినిరాసకంబులు దదంబువులం గొనియాడి మ్రొక్కుచున్. 328

క. అన్నది సద్యశీకృతసుమియ్యన్నది నటఁ గడచి భరతుఁ డతిరయమునఁ దా
నన్నదిశకు గుహుతోఁ దా, నన్నది మదినూది నడచె ననుజసహితుఁడై. 329

వ. ఇవ్విధంబునం జని యెడనెడ వినోదంబులగు నవీనవనంబులు తుంగంబులగు గిరిశృంగంబులు విశాలంబులగు సాలంబులు నాలోకించుచు సరయూగంగాసంగంబు నుత్తరించి గంగాతీరంబునకుం జని యందు. 330

ఉత్సాహవృత్తము.
సాధునీతిఁ గనియె రాజసత్తముండు సత్తతో, సాధునీనిదాఘునసఘుశ్లాఘితాత్మవాదుని
న్సానుకనిష్ఠు దీనరక్షసాధునిద్ధసన్మనీ,సాధురంధరున్ గుహాల్పిపాదునిర్వికారునిన్.

వ. ఇట్లు గాంచుటయు సద్గుహుండు నాదరపూర్వకంబుగా భరతున కిట్లనియె. 332

క. ఇలు వెలువరించి రాముని,కలిమిం గొని యంత నిలువక కలుషవృత్తివై
బలిమి మెయి నతనిఁ దలపడఁ, దలఁచి యరిగెదొ ద్విట్లు దుర్నితంపుఁ దలఁపున్. 333

చ. అన నతఁ డోనిషాద విను మట్లు గాదు మదగ్రజన్ముని
జనకసుతాసమేతు నృపసత్తము రాముని లక్ష్మణున్ జగ
జ్జనుతకీర్తినైన ద్విపదసాధ్యక యోధ్యకుఁ దోడితే ముదం
బున నిటువోక నీ కగునె పోకడమాలినపల్కు వల్కఁగన్. 334

చ. అనుటయు సంతసించి యతఁ డాతనికిన్ విహితాగ్ర్యపాద్యము
ల్వనుపడఁ గా నొసంగఁ దగు భంగిగ గంగఁ దరంగిణీమణిం
బొనరఁగ నుత్తరించి గుహుఁ బోవిడి వరించి విరించికృత్యమే
వ్వరికి నలంఘనీయ మనివాక్యము నం దుంచుచు న్వెసన్. 335

వ. భరద్వాజాశ్రమంబునకుం జని. 336

క. అమ్మునిపతికి నమస్కారమ్మొనరించుటయు సాదరమ్మున నిటు రా
రమ్మని భరతుని కరముఁ గరమ్మున గీలించి ముని కరమ్మరుదారన్. 337

క. మనమున నేఁ దక్కుము నీ, జనకుఁడు స్మృతిఁ నొందె విధివశమ్మున నిటు రా
మునిఁ గానఁ బోవు టెంతయు, నన ఘాలం బయిన కార్యమని పల్క సొరగన్. 338

క. వలనొప్ప రాముఁ డరిగిన, వలను భరద్వాజమౌనివలనఁ దెలిసి య
వ్వలఁ జనియె భరతుఁ డెంతయు, వలనుదగు ల్వాడి నవులఁగుచుని లె నతిభయుఁడై. 339

వ. ఇట్లరిగి విచిత్రకూటం బగు చిత్రకూటంబు సమీపంబునకుం జనునవసరమున. 340

ఉ. ఎప్పుడు రామచంద్రుముఖ మెప్పుడఁ జూతుము కన్నులార ని
ంకెప్పుడు రామభాషణము లింపుగ విందుము వీనులారఁ దా
నెప్పు డయోధ్యకు న్మనల నేలఁగ వచ్చును మిత్రులార యం
చప్పుడు వేడ్కఁ బౌరజను లారని రావము లుప్పతిల్లఁగన్. 341

క. పలికెను పలుకులు తురగ,మ్ముల హేషలు మత్తనాగముల బృంహితము
ల్గలసి బలిసి వనౌకస,ఖగశకునంబులకు భీతి గలిగించుటయున్. 342

క. తద్రవముం బక్షిమృగో,పద్రవము న్లక్ష్మణుండు పరికించి యెుద
గ్రద్రుమము నెక్కి కనియెన్, భద్రంబుగ వచ్చుచున్న భరతుని సేనన్. 343

వ. కని ససంభ్రముండై రాముం గనుంగొని. 344

క. రామ విను భరతుఁ డేచిట్టి, కో మనకడ కిపుడు వచ్చుచున్నాఁ డనిన
న్సౌమిత్రి మనలఁ దోడ్కొని, పో మనమునఁ దలఁచి రాక బుద్ధి నెఱుఁగుమీ. 345

వ. అనిపలికె నయ్యవసరంబున. 346

చ. సరభసవృత్తి మోముల విచారము వేడ్కయుఁ దోఁప నేగి య
బ్భరతుఁడుఁ దత్సహోదరుఁడు బ్రీతిఁ గాంచిరి మానవేంద్రుని
న్నిరతశమాశ్రితైణఫణినిర్వ్యసనోగ్రమహోక్షగేంద్రునిం
బరమపవిత్రతాపసకృపాగసాంద్రుని రామచంద్రునిన్. 347

వ. ఇవ్విధంబున సందర్శించి. 348

క. పొరిఁబొరిఁ బులకాంకురములు, శరీరమునఁ గ్రమ్మ దేర సరి మ్రొక్కిరి స
త్కరచరణలలాటంబు లుదరములు భుజములును భూమితలమునఁ బొరయన్. 349

మ. అటు తన్మ్రొక్కినముద్దుతమ్ములను సమ్యగ్భక్తిపత్తమ్ములం
బటుహర్షంబున రామచంద్రుఁ డవనీపశ్రేష్ఠుఁ డాసక్తిఁ గాఁ
గిటు నాశీర్వచనాళిపూర్వకముగాఁ గీలించియుం జేర్చి ము
త్కటు వహాచుండఁ దదీయమస్తకము లాఘ్రాణించి భావించియున్. 350

క. తనకరములఁ దమ్ములమృదు,తనువులు నిమిరియు నతం డతనుమోదమునం
దనియెఁడు రాముఁడు ఘనచం,దనచర్చలు గావె సహజదర్శనము లిలన్. 351

వ. అయ్యవసరంబున. 352

క. భూమ్యాత్మజకును ఫణిపతి,సామ్యుం డగు లక్ష్మణునకు సముచితముగ స
త్కామ్యవ్రత మ్రొక్కెను రామ,స్వామ్యనుజుఁడు లక్ష్మణానుజన్మసహితుఁడై. 353

వ. ఇట్లు మ్రొక్కి కుశాసనంబుల నాసీనులై యున్న యెడ రాముండు. 354

చ. అనుజులఁ గాంచి సేమమె కదా నరనాథున కన్న నన్నలో
ననఘులు వార లోకిక్షృదయాంచితి భూపతి దా నతివ్యథా
జనితభవద్వియోగఘనసాగర మీఁదఁగలేక నాఁటిలో
మునిఁగినవాఁడు దైవకృతము న్నరు నెవ్వఁడు గడ్పఁ ద్రోవ నగు నే. 355

చ. పరమకృపాకరుండు గుణబంధుఁడు దానమనేది కీర్తిత
త్పరమతి సూనృతవ్రతుఁడు పార్థివనీతివిశారదుండు నం
బరమణివంశవార్ధిహిమభానుఁడు బాహుబలాఢ్యుఁ డంత భూ
వరమణి యైనతండ్రి విడువన్వలెనే నన్నల న్మహీశ్వరా. 356

క. సమరమున సురాధీశుల, సమయింపఁగఁ జాలు బలవసము గలపతి దా
సమసె న్మీరలు వనవాసము నొందిన యేడవదివసమున మహాత్మా. 357

చ. అనుటయు వారిపల్కులు మహాశనికల్పము లైన మూలక
ర్తనవినిపాతసాలము విధంబున నేలకు వ్రాలె రాముఁ డా
తనికిరియు లక్ష్మణుండును వసుధం బడియె న్వసుధాతనూజయుం
జెమపగుచంత నెంతయుఁ దపించుచు మూర్ఛమునింగె నంతటన్. 358

ఉ. ఇంచుక సేదదేఱి వసుధేశుఁడు రామవిభుండు చాలదుః
ఖించెను తమ్ములం గని ప్రకృష్టతరం బగువార్తి క్రమ్మఱ
న్నొంచిన నిచ్చ కేనియు మనోధృతి చాలమిఁ దండ్రిఁ గూర్చి శో
కించెను దండ్రి శోకముసకృత్పరితాపము సేయుచుండున్నే. 359

ఉ. వెండియు రామలక్ష్మణులు వేయువిధంబులఁ దండ్రిఁ గూర్చి మా
ర్తాండకులేశ హా దశరథప్రభుసత్తమ రాజరాజ వే
దండసుతుండ దండధరదండధరోపమకీర్తి యంచు నో
ళ్ళుండఁగ నేడ్చి రెంతయు విహీనజనంబులభంగి నార్తులై. 360

క. భీతాత్మ యగుచుఁ దనయుల, చేతులుఁ గడుఁ బిసికికొనుచు జిసికుడిచనుచు
న్సీత వగచె దివి కేగితె, ధాతృతురగచారుకీర్తిధామా మామా. 361

వ. అని మఱియుం బలవించుచున్న సమయమ్మున. 362

శా. కైకానందనుఁ డున్నదమ్ములను భూకాంతాసుతం దా కృ
చ్ఛ్రైకాపాస్తసమగ్రరాజ్యకరసంశుద్ధార్ద్రబోధాతిశాం
తాకృష్టాత్ములఁ జేయుచు న్మిహిరవంశ్యస్వామి రాకుండు గం
గాకూలాంకముఁ జేరి యుండు నిగమోక్తప్రక్రియం జయ్యనన్. 363

క. అనుజప్రియాసహితుఁడై, మనుజప్రవరుఁడు దవంబున మగ్నాత్ముండై
జనకునకుఁ దిలోదకవిధు, లొనరిచి కృతకృత్యుఁ డగుచు నుటజము సేరెన్. 364

ఆ. ఇట్లు వచ్చి రాముఁ డేరితీ మనంబున, ననుజవరులఁ బట్టికొన్న మహోశు
గాకుఁగాత్రి వ్రాలె నాకుఁగాత్రిఁ గూలు, నగమునట్లు పుణ్యనగమునందు. 365

వ. ఇవ్విధంబునం బితృమరణశోకవ్యాకులితమానసుండైన రామచంద్రుఁ భరతుం డూరార్చుచున్న యవసరంబున గురుండు కౌసల్యా కైకా సుమిత్రలం దోడ్కొనివచ్చి సముచితంబుగాఁ దత్సమాగమంబు నడపుటయు రాముండు సీతాలక్ష్మణసహితుండై కన్నీరుఁ దదంఘ్రిపురోభాగంబులఁ బడుటయు నక్కాంత లక్కొడుకులం గోడలం దీవించుచు నక్కులం గదియించి వెక్కి వెక్కి యెక్కుగుక్క దిక్కులు పిక్కటిల్ల నేడ్చిరి మఱియును. 366

ఉ. ఎల్లజనంబులు న్వినఁగ నీల్గినపక్కిఁ ఘుం దలంచుచుం
దల్లితోరసద్గుణవితానము నప్పుడు పేరుకొంచు నా
తల్లులుమువ్వురు న్సుతులు దారుణశోకభరంబు నొంది వెం
దల్లడమంది యేడ్చినవిధం బది యెచ్చటనైనఁ గల్గునే. 367

క. తత్రితయకాంతలు కోసలపుత్రియుఁ గైకయును మగధపుత్రియు నంతోఁ
బుత్రులదైన్యము ధాత్రీ, పుత్రీదైన్యంబు గాంచి పొగిలిరి మిగులన్. 368

క. అప్పుడు. 369

ఉ. నాయఁడు ప్రోలి కేగినజనప్రభు మామఁ దలంచి చింతతో
నాకులపాలికాతిలక యైనధరాసుత యేడ్చె నేడ్వఁగా
నాకులపాటుఁ జెందెఁ గుసుమాక్షులఁ బువ్వసాత్రి లొల్కుచు
న్స్త్రీకులు తద్విలాప మసమానము గాదె వదిం దలంపఁగన్. 370

వ. తదనంతరంబున వసిష్ఠభరతప్రయత్నంబునం గొంతవడికిం గౌసల్యానందనుండు దెలివి నొందుటయుం దక్కినవారు నుపశమిల్లి రంతఁ బౌరజానపదబ్రాహ్మణగురుబంధుభృత్యామాత్యప్రియానుజప్రియాసమవేతుండై పవిత్రసమస్థలసుఖాసీనుండై రాముం డుచితవచనంబుల నానందంబు గావించుచు నుండి కొండొకసేపునకు భరతు నానవంబునం బ్రసాదమహితం బగు మాడ్కి నిగిడించి పితృనిర్దిష్టదిష్టంబుగ వనంబునం గడపి పురంబునకే మగుడివచ్చువంతకుం గరుణ గలిగి ప్రజాపరిపాలనం బొనర్ప నయోధ్య కరుగు మన్నా యని సప్రేమసాదరబహుళంబుగా నాడుటయు నతండు విషాదంబు నొంది యున్నం గనుంగొని. 371

ఉ. భూతలనాథనాథ రఘుపుంగవ క్రోధము దక్కి నన్ను నీ
శీతలదృష్టిఁ జూచుచు వచించెద రాజ్యభరంబు సర్వము
న్నాతలఁ బెట్టఁ జూచెదవు నాతలఁ బట్టులు గాదు నీవు ధా
త్రీతల మేలఁ గావలదె జగమెల్ల నుతించుచుండఁగన్. 372

క. ఇనవభ్యుదయంబునఁ జక్రినికాయము రాజు కరుణఁగని కువలయముం
జనవర పాలుపొందుం జన్యున రాజ్యము సేయుమాంటె నరుదె మ్మనఘా. 373

గీ. కేకయాత్మజ నడపిన కృత్రిమంబు, నించుకయు నెంచకుము భవద్ధృదయమందు
సత్యసంగ్రామమూర్తి వీ వఖిలభూభృ,దమ్మ కహియింప రమ్మ వరమ్మ నిమ్ము. 374

క. వర్ణత్వాద్యాశ్రమములు, వర్ణాశ్రమధర్మములును వసుమతిజనదు
ర్వర్ణసువర్ణము లడఁగు, న్వర్ణితుఁ డగు రాజు లేని వసుమతిలోనన్. 375

ఉ. కావున మాదుప్రార్థనముఁ గైకొని నీవు జగజ్జనంబులం
గావు నరాళిసత్కరుణఁ గాచినధర్మపుకో సమానవుల్
గావు నరేంద్రధర్మములు కారుణికత్వధురీణ సేవనా
గా వనభూమి నీకుఁ దిరుగం దగు నే మడిగుంద నీకిఁకన్. 376

శా. క్షోణీభారము నిర్వహింప నహితక్షోభంబుఁ గావింప స
త్త్రీణానందము భూజనాళి కొసఁగ శ్రీరామ రమ్మావన
క్షోణిన్ని ల్చెద నాను పొమ్మనుచు నాకు న్నీవు చెప్పంగ మ
త్ప్రాణంబు ల్విడువందలఁచితి సుమీ ప్రాయోపవేశంబునన్. 377

క. చాల న్వగపున వనమున, నేల నివాసంబు నేల నేల నరిమ్మేఁ
జాల భూపాలనము నీ,పాలన వసియింతు వగన్నపాలకమౌళీ. 378

వ. అనుటయు రాముండు మందస్మితసుందరవదనారవిందుండై. 379

ఉ. తమ్ముఁడ వెఱ్ఱివాఁడవు గదా తెలుపె స్ఫురదీయధైర్య మే
మెమ్మెయి రాజ్యపాలనము నిత్యకొనంగఁ దండ్రిపంపు భా
వమ్మున నిల్పి కానల నవశ్యము గ్రిమ్మటి వత్తు నీవు హా
ర్షమ్మున నాచరింపుము ప్రజాపరిపాలన మప్రమాదివై 380

క. మనబోటివార జనకుని, పనుపున వర్తింపకునికి పాడియె గుణమం
దన నీ వెఱుఁగవె ధర్మము, ననుఁ గావింపకుము రాజనందన యింకన్. 381

క. పితృభక్తి సేయుటక దైవతపూజాపరుఁడ వగుచు వసుమతిజులరన్
ధృతిమంతుఁడవై వత్సర,చతుర్దశము బ్రోవుమీ ప్రజలఁ బ్రజలకిఁకన్. 382

చ. సుఖమున ధారుణీజనులు సొంపు వహింప లసన్ముఖక్రియో
న్ముఖమున ధారుణీసురసమూహము పెంపు దలిర్పఁ బాదుకా
ముఖమున రాజ్యకృత్యము ప్రమోదమున న్నడుపంగ రాజధ
ర్మఖని యనన్ వసించె మతిమంతుఁడు రామునిరాక వార్చుచున్. 396

వ. ఇట్లయోధ్యాపురసమీపంబున నొక్క యలఁతిపల్లియు నుచితవస్త్రంబుల నుండె
ననిచెప్పి ప్రమదాతిరేకంబున. 397

శా. దైతేయప్రకటాటవీదహన భక్తత్రాణపారీణ సు
జ్ఞాతానాగతవర్తమాన గతిదిక్ప్రక్రియాసన్నుత
ఖ్యాతాఖ్యాతకృపారసప్రసవిశాలాక్షాతిసంభావితా
జ్ఞాతావాస మునీంద్రమానసనివాసా పీతవాసాంచితా. 398

క. పంకజలోచన మునిజనపంకవిమోచన విశేషభాసుర శ్రీవ
త్సాంకకరుణాంబుసేచన, పంకజభవకామినీపరిభావితవచనా. 399

మత్తకోకిల. పాలితాఖిలలోకనాయక భక్తసౌఖ్యవిధాయకా
కాలభీకరసాంపరాయక కాలకాలనుసాయకా
కాలనీరదకామనీయక కాయజిత్సురసాయకా
*శీలయుక్తఫలప్రదాయక శీలవేంకటనాయకా. 400

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యాన పరాయణ భూమధైర్యవినయ
రమనార్యతనయ పండితసేవాసముచ్చయ క్రొత్తపల్లి లచ్చకవి ప్రణీతం
బైన దాశరథివిలాసం బను మహాప్రబంధంబునందుఁ

తృతీయాశ్వాసము.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబాయైనమోనమః

# దాశరథివిలాసము.

## చతుర్థాశ్వాసము.



కాంతాపరముఖ కా
శ్రీకాంతరమహితపుష్పవిటిత్కృతపీఠా
నాకావాసాసమానన
హాకరిహార్యత్ర వేంకటాద్ర్యధ్యక్షా. 1

వ. దేవా తదనంతరకథావిధానం బవధరింపు మట్లు భరతుండు ధర్మనిరతుండై నందిగ్రా
మంబున నివసించెనని చెప్పి యప్పట్టిపట్టువృందపసి వెండియు నిట్లనియె. 2

ఉ. తమ్మునిఁ గాంచి రాముఁడు సుధారసతుల్యము లైనవాక్కిఁకా
యమ్మల నిట్లు వల్కె మన మవ్వనమంబున కేగ కీపిశా
లమ్మగు పర్ణవేశ్మమున లక్ష్మణ నిల్చితిమేనిఁ దాసబా
షమ్మగు టాత్మనెంచి మనపజ్జకు వచ్చుతుండు క్రమ్మఱన్. 3

క. వచ్చుచుఁ బోవుచు నున్న, న్వచ్చును విఘ్నంబు విపినవాసంబున కే
నచ్చుపదం దెల్పితి నిఁక, నిచ్చో నుండఁ జన దవలి కేగిన యొప్పున్. 4

వ. అని పలికి సీతాలక్ష్మణసమేతుండై చిత్రకూటంబు వదలి చని ముందట. 5

సీ. ఘనలతాతన్వులు కౌఁగిలించికొన మి, న్నందియొప్పెడు విటపావలియును
పాషాణకంటకబహుళంబులై ఘోరభయంకరము లైన వర్త్మములును
జీర్ణపర్ణములలోఁ జిటచిటధ్వనులతోఁ, గున్కుబర్వులు వాలుగోధికలును
దరుకోటరాంతరస్థఫణిఫణామణివ్రాతఘృణుల్య ల్కాజాతములును
గీ. సామజవ్యాఘ్రభల్లుకశరభములును, గలిగి భీకరమగుదానిఁ గనె నసురశ
రణ్యమగు నొక్కదుర్గమారణ్యమంత, సన్మజనమూర్తి రామరాజన్యమూర్తి. 6

వ. ఇట్లు కనుంగొని. 7

శా. వన్యేభోగ్రలులాయసింహశరభవ్యాఘ్రాచ్ఛభల్లాదికా
ధ్వన్యాభీలమృగావళీభయదకృద్ధ్వన్యాధికాకంపితా
వన్యాత్తోద్భవసాధ్వసాపనయనవ్యాసంగుఁడై యాత్మశిం
జిన్యారావ మొనర్చె రాముఁడు పలాశిస్తోమభీషణంబుగన్. 8

వ. నిజధనుష్టంకారఘోషంబున వనమృగంబు లెవ్వియుం దమ్ముఁ జేరక పాఱునట్లు గావించుచు వివిధఫలమధుర మధురసంబుల నవనిజకుం దృప్తిచేయుచు నయ్యాయిలతాకుంజపుంజంబులం జూపుచుం జనుచు నవసరమ్మున లక్ష్మణుం డన్నం గనుంగొని. 9

ఉ. సారము లోననూఁదికొని చంచలభావ మొకింతలేక వి
స్తారశిఖాచ్ఛటల్ జటలచందము నొందఁగ వల్కలంబులం
జీరలుగాఁగ శాకులు విశీర్ణతనొందఁగ రామచంద్రుఁ దు
ర్వారతపోభరం బిటు లరణ్యము నిక్రియఁ దాల్చెఁ జూచితే. 10

వ. అనుటయు మహానందంబు నొందుచుం జనిచని. 11

సీ. ఆఖుశాబకకేలిహానసామాజిక్యావరితపటుతరగర్తములును
వాతాయమానవ్రాతఘోరవ్యాఘ్రకులసమాకీర్ణనికుంజములును
మృగరిపుప్రకరగంధగజేంద్రసంఘాత,దంతురితగిరిగుహాంతరములు
భీతికృదోతువారాతతశుకశారి,కాటదంచితతరుకోటరములు
గీ. శ్యేనజాలకపోతసంశ్రితమహావి,శాలమహనీయబాలరసాలములును
గలిగి విదళితఘనపథికనియజన,తాశ్రమం బగునొకతాపసాశ్రమంబు. 12

వ. కనుంగొని యప్పుణ్యాశ్రమంబుఁ బ్రవేశించి యందు. 13

క. అనసూయాహృదయేశ్వరు, ననసూయాహృదయకమల నత్రిమునీంద్రుం
గని తత్పదంబులకు వం,దన మొనరించుటయు నద్భుతప్రమదమునన్. 14

క. దీవించి రాముఁగని ముని,భావం బలరార నర్ఘ్యపాద్యంబుల సం
భావించి యనంతరమున, భావభవనిభు సుమిత్రపట్టిని మిగులన్. 15

వ. సముచితసత్కారంబుల మనఃప్రియంబు గావించి రామలక్ష్మణులం బవిత్రకుశాస్తరణంబుల నాసీనులం జేసి కుశలంబడిగి తానును సముచితాసీనుండై మధురసంభాషణమ్ములం దేల్చుచున్న యవసరంబున. 16

మ. అనసూయాచరణారవిందముల కత్యంతానురాగంబుగాఁ
దనసీమంతిగతోల్లసద్ఘుసృణముం దాకించి చేదోయి నొ
య్యన జోడించి నమస్కరించుటయు నయ్యత్రేయి ధాత్రీసుతా
వనజాతాయతనేత్ర నెత్తికొనియెన్ వాత్సల్యసంపూర్ణయై. 17

వ. ఇట్లాశీర్వచనపూర్వకంబుగా నెత్తికొని నిజవిశాలపర్ణశాలామధ్యంబున సుఖాసీన సజ్జానకి నుద్దేశించి. 18

చ. సుఖములరోసి కాననవసుంధరకుం బతివెంట నాజ్ఞ నేగుదెం
చి ఖరకరాతపంబునఁ గృశించెదు భర్తపిఱుందనవ్వన
న్సుఖముదలిర్పనుండెదవు ముక్తభయస్థితి వైపతివ్రతా
త్వఖనివి నీవు నీకు సరివత్తురె యుత్తమమత్తకాశినుల్. 19

వ. అని మఱియు ననేకవిధంబులం బొగడి. 20

గీ. అభిరామకమసుభగతాభివృద్ధి, యగు నిదిధరించువారల కని వచించి
కంబుకంఠికినంగరాగం బొసంగె, న త్తపస్వి యనురాగ మతిశయిల్ల. 21

ఉ. ఈకరణిన్మునీంద్రసతి యిచ్చినరంగగు నంగరాగమున్
బ్రాకటలీలఁ దాల్చి కడుఁ బ్రార్థనసేయఁగ నామెతోడ ని
ర్భీకుఁడు రామమూర్తి దను బెండిలియైన చరిత్రమెల్ల సీ
తాకులకామినీమణి ముదంబునఁ దెల్పి యనంతరంబునన్. 22

సీ. అత్రిభార్యకు వినయంబునఁ బ్రణమిల్లి, కులసతీధర్మము లొక్కొక్క మిగుల
వినవాసచేసెద వినిపింపు మనవుడు, నయ్యవనీజాత కాదరమున
భర్తమాటకు మఱుపల్కుట తలవాకిట మెలంగుటయుఁ బాయసము నొకర్తు
సేవించుటయును నిషిద్ధమబ్భర్త కురూపియైన హరిస్వరూపి గాఁగ

గీ. మదినిరూపింపమి కడుదుర్మార్గమగు మహాత్తరంబుగ నాత్మభర్తయగుట
యుత్తరించదగుట యశుచియై యుత్తమిల్లుటయును గూడనికార్యము లయని నిచె
న త్తపస్వి సత్కృపాయత్తయగుచు. 23

క. భూసురపూజాదివయా, నాసక్తకలగుటయొప్ప దనిమరియును సా
ధ్వీసాధుచరిత్రంబుల, భూసుత కెఱిఁగించె న త్తపోహితకరణన్. 24

గీ. అట్లు దెల్పిన సీత ప్రహర్షయయ్యె, నంత శ్రీరామలక్ష్మణు లత్రిమౌని
కథితపుణ్యకథాసమాకర్ణనమున, దృప్తులై మోదవారాశిఁ దేలుచుండి. 25

ఉ. ఆ త్రిపురాంతకప్రతిముఁ డత్రిమునీశ్వరుఁ డాదరింపనా
రాత్రివసించి వేగినఁ గరంబులు మోడ్చి తదాజ్ఞనొంది సౌ
మిత్రిసమేతుఁ డత్రిసతి మెల్లన వీడ్కొని వచ్చియున్న భూ
పుత్రినిగూడి యేగె నృపపుంగవుఁ డా రఘురాముఁ డాదటన్. 26

నవసరమ్మున లక్ష్మణుఁ డన్నం గనుంగొని. 27

చ. ఒకగణి కామతల్లి సుమనోజ్జ్వలయై మృగుపల్లవాళిఁబా
యకవిటపోపగూహనకు నైయిదెసాఁగెను రామచూడు మా
నొకగణి కామతల్లి సుమనోజ్జ్వలయై మృగుపల్లవాళిఁబా
యకవిటపోపగూహనకు నైయిటుసాగెటయుక్త మేమనా. 28

వ. అనిపలికి. 29

క. ఆధరణీశ్వరుఁ డనుజు సహోదరమునఁ గాంచి మునుల నరిగికని యొంబ
ర్జాదుల మునివరులనప, ర్జాదయుతోపముల నయ్యగణ్యమునందున్. 30

క. కని వారి యాశ్రమములకుఁ, జని వారలొసంగు ఫలరసంబులుఁ దేనె
ల్గొని యమ్మునీశ్వరుల వీ, డ్కొని రాముఁడు దీవల్లి కొనినవన మునన్. 31

వ. జానకీలక్ష్మణ సమేతుండై పాషాణకంటక సుస్పృశంబులై పాదంబులు గందు
చుం దొట్రుపడ మందగమనంబునం జనునెడ. 32

ఉ. నిక్కవిరాధనామరజనీచరుఁడొక్కఁడు వచ్చి జానకిం
గ్రక్కునఁబట్టి మూఁపునఁదగంగ వహించి విశేషరోషుఁడై
యెక్కఁగఁ గొంచుఁబోయిన నమేయబలాఢ్యుఁడు రాముఁ డంతఁబే
రుక్కనవాని కడ్డపడి నుద్ధతుఁడై యనుజుండు నోహుగన్. 33

వ. ఇట్లు రామలక్ష్మణులిరువురు నెదిరించి. 34

శా. క్రోధోద్రేక మనస్కులై రఘువరు ల్వారిరాస్త్రజాలంబుల
న్వేధింపం దనుజాధముం డతిమహావేశుండు విస్తారమా
యాధారేయుఁడు సీతడించి వెసతో నా రాముని న్లక్ష్మణు
న్సాధింపన్నమకట్టి పట్టుకొని యంసద్వంద్వముం జేర్చినన్. 35

ఉ. వారలఁ గాంచి సీతవగవన్ జనకాత్మజఁ గాంచి వారలు
న్వారనిదీవతంబొరయ వాఁడు రయంబునఁ బోఁదలంచుచున్
శ్రీరఘురాముఁడుం బురుషసింహుఁడు లక్ష్మణుఁడుం బలాఢ్యు నే
పారఁగఁ బాఱనీ కదిమిపట్టిది కంఠము రెండుప్రక్కలన్. 36

ఆ. అదిమిపట్టి వాని నల్పసత్త్వునిఁగ నె, త్తింగి బుధులకందఱికి హితంబు
లైనవాక్యయముల నాఖుబోధించి, వినమి కమితరోష వేసులను మ. 37

చ. తులువ భయంకరాస్త్రములఁ దున్ముచు నొంతయు నొప్పఁగాక నీ
తులు వలుకంగ నేలయని దుర్మతి నీలచేతికిచ్చి గం
తులవునె ఘోరపోషమదె త్రుళ్ళఁడగించెవ మంచు వానిచే
తులవనిఁ గూల్చి కొక్కమొగిఁ దోయజమిత్రకులాబ్ధి చంద్రముల్. 38

వ. తదనంతరంబున. 39

క. కంఠముఁ దెగనఱకుదునని, కుంఠితుఁడై వాఁడు నేలఁగూలెను నెడసో
త్కంఠుఁ డగుచు నిలుకుఱికిరి, కంఠీరవముల్గిరిన్ డిగ్గుచు కరిణిన్. 40

వ. ఇట్లు లంఘించి జానకిభయంబు వాపి యుల్లసిల్లి రంత. 41

గీ. రామబాణనిహతిఁ గంధకంబు ద్రెస్సి, యక్షణమ రామలక్ష్మణు లబ్బురపడ
శాపమోక్షంబుఁ గాంచి నిశాచరుండు, గర్వుఁడగు కుంబురాఖ్యగంధర్వుఁ డగుచు. 42

ఉ. చెంతకువచ్చి రామనృపశేఖరుఁ గాంచి నుతించుచు న్నిజో 45
దంతమునంతయుం దెలిపి తత్పతివీడ్కొని యాక్షణంబని
శ్చింతమనస్కుఁడై ఖచరసింహుఁడు వోయిన మానవేంద్రుఁడ
త్యంత సవిస్మయాత్ములగు నట్టిధరాతనజానుజాతుఁడై. 43

క. అరిగిభయంకర వనములఁ, దిరిగితిరిగి యమితకీర్తి దిక్ప్రతతంగా
శరభంగుని శరభంగుని, శరభంగరహితుఁడు రామచంద్రుఁడు గనియెన్. 44

క. కని తచ్ఛరభంగపదా, బ్జనికటకలఘుత్రితఫాల భాగుండైయ
మ్మునిపతినతిఁ బనతుఁడ, మ్మనుజేశ్వరు నెత్తి నిలుపల మన్ననయొసఁగన్. 45

వ. గాఢాదరపూర్వకంబుగాఁ గౌఁగిలించికొని యనంతరంబ మొగికినిలిచియున్న ధరిత్రీపుత్రీ సుమిత్రాపుత్రులం దగుభంగి సంభావించి యమ్మహామహులకు నర్ఘ్య పాద్యంబు లొసంగి మధురంబులగు గందమూలఫలంబుల నాతిథ్యంబునడిపి సుఖో పవిష్టుండగు శ్రీరామునకనుంగొని శరభంగుండు. 56

చ. నను బలభేది నాకభువనంబునకుం బిలువంగవచ్చిన
న్నిను మఱు వోకనిన్నుఁ గను వేడుకనిల్చితిఁ జూడఁగాంచితి
న్మనుజవరేణ్య నీ వలరమాపతి వార్యజనాదరుండవుర
ఘుతనూసంగు నీకరుణ గాంచినవారికిఁ బ్రాప్తె సౌఖ్యముల్. 47

క. త్రిదశజగన్నివసనరుజ, పదవాసంబును ద్వదీయపదదర్శనసం
పదకు సదృశుంబులె తలఁపదశేంధకనూజభూమి పదయామూర్తీ. 48

వ. అని మఱియుం బ్రస్తుతించి.

క. అలయుందేనెల ఫలముల, నలరుల నజినోత్తరీయకాదుల నలకా
నలరుచిరములగు తలిరుల, నలరుల సద్భ్రదయుండగుచు నమ్మునియొసఁగన్. 49

వ. పరితుష్టుండై యమ్మహాత్ము వీడ్కొని. 50

క. సాలంబులు వరుణరుచికి, సాలంబులఁ గీరసంతసాలంబులు నా
ఛాలమ్ముల్పక్ష్మపికమ్ముల, జాలమ్ముఁ గలిగి కనుఁగొనికాలమ్మున మున్. 51

లలితారుణప్రవాళలతాకదంబమై, స్తోకమై హారికులా హారమగుచు
వరభూమిశేఖరమై యమరచంద్రకిరణాళి, కూలమై మహితవిశాల మగుచు
పవమానీయుగండక మదజలమాత్రమై, భూమమై రాజీవధామ మగుచు
వరరాశికెనయగు వనరాశిఁ గనుఁగొని, రాఘవుండనుజ గోత్రాసుతాస
మేతుఁడై చని సద్గుణోపేతుఁ గనియె, నయ్యరణ్యాంతరంబున నధికనిష్ఠఁ
దపమొనర్చు మహాత్మకాంత విమలాత్ముఁ, దీక్ష్ణకరకోటిధాముఁ సుతీక్ష్ణనాము. 52
కాంచి యాతని మన్నించి నన్న, తించి యవక్ర్మని యాజ్ఞ వహించి మించి
తన్నుఁ బ్రార్థించు మునుల యుత్తమతపోవ, నంబులకు జూడఁ బోయె నయ్యంబుమీఁద
అరిగి ప్రియాసహితుండగు నారాఘవుండు. 54
మునికుమారులకుఁ గమ్మని ఫలంబులు దెచ్చి, యొసఁగి లాలించుచు నొక్కచోట
పారికాంక్షులతపోధన వాంతికంబుల, నుటజముల్గట్టుచు నొక్కచోట
వాచంయమికథిత వరపుణ్యకరకథ, లూఁకొని యలరుచు నొక్కచోటఁ
దాపసులకు నుపద్రవములు గావించు, రక్కసులను ద్రుంచు చొక్కచోట
ఋషివరేణ్యుల కజినోత్తరీయకాము, లొసఁగి దీవనలను గొంచు నొక్కచోట
గొప్పమునివున్నగలు గొంచు నొక్కచోట, రాముఁడు చరించె సుగుణాభిరతుఁడు మతియు
. మునిజనుఘమహితవర్తన, ముఁగొన్ని దినంబులచట మోదించుచు రా
మనరేంద్రుఁడు వారలవీడ్కొని తగుగతి సుందకర్ణి ఘోరతపంబున్. 56
. కావించు నప్పణాశ్రమసమీపంబున నరుగునవసరమున. 57
సితపీతకాంతులఁ జెన్నొందిపథికుల, కతిమాత్రకామోద మావహింప
శోకమై కాశ్రయ శాఖానిరంతర, స్వామమై వలపులు సందడింప
వ్రమశిఖాకర్బుర మేచక కేకాళి, నీలపింఛంబయి కెమ్మలింప
నిజసోల్లాసిత ద్విజాసరంబయి, యింపుమీఱుచు త్వెంప రాము
.. వామపార్శ్వంబునను సుమావళుల నేలు, బాలసహకారమండంబు పజ్జకేగుఁ
గాంతమాయూరశరవాటకంబుఁ గాంచుఁ, గొమ్మ పొదలుగోయు నవోక్తనయందు.
5. ఇవ్విధంబున ముదంబునొందుచు, శ్రమంబుఁ గుందుచు, తలంకుచు వడంకుచు వెడ
వెడ నడగిను పుణ్యమిపట్టిం గనుఁగొని రాముండు. 59
క. యాసను ఖరయవిసర మూ, యాసను రానేల వలవ దడవికనుచుఁ జా
యా సముచితముగ మున్నద, యాసచుధికవృత్తిఁ దెల్ప నది వినవు కటా! 60
క. లాయమ్ములు రిపుజనవిపు, లాయమ్ములు సంతతవిపులాయమ్ములు వా
లాయమ్ములు మనకిపుడు లు, లాయమ్ములు భయదఖరములాయములయ్యెన్. 61

క. కాంతారమ్ముల నరుతర, కాంతారమ్ములఁ జరింపఁగా నోపుదె స
త్కాంతారమ్ముల నలికెను, కాంతా రమ్మనుచు విభుఁడు గౌఁగిటఁ జేర్చెన్. 62

వ. ఇట్లు బహువిధోపలాలనంబుల నలరించుచు నంత నయ్యన్నదమ్ములు దుర్గమారణ్యమార్గంబుల నప్రమాదులై చని చని యొక్కనాఁడు. 63

ఉ. రాసుతు లర్కవంశవనరాశిసుధాకరు లెంతయేని సం
త్రాసము సర్కవంశవనరాశిసుధాకరమైన కోన ధా
త్రీసుతఁగూడి చొచ్చి విహరించిరి రాముఁడు లక్ష్మణుండు న
జ్ఞాసనకృత్య మేరితర మౌను గడంగి తొలంగఁబెట్టఁగన్. 64

వ. అది మతియును బరిసిద్ధాశ్వత్థపరివృద్ధ కపిత్థవటాశోక దాడిమీతరు సంభృతంబును పారిజాతకామ్రాతక శ్లేష్మాతకపిండీతవిభీతక కేతకీభల్లాతికీ జంబూ జంబీరౌదుంబర నింబ భూనింబకదంబ కదంబ భూమిజంబు కావ్యడంబక కాకోదుంబరి కాంబుజ భూమిజంబు కాముఖానోకహ సంకులంబును శిఖిసారక హాయమారక కుమారక కలికారక వనమయూరక సాల రసాల తమాల కృతమాల తూల తాలహింతాల నారికేలభండీలాంకోలముద్దాలన క్తమాల సాలవిశాలంబును గలిగి త్రివిష్టపంబు విధంబున రంభాసురభ్యైరావత మందారేంద్ర సురసాన్వితాన్వితంబై పృథు ధరాక్రమంబున కుంభీస్యందనవీరతగుధనుర్బాణాంచితంబయి నభోమార్గంబు చందంబునఁ దరణివసుమనోహరంబయి యధోభువనంబుకైవడి ననంతాశ్రయంబయి సత్యలోకంబు ప్రకారంబునఁ బ్రహ్మణ్యశారదా గాయత్రీసముపేతంబయి జటీసమూహంబువలనుఁ జటీకౌశిక శాండిల్యలోమశ కపిలానుకూలంబయి కైలాసంబు పోలిక పాశుపత హైమవతీ శివాధికంబయి, బలిసద్మంబునను వోలె, కితవపలాశ రాక్షసీ సంయుతంబయి యభయాధికంబయ్యును గుక్కురా లర్కభయానకంబయి ఋక్షపున్నాగమయూరారిష్ట వ్యాఘ్రానఖ సమన్వితంబయ్యును ఋక్ష పున్నాగమయూరారిష్ట వ్యాఘ్రానఖ సమన్వితంబయి నాగవల్లీలవలీలతా బహుసుతాత్రివృతా ద్రాక్షాదిలతా బహులతాభిరామంబయి యొప్పునయ్యరణ్యంబునం దట్లు ప్రవేశించి పెంటుల నెదుటఁ బెట్టికొని మెట్టుకొట్టుకొనలం బులులువిప్పి యాడుచుట్టి నట్టువపిట్టతిట్టులం గాంచి హర్షోత్కర్షంబునొందుచు నొక్కొక్కపట్టునం బుట్టల నిక్కినిక్కి దిక్కులు చూచు గౌధేరంబులం బట్టికొన నుంకించు శబరశాబకులం జుట్టికొని ప్రోవులై పోవు సారమేయంబులకు దూరంబుగాఁ దొలంగుచు, బండి గురివిందతీవ చప్పరంబులనీడలం బండి విశ్రమించుచుం బండినకంటకఫలంబు లుపయోగించుచు, స్కంధాగ్రంబునను మున్నుగసి తపవనంతరంబున న్నిసువులకు నిజలాంగూలదండంబు

లూఁతలుగా నొసంగి యెక్కించుకొని శాఖాగ్రంబులం దుముకు శాఖామృగంబుల సహాయం బపేక్షించుచు, నకులంబులు తేలిహాసకులంబుల విదళించు నేర్పునకుం బొంగుచు, భుజంగసమాలింగితమ్ములగు ద్రుమమ్ముల కొమ్మలు భుజంగాలింగితలగు కొమ్మలం బోల్పఁ బట్టగు ప్రదేశంబులం దిరుగుచు, ననేకవిధ మార్జాలజాలంబుల నాలోకించుచు, సారంబులగు కృష్ణసారంబులవారంబు లీరంబులం బాఱు సారవంబు లాలించి, ఘోర క్రూర మృగంబులుగా శంకించి పరికించుచు, కమలాకర తీర మహీరుహాగ్రశకున నిపతితంబులగు ఫలంబులు జలంబుల బుడుంగు బుడుంగు మనుచుం బడుచప్పుళ్ళు మెప్పొదవ నాలకించుచు, నత్తుంగంబులగు పర్వతశృంగంబులనుండి వెలువడి జలజలం బ్రవహించు సెలయేళ్ళ ననుకరించు వూఁదేనె వాఁకల సమీపంబుల నిలుచుచు, వింతలగు కమ్మతావులు వెదచల్లు కపురంపుటనఁటి బోదియల నారసికొనిపోవుచు, రేపకడ మేల్కొని యెరలువెట్టి పిల్లల నెఱకల నిఱికికొని యొదిఁగి నిదురించు కారుకోడిపిట్టలం బిట్టులికించుచు, సర్పవృశ్చికంబులకు వెఱవక వెరవున వెలుతురుకై వత్తి నోటం గఱచి పట్టికొని యల్పవిశాలంబులగు గిరిబిలంబులం దూఱి చని యందు నిదురించు నేదుపందులం గడకాళ్ళు పట్టికొని వెనుకకీడ్చికొనివచ్చు నిషాదుల సాహసంబున కచ్చెరువునొందుచుఁ బథమ్మునఁ దమ్ముం గాంచి భయమ్ము గ్రమ్మికొన రయమ్మునం బారులై పాఱు శశకాది క్షుద్రజంతునికరమ్ముఁ గరమ్ముఁ గనికరమ్మునం బోవిడుచుచు, మృగయాపరిక్షిప్తపిపాసాక్త పృషత్కంబులు మనుఁబోతులం గ్రుచ్చికొని యుచ్చి చనినవేగంబునం గాఁడినవాడిన జోకలగు మావిమోకల నాలోకించి యాకులంబు నొందుచు మఱియుం గొన్ని సంకటస్థలంబులం బాదంబులం దీవలల్లికొనినం బోఁజాలక మిట్టిమిట్టిపడు కణుతుల సమీపంబునకుం బోయి బంధమోక్షంబు గావించుచు నశ్రమంబులగు తాపసాశ్రమంబుల చెంతం గాసారంబుల తీరంబులం బర్ణశాలలు విశాలంబులుగా నిర్మించికొని వసించుచు, వల్మీకబిలంబులు వెలువడి దీర్ఘజిహ్వాపల్లవంబులు సాఁచి చిఱుచీమలం జవిచూచుచు నలుకువోడమినం జుట్టచుట్టికొని వెలికింజిప్పల ప్రోవుగన్పట్టఁ గొంతవడికి భయంబుదీఱిన నెప్పటియట్ల తిరుగ నారంభించు నాలువల నాలోకించుచు, వివిధమధుమధుర ఫలపలంబుల నాఁకలి ప్రచ్చుచుఁ, బువురాల్చిన తరుమండంబు తారకారహితంబగు నాకాశంబు చందంబుగా వితర్కించుచుఁ గంఠీరవంబులకుంతితోత్కంఠం గుంభికుంభస్థలంబులు వగుల్చిన నందలి క్రొమ్ముత్తియంబులు రాలుటగా నెఱుంగక బదరీఫలభ్రమ దట్టంబులగు పత్త్రపుట్టికలం బెట్టుచు, విటపాగ్రంబుల నమాంగమ్ములగు నెమ్మలు గనుంగొని చిఱుతపులు లల్పమృగంబులం బట్టి

యచటఁ బెట్టికొని భక్షించుటగా నూహించుచుఁ దరుశిఖరములాయపరినిక్షిప్త
నిజాండ గ్రసనోద్ధతకృష్ణసర్ప సమాలోకన జనిత మహాశోకరోష వేగ పరిభ్రమిత
పక్షికులార్త నాదంబులకుం గనికరించుచు, మచ్చికలచ్చుపడం బెచ్చుపెరిఁగి పచ్చి
కపట్టులకువచ్చి మెచ్చివచ్చులకడి మేయుచున్న సారంగంబుల చరణాంగంబు లధి
ష్ఠించి తత్ఖుర స్పర్శనంబున నీఁడి రెక్కయు శలభవిసరంబుల సరభసంబునం బట్టికొని
మ్రింగి క్రమ్మఱ నెప్పటియట్ల లేళ్ళ మూఁపులం బాదంబులు మోపి యుల్లసిల్లు
భరవ్యాజంబుల నభివీక్షించుచు, నిలువెల్లం జలిచీమలు గఱచి పట్టినం గాళ్ళఁజాలక
తరులతాగుల్మంబులు సాల్వడం గొట్టికొను మెట్టపొట్టపింజరుల యుపద్రవంబులు ద
ప్పించికొని పోవుచు నార్ద్రప్రదేశంబుల విహరించియుం బుష్పరసంబులు పుక్కిళు
లంబట్టియు వచ్చుచుంబోవుచున్న జంటీఁగల వెనువెంటం దప్పక చని క్షుద్రపటులని
ష్కుహమ్ములగు వనోకహమ్ములం గనుంగొని తన్నిమిత్త సమాయాతభల్లూక వ్రాతం
బులందోలి తద్గర్భమ్ములఁ గరమ్ముఁ జొనుపుటకుఁ గరమ్ము నిఱుకటమ్మైవశమ్ముగా
కున్నం గొనగోళ్ళనవియించి కాఱుమధుధారలం దోయిళులంబట్టి గ్రోలియుండనివి
సనకజాతి నెఱియలం జేతులు వఱపి మధుకోశంబులు దీసియొసఁగినం బొట్లంబులు
గట్టునెడ నెఱుంగక చిన్నిపూఁదేనె పోరలం బురువుల తుట్టెలని పాఱవైచు చిన్న
వారలంజూచి నగుచు మరల నేరిందు చెంచునాయకుల వింతమాటలకు సంతోసం
బునొందుచు ఫణిఫణామణి తోరణ విశాలసాలసౌధాంతర జ్యోతిరింగణ దీపికాదీపి
తమ్ములగు గుచ్ఛ సుమలతాకాయమానమధ్యప్రదేశ మకరందపరిక్షాళిత శిలాతలా
సీనభిల్లపల్లవాధరీ వినోదమధుర వేణునాదంబులకుఁ గరంగుచు నిజశంతు సంతా
నంబుల గుల్మాంతరమ్ములు నిరంతరమ్ములుగాఁ గర్పటాకారంబున నేర్పన నల్లి దా
నిం దగుల్కొని చిక్కిన కీటకంబుల దంశంబు లుపదంశంబులుగా భక్షించు నూర్ణ
నాభంబుల యాలోచనంబులకుఁ దలలూఁచుచు మేఁపుల సందడిం జెదరిపోయిన
సమయంబునఁ బొంచి చని క్రోల్పులులు సలుఁగులంబట్టికొని పాఱునెడ నిజశాబకం
బు లొనరించు నార్తింౘెలుపు ఘీంకారంబు లాలించి గ్రక్కునం గలసికొని వ్యాఘ్రం
బులని గ్రహించి పిల్లలగుమిఁగూడికొని పొదల సందుసందుం బొదలుచు ఘుర్ఘుర
ధ్వానంబులం బుడమి వ్రక్కలించుకొని యొక్కఁ ప్రోవుగా నిదురఁ జొక్కియున్న
నత్ఖరోమంబులం దెలుపుచు శమ్యవంశ నవ్యసంఘట్టనోద్భూత ప్రభూతవన
భూతాశనజ్వాలాకలాపంబునకు సహాయంబైన మధ్యాహ్నసమయోష్ణ కిరణోష్ణ
సహిష్ణువులై పడవ్రేలఁబడి పొరలు సైరిభంబుల నిధంబులుగా నభివీక్షించుచు,
మృతమృగకళేబర దుర్గంధ గర్తవర్తన ధూర్తమృగ ధూర్తసమాఘాతంబులకు

రోయుచు, చమరీమృగ వాలవ్యజనవీజనోజ్జనిత మరుచ్చలల్లతాలతాంతడోలికా సంస్థితంబులగు మిళిందబృందఝుంకారంబులకు వినోదంబు నొందుచు, శునకంబులు వెనుకొనం గనుకనింబాటి యుబ్బారిం దోలంగఁ దమ్ముంజేరిన రురువారంబులం గటాక్షించి తద్విరోధంబులగు జంతువుల నదలించుచు, మనోహరవిపరీత భయానకంబులఁ దానకంబులగు ఖగమృగస్వనంబు లాకర్ణించుచు, నిరోధిత తరణికిరణ ప్రసరణతరులతాశిఖర పరిపక్వఫలప్రతిబింబిత తారకాకోరక ప్రకరంబు నుంబోని ఫణిఫణామణిప్రభాపటలీ ధగద్ధగితంబున కచ్చెరువందుచు, వనేందిరాకిసలయహస్త పరిస్రస్త ముక్తాఫలక్రమాభివీక్షిత బాలతృణాంకురాగ్రమాలికా ప్రతిభాసిత హిమానీ బిందుసందోహంబుఁ గొనియాడుచు నిండారం బండిన దొండపండులదండం దండిగఁ జెక్కిన జిగురుం గండెలం దండోపతండంబులగా బెండువడి పడిన పీలిపిట్టలం బట్టికొని మెచ్చువచ్చు కుచ్చులం బుచ్చుకొను శకునాంతకుల చెంతకుం బోవుచు దివాచర నిశాచర మృగపక్షి ప్రచరణంబువలనను గమల కైరవ వికసనోన్మీలనంబు వలనను ప్రభాకరోదయ కలాస్తమయ కాలనిరూపణంబు గావించుచు మెట్టయుండుతపిల్లలంబట్టి విడుచుచు శార్దూలంబులం దోలుచు తరక్షువుల శిక్షించుచు శరభంబుల సరిపెట్టుచు గవయంబులం గడతేర్చుచుఁ గణుఁజురులకుం దొలంగుచు వాఁడిగల ముండ్లు గాఁడినం దూఁగాడుచు నన్యోన్యవైర సంశోషణంబు లగు సంభాషణంబులాడుచు వర్షాతపహిమానీ నివారణంబుగా గుజ్జుమావులపజ్జకుం బోవుచు గుసుమవిసరంబు లేఱుచు నీరంబులం దూఱుచుఁ గొంతదూరంబు చనిచని యొక్కనాఁ డొక్క పుణ్యాశ్రమంబుఁ గనుంగొని యందు. 65

మ. భవనారణ్య భవప్రతీతు సుగుణ భ్రాజిష్ణు వింధ్యారిదు
ర్భవనాగారిఖగాధిపు న్నియమిసంభావ్యప్రభావాఢ్యునిన్
భువనారాధ్యుని మాత్రవచ్చులికితాంభోరాశి నక్కుంభసం
భవనామున్ జగదేకవంద్యుఘనులోపాముద్రప్రాణేశ్వరున్.

క. కని మ్రొక్కిన సీతారాముని గ్రక్కునఁ గ్రుచ్చియెత్తి మునిమక్కువనె
క్కొనఁ నక్కున నక్కఁగదియ, నును జెక్కులునొక్కి కడుమనోమోదమునన్. 67

ఉ. అంబుజమిత్రగోత్రకలశాంబుధిసోముని రామునిం బ్రమో
దంబునఁ గన్న పుత్త్రునివిధంబున నెంతయు నాదరమ్మురూ
పంబు వహించెనో యనఁ గృపన్మనిదేల్చె సుఖాసనార్ఘ్యపా
ద్యంబుల నిష్టవాక్ప్రనిచయమ్ముల నిట్లలరించి వెండియున్. 68

క. లక్ష్మణుఁగృతలక్షణుఘన, లక్ష్మణుమన్నించి తనకులసతినని చెనా
లక్ష్మీసమానయగుజన,కక్ష్మాధీశసుతఁ బూజఁ గావింపంగన్. 69

వ. నియోగించి రామలక్ష్మణుల నుచితాసనసమాసీనులం గావించి మధురవచనరచనల నలరించి రాముం గనుంగొని. 70

ఉ. కాయము వొంగనిన్నుఁ బొడఁగాంచితి ధన్యుఁడనైతి నాదినా
రాయణమూర్తివీవు మునిరక్షణకై యిటులుద్భవించినా
వాయననీతనూజభవదంగనపంకరుహాక్షిలక్ష్మినూ
నీయనుజుండు లక్ష్మణుఁడు నిక్కము శేషఫణీంద్రుఁ డారయన్. 71

చ. త్రిదశశపద్దశాహ్యతిగుఱించి విరించి స్మరించినన్ ధరి
త్రిదశరథోర్వరావరసతీత్రయమందుఁ జతుర్విరాకృతు
లుద్గదమునఁదాల్చి పుట్టితివమోఘమువిష్ణుఁడవీవు తావక
ప్రదరనిపాతితంబులగు రాక్షససైన్యములొక్క ప్రేల్మిడిన్. 72

వ. అని యభినందించి మఱియుం బుణ్యకథావిశేషంబు లుపన్యసించుచు నిట్లుండనగ స్త్యుండొక్కనాఁడు రఘుపుంగవుంగనుంగొని నీవింక నిందుండవలవదు గౌతమీతటం బున నుత్కృటంబగు పంచవటుంబుగలదచట నుటజంబునిర్మించికొని జానకీలక్ష్మణ సమేతుండవై యప్రమాదంబున నుండునదియని చెప్పి రాఘవున కమోఘశిలీముఖంబు లొసంగి యాదరాతిశయంబున. 73

క. హస్తయుఁతతరునిరణగ,భస్త్రావదని రామభద్రునిఁ గరుణ
స్నవ్రస్త్యధికంబగునటుల న,గస్త్యుఁడు దీవించెఁ గౌతుకం బలరారన్. 74

వ. దీవించినం బరమానందంబునొంది రామచంద్రుండు మునిచంద్రుని గనుంగొని. 75

క. వింధ్యమునణఁచితి బలపరి,పంథ్యభ్యర్థితుఁడవగుచుఁ బాణితలమునం
గంధ్యుదకమ్ముం ద్రావితి,వంధ్యతపోవిభవపొగడ వశమే నిన్నున్. 76

వ. అనియిట్లు ప్రత్యభినందనపూర్వకంబుగా వీడ్కొని. 77

క. సాలనుఁ సాలపనసత,మాలవకులపూగనక్తమాలసదమిసీ
తాలమగువనంబున సీ,తాలక్ష్మణసహితుఁడై ముదంబున నరిగెన్. 78

గీ. ఇవ్విధంబున నరిగి మదేభసింహశరభశార్దూలభల్లూకసైరిభతతి
గలిగి కాకఘూకారవాక్రాంతమగుమహావనంబుల విహరించు నవసరమున. 79

సీ. వటుముఖతరుశిఖాచ్ఛటలు గనుంగొని, యిది క్రూరసర్పంబు లేయటంచు
గుమ్ముఁబర్వులువాఱు క్రోడంబులను గనుఁగొని యిభగజములొకోయటంచు

వావిరిమెఱుఁగు శిఖావళంబులఁగని, యివి పెనుభూతంబులే యటంచు
వీచికాసదృశచరీచికల్గనుఁగొని, యివిదీర్ఘదీర్ఘికలే యటంచుఁ
గీ. దరలద్రాక్షావల్లీవితానసంచ,యల్లలితపీ ధమ్మిల్ల భిల్లపల్ల
వాధరులఁగాంచి మునికన్నెలాయటంచు నడుగునడుగగ్గుకుఁ దన్నుఁబుడమిజాత.
వ. వెండియు. 81

చ. వికచసరోజగంధి పృథివీసుత రాముని కేలువట్టికం
టకతరుదుష్టసత్త్వనికటం బిచ్చటంజరియింప నేలయొం
డొకభయశూన్యమైనయెడ కొయ్యన నేగుట యుక్తమంచుమా
రమథరపత్త్రిఁజూపుఁగను రమ్యములంచుఁ దలంచి ముగ్ధయై. 82

వ. ఇట్లెఱుంగక పల్కుజానకిం గనుంగొని కొండొకవిషాదంబు గదిరిన న్మొగంబునం దోఁపనీక మఱుమాటలి ట్లనియె. 83

క. కాలవశతనివురించిన, గాలవశతములను వేడ్కఁగనుఁగొను వైదే
హీలతలువోలిచె వైదేహీలలితలతాంగి చూడు మింపొందంగన్. 84

ఉత్సాహ.
కొమ్మకొమ్మటంచు నేర్చి కొమ్మకొమ్మపంచులుం
గుమ్మరించు రుచులమించు కొండచఱులజున్నలు
న్నెమ్మిమీఱ నెమ్మిగులుకు నెమ్మిపురులకన్నులు
న్నమ్మతిగనోసంగు రామచంద్రుఁ డవ్వనంబునన్. 85

వ. ఇట్లొసంగుచు వనవాసం బనాయాసంబగు నట్లు సేయుచున్న యన్నం గనుంగొని లక్ష్మణుండు తనమనంబున. 86

సీ. స్యందనంబు శతాంగమయ్యె భూజానికి, జిహ్వాకుఁ బున్నాగ మయ్యెఁ బొన్న
జగతీశునకు నుటజంబు భవనమయ్యె, నవనీపతికిఁ జూర్ణమయ్యెరజము
అధిపమకాళికిమావు లశ్వరత్నములయ్యెఁ, బాట్లయ్యె స్పృహనకు భల్లుకమ్మ
లధిపతికి ఛదంబులయ్యెఁ బత్రింబులు, దరులయ్యె నిగమము ల్నరవరునకు
గీ. భద్రకలశంబులయ్యెఁ గుంభములు ప్రభున, కఖిలజనమాత్యునకు గోతులయ్యెఁ గపులు
ధరణిఁ గలవంతమైన విధాతృకృత్య, మెవ్విధంబునఁ దలఁగుచు రెట్టివారు 87

క. మేలగు వీణారవముల, మేలుక నెను రామవిభుఁడు మృదువిగ్రహుఁడి
క్కాలమున సృగాలంబుల, యూళల మేలుకొనఁజొచ్చె నుగ్రాటవులన్. 88

వ. అని వగచి, జానకిం గనుంగొని. 89

గీ. సీతతోఁ గూడ నందు వసించెఁ దత్స, మీపమున నొక్కచోట సౌమిత్రి యుల్ల
మల్లసిల్లుచునుండ నల్పోటజంబుఁ, గట్టికొని యుండె రామభూకాంతుఁ డలర. 103

వ. ఇవ్విధంబున నివసించి సమస్తోపచారంబులు లక్ష్మణుండొనరింప సుఖంబుండి సమయ సమయంబులు పండ్రెండుఁ గడపి యల్పావశిష్టంబగు నత్త్రియోదశవత్సరంబునం దొక్క నాఁడు. 104

మ. ధరణీనందనకున్స్థలంబులు సుమిత్రానందనా తెమ్ము పా
మ్మృగయుం బౌరఁగ రమ్మటంచుఁ బనుప నొమ్మోదంబు లక్ష్మణుం
డు రహింబూవులుఁ గాయలాకులును బండ్లుం గోయ నక్కాననాం
తరసీమన్విహరించుచుండ నతివిస్తారాద్భుతాపాదియై. 105

క. క్రతుభుగ్రిపు నాశమును, గ్రతనసితోద్వేల మొక్క కరవాల మవ
క్రతరంబై తోఁచె శత, క్రతుమాయాకలితమగుచు గగనతలమునన్. 106

వ. అంతరిక్షంబునం బఱతెంచి సమక్షంబున నిలిచిన యలక్షితకార్ముకంబు నభివీక్షించి లక్ష్మణుండు దక్షిణహస్తంబునం బరిగ్రహించి తత్తీక్ష్ణ పరీక్షార్థంబు గానప్పుడ.

క. ధారాధరనిభములగు మ్రహీరుహముల నఱక మానులే తెంచి ధరి
త్రీరమణపుత్రి భళనసి, ధారాదళితములు సేయఁదగునే తరులన్. 108

వ. అనిపలికి వారించి యమ్మును లారాజనందను నుద్దేశించి. 109

మ. ఫలసంఘంబులు లేవు రావు ఖగము ల్పత్రంబులున్ భక్షణా
ర్హాలసత్కాంతులు గావు కావున మహావ్యాళ్యాళికిన్ రావు బూ
వులగుత్తుల్గనరావు మాత్రమునఁ దావు ల్లేవు రాజేంద్రనీ
వు లసద్బాహుబలుండవివ్వేదుసుఁ బోత్రివుం గన్మి తూటాడుమీ. 110

చ. అనవుడు రాజనందనుఁ డహార్పతితేజుఁడు లక్ష్మణుండు చ
య్యనఁ దను హెచ్చరించెడు మహాత్ములకున్ మ్రొక్కి మెప్ప వాఁశవ
ర్ధన మొనరించి యందు రుధిరప్రవిలిప్తకపోలునిం గృపా
ణనిహతసత్కపాలుని ఘనవ్రతశీలుని దైత్యబాలునిన్. 111

క. కని మునిపుత్రుఁ జంపితి, నని భయకంపితశరీరుఁడై కడు వేగం
జని తన యన్నం గనుఁగొని, వినిపించెం దనదు సర్వవృత్తాంతంబున్. 112

వ. వెండియు. 113

క. నరవర యెఱుంగక గుల్మాంతరితుండై తపము సేయు తాపసవంశో
త్తరు నొకబాలకు భయద, త్సురికాహతుఁ జేసినాఁడఁ జుమ్మని పలుకన్. 114

ఉ. విన్ము సహోదరా దనుజవీరులఁ జంపి మునీంద్రరక్షసే
య న్మనమిందు వచ్చి దురితాత్ములఁ జంపక యిట్లు సాధువృ
త్తి న్మునినై సమాధినిరతి న్ముద మొందుచునున్న మౌనిబా
లు న్మెడ ద్రెవ్వఁజేసి కడు లోపితకర్ములమైతి మక్కటా. 115

వ. అని యనేకవిధంబుల ననుజసహితుండై విచారంబు నొందుచున్న యన్నరేంద్ర
చంద్రు సమీపంబునకు మునీంద్రు లరుగుదెంచి భవదనుజభుజాసిధారాదళితమస్త
కుం డగు నతండు దనుజుండు వీనిం దునుమాడుట యనఘంబని యతనికి మనస్తాపో
పశమనంబు లగు వాక్యంబులు దగుభంగి నుపన్యసించి యనంతరంబ సౌమిత్రిం జే
రంజని యిద్దురాత్ముండు విద్యుజ్జిహ్వుండను రావణసహోదరి యగు శూర్పణఖ
యం దుద్భవించినవాఁడని తదీయజన్మప్రకారంబుఁ దేటపడం బలికి మఱియును.

ఉ. జంబుకుమారుఁ జంపితి నిజంబు కుమారక దీన నీకు దో
సంబు తలంచిచూడ యవసంబును లేదు ముదంబునొందు మా
త్రింబడనేల యీతని వధించితినంచుఁ దదీయవృత్తి స
ర్వంబును నీకెఱుంగఁగ ధ్రువంబుగ నిప్పుడు విన్నవింపమే. 117

క. అనిన మిషము సేయఁగఁ దన, జనకునిఁ జంపిన విరోధి సమయింపఁగ ని
ట్లొనరించెను తప మితనిం, దునుమాడిన దీన నీకు దోసము గలదే 118

వ. అదియునుంగాక మదీయప్రేరితుండవై యొనరించుటం జేసి పాపంబునకు సంశయిం
పం బని గలదే యని వాచంయమిప్రకరంబు నిజాశ్రమంబులకుం జనియె నిట్లు మహా
మునిప్రబోధితులై రామలక్ష్మణులు నిర్విచారులై యుండిరంత నొక్కదినంబున.

క. శూర్పణఖవచ్చి యటు పరిమార్పఁబడిన కొడుకుఁ జూచి యాఱనిపగ త
న్నేర్పఁగ గద్గదాననమున, నార్పులు బొబ్బలు వెలంగ నాక్రందించెన్. 120

వ. ఇట్లరణ్యరోదనంబు సేయుచు మృతుండగు సుతుం దలంచి. 121

శా. తండ్రిం జంపినవానిఁ జంపుటకు నుద్యన్నిష్ఠ నిచ్చో గడు
న్నుగ్రంబైన తపంబు సేయు నిను నేవీరుండు హింసించెనో
తండ్రీ నామది శోకమాఱునె మహోద్దిష్టంబు సంధిల్లఁ జె
క్కుండ్రం జంపకయుంచు నద్వివ్రతవక్త్రపోల్లసద్దంష్ట్రియై. 122

ఉ. మానులఁగాంచి నాసుతు నమానుమతేజు వధించినట్టి దు
ర్మానినిజూపకున్న మిము ద్రుంచఁగ మోఁదెద నన్నవారల
మ్మానినిఁగాంచి భీతియుతమానసులై తగ నిట్లు పల్కి ర
మ్మానిజమాలించు మొక మర్త్యవరేణ్యుఁడు ద్రుంచె నాపుకున్. 123

ఉ. అంగన వానిఁబట్టి పరిమార్పఁదలంచి కడంగి ఘోరకా
లాంగనవోలె రోయుచు మహాటవి నొక్కెడఁగాంచె సాధ్వి సా
త్వాంగనఁగూడి సోదర సహాయయునం దగురీతిఁ బర్ణశా
లాంగన మొప్పఁజేయు మహితాత్ముని రాముని గీర్తికామునిన్. 124

వ. ఇట్లు గాంచి. 125

ఉ. వామతరోల్లసద్దశనవారవిభా చపలాంశుజాలమున్
శ్యామలవర్ణముం బటుదయారసవృష్టియుఁగల్గి కానలో
నీ మెయినున్న వాఁడు ఘనుఁడీతఁడు సంశయమింతలేదు నా
కీమహనీయ తేజు నెడ నెంతయు నగ్గలమయ్యెఁ గామమున్. 126

వ. అని మఱియు నతనిం దనివిసనక కనుంగొని. 127

సీ. ఇతనిమోమరవింద మితనికన్నులతుంద, మిందీవరంబుల పొందుఁదెగడు
నితనికటులు తిన్నె లితని మాటలు చిన్నె, లలసుధాధారానయంబుఁ దెగడు
నితనిపొక్కిలిబావి యితని చెక్కులకీవి, యలదర్పణముల సోయగముఁ దెగడు
నితనిమోవి పగడంబితనికంఠము డంబు, కంబుమానితసుందరంబుఁ దెగడు
గీ. నితనిహస్తము లస్తము లితనివెడఁద, యురమయురమిమ్మహాత్ము పొందొప్పఁగాంచి
యొలమినొందని జన్మంబు వృథయటంచుఁ, జేరఁ జనుదెంచె రాక్షసస్త్రీ రయమున.

క. మునివర్యులకు నొక్కమహము, జరియింపఁగఁజేయు రామచంద్రుంగని కా
మినిదోషాచరి మోహించిన దనుటకు ధరణి నేమి చిత్రము తలఁపన్. 129

క. కని రిపువంశ్యులు జేరంజనుదెంచెదు దానిఁ గుసుమసాయకబాణ
ప్రనిహతమనోబ్జజనఖ ,డన పటుతరతీక్ష్ణశూర్పణఖ శూర్పణఖన్. 130

వ. అయ్యవసరంబున లక్ష్మణుండు నీ వెవ్వరిదాన విచ్చలనికిఁగాఁ బ్రయోజనంబు నీకుం
గలుగ దేము దశరథరాజనందనుల మిర్వురంబుఁ బొఱు విహారార్థంబు చనుదెంచితి మెడ
గలిగి పొమ్మనుడు నతని నాదరింపక యన్నిశాచరి రామచంద్రుం గనుంగొని. 131

ఉ. ఆతతకీర్తి పూర్వవిబుధాధిప శేఖరుఁడైన రావణా
ఖ్యాతునితోడఁబుట్టువ నకంపితచిత్తఁ బులస్త్యవంశసం
జాతను నిన్నుఁగాంచి సుమసాయకసాయకపీడితాంగనై
తీతను వేలరాదు వసుధేశ్వర నిన్ను వరింపనుండెదన్. 132

వ. అదియునుంగాక వినుమేను గామరూప ననేకవిధ సుందరాకారంబులు వహించి
ప్రీతుఁజేయను నెఱసి చోటికి నిన్నెత్తికొని పోవను నేర్తు మదీయ నామధేయంబు

శూర్పణఖ నన్నుం గలసి భవత్ప్రియానుజప్రియాసహాయుం బపేక్షింపక కామోప
భోగంబు లనుభవింపు మని పల్కిన నవ్వుచు నతం డారక్కసిం గనుంగొని. 133

క. సుమతీ చంపక విడిచినఁ, బ్రమదంబునఁ బొంగి చనక ప్రత్యక్షులఁ గూ
టముఁగోరెదు నాతో రా, సుమటన్నం జంక నెత్తికొనుమను భంగిన్. 134

క. అని పలుకునంత దానిం, గనితద్వికృతాకృతియును ఖరనిస్వనముం
దన కద్భుతమగుడు ధరాత్మజ నగియె నగినఁ గ్రోధతామ్రాననయై. 135

ఉ. ఆదనుజాంగనాధరు ధరాత్మజఁ గన్గొని నిన్ను మ్రింగినం
గాదనువారు లేరు నను గర్వముఁ దక్కుమటంచు దాని హృ
ద్భేదకవాక్యసంతతులు ప్రేలిన రాముఁడు కర్ణనాసికా
చ్ఛేదన మాచరింపుమనఁ జెచ్చెరలక్ష్మణుఁ డట్లొనర్చినన్. 136

క. ముక్కుఁ జెవులుఁ దెగిపోవుడు, నక్కటిరక్కసులు వెగడనుదురవమున నా
టక్కరి మిక్కిలియేడ్చుచు, నిక్కరణి న్సేయధర్మవే మీకనుచున్. 137

ఉ. వాలమున్ ద్రొక్కినం గినియు వాయుభుగంగనభంగి నింగి వా
తూలరయంబునం బఱచి దుర్మతి యప్పిశితాశి యన్న పే
రోలగమున్న చోట రుధిరోద్గమవైకృతకర్ణనాసికా
మూలము లెత్తయు న్నలుప ముందఱ వ్రాలెఁ గరంబు దీనతన్. 138

వ. వ్రాలి మహారోదనంబు సేయుచు నన్నం గనుంగొని. 139

ఉ. ఒక్కనయందు దారయు సహోదరుఁడుం దనుఁగొల్వ రాజసం
బెక్క వనక్షితిం దిరుగ నెక్కడివారలు మీరటంచు నే
నక్కడకేగి వారివిధ మారయఁగోరినఁ గర్ణయుగ్మము
న్ముక్కును గోసి చేనిడిరి మోసముగాఁగ ఖరాసురాగ్రణీ. 139

శా. నాసాకర్ణవిహీననైతినని చింతం బొంద నింతేనియు
న్నీసామర్థ్యము లెక్కసేయక స్మయాంధీభూతులై కావను
ల్లాసాధిక్యతనున్నవారని గడు న్లజ్జింతు నన్నీచులం
బ్రాసాసిక్షురికాదిసాధనముల న్భంగింపు మెబ్భంగులన్. 141

ఉ. వారని కిప్డు పరివారపలాశసమన్వితుండవై
వారణహస్తసన్నిభభవద్భుజవిక్రమ మెక్కడేగె య
వ్వారని సేయఁజాలక జవంబడిపాఱినఁ బాఱనీక వే
వారలఁ జంపకున్న మనవారలకుం గడుఁ గీడు మీఁదటన్. 142

చ. విను నను నవ్వనారి వెనువెంటను వచ్చెను కాంత దానిచే
తనయిటులయ్యెనాస వికృతాత్వము గావున నన్నుఁగూర్చి య
మ్మనుజుల తేజమేని సురమర్దన దానిగుఱించి యింక ని
ద్దనుజులగోత్రమేని కడు దగ్ధము సన్నిజమింత తెల్పితిన్. 143

చ. అనుటయు దండతాడితమహాహిగతిన్ ఖరుఁ డగ్గిసోదరిం
గనుఁగొని చింతదక్కు మిదె కావున యున్నిఖిలేశ్వభంగి న
మ్మనుజులఁగాల్చి ప్రత్తు నమూనముదక్కుము చూడు మస్మదీ
యనిబిడకోపము త్రకవివిధాద్భుతబాణము లెట్లుసేయునో. 144

వ. అని ప్రగల్భవచనంబులాడి. 145

చ. అశనినిభోగ్రవాక్యనిచయంబులఁ జెంగటనున్న దూషణ
త్రిశిరులఁ గాంచి వేగఁ బఱతెండు బలంబులఁ గూర్చి సత్కృపా
ణశరముఖాహవోపకరణంబులు దెండని పంగడంగి య
ప్పిశితభుగీశ్వరు ల్గదలు బీఁటలువాఱఁగ నార్చుచుం గడున్. 146

వ. సమరసన్నాహ సముత్సాహంబునం బొలిచి నిలిచినం గాంచి, 147

క. స్వస్థమురేంద్రవమూర్ఘ్నభ్రష్టాభ్రకకోటి మిగుల బద్దలుగాఁగం
బ్రస్థానభేరి చెలఁగ జనస్థానము వెడలి ఖరుఁడు నడిచెఁ గలంకిన్. 148

క. ఖరుఁడు నిశాచరకులశే,ఖరుఁడు ఖరుండిద్విపఘనకరకరుశో
త్తరు ధామమ్మజనముహా; త్తరు రాముం డోడనరిగెఁ దత్తఱపడుచున్. 149

వ. అమ్మహీపాలుం డనుజన్మునాలోకించి. 150

మ. అవనీభాగము సంచలింపఁగ భటావాంపూర్వ నాదావస్సైం
ధవహేషారవమత్తసింధుర మహోద్వ్యాస్బృంహితధ్వానమే
ఘనిధూతాతతగంధవాహాకపతాకస్యందనాభీల నే
మినిరావంబులు మించె నెక్కువగ సౌమిత్రీ కనుంగొంటివే. 151

చ. అదియొనుగాక భూమిరజ మద్దెస మిక్కుటమయ్యె నెవ్వరో
కదనమొనర్ప రాక్షసనికాయముతోఁ జనుదెంచున ట్లుగా
మదిఁగనవచ్చె నాఖలుల మాల్కొని కండలు చెక్కువైతు విా
వదినను గాచి యుండుము యొకవైపున భద్రముగాఁగఁ బుత్రికా. 152

క. కుసుమశరవిద్ధయగు ర్నాక్షసి జానకి ప్రింగఁబోవ సముయించ కు పే
క్షసలిపి వికృతాకృతిఁ జేసి సొరిదివిముపంగ నింతఁ జేసె నృపాజా. 153

ఉ. కావున సంశయింపఁ బనిగాదు ధరాసుత భీతినొందు సై
న్యావలిఁ గాంచి యట్లగుట నద్రిగుహన్వసింపఁజేసి య
చ్చోవిశిఖాసనాస్త్రపరిశోభితహస్తుఁడవై ముదంబునం
గావలియుండు మేను ఖరకంటకులం బరిమార్చునంతకున్. 154

వ. అని సీతారక్షణంబునకు లక్ష్మణుం బదిలపఱచి. 155

మ. కలభాలోకనచారుచంక్రమణవక్త్రేందీవరస్ఫూర్తిభూ
తలయోద్ధత్యమహాష్టమూర్తి క్రియ రౌద్రప్రస్ఫురన్మూర్తియై
విలునమ్ముల్దగులీలఁ దాల్చి కనె నవ్వీరుండు రాముండు ని
శ్చలనైశాచరమాన్యము న్సదనువాంచాశూన్యము న్సైన్యమున్. 156

వ. అంత నబ్బలంబులు గంతుమిగిలి. 157

ఉ. చేరఁగవచ్చి శూర్పణఖ చెప్పినవీరుఁ డితండె యంచుఁ గ
న్నారఁగఁజూచి లేశము భయంబు దలంపక యుద్ధక్రోధమే
పారఁగఁ జుట్టుముట్టిన మహాబలుఁ డాతఁడు గన్నుదోయి కెం
పారఁగ నబ్బలాటవి బయల్పడఁజేయుఁదలంచి యుగ్రుఁడై. 158

శా. మధ్యాహ్నోష్ణసహస్రభాను క్రియ రామక్ష్మాధినాథుండు వా
ర్ధిధ్వానముతోఁ జయానిపర మూర్వీభాగము న్నిండి సా
న్నిధ్యాకూతముగాఁగనుంగొని మహోన్నిద్రస్ఫురన్మూర్తియై
పథ్యాహీనముగాఁగ నించెనిషువు ల్ప్రత్యాలీఢపాదస్థుఁడై 159

శా. శ్లాఘాలంఘ్యపుఖర్భవేద్ధరుచి సత్సౌదామినీజాలమున్
జ్యాఘాతస్తనితంబు దీర్ఘవిలసచ్చాపైంద్రచాపంబు న
వ్యాఘాతాంబకవృష్టియుం గలుగు రామాభ్రంబు రక్తప్రవా
హౌఘంబు ల్గురిగించె భూతవితతుల్ హర్షింప సైన్యాటవిన్. 160

వ. వెండియు రఘువరుండు కోపోద్దీపితుండై. 161

ఉ. కొందఱఁ గుత్తుకల్దునిమి కొందఱఁ జెక్కులు చెక్కి కొందఱం
గొందలమందఁజేసి పటికొందఱ మేనులు సించి కొందఱం
జిందఱవందలై పఱవఁ జేసి విశేషరయంబు పేర్మి న
య్యందఱఁ గూలనేసె కరుణాన్వయుఁ డందఱ కన్నిరూపులై. 162

ఉ. ఒక్కెడ నేమఁగుల్చదియు నొక్కెడ నశ్వము లుక్కడంగు వే
ఱొక్కెడఁ గేతువుల్వ్రీలుగు నొక్కెడఁ గాలుబలంబుగూలు నిం

కొక్కెడ రథ్యము లుఱుఁగు నొక్కెడ వ్రాలు శతాంగపఙ్క్తి దా
నొక్కెడ రాముఁ డెవ్విధినొకో తొలగించెను బాణకోటులన్. 163

క. అని తను నుఱలగ్గింపఁగ, ననితరసామాన్యవిక్రమాధికుఁడై రా
మనరేంద్రుఁ డివ్విధంబున, ఘనతరశస్త్రహతి రిపుల గాసియొనర్పన్. 164

ఉ. జన్యము సేయఁజాలక నిశాచరసైన్యము దైన్యమంది రా
జన్యుని దేఱిచూడక వెసం బఱవ న్ఖరుఁ డడ్డమేగి యి
ట్లన్యశరణ్యశూన్యులక్రియం జుణుఁగం దగ దేను గల్గ మే
దిన్యధినాథుఁ గూల్తునని త్రిప్పె నిశాచరకోటిఁ గ్రమ్మఱన్. 165

ఉ. క్రమ్మినవిక్రమమ్మున సగర్వుని శాత్రవుఁ జుట్టుముట్టి వా
లమ్ములు గ్రుమ్మరించు నకలంకమనస్కుఁడనౌచు నంచు సై
న్యమ్ములఁ గ్రమ్మరించి ఖరనాముఁడు రాము నెదిర్చి తత్సమ
త్సమ్మున నిల్చి యిట్లనియెఁ గన్నుల నెఱ్ఱఁదనంబు దోఁపఁగన్. 166

ఉ. మక్కువ నిన్నుఁ జూడఁగ సమత్తముఁ జేసిన మత్సహోదరి
న్ముక్కును గర్ణము ల్చిదిమి మోసమొనర్చితి వంతఁబోక నీ
ప్రక్కడిమూఁకఁ ద్రుంచి కడు మోదమునొందెదు నీవు నీవ పే
రుక్కను దేజముం గల మహోద్ధతుఁడైన నరేంద్రుచాడ్పునన్. 167

వ. అని పలికి మఱియును. 168

క. స్వేచ్ఛావిహారపరుఁడ వి, శ్వాచ్ఛాదితయశుఁడఁ జూడు మఱి నుఱేఁ జేతు
న్నిశ్చితశరముల నీ కంఠచ్ఛేదము ఖరుఁ డన న్వెడఁగ నను వినవే. 169

వ. అనిన విని రామచంద్రుండు మందస్మితసుందరముఖారవిందుండై యద్దనుజాధముం గని.

క. తను దాన పొగడికొను టొప్పని పనియని యార్యజనులు పలుకుదు రిపుడీ
పని సేయక మాటలచే, తన జరగఁ దలంచి తివ్విధంబుఁ దెలిసితిన్. 171

వ. అదియునుంగాక. 172

ఉ. భీరుల ముందుఁ జెట్టికొని బింకములాడెదు వెన్క సఖ్యమేఁ
గోరిన నస్మదీయశరతు ఘోరతరాద్భుతమార్గణాగ్నికిం
బోరను నొఱ్ఱ నీరుధిరపూరము సాజ్యముగా ఘటించి వెం
పారెడు ప్రాణవాయువుల నాహుతులీయమి ధార్మికత్వమే. 173

చ. అన ఖరుఁ డల్గి దూషణుఁడు నత్త్రిశిరుండును దోడుగా నరేం
ద్రుని బటుబాణజాలములతో నెదిరించిన రామభద్రుఁడుం

జనుపడి వానితోడఁ దలపడ్డఁ గరంబును బోరు ఘోరమ
య్యెను గులపర్వతాళి నవియించెడు కార్ముకభీకరార్భటిన్. 174

వ. అట్టియెడ. 175

సీ. నక్తంచరధనుర్విముక్తనారాచపరంపరాసారంబు రాఘవాద్రి
ముంచిమించినఁ బెనుమంచుఁదుంపురుల నణంచునగ్రాంశుచందమునసుగ్ర
మూర్తియై రాముఁ డమోఘ శిలీముఖవ్యాపారమున వానితూపులడఁచి
నిశితబాణంబు లన్నిశిచరపతిమేన, గ్రుచ్చినవోచ్చి ఖరుండు బీరు
గీ. వోని తాల్మి నరేంద్రునిపై ననేక, పరశుపట్టిసముద్గరప్రాసముసల
శూలకరవాలపటుభిండిపాలవితతి, విసర నదుమన నఱకె యుర్వీశవరుఁడు. 176

క. కేతనమువిఱిచి తురగ, వ్రాతంబులఁగూల్చి యర్కవంశ్యుఁడు వెసఁ ద
త్సూతుఁ దునుమ విరథుండగు, నాతనికెడసొచ్చె దూషణాఖ్యుఁడుగడిమిన్. 177

వ. అన్నకుం దలకడచి కోపాటోపంబున. 178

చ. రయ మధికంబుగాఁ జని విరాధవిరోధి నెదిర్చి ఘోరదు
ర్జయపథవర్తులైన త్రిశిరప్రముఖు ల్దగు తోడుగా మహా
భయదరణంబు సేయఁ గని పార్థివుఁడుం గడుఁబోరుచుండ నొ
క్కయరద మెక్కివచ్చి విశిఖంబుల ముంచె ఖరుండు రామునిన్. 179

ఉ. దూషణము ల్సెలంగ ఖరదూషణముఖ్యులు వెల్లురేఁగి యు
పూషసువంశ్యునిం దొడరి పోరుటఁ గాంచి బలంబులెల్ల సం
తోషము నొందియొక్కమొగిఁ దోఁచినఁ గోపమునొంది రాక్షస
ద్వేషణుఁ డాతఁ డప్డు పరివేషగతుండగు భానుచాడ్పునన్. 180

వ. మండలీకృతకోదండుండై. 181

క. తుంగమదవుసొచ్చిన మాతంగవిభునిబోలి రామధరణీశ్వరుఁ డు
ప్పొంగుచుఁ జెచ్చెఱఁ దత్సేనాంగంబుల రూపుమాపి యలుక మలఁగమిన్. 182

సీ. శుష్కవంశాటవీఘోషంబు గావింపఁ, గనకోష్ణవహ్నిహుతాశనునిభంగిఁ
పృథుబుభుక్షాపరిపీడితంబయి మృగవ్రజము గన్గొనిన సింహంబుభంగిఁ
గన్నులఁ గప్పిన గవిసెనల్వీడి గువ్వపదువుఁ జూచిన వెనుపత్రిభంగి
సర్వరసమయప్రజానాశమొనరింప, వర్తించు నాసమవర్తిభంగి
గీ. వెఱసి రాదైత్యకోటి నుక్కఱఁ ఖఁడ, ఖండఖండాహతులఁ ద్రుంచుచుండఁ జూడ
భానుకులవార్ధిచంద్రుని ప్రభను గాంచి, యొక్కరొక్కరుఁ డధికప్రహర్ష్యగుఁడగుచు.

ఉ. కేవలశూలుఁడో యనఁగఁ గేలఁ గృపాణము గ్రాలఁగాఁ బృథు
గ్రీవము మీఁదికెత్తికొని కేకలు వేయుచుఁ దాఁకినం బృథు
గ్రీవుని ఫాలభాగమున శీఘ్రము రాముఁడు నించె నుజ్జ్వల
త్పావకసన్నిభంబులగు బాణము లాతఁడుఁ గూలె నేలకున్. 184

గీ. ఇవ్విధమునఁ బృథుగ్రీవు నేపడంచి, యజ్ఞశత్రునిఁ బరిమార్చి యంతఁబోక
శ్యేనగామిని దునుమాడి వానితోడి, వారల ననేకదైత్యుల నీరుచేసి. 185

వ. అవష్టంభవిజృంభితుండగు రాముని సహింపక. 186

ఉ. ఎక్కడఁబోదు నాయెదుర నీవని దూషణుఁ డారఘూత్తమున్
గ్రక్కునఁ దాఁకి తీక్ష్ణవిశిఖంబులు నాటిన వానినన్నిటిం
జెక్కలు సేసి రాజకులసింహుఁడు రంహుఁడు మేను వెంచి తా
నక్కఱి నాత్మవిల్లువిమి యాతనిఁ గూల్చె రథంబు మున్నుగన్. 187

క. దూషణుఁడు పడుటఁ గనుఁగొని, శేషించిన దైత్యబలము చెదరిపఱచిన
రోషావేశంబున న, ద్దోషాచరుల న్మరల్చి దుర్గమలీలన్. 188

క. అశనినిభబాణవిద్యా, కుశలుండగు రామవిభుని గోపమున నిరం
కుశవృత్తి నడచి యప్పుడు, త్రిశృంగగిరివోలెఁ దాఁకెఁ ద్రిశిరుం డంతన్. 189

వ. ఇట్లు తలపడి. 190

మ. ఖరుఁ డానందము నొందఁ భూతచయమాకర్ణింప నారాజశే
ఖరుఁ డాయఁ జని యస్మదుద్ధతి నెఱుంగంజాల వారాజశే
ఖరుఁ డాజి న్ననుమార్కొనన్ వెఱచు శక్యంబౌనె నీకింక మ
త్ఖరనారాచపరంపరాప్రణిహతిం గష్టంబు వచ్చుం గటా. 191

వ. అనిపలికి. 192

గీ. వీఁక మెఱయఁ దాఁకి మాయ లనేకములు ఘటించి నదు లబ్ధిఁ జేరి నశించుభంగి
మాయ లాతనిఁ జేరక మాయమైనఁ, గ్రోధమానసుఁడై రక్షసాధముండు. 193

ఆ. కనలి కనకపుంఖకనదంబకంబుల, రయము మెఱయ వైవ రాఘవుండు
వాని నడుమఁ దునిమి వానివక్షమునఁ గ్రొవ్వాఁడిశరము లేయ వాఁడు గనలి. 194

క. ఈడంబోక పెనఁగిన, వాఁడిమగఁడు రామవిభుఁడు వాలికతూపుం
గాఁడఁగ నేయ నతఁడు తూఁగాడుచు నిలఁగూలె దూషణాంతకుఁడార్వన్. 195

వ. త్రిశిరుండు గళితశిరుండైనం గాంచి తక్కిన రక్కసిమూఁక లొక్కుమొగిం జుట్టుము
ట్టుటయు. 196

క. కార్చిచ్చుపేర్చినటికి, సార్చుల వన మేర్చుపగిది సద్ధుజులఁ బో
కార్చి యనంతరమునఁ గృప, గూర్చిన మది ఖరునిగాంచి క్రూరరహితుఁడై. 197

చ. చెలియలిముక్కువోయె ననుసిగ్గున కోర్వనివాఁడ విష్ణుత
మ్మలతల లూడఁ గాంచితివి మోసమగుం దురహంక్రియాభిమా
నుల కిటు సైన్యహీనుని నిహం గనఁగొన్నఁ గరంబు బాలివు
ట్టై లఘుత కోర్చి యీచలము డింపుము నీబ్రదు కేను గోరితిన్. 198

క. పలుకంగ వమ్ముఁ బలికిన, పలుకులు సెల్లింప నెట్టిప్రాజ్ఞుకైనం
దలమే చలమేటికి నీ, తలమీఁదకు వచ్చెఁజావు దప్పఁ దొలఁగినన్. 199

వ. అనినం గనలుగదుర ఖరుండు. 200

క. నిను నస్మదీయబాణ, ప్రణిహతుఁ గావింపకున్నఁ బ్రజలు ననుఖరుం
డని వెఱతురె నను బరిమార్చిన దైవము నీవెకావె సిద్ధము జగతిన్. 201

గీ. అని పెలుచనాడి నిజరథ మధికచిత్ర, గతులను జరింప రాము నప్రతిహత ప్ర
భావు మార్కొని ఖరుఁ డిషుప్రకరముల ది, గంతరముఁ గప్పి యార్చె బ్రహ్మాండమద్రువ

ఉ. ఆర్చిన రామచంద్రుఁడు దయామహితాత్మకుఁడయ్యు వీనిఁ బో
కార్చినఁగాని కాదని దురాత్ముఁడ వైచెడుబాణకోటిఁ జ
ల్లార్చి నరాద నిన్నుఁ గని యక్కటికంబు జనించి యిట్టులా
రార్చినఁ గాన విజ్ఞుఁడు మహాత్ముల పల్కులు లెక్కసేయునే. 203

చ. అని విలుఁ ద్రుంచినం గనలి యాఖరుఁ డొండొకచాప మెత్తిన
న్మనుజవరుండు వెండి తునుమాడిన నన్యశరాసనంబు న
ద్దనుజుఁడు దాల్ప రాముఁడు పసంపడి దానిని ద్రుంచి వానితా
ల్చిన విశిఖాసనంబు లవలీల నరేంద్రుఁడు రూపుమాపుడున్. 204

ఉ. అన్యధనుర్లాభము రయంబునఁ బూని ఖరాసురుండు రా
జన్యుని పేరురమ్మునఁ బ్రవత్కవరమ్ములు దూర్చి నిగ్రహం
దైన్యము నొందఁజేసెదను దారుణకర్ముఁడ నే నటన్న న
మ్మాన్యుఁడు రాముఁ డుగ్రతరమార్గణవారము నించె మేనునన్. 205

వ. వెండియు. 206

క. మాయావి ఖరుఁడు బహువిధ, మాయలు గావింప దైత్యమాయాఘ్నులస
త్సాయకములు నఱపుచు రఘు, నాయకుఁ డాతని శరాసనంబు నఱకెన్. 207

క. మండిపడి శక్తి వైచిన, ఖండించిన రాముఁ గాంచి ఘనభయదగదా
దండము వైచి నఱకను, ద్దండుఁ డతం డొండువిల్లు ధరియించె నెడన్. 208

న కేలభంబులంబోలె బ్రమాదికరదిగావున. 223

ఆ. వారిసంహరించి వారిత్రోవ వచ్చు, వారిజాక్షినీవు వలచితెచ్చి
హృదయమునఁ గృతకృత్యతనొందవ, యేని నీబలంబు వృథయుకాదె. 224

వ. అనితద్వృత్తాంతంబు సవిస్తరంబుగా నెఱిఁగించి వెండియు నద్ధరణీతనూజ నూతన
తనూవిలసనంబుఁ గొంత కొటపజూపఁ దలంచి యన్నకిట్లనియె. 225

సీతావర్ణన.

గీ. ఈవిదముఖసామ్యమునకు నేమోసృజించె, బాలశశిబింబ మది సరిపడకయేమొ
పద్మముగఁ జించె నది మాపువకుటనేమొ, యద్దమునుదిద్దె వేలుపుఁబెద్ద పెద్ద. 226

ఉ. చంచలనేత్రకన్గవకు సాటియొనర్పుచు సారసాళి నీ
రంచు శుచిద్విజాస్యుఁడగు నంబుజసూతికిఁ దెల్పుఁడంచు రా
యంచలపాదపద్మముల నంటు సరోజము లైనఁ దీయనే
సంచితపంకలగ్నమగు జన్మముగల్గినవానిపంతముల్. 227

చ. ప్రబలెడు తన్ముఖాబ్జమకరందముఁగ్రోలియు నక్కఱింగటు
నొప్పగునాసకంథఫలిసొంపునవొప్పెడు వజ్రపుప్పరీ
తిఁ బరఁగెనంచు శ్రీభవుగతిం గడుఁ బొలుపుఁ జేయుచు న్నటిం
చుచుహులబంధరంబులఁ శోభిలు నక్కనకాంగియుంగుళుల్. 228

గీ. కంఠ మరియొకానత్రిరేఖయును జెప్పఁ, గలదెకు ముత్తియపుఁజిప్ప లందులోని
దంతములు మౌక్తికములుగాఁ దనరఁబోలుఁ, గాంతలావణ్యపూర్ణసాగరమునందు. 229

సీ. భూరిసప్రకృతంబు వొందక భూరి వికారాగ్ని నీరుగాఁ గ్రాఁగవలదె
మించుబింబంబు పమింపఁగానేరక, కడుఁ బండి బ్రద్దలుగాఁగవలదె
కాంచనంబు సమంబుఁ గాంచక పెనుగాన, మరుతపోభారంబు నూనవలదె
శక్రాశ్మజాలంబు సవతుకొందక సాఁగ, దఱిగిపోవుచుఁ గడ్డిగఱవవలదె

గీ దినుసుగాలేక బిసములు తేజిమూశ, రాకడాగంగవలదె కర్దమమునందుఁ
దరుణిమృదుతనుచ్ఛాయకధరమునకును, బరిమళమునకుఁ గురులకు బాహులకును.

ఉ. నాకు వశంబుగాదు సతినాభి నుతింపఁగ నైనఁ దెల్పెద
న్నాకువటంచు దైత్యకులనాథ వచింపఁగవచ్చు హెచ్చవ
లీకకనుకాక యున్న నటు మీఁదఁ దనర్చెడు రోమరాజియు
గ్రావకటుకృష్ణసర్ప మతిరమ్యత నందుదయింప నేటికిన్. 231

మ. జలజాక్షీస్వవయుంజయింపఁ గుటుసునై సృష్ట స్వయిం జేయకో
కిలకుం భద్యములయ్యె లేఁజిగురు లంఘ్రిద్వేషతం దచ్ఛవం

బులు భక్షించియు నీకుఁగాక తపస్స్ఫూర్తిం గడు న్మౌనియై
తలమోపన్వెఱచె న్విచారమునఁ బత్త్రిశ్రేణియుం డొల్లఁగన్ 231

చ. కవఁదనరారు నాపెఱుచకంబుకరీతి నెసంగఁగోరి జ
క్కవకవ రాత్రులం దమకుఁ గల్గు వియోగము నాత్మనెంచి యా
పవలున నూహచేసికొని బంధము వేసికొనంగ నేమొ చం
చువుల బిసాంతరంబులను సొంపుగఁ జేరెడుఁ దంతుసంతతుల్. 232

గీ. తారలను గేరుగోరుల తీరు నాస, సౌరు సంపెఁగ మీఱు నూఁగారు దారు
చెవులుఁ శ్రీకారములతోడఁ జెలిమిఁ గోరు, నేలపదినూఱు లాపీత కీరుతేరు. 233

ఉ. చెప్పకతప్ప దప్పుడఁతి చెల్వు నుతింప సహస్రశీర్షము
త్మెప్పునఁ దాల్చి సన్నుతికి మించుట యుక్త ద్విసహస్రజిహ్వక
ల్గొప్పడ వొందియుం దరుణిసొంపు నుతింప వశంబు గాక తా
నప్పు డధోజగత్పతితుఁ డయ్యె ఫణీంద్రుఁడు మాటలేటికిన్. 234

గీ. పెసరకాయలు వ్రేళులు పెదవి చెఱకు, రసము పిక్కలు కలమగర్భములు నూవుఁ
బూవునాసిక వరిమల్లుఁ బొల్చుమధ్య, మవనిజసస్యముల యవయవము లయ్యె.

సీ. దాడిమీబీజసంతతులు దంతములు గా, సంపెఁగపూవు నాసాగ్రముగఁ
బొలుపుమీఱెడుపొన్నపువ్వు పొక్కిలి గాఁగ, దలిరుటాకులు కరద్వయముఁ గాఁగ
దివిరిప్రాఁకెడు నెలతీవ యొడలు గాఁగ, సరసలకుచములు చనులు గాఁగ
ననఁటికంబములు చక్కని పెందొడలుగాఁగఁ, బువ్వులెల్లను జెలువప్పు గాఁగ

గీ. బింబ మధరంబుగా నురువంబు సౌరభంబు గాఁగ శిరీష మంగంబు మార్ద
వంబుగా వనలక్ష్మి రూపంబుఁ దాల్చె, ననఁగ నగుఁ గాత సౌభ్రాత యువనిజాత

వ. మఱియును 237

సీ. ముదిత కరంబుల మ్రోఁకుల నంటిన, నవి యిగురించెడునట్లు గాఁగఁ
గొమ్మ ప్రాణేశు రారమ్మని పిలిచినఁ, గోకిలస్వనము గాఁ గొమరుమిగుల
బాలదృగ్జాల మేలాలతాదుల వ్రాలి, పుష్పణీబంధ ప్రసవము గాఁగ
భాసురాధరబింబ పక్కున నవ్వన, వనవెల్లఁ బూచి నవ్వు గాఁగ

గీ. నతివపల్లవములు పంకటాకుఁ దుటుముఁ, డనికశుకచంచుపుటనికృత్తనవిపత్త్రి
పల్లవంబుల రీతిని బట్టుకొలుప, నంగన యకాలమధుమాస మావహించు. 238

తే. నళినదళనేత్రమందయానంబు గాంచి, వనరి తలలూఁచి ముఖములు ముణుచును గరు
లాస్యములు జేవుతెంప రాయంచకదుపు, వెల్లనై యుండు నెప్డు నుర్వీసురారి. 239

క. వెన్నెలయననగు నగు నతికి, వెన్నెలవగుఁ గప్పుఁగొప్పు గేల్గవయొప్పుం
దివెన్నెలఁ దెగడ పిఱుఁదులు నన్నెలఁతక యొప్పుఁగాక యన్యల కగునే. 210

సీ. కవ రాత్రులందు జక్కవలఁ బాపినయట్లు, పసిఁడికి దావిఁ గూర్పనియవసడి
పవలు వికసనముఁ దోవఁ గేంగిదిసంతు, చివురుల నివురంగఁ జేసినపడి
నెల నొకతీరుగా నిలువనీయనిరవ్వ, లేదూండ్ల నసటుఁ గూర్చినకొఱంత
వెన్నెలఁ జుక్కల వెలుఁగనీనిదగడా, రిసుకతిన్నెల నెగయించురోయి

గీ. పాపికొనఁబోలు నీఁతిరుబ్బలను మేనుఁ, గన్గవయుఁ గేలుదోయిఁ జొక్కంపుఁబ్రమోదము
భుజములును గోరులును నిద్దపుంబిఱుఁదులు, దనొనర్పఁగఁ జాలి నెత్తమ్మిచూలి.

క. శయమా పరిస్ఫుటకు శ్రీశయమా లసదలికులాతిశయమా సుబిలే
శయమా జేసి నాభిజలా, శయమా సతి కీకులేమి సరి సంశయమా. 242

వ. అని యివ్విధంబున సీతాసతీసౌందర్యంబు సంక్షేపరూపంబున. 243

క. నీచచరిత యగు నారజి, నీచరి తెల్పుటయుఁ దగవిని మన మలరఁగా
నాచెనఁట్రిగక్కసుండా, లోచనఁ గావించెఁ బద్మలోచనఁ బట్టన్. 244

గీ. రమణిఁ దేనిట్టు లూహించి రాముఁ డలఖ, రాదులనరాదులను బట్టి కాన నుక్క
డంచె ననుమాట నిజహృదయంబుఁ గలఁప, గపటమానసుఁ డగుదశకంఠుఁ డంత

క. ఏచినవిరహానలమునఁ, దోఁచక నొక్కరుఁడ వెడలి త్రోచినతాల్మి
న్నొచన నోంబుజుఁ డకుమా, రీచుం దనపూర్వమంత్రి బుభుభయదకరున్. 246

వ. చూచి వనోభీష్టంబు తెఱంగు సమస్తంబు నెఱింగించి లోకవిద్రావణుం డగు
రావణుం డిట్లనియె. 247

ఉ. కొంచక మాయలేడి వయి గొబ్బున రాముని లక్ష్మణుం దొలం
గించుము పర్ణశాలకు నొకించుక దూరము నంతలోనఁ బె
న్వంచన రామదేవిఁ గొనివచ్చెద మెచ్చెద నీప్రతాప మ
గ్గించెద నెల్లకాలము సఖిత్వనిధీ యటు సేయు మింపునన్. 248

చ. అనవుడు దీని కిట్యకొన కడ్డము పల్కినఁ బ్రాణగొడ్డపుం
బని యగు వీనిచేత నొడఁబడ్డ నరేంద్రునిదొడ్డనారసం
బునిగుడు మీఁదబడ్డ శరము న్మడిఁబడ్డశరంబు వోవునే
యని యడఁబడ్డప్రల్లక్రియ నాతని కిట్లనియె న్నయంబునన్. 249

ఉ. దీపము గాంచి మ్రింగఁబఱ తెంచి నశించినపుర్వుభంగి ను
ద్దీపితవిక్రమాఢ్యుని సతీహరణంబునఁ జావువచ్చుఁ గా

దీపని రాఘవేంద్రునిపయి న్మన మేగుట మీలు క్రొవ్వి దా
మేఫున నేటిగట్టుపయి కెక్కినయట్లుగ దా తలంపఁగన్. 250

ఆ. చిన్న నాఁ డతఁడు నన్నలుంగున నెత్తి, నూఱుయోజనములు వాఱ దవ్వ
జలధివిసరివైవ వెలలితిఁ జావక, నతనిదివ్యలీల లద్భుతములు. 251

క. శైశవమున నతఁడు ధనుః, కౌశలి కాకుండియును విఖండనఁ జేసెం
గౌశికునాజ్ఞ సుబాహు, గౌశికనిర్లక్ష్యతాటక న్మను గాఁగన్. 252

క. అని రామునిబల మెఱిఁగి, చిన నాతఁడు వినక కినుకఁ జెందుట మదిలోఁ
గని మారీచుఁడు శ్రీరా, మునిచేఁ జచ్చుటయు పరమమోక్షం బనుచున్. 253

ఉ. క్రూరుఁడు తాటకాత్మజుఁడు కోమలకైతవకృష్ణసారసా
కారత నెంతయు న్నొప్పుగం దనరె న్వెలిచుక్కచాలుచే
ధారుణిసంచరింపఁగ సుధాసిధిలాంఛనమైనయిట్టి త
చ్చారుసుధాసుబిందువిలసద్వపువొప్పఁగ వచ్చెనో యనన్. 254

క. అంగము బంగారముఁ గ్రొన్నంగవ పృథునీలతరమణులుఁ బొడవగుస
చ్ఛృంగములుఁ గుఱుచవాలము, నుంగల్గి కురంగమై మనోవేగమునన్. 255

ఉ. రాముఁడుఁ లక్ష్మణుండును ధరాసుతయుం దలిరాకుటింటఁ జే
తోముద మొప్ప నుండి తిరదూరమునం బరిఫుల్లమల్లికా
క్రామితగుల్మమధ్యలతికాపృథుభాసితపుష్పడోలికా
ప్రాయఃనీలభాకలితబంభరనాదము లాలకించుచున్. 256

క. ఉన్నయెడ వాయువువ్వేగు, నున్నమెడకు నేగి జిహ్వాశుద్ధియగునో కా
కున్నొయని చూచుగతి నన, లన్నాలుక సాఁచి తినుచు లంఘున మొప్పన్. 257

వ. కురంగంబు కుఱంగట మెలంగుటఁ గనుంగొని కురంగలోచనయగుసీతాంగన రాముని
కరాంగుళిఁ బట్టికొని. 258

చ. కనుఁగొను మింతచక్కనిమృగంబు జనించుట యద్భుతంబు నా
మనమున దీనిఁ బెంచుటకు మక్కువ మిక్కుటమయ్యెఁ బట్టితె
మ్మనవుడుఁ దత్పరిగ్రహసమాహితవర్తనుఁడై కడంగె రా
మనరవరేణ్యుఁ డంగనలమాటలకుం బతు లుత్సహింపరే. 259

వ. ఉత్సహించి సౌమిత్రి నాలోకించి. 260

క. ఈ వచ్చెకుసారంగము, నేవిధమున నైనఁ బట్టి యిచ్చుటకు న్నే
వేవచ్చెడునంతదనుక, మీవదినెను గాచియుండుమీ నీవనుచున్. 261

చ. కపటమృగాకృతిం జనులఁ గాఱియవెట్టఁ దలంచి మానవా
ధిప దనుజాధమాధములు త్రిమ్మరుచుందురు కాననంబుల
న్న్యపగతనీతు లావిధమువాఁడ యితం డిది మాయలేడి, కా
దిపుడు చన న్రఘూత్తమ మదీయవచస్సరణిం గ్రహింపుమా. 262

వ. అని పలికి వెండియు. 263

క. ఈకసుమతి నీవ సుమతి, వీ వెఱుఁగని దొకటి గలుగునే మారీచుం
డీవచ్చెను రాజీవా, బీ వచ్చెదుగు వెనువెంట నేగందగునే. 264

క. హితమతి నీగతి నతిమా, నితదివ్యజ్ఞానబోధనిధి లక్ష్మణుఁ డం
చితముగఁ దెలిపిన మాయా, కృతుఁ డా రాఘవుఁడు సర్వవిదుఁ డిట్లనియెన్. 265

క. ఇది నిక్కపుసారంగపుఁ, గొదమ యయిన వేగఁ బట్టికొని వచ్చెదఁ గా
కది మాయలేడియేనిం, బ్రదరంబుల దానియురము వ్రక్కలుసేతున్. 266

క. వదలక భక్తిమెయి న్నిమ్మపడి నెను గాచికొనియుండు వాతాయువుఁ దె
చ్చెదనని యుటజంబునఁ దన, సుదతి నునిచి రాఘవుం డమోఘాంబకుఁడై. 267

ఉ. ఆజిరమారకుం డనఁ జండంబకముద్ధరియించి పర్ణశా
లాజిరవర్తి గాఁగ దనయంగము పొంగ నరేంద్రుఁ డేగ ఘో
రాజినయోనిఁ బట్టుటకు నట్టియెడం గనకంబు మాసె ఘో
రాజినయో నిశాచరులయన్వయ మీగతి మాయనోయనన్. 268

క. వడియు నగుదశ్శకునములఁ, జెలువక నల్లగి ప్రవరప్రపభుఁడు గనిరామం
దెలకను మఃప్రియంబుగ, మెఱయుచు విహరించునట్టిమృగమున్ సరగన్. 269

వ. అవలోకించి. 270

క. ఇంచుకయును సద్దు సేయక, వంచనకాయంబుతోడ వసుధేశుఁడు దాఁ
బొంచి చని పట్టఁబోఁ గుప్పించియెగసి మాయలేడి బెదరినకరణిన్. 271

చ. ముఖ మెగయించిచూచుఁ దృణముం దగమూర్కొను మస్తకంబు గోఁ
కు ఖురపుటంబులం బ్బధునికుంజముల న్వడిఁ దూటి డాఁగు నా
కుఖ న మొప్పఁజేయుఁ బలుగొమ్మల నిట్టటుఁ గొట్టుఁ బొట్టిత్రోఁ
క ఖురకరాగ్రయుండు సరగం దనుఁబట్టఁదలంచి వెంబడిన్. 272

చ. రవికులవార్ధిచంద్రుఁడు కురంగముఁబట్టఁగ నెద్దియన్నిగ్నో
జవముగఁ బుట్టలుం బొదలు జంగునఁ దాఁటుచుఁ బాఱు లేడియుం
దవిలి దూప వృక్షసవిధంబుల రాముఁడు దేరినిల్చినం
జవమతిఁ ట్లు నాలుకను సాఁచి వగర్చుచు నిల్చు నిట్టియున్. 273

క. సారంగధరుఁడు మున్గ్రితు,సారంగము వెనుదవిలినచందంబున సా
సారంగసదృశదృష్టున్,సారంగము వెనుక రామచంద్రుఁ డరుగుచున్. 274

చ. శిరమున మేనున న్నలుచిక్కఁగఁ జేర్చికొను న్లతాగ్రహం
తిరములఁ బొంచి పొంచినను దారికి నడ్డముపోయి దట్టపుం
దరువులమాటున న్నిలుచుఁ దత్పరతం దృణముష్టిఁ జూపు భూ
వరకులనాథుఁ డావారిణకర్యముఁ జట్టునపాయశాలియై. 275

వ. అత్యవసరంబున. 276

గీ. తృణము గఱచుట వంచలదృష్టిఁ గనుట, భయము నొందుట వెన్నిచ్చి పాఱుటయును
జూడఁగా నప్పు డమ్మాయలేడి సమర,భూరమున కోడి పాఱెడిపందవోలె. 277

వ. మఱియును. 278

సీ. దాఁటుచోఁ బూర్వపాదద్వంద్వ మొక్కెడఁ, గదియించు టంజలిక్రమముగాఁగ
ఱలిఁబాఱుచో ఖురంబులు నెఱియలఁబడి, మ్రొగ్గుట యొప్పగు మ్రొక్కుగాఁగ
నురుతరశ్రమమున నుఱఁగక వెడలు ని,ద్రాఘోషకంబు పాద్యంబుగాఁగ
దినునెడ రాలినతృణలేశ మతిపవి,త్ర మ్మగుదర్భాసనమ్ముగాఁగ

గీ. జేరి యెదురేగు టాత్మోపహారముగను, రాము నొప్పించె మాయాకురంగ మపుడు
పరమపురుషుఁడు హరిసమర్పణముగాఁగ, ముక్తిఁగోరి యొసంగెడు మునియుఁబోలె.

వ. వెండియు నక్కురంగశాబకం బగంబులనక నగంబులనక రయంబునం బాఱుచు మాయావిగాన రామునిపై శరకూరాపర్గంబుఁ గురిసెడు దానిం బోలె జరవ ఖురపుటాగ్రంబుల ధరణీపరాగంబు మీటుచు రాత్రిసవంశతుయం బగునల్కాపాతంబునుం బోలె మిట్టి కెగసిపడుచు మృత్యుముఖగహ్వరంబునం జొరంబాఱుకరణి గుహాముఖంబులం దూఱుచు బ్రాణాత్యయావసరంబునం బోలె భ్రమించుచుఁ బూరుషుని సంపదయుంబోలెఁ దనంతఁ దోఁచి యదృశ్యం బగుచు దరిద్రునిం బోలె దీనాననంబుఁ జూపుచు సమీరంబుపగిది నలక్షితవేగంబై గరుడనిషధంబునఁ గర్బూరాంగభాసురంబై కాపురుషునికడ వుసం గుటిలమార్గగామియై నరకంబున కోర్వనిదానిం బోలె నసిపత్రవనంబులకుఁ దోలంగుచు ఘోరదుర్గమారణ్యమార్గంబున బహుదూరంబుగా నెలయించికొని చనుటయు రాఘవుండు నిజాంతర్గతంబున. 280

క. తమ్ముఁ డిదిమాయలేడి మ్రుచ్చన్న నమ్మఁదగ దన వినకవచ్చితి మో
సమ్మయ్యె దీని నగ్రశ,రమ్మునఁ గూల్తు నని భయదరంహ స్తరుఁడై. 281

ఉ. తూణములోనిబాణ మతితూర్ణముగాఁ గొని నారిఁగూర్చి య
క్షీణమదంబున న్నృపతిసింహుఁడు రాముఁడు తూఱనేసె ని

స్త్రాణము దుర్విషాణము విరాజితశోణము సత్కృపాలయా
ఘ్రాణము ఘోరభాణ మఘకర్మధురీణముఁ గైతవైణమున్. 282

వ. తచ్ఛరం బురంబు నాటుటయు. 283

చ. స్మయరహితుండు నిర్దళితసత్త్వుఁడు నై తశతొంటిరూపు వి
స్మయముగఁ దాల్చి రాక్షసుఁడు చచ్చెనెడ న్వెస లక్ష్మణా హతో
స్మి యనుచుఁ బేరెలుంగున వచించి ముఖంబున నెత్తుగొల్క న
వ్యయుఁ డగురాముబాణహతి నాతఁడు ప్రాణము వీడె ధన్యుఁడై. 284

క. ఇవ్విధమున మారీచుని, క్రొవ్వుచెఱచి యుల్కుచును రఘుప్రవరుఁడు పెం
దవ్వరుదెంచితి నని వెస, నవ్వనముం బాసి వచ్చు నంతటిలోనన్. 285

మ. అనుజా లక్ష్మణ చేరరావె యనుదీనాలాప ఘోరాముఁ డా
డికచందంబునఁ దాటకాత్మజుఁడు నూటెంబల్కు టాలించి హా
యని ధాత్రీసుత వెచ్చనూర్చి పెనదైన్యం బాకృతిం దాల్చెనో
యన సౌమిత్రిముఖంబుఁ గాంచి యిటురమ్మా యంచు భీతాత్మయై. 286

క. ఓయన్న సుమిత్రాసుత, మీయన్న వనంబులోన మిగిలినవగ రా
వో యన్నఁ బలుక వేమిటికో యన్నఁడు లేనిభీతిఁ గూరె మనంబున్. 287

గీ. అసురవరులును సురలుఁ దన్నాఁగి రేని, భయముఁ జెందనిశూరుఁ డిప్పగిదిఁ దమ్ముఁ
డా యనుచుఁ జీఁబిల్చెను డాయఁబోఁగ, దయ్య తడవేలనయ్య ప్రణయ్యముగదయ్య.

ఉ. అంజలిసేతు రామునిరయంబున నిప్పుడె కూడఁబోయి నా
సెంజెలి దీర్పుమంచు ధరణీసుత వేఁడిన లక్ష్మణుండు బ
ద్ధాంజలియై తదీయచరణంబుల మస్తము మోపి యేల భీ
తిం జలనంబునొందఁగ సతీమణి యుండుము సూల్లసత్పదా. 289

క. లలన పదునాల్గుభువన, మ్ములభారము మీఁదఁబడిన మోయవలఁతి త
ద్భుల మీవు నే నెఱుంగుదు, చలింపవల దింక రామచంద్రునికొఱకున్. 290

క. క్రించుఁదనంబున రాముని, వంచింపం బెటేఁగి దనుజవంశాధము లూ
హించి వెడమాయలను పచరించి చెడుదు రగ్గిపడిన క్రిములవడువునన్. 291

వ. అనిపలికి మఱియును మదగ్రజుండు హరిణపరిగ్రహార్థం బరుగునవసరంబున. 292

క. వదలక భక్తిమెయి నన్ను, వదినెను గాచికొనియుండు వాతాయువుఁ బ
ట్టెడ ననియరిగెం జెప్పుచుఁ, దదీయవచనంబు లెట్లు దాఁటుదుఁ జెప్రమా. 293

చ. అనవుడు రామచంద్రుఁడు మహాపద నొంది సహోదరా రయ
మ్మునఁ జనుదెమ్మటంచుఁ గడుఁ బొక్కుచుఁ జీరిన నంచుఁబోక న

న్ననుచితమార్గవర్తను దయాపరిహీనునఁ గాచియు
న్నను ఫలమేమి యన్నను వెసం గఁబోవఁగదన్న మ్రొక్కెదన్. 294

క. అనుటయు నధోముఖుండగుచు, ఘనచింతాక్రాంతుఁడును విగళితాశ్రుఁడు ద
త్తనిరుత్తరుండు నగువా, తనిఁ గన్గొని సీత క్రోధతామ్రాననయై. 295

మ. ఇదె మీయన్న మహార్తుఁడై పిలిచెఁ బొమ్మీ యన్నఁ బో వేమి నీ
మదినూహింతటొ కాక కాన నొగుల న్మాతోడ నేతేరఁ బూ
ర్ణదయామూర్తివె యంచు నిష్ఠురము లన్యాయంబుగా లక్ష్మణు
న్నవతీరత్నము దూఱినాడె సదసద్వ్యాప్య్యలగ్నా దుఃఖితల్. 296

వ. ఇట్లాడి దుఃఖాతిరేకంబున. 297

క. నాచిత్తము నినుబోఁట్లకు, గోచరమే యన్న చావుఁ గోరి నను మది
న్వేచితివిగ టిప్పుఁడెఱిఁగితి, నీచ సుమిత్రాసుత దురాత్మ నిహతవివేకా. 298

క. వాటుం బగునమ్మటుజ, వాటమునకడ నిలువ నీకు వల దనవుడు న
మ్మాటలు తనహృదయంబున, కేఁటులపోటులయి నాటు నిట్లనిపలికెన్. 299

ఉ. ఆరఘురాముఁ డాత్రిదశుఁ డక్కట యివ్వనముగ్రగాత్మస
క్రూరము నిన్నుఁ బాసి చనఁగూడదు నాకని యొత్తిచెప్ప ని
ష్కారణనిష్ఠురోక్తుల నఘుం బని మాడెదు పల్కెడిట్లు నీ
వారిజనేత్రి మత్సహాగ్రస్థితి రాముఁ డెఱుంగకుండునే 300

క. అని పలికి రామచంద్రుఁడు, చనినపథముఁ బట్టి చనియె సౌమిత్రియు నో
ప్పనిహృదయంబున రావణుఁ, డనుకూలంబైన సమయ మని ముద మొదవన్. 301

క. అన్యాయుఁడు ఖలుఁడు విఫలి, తాన్యాయుఁడు ఘోరరూపుఁ డంతట మాయా
సన్న్యాసి యయ్యె నారా, జన్యునిసతిఁ బట్టు దుర్విచారముతోడన్. 302

గీ. ఇట్లు కర్మందియై తను వెల్లబూది, పూఁతఁ దనరార నొకజలపూర్ణకలశ
మమరధరియించి హరహరా యనుచు వచ్చి, పర్ణశాలకుఁ గడుసమీపమున నిలిచి.

క. దేహిభవుఁడుఁ డాతఁడు వైదేహి భరితవినయఁ గాంచి దేవీ భిక్షాం
దేహి యనుడు జానకి సం, దేహింపక యెదురువోయి ధృతిదళ్కొత్తన్. 304

వ. అర్ఘ్యపాద్యంబు లొసంగి నిభృతయై యిట్లనియె. 305

ఉ. ఇంచుక విశ్రమింపుము యతీశ్వర మత్పతి వచ్చి మిమ్ముఁ బూ
జించు నతండు పొన్నెడలి జింక తటాలున నిందువచ్చిన
ట్రించిన దానిఁ బట్టికొని తెమ్మని వేఁడుకమీఱ నేను ప్రా
ర్థించినఁ దన్నిమిత్తమున దివ్యధనుర్ధరుఁడై సహోదరున్. 306

క. పుత్రసమాను సుమిత్రా,పుత్రకు ననుమాను సుగుణభూషణు ఘను న
స్మత్ప్రాణపరాయణుఁడై, ధాత్రీపతి కాఁపు పెట్టి దాఁచిపెట్టుందక్. 307

గీ. అరిగి తడవయ్యె హా లక్ష్మణా యటంచు, దైన్యమునఁ జీరె నాతనితమ్ము నతఁడు
నతనిఁ గనఁబోయె నుల్కుచు నడవి నొంటి, నున్న దానఁ బరివ్రాజకోత్తముండు.

వ. అని చెప్పి. 309

క. కుశలంతి వసుధ నేలిన దశరథుకోడలను రామధరణిపుభార్యన్
దశదిశల న్విశదం బగు,యశమునఁ జెన్నొందుజనకునాత్మజ ననినన్. 310

క. అతివా నీ వాఁడుచను,తృప్తివాక్యంబులకు నాయుహ్వానము వలదె నీ
గతి వానల నెండల నీ,యతివామాంగంబు వడుట కాపన యయ్యెన్. 311

చ. నెలఁ బుగడించుమోము మహనీయతరం బగుచన్నుదోయి పె
న్నెలవడదాఁకుదేహము నణీయతరం బగుమధ్యభాగముం
గలుగఁగఁ జేసి భాగ్యనిధికాంత నొనర్పక నిన్నుఁ బేదకు
న్నెలఁతఁగఁ జేసె నేరునఁగనేర్తు విధాత్రుఁడు దుర్విదగ్ధుఁడై. 312

క. నవనీరజగంధివి కదా, నవని రజోగంధి వగుట యన్యాయము దే
వవిలాసినీకదంబము, నవధీరణ సేయఁజాలునందము గలుగన్. 313

గీ. అని మఱియు నుద్ధరాత్ముఁ డయ్యవనిజాత, దర్శనముఁ జేసి నీదుసౌందర్యమునకు
సర్వభువనంబు లేలెడుసార్వభౌము,పత్ని వగుట యెంతయు ను లెస్స పద్మగంధి. 314

చ. అనుటయు వానిఁ గాంచి వినయంబు చొకయించుక లేక సీత న
న్నుచితరీతి నీతి విడి యాడెదు దుష్టనికృష్టపద్ధతిన్
మనమున నన్యులాంగనలు మానక సన్నుతి సేతు రిట్లు వ
చ్చెనె బరికించిచూడఁ బరిశుద్ధులనోటు నశుద్ధవాక్యముల్. 315

క. నానాథు శౌర్య వందిత, నానాథుని కార్య నీవనాథుని గా హీ
నా నాతోఁ బల్కెదు తగు, నా నానాలోక వాళనముఁ గోరి కటా. 316

క. పితృవాసతిఁ బునముఁ దృణ,ప్రతిమానముఁ గాఁ దలంచి భయదఘనవన
స్థితి కోర్చెఁ గాక లోక,త్రితయము నేలంగ వలఁతి దృఢభుజశక్తిన్. 317

వ. అనిన నయ్యతివ్యాజపరివ్రాజకుం డయ్యవనిజ కిట్లనియె. 318

క. నిన్నును నీనాథుం గనా, నెన్నికొనెదు గాని నిర్జరేశ్వరుఁ జెఱసా
ల న్నిలిపి రాక్షసులచే, సన్నుతిఁ గనినట్టి నన్నుఁ జర్చింప వయో. 319

ఉ. నీ విటు విన్మ సీత నుమహనీయుఁడు తాత పులస్త్యుఁ డప్ప వి
శ్రావసుఁ డన్న యక్షపతి వానిజయించి తదీయపుష్పక

శ్రీవిభవంబు లెల్లఁ గొని జీవముతోడుతఁ బోవనిచ్చితి
రావణనాముఁడన్ భయదరాక్షసనాథుఁడ లంక నేలుదున్. 320

క. లోకములెల్ల జయించిన, లోకభయదరాక్షసుఁడఁ దలోదరి భవదా
లోకమ్ములఁ జిక్కితి నను, గైకొను మిష్టోపభోగగతి వడయుటకున్. 321

వ. అని వెండియు. 322

ఉ. ప్రాయముకల్మి నింపెసఁగి రాక్షసనాథుఁడ నైన నాయభి
ప్రాయముఁ దీర్పుమా యనుమ రావణుఁ డాడిన నాఖలుం దృణ
ప్రాయముగాఁగఁ జూచి నృపభామిని జానకి వల్కె ధర్మవి
ప్రాయముఁ జూడ నీవు మదిఁ బట్టితె నెవ్వరినుండ కీర్తిన్. 323

ఉ. సారపుబ్రహ్మవంశమున జన్మము నొందితివంటి నీవు నా
చారపుమాట లాడుట యసంగత మేమ బలిష్ఠతన్ వృథా
నీరయిపోఁ దలంచితివి నిశ్చయ మింతకు నిన్ను నాతత
క్రూరము లాఘూర్ణితమునిరోపము లిప్పుడు రూపుమాపవే. 324

గీ. రామలక్ష్మణు లిచ్చోట లేమి నెఱిఁగి,వచ్చుటయ తెల్లముగ్యా నీవారి విజిత
విక్రమము నీమసత్కీర్తి విశదమయ్యె, నన్ను నున్న జయించితి నన్న విన్న. 325

క. చెడుఁగ చెడుకాలమైనన్, వెడఁగునుడుగు లాడె దిట్లు వేయేటికి నీ
వెడఁగలిగిపొమ్ము నృపుఁడ, య్యెడనుం జయ దేకము న్నయెయ్యేశకైనన్. 326

చ. అనవుడు సంగజాతశరానలతాపవిభిన్నచిత్తుఁ న
వ్వనజదళాక్షి వేగమ భవద్వచనామృతవృష్టిఁ దేల్పకు
న్నను మరణంబు నీకతన నాకగు నిశ్చయ మంత నన్నుఁబో
లిఁ మగవార లెవ్వరును లేమిఁ గాంతలు వంత నొందఁగన్ 327

క. గోభూభుజగజగస్థిత,భూభృత్పతు లెల్ల వలసి పొంగుదురు నాం
గోభూభూనత్రాహుండ, నీభాగ్యము గాదె ప్రొలఁతి నిన్ను వలచితిన్. 328

ఉ. ఎక్కడి రాముఁ డింక నతఁ డెక్కడ నెక్కడవచ్చుఁ గానలో
నెక్కడనో మనో యనుజుఁ డెక్కడనో యమరో రాక్షసాలి చే
నెక్కడడ్రుంగెనో మృగము లెక్కడ్రమింగెనో వానిమీఁద నీ
కెక్కడిప్రేమ రమ్ము నన మేరుద మిద్దఱము ప్రియంబునన్. 329

సీ. అప్సరోవనితల నవధీరణము సేయు, రాక్షసాంగనలు పారంతు లోసంగఁ
గ్రీడాభవనకుద్యకేళితవిమలన్,శ్ఛలదీప్తమణిదీపికలు వెలుఁగ

ఘనశైత్యకారకఘనసారమిశ్రిత, పృథులచందనచర్చ హృదయ మలర
నత్యంతవివిధమనోహ్లాదకల్పిత, పరిమళాగరుసుధూపములు మలయ
గీ. మెచ్చి బలమున నేఁ జెఱదెచ్చినట్టి, ఖచరకాంతలు తగునాడికములు సేయ
బాల కైలాసమును శమీపత్రముగను, జేసి యాదేశుదశకంఠుఁ జేరఁదగదె. 330
వ. అనిపలికి యాక్షణంబ. 331
క. శశివదన సుఖబర్హిర్ముఖ, శత్రుశ్రేణుల బందెసాలల నిడున
ద్రుతవీక్షింపు మనుచు విం, శతికరములు దశశిరములు సమబాహ్వాకృతి యుక్. 332
గీ. మెఱయు నూడలు గలవట్టితెఱఁగుఁ దోఁప, నెదురనిల్చిన జానకి హృదయ మదర
శేమిసేయుదు నిటకు మాయామృగంబు, దేల చనఁదెంచెఁ బొమ్మంటి నేల విభుని.
వ. అని తలంచి నిరుద్ధభయాతిరేకంబున. 334
క. ధరణీసుత ధర్షింబడి, పరమం బగుమూర్ఛ మునుఁగఁ బట్టుకొని నిజే
ద్ధరథంబున నిడికొని స్వక్ష్యుఁడై రావణుఁడు పోవఁ దదవసరమునన్. 335
ఉ. ఇంచుక తేఱిమోచి మొగమెత్తి దిశల్ పరికించి తన్ను నొ
క్కించుకభీతి లేక కొనియేగెడు రాక్షసనాయకుం బ్రతీ
క్షించి కరంబు బెగ్గడిలి చిత్తము తత్తఱమంద సీత దుః
ఖించెఁ దదీయశోక మెఱిఁగింపఁగ బ్రహ్మకునైనఁ దీఱునే. 336
వ. దుఃఖించుచుఁ దనమనంబున. 337
క. పుణ్యవతిమఱఁదిమాట ల, గణ్యములు గణింపనైతిఁ గల్గెనె ఘోరా
రణ్యమున నింక నాకు శ, రణ్యమనుచుఁ జింతమిగుల రాముఁ దలఁచుచున్. 338
క. క్రోధాత్ముండై తొల్లివి, రాధుం డెత్తికొనిపోవ రక్షించితి త
ద్బాధయుడిపి యిప్పుడు రఘు, నాథ వెస బ్రోవ విదేమి నను జెఱఁ దలఁగన్. 339
ఉ. వే యనుజన్ముఁ గూడి రఘువీర దురాత్మకు వీనిఁ ద్రుంపరా
వే యను లక్ష్మణా కదు విపేక్షవిహీనత నిన్నుఁ గొన్ని య
న్యాయము లాడి తత్ఫలము నందితి నిప్పుడ యన్నఁ దోడితే
వే యను వీనిఁబట్టి పడవేయను వేయననేల మ్రొక్కెదన్. 340
క. రావణుఁడు నన్నుఁ జెఱఁగొని, పోవుచున్నాఁడు వీనిఁ బోకార్చి నను
గావఁగ నిమ్మెడ రఘువర, వేవచ్చినఁగాక కీర్తివికలత గాదే. 341
వ. అని మఱియు ననేకవిధంబులం బలవించుచు. 342
చ. ఎక్కడఁ జొత్తు నేనితెఱ వెవ్వరిదిక్కిఁక నేమిబుద్ధి న
న్నిక్కఱి నాత్ముఁ డెత్తికొని యేగెడు నిప్పుడ ముట్టుముట్టి వ

త్రెక్కి నవీనికంఠముల నెంతయు మేదినిఁ గూలఁ దాఁచి నక్
జక్కఁగఁ బ్రోవరయ్య సురసాధ్యవియచ్చరకిన్నరోత్తముల్. 343

క. పరమపతివ్రతసీత, న్సరగునఁ గొనిపోవు రాత్రిసాయుని వీనిం
దెరువున నాఁగరు మీరుం, దరుగుల్మలతాదులార దయలేమిఁ గటా. 344

సీ. దనుజుండు నన్నుఁ బట్టి వినువీధిఁ గొనిపోవఁ, గానరా విదియేమి గంధవాహ
వానవు నాఁగి నింతయొనర్పఁ డనివేఁడ, మాటలాడ రిదేమి మానులార
యరసి రక్షింపుమా యమ్మ యనుచుఁ బిల్వ, తిను యిట్లుతగునె వసుమతి నీకుఁ
గనలి యీతని శిరఃకాంతార మేర్పక, తరులఁ డాఁగెద వేమి దావవహ్ని

గీ. కరుణ నన్నుఁ గాచుటకు నిజకాండములను, రావణుని బట్టి ముంచు గోదావరి యాన
వడిగఁ బాఱవు ఇదియేమి జడతనొందె, యనుచు బలవించు నలుదిక్కు లాలకించు.

క. అవనిజ యిట్లు పొగిలెడు, నవసరమున సంచలించె నగములు దా
మవనీజము లగుటఁ దలఁప, నవని న్సహజగుణ మెట్టులెన విడుచునే. 346

వ. అయ్యవసరంబున. 347

మ. మరయాకారముఁ దాల్చి రాఘవుల నమ్మారీచుఁ డావంచనం
గొనిపోవన్ దనుజాధముం డిచట నీక్షోణీసుతం బట్టె నే
మని యానిందఁ దొలంగఁ ద్రోతు మిఁక నాహా చచ్చినంగాని పో
దనియో లేశలు జేరెనుం గురవకాంతంబుల్ దవాగ్నిభ్రమన్. 348

గీ. ధరణిజాక్రందనోద్ధతధ్వానఘూర్ణ,మాన కానన మృగపక్షిమండలంబు
పటిమ బెట్టయుఁ దవరారెఁ బత్తికంతు,మాఱు శ్రీరామునకుఁ దెల్పనో యనంగ.

సీ కన్నులెఱ్ఱఁగఁ జేసెఁ గలకంఠబృందంబు, బుసకొట్టుచును ఫణు ల్విసముఁ జిలికెఁ
గటము లదర నిల్చె గంధసింధురములు, ప్లవగజాలంబులు పండ్లు గొఱికె
మొగములు జేవుఱింపఁగ శుకంబులు గూసె, నోలిఁ గపోతము ల్హుంకరించె
ఘూకము ల్గిఱగిఱఁ గ్రుడ్లు ద్రిప్పఁగఁ జొచ్చెఁ, గేకిసంఘంబులు కేక లిడియె

గీ. నఖిలభూతహితుం డగునట్టి రాము,వనిత బలవంతమునఁ జెఱ వట్టి గగన
వీథి వడిఁ గొనిపోయెడు వేళ దుష్ట,దనుజుఁ గన్గొని కినుకఁ జెందిన పగిదిగ. 350

వ. అంత నజ్జనకనందన. 3 1

ఉ. ఏ మిథిలాధినాథుసుత నిద్ధయశుం డగురాముభార్యఁ జెం
డోముననార యక్షవిహగోత్తములార ఫణీంద్రులార వే
నామొఱ యాలకించి కులసాపకు వీనితల ల్హరించి పో
రే మహనీయులార మదధీశుఁడు మిమ్ముఁ గరంబు మెచ్చఁగన్. 352

క. అని ఘోరగృధ్ర మురువడిఁ, గొనిపోయెడుసర్వవనితకు న్సమ మగుచున్
జనకజ యేడ్చుటయుం దద్ధ్వని విని కరుణారసప్రధానుం డగుచున్. 353

క. నాకపతికి వెఱవక మై, నాకము రావణు నెదుర్ప నలిరేఁగుచుఁ దా
నాకడలి వెడలి కడువడి, నాకపథంబునను వచ్చె నని సుర లెంచన్. 354

ఉ. పాతితశాత్రవుండు నురుపక్షబలుండు జటాయు వల్లసం
పాతిసహోదరుండు నృపభామిని శోకము సత్వరానుకం
పాతిశయంబునన్ విని మహాబలు రావణు నాఁగె మున్న శం
పాతతదేహదీప్తిఁ గులపాంసను దృష్టిపథంబు నాఁగఁగన్. 355

వ. అమ్మహాబలుం డడ్డపడి 356

క. కంఠీరవమధ్యను దశకంఠ విడువవేని నీదుకంఠములు మహో
త్కుంఠం దునిమి సమవర్తిప్రకంఠమునకు ననుతు గరళకంఠు నెయిదిన్. 357

క. అనవుడు నతఁడు డాతని కిట్లనుఁ బులుఁగా నన్ను గెలువనగునే నిన్నె
ట్లున జంపు దేటివగ నీ,కను నచుఁ దలపడిరి బోరు ఘోరం బయ్యెన్. 358

చ. ఖగదనుజాన్వయోత్తము లప్రతిమానులు కామరూపు ల
త్యగణితసత్త్వ లూర్జితదయానము లాశుగవేదు లగ్రప
న్నగమనజాశనుల్ మిథిలనాథసుతాప్రియతాపకారకుల్
దగినఖాస్త్రసాధనలు దార్కొని వీఁక జటాయురావణుల్. 359

వ. ఒండొరుల నఖవిశిఖంబుల వ్రేటులాడు సమయంబున. 360

గీ. అక్షిగతుఁ డగురాక్షసాధ్యక్షుఁ డుగ్రపక్షినాథనఖక్షతవక్షుఁ డయ్యె
నాక్షణంబున రాక్షసాధ్యక్షుచేతఁ, బక్షినాథుండు నువిశీర్ణపక్షుఁ డయ్యె 361

ఉ. నొచ్చియు నీడఁబోవక వనోద్ధృతి రావణుఁ గాంచి వంచనం
దెచ్చితి రాఘవేంద్రసతిన్ మగపంతము గాదు నీకుఁ బా
టచ్చగవృత్తి గాని యిఁక దక్కులు సెల్లవు మన్నభావాలిం
జచ్చిన మేలు నీ కనుచు సాహసవృత్తిఁ గడంగి యాతనిన్. 362

గీ. వదనములు చీఱఁగఁ దవుల్ చిదుమఁగోరు, నెనసి వడిఁబోరు నభమున కెగపిపాఱుఁ
గ్రమ్మఱను జేరుఁ జాఁకిఁ గాంచి వగలఁ, గూరుఁ బలుమాఱు మీఱు ననూరుసుతుఁడు.

వ. మఱియు నద్దనుజుం డద్దయు నద్దిలేనికడిమిం గ్రద్దరించుచు గ్రద్దగూఁడఁ బెద్దయుం
బ్రొద్దు ప్రొద్దుకొలఁది పోవిమద్దియయలర నద్దనుజుం దాఁకి పోరి పోరి పెద్దవాఁడు
గావున. 364

క. పక్షములు దనుజకరవాలక్షతులం దెగుడుం గడుం జలంబఱి పడియెం
బక్షిశ్రేష్ఠుఁడు పవిభగ్నక్షోణీభృచ్ఛిఖరముకరణిన్ ధరణిన్. 365

క. సీతం గైకొని నభమున, ఘాతకుఁ డగురక్కసుండు పఱచెడ నని దుః
ఖాతిశయంబున వ్రాలిన, రీతిం గూలుటయు నతివ ప్రిదిలినతాల్మిన్. 366

వ. కంఠగతప్రాణవాయు వగుజటాయువు నుద్దేశించి. 367

చ. అసురవిరోధి క్రుంచి నను నారసి ప్రోవఁదలంచి భీమమౌ
సమర మొనర్చి వైరిశితసాయకభగ్నగరుద్ద్వయుండ వై
శ్రమమున నివ్విధంబున ధరంబడఁ జూడఁగ నైతి నీకుఁ బు
ణ్యము నను బోవఁ బాప మెదు రయ్యెఁగదయ్య ఖగప్రభూత్తమా. 368

గీ. అసురవరుఁడును ఖలుఁడు నన్యాయుఁ డధముఁ, డైన రావణునకు జయ మమరనోపఁగి
పరమపుణ్యాత్ము నిన్నిట్లు పడఁగఁజేసె, ధాత నీయెడఁ గడుఁ బక్షపాతి యగుచు

వ. అని మఱియు ననన్యశరణ్య యగు నవనీకన్య తనమనంబున. 370

చ. అరయఁ బరోపకారపరుఁ డై యితఁ డీల్గెను బుణ్యలోకసు
స్థిరుఁ డగుఁగాక యంచు వగఁ జెందుధరాసుతఁ గొంచు రావణుం
డరిగె సరిత్సరోవనమహావనపావనయోగికాశ్రమో
త్కరగిరిశబరాలయాదులను దాఁటుచు లోకభయంకరాకృతిన్. 371

క. తటతట హృదయ మదర నం, తట జనకజ యొక్కశైలతటమునఁ గనియెం
దిటముగ విహరించెడుమర్కటవర్యుల నివ్విధమునఁ గాంచి వెనుకగన్. 372

క. పార్థివునకు వార్తాకథ, నార్థం బర్థం బొసంగి యగచరులను సం
ప్రార్థన సేసెడుగతి వస్త్రార్థంబున నగలు ముడిచి యవనిన్ విడిచెన్. 373

గీ. ఎట్టికాలంబునకుఁ బుట్టెనింటి కేగు, తాను మనుగొన్నసొమ్ములఁ దగఁగ నెరవు
దీర్చుగతి నొప్పె రాఘవుదేవి సుమణి, ఖచితభూషణములు రత్నగర్భ నిడిన. 374

క. నగమున నివ్విధమునఁ దన, నగలు మిగులఁ బైటచెఱఁగునను ముడిచి వడి
న్నగచరులయొద్ద విడువఁగ, నగన యనుచు మొఱయుమను ఘనధ్వనిఁ బడియెన్. 375

వ. ఇవ్విధంబున నాశ్రితవ్యాప్తయు సంతప్తయు నగుజానకీపరిక్షిప్తతప్తకాంచనమయ
భూషణంబుల నయ్యగచరశ్రేష్ఠుం డగుసప్తాశ్వనందనుం డాప్తులం బనిచి సుగుప్తం
బుఁ గావించె నంత. 376

సీ. మానినీఘనశిరోమణిఁ గాక రత్నకలాపకలాపము ల్పాపతితముఁ
గావించి హా నాథ కావరావే యంచు, దిగులొందుజానకీవగపుఁ గాంచి

కనలి లోనుడుకుచుఁ గలఁగుచు నకూపార, తీరంబుఁ జేరి యత్త్రిదశవైరి
మాయావిహారి దుర్మార్గుండు రావణుఁ, డంత సన్నద్ధుఁడై యుద్భటతఁ

గీ. వంశవంశాటవికిఁ దెచ్చువహ్ని యనఁగ, జలధి గని క్షితినొందురసాతనూజ
సీత నకలంకఁ గొని కడు శీఘ్రముగను, లంక సకలంకఁ జేరె నిశ్శంకుఁ డగుచు. 377

వ. లంకకుం జని జనకనందనం దనయుపవనాశోకవనమధ్యంబునం బదిలపఱిచి యద్దు
ష్టుం డిచ్చో ధరణీపరాగపరిచ్ఛన్నశరీర వై నవయ నేల మదీయాంతఃపురప్రవే
శంబుఁ గావించి కామోపభోగంబులం బొందు మనుటయు జగన్మాత యగుసీత
యిట్లనియె. 378

మ. గతితప్పన్ రవి సంచరించినను లోకాలోక మూటాడినం
గతి శ్రీరాముఁడె నాకు సాధ్విని జగత్కల్యాణ నే నన్యసం
గతి కాసింతునె హంసి కాకము నెవం గామించునే ఘోరదు
ర్గతిపాలై చెడ నిట్టులాడెదు నినుం గాలంబు చేరం గటా. 379

వ. అనుటయు. 380

క. కను లెఱ్ఱవార మిగులం, గనలుచు రావణుఁడు వలుదుఁ గఠినత దనుజాం
గనలార వేచియుండుం, డని జానకిఁ జూపి చనియె నంతట నిచటన్. 381

క. ఒకమృగముఁ జంపి నిజకా, ర్ముకాగ్రమునఁ దగఁదగిల్చి మోదమ్మునఁ బ
ర్ణకుటీరమునకు వచ్చెను, నకుటిలుఁ డారాముఁ డెదురఁ ననుజుం గనియెన్. 382

చ. కనుఁగొని గుండె జల్లుమనఁగా శుభగాననఁ గానలోన సీ
త నొకత డించివచ్చితిక దా మదదానవదానవత్కరిం
ప్రనిబిడ మిత్యరణ్య మిటు రానవురా దవురా పదద్వయం
బనయము సంచలించెను సుమా లసమానసమానసస్థితీ. 383

ఉ. ఈమృగశాబముం జనకజేచ్ఛకునై తగఁ బట్టితెత్తు మా
యామృగమేనిఁ గూలిచి రయంబున నిష్పడ నత్తుఁ గానలో
నీమృగనేత్ర నేమరకు మీ వని యెంతయు నొత్తిచెప్ప నా
నామృగసంకులం బగువనంబున నొక్కతె డించి వత్తురే. 384

వ. అదియునుంగాక. 385

చ. విను మిది మాయలేడి వెనువెంటఁ జనన్వల దంచుఁ దొల్లి నీ
వనుపమబుద్ధివై తెలియ నాడితి విప్పు డరణ్యభూమి సీ
త నొకత డించివచ్చితి పదంపడి రాక్షసబాధ నొందునో
యని కలపోయవైతి వకటా వికటుం బగుధాత త్రిప్పునన్. 386

వ. అనిన విని యుల్కిపడి సవినయంబుగా లక్ష్మణుం డన్న కిట్లనియె. 387

క. నీ వాడినచందంబున, నా వారిజనేత్ర సీత నారసియుండ
న్నీ వాడినచందంబున, రావే లక్ష్మణ యటంచు రాక్షసుఁ డనినన్. 388

ఉ. సారసనేత్ర నన్నుఁ గని చయ్యన నిట్లనఁ బొమ్మటంచు వి
స్తారకుగా రయై పలుక సమ్మతి నయ్యెడ తోఁత రాముఁడే
వారికి లోను గాఁ డని భవద్భుజవిక్రమ మే నెఱిఁగి నీ
ప్రాణము నుంచుఁ దెల్పిన మహోగ్రదవానలతీక్ష్ణనేత్రయై. 389

క. వినరానిమాట లాడినఁ, జనుదెంచినవాఁడఁ దప్పు సైఁపు మనుచు మ
న్ననము బలము నెఱిఁగియు నన్నిన్నాడ వటంచు రాజశేఖరుఁ డనుజున్. 390

క. పద పద పోవుద మేము, పద వొందెనో జనకతనయ భయమున ననుచుం
బదములతోఁ ద్రిల దీనాస్యుఁడై రాముఁడు నివాసపదమున కరిగెన్. 391

వ. నానావిధంబు లగుదుర్నిమిత్తంబులకుఁ జిత్తంబు తలపడ వచ్చి సోదరున కభి
ముఖుండై. 392

సీ. రాజీవనేత్ర నారాక తా నాలించి, యెదురుగా వచ్చునే నేఁ డేల రాదు
హరిణశాబకముఁ బట్టి ద్వారపెట్టి దెచ్చితి, నా యని యొప్పు డేల యడుగరాదు
కొమ్మను జేరి పల్కులు నేర్చికొనుకీర, పఠులాంబు నేఁ డేల పాసిచనియె
నావికసితవల్లికాభిరామం బగు, నటజంబు నేఁ డేల యొప్పదతిగఁ
గీ. గలికికరచరణాబ్జాంకములఁ గలుగు, శాలిభూషణశింజితం బేల వినఁగఁ
బడదు నేఁ డుగ్రరాక్షసాపహృత యయ్యె, సీత నిశ్చయ మిది సుమిత్రాతనూజ.

క. అని పలికి పర్ణశాలం, గని జానకి లేకయున్నఁ గడువడి హా చం
దనగంధి యెందుఁ బోయితి, వని మూర్ఛాపరవశాత్ముఁడై మహిఁ బడియెన్. 394

ఆ. పడినయన్న నెత్తిపట్టి యేడ్చుచు సుమిత్రాసుతుండు వల్కెఁ దగునె యిట్లు
ధైర్యముండ రామధరణీశ వెతకుద, మివ్వనాంతరమున నింక నందు. 395

క. అని కటకటఁబడి శ్రీరాముని గను నూరార్చి యందు మునమిఁ వెతకెన్
జనకజనుఁ బల్లవాగ్రాదసికటకుల్యాంతరముల రామసహితుఁడై 396

సీ. ఈరీతి శోధించి యెందును గనరాక, యన్న శ్రీరాముఁ డోహో యటంచు
గొంతెత్తి పిల్చుచుఁ గొమ్మ డాఁగితె యంచు, మెకములు భ్రమింగెనా యని యటంచుఁ
బర్ణశాలాసమీపంబున రోయుచుఁ, బూవులు గోయఁగఁ బోయె ననుచు
వనజాక్షి రోసి కన్గొనుట కష్టం బంచు, హా యేమి సేతుఁ గాంతా యటంచుఁ

గీ. గాన మన కింకఁ దో డేది గలరటంచు, డాయరా వేమి నను దమ్ముఁడా యటంచు
బాల కారగ్గిసాలు గాఁబోలు ననుచుఁ, బాములు గ్రసించెనో యంచుఁ బలవరించు.

సీ. ఇందీవరాక్షి న న్నిందు రమ్మనిపిల్చె, నని కోకిలస్వరం బాలకించు
నదె చంపకామోదహ స్తశాఖం బని, వామలతాపల్లవంబు గాంచు
నదె గంధగజయానయరుణాధరం బను, నిండఁబండినదొండపండుఁ గాంచు
నదె తత్ప్రకనకాంగిహోవల్లు లంచుఁ, గమనీయతరకోరకములఁ గాంచు

గీ. దంబు మీఱు మృగాక్షిదంతంబు లనుచు, దాడిమీస్ఫుటబీజసంతతులు గాంచుఁ
గొమ్మ పాల్పారు చెక్కుటద్దమ్ము లంచు, లలితసాంద్రకదళీదళములఁ గాంచు.

వ. మఱియును. 399

చ. గజములఁ గాంచి గంధకరిగామిని యంచుఁ గలంగు మి చు నం
బుజములఁ గాంచి పద్మముఖి పోయితె యంచుఁ దలంచు బంభర
వ్రజముల గాంచి భృంగచికురా యని చేడ్పడు నాకుజోంపను
ల్కుజములఁ గాంచి పల్లవమృదూపలహ స్త యటంచు వంతగన్. 400

వ. వెండియుం బ్రేయసి నుద్దేశించి. 401

క. రమ్మా యను బల్కవు మా,రమ్మా యను డాఁగు టేది వరమ్మా యను వై
రమ్మా యను వెదకుట భా,రమ్మాయెను గడు నవాదరమ్మా యనుచున్. 402

ఉ. మా యను జెందనేల చెపుమా యనుఁ బల్కవి దేమి ముద్దుగు
మ్మా యనుఁ దాళఁజాల వినుమా యను నావెత దీర్చుపొన్నికో
మ్మా యనుఁ గష్ట మాయెను జుమా యను నాపయి నింతనిష్ఠుర
మ్మా యనుఁ బంతమా యను సమానగమా యను దైవమా యనున్. 403

క. బాల విప్రలాప్రశుకణజం, బాల వదాచరదురోజబాహ్లిక వగుచుం
బాలశశివదన వగవం, బా లయితివె ధాత మిగులఁ బాలసుఁ డగుటన్. 404

సీ. వనిత నీ వావక్షించి కందమూలంబు, లనుపమానరుచిభక్ష్యములు నాకు
భక్తి నీవొసఁగిన ఫలరసంబులు లసదమృతోపమానంబు లతివ నాకుఁ
బటువ్రాతముగ నీవు పఱచినకుశములు, రమణీయ తూలతల్పములు నాకు
నబల నీ వేటినయెడనిచ్చిలెలు కల్పకప్రసూనంబులు కలికి నాకుఁ

గీ. దివిరి నామేన నీ వలందినపరాగ, మమితశీతల మగుమలయజము నాకు
రమణి నీవున్న పొదలు సౌధములు నాకు, నువిద నీతోడిగహన మయోధ్య నాకు.

వ. అని యిట్లనేకవిధవిలాపంబులు పలుకుచు వగచుచున్న యన్నం గనుంగొని యవికళబాష్పకణపరిపూరితనిజకపోలయుగళుండగుచు సుమిత్రాపుత్రుండు తగు రీతి నూరార్చుచుండె నంత నయ్యన్నదమ్ములు. 406

సీ. సారసారససారసారసమధురసా,సారంబు లైన కాసారములను
అంగీకృతాభంగభృంగీసుసంగీత,సంగతరంగత్తుంగములను
సంతతాక్రాంతాప్రకాంతగాఢధ్వాంత,దంతురితాద్రిగృహాంతరముల
నాగతుండపరాగభోగిభోగాభోగ,భాగత్యుపత్యకాభోగములను
గీ. భ్రాంతరంబుల నాశ్రమోపాంతములను, గోటివిధఖచరాంగనాకూటకూట
కూటకోటుల మసలక కొమ్మ వెదకి, సీతఁ గనరామి కెంతయుఁ జింత నొంది. 407
క. ధూర్తమృగధూర్తపటుతర,గర్తంబులఁ బర్వతముల గహనంబుల న
త్యార్తు లయి వెదకి రొక్క,ముహూర్తంబును నున్నచోట నుండక సీతన్. 408
వ. ఇట్లు పరిశోధించి మగుడం బర్ణశాలాసమీపంబున కరుగుదెంచి యెందునుం జనక
నందన సందర్శింప నేరకున్న యవసరమ్మున రాముండు సహజన్ము నాలోకించి.
సీ. కొమ్మ యీకొమ్మఁ జేకొని నిల్చెఁగాఁబోలు, నిచట నీక్రొమ్మావి యింపు నొందెఁ
జిలుకల కిచటఁ బల్కులు నేర్పెఁగాఁబోలుఁ,జుమ్మ యీకర్ణికారమ్ము ప్రబలె
దిగులున దీని సరిఁ బట్టెఁగాఁబోలుఁ, నిచట నీకురవకం బిగురు లెత్తెఁ
దిలకినీతిలకంబుఁ దేఱిచూడఁగఁబోలు, నిచట నీతిలక మిట్లెలమి గాంచె
గీ. నిచటఁ గడువేఁడినిట్టూర్పు లియ్యఁబోలు, నింతి యీసిందువార మత్యంత మమరె
నాతి యిచ్చోట వెడనవ్వు నవ్వఁబోలు, మిగులఁ బువ్వులతో నీనమేరు వొప్పె.
వ. అని పలికి. 411
క. తనకరముల నమృతం బిడి, విను లతలం బెనుచుచుపాలవెల్లినినువునాఁ
జనుజనకనయనఫల మిపు, డనయముఁ గృశియింపదే యినారాద్ధత నై. 412
చ. కరు లురుపింగదృష్టు లురగంబులు గోకము లచ్ఛభల్లము
ల్సరభములు న్సృగాలములు సైరిభము ల్చలు లీతరక్షువు
ల్సరసిజనేత్ర నేఁచుటకు సంశయమే శుకపుండరీకబం
భరపికశారికాదు లిట మానక నీగతి నన్నొ నేఁచఁగన్. 418
సీ. బిసబాహు కని పాసపిండు వేధించెనో, వేధించునే మేఘసాధుశణిఁ
గవలానన యటంచుఁ గరియూథ మేఁచెనో, యేఁచునే ఘనపింగదృష్టిమధ్యఁ
గిసపాణి యటంచుఁ గోకిల లెంచెయాలెనో, యలమునే మీఱురమాభిరామ
సువకోవలి యటంచు భ్రమరముల్ మూఁగెనో, మూఁగునే చంపకామోదదేహ
గీ. కటిఫలధరి యని శరభ్రజ వడెట్లు, మించిసికించెనో విసికించు నెట్లు
వాసనలనొప్పగలుగు జవాదిపూఁత, యనుచు నెంతయు భ్రమ నెందు నాత్మయందు.

వ. మఱియును. 415

సీ. జనకజాతఁ గజాతసమనేత్రఁ గానరే, జంబూవిశాలభూజంబులార
మధుపరాగపరాగమృదుగంధిఁ గానరే, లలితరసాలసాలంబులార
జలదమాలతమాలసమవాలఁ గానరే, మహితమాలూరభూరుహములార
ఘనలతాంతలతాంత కమనీయఁ గానరే, పటుజటోత్కట వటవటములార
గీ. మధురబంధూకబంధుకమ్రాధరోష్ఠిఁ, గానరే గురువుచ మీరు కానరేఁగు
లార యని విభ్రమాద్భ్రుఁడై నరేంద్రుఁ, డచట నచ్చటఁ దిరుగుచు నడలి యడలి. 416

క. గములార వఱలుఘననా,గములారా ఘోరపన్నగములారా సిం
గములార మృగములార న,గములారా నగములార కానరె సీతన్. 417

వ. అని యివ్విధంబున యుక్తాయుక్తవివేకవిహీనునిం బోలె దృగ్గోచరంబు లగుపదా
ర్థంబుల నెల్ల జనకనందన నడుగుచుం జని చని లక్ష్మణుం గనుంగొని. 418

క. అనుజా మనమిరువురము, న్నిను జానకియొద్ద లేనివేళఁ గుపితుఁడై
దనుజాధముఁ డొకఁడు ధరా,తనుజాతం గొనుట నిశ్చితం బూహింపన్. 419

క. జనకజ నియ్యెడఁ గాంచితి, మని తెల్పెడుభంగి భల్లుకావలి మొఱసె
న్నిను పవనిజ వెదకెనుగతి, ఘనవృక్షాగ్రములఁ గపినికరము మొఱసెన్. 420

వ. అని పలికి శోకాతిరేకంబున నొడ లెఱుంగక లక్ష్మణుం గనుంగొని. 421

ఉ. ఎవ్వఁడ నేను రాముఁడ వహీనబలాఢ్యుఁడ కా నెఱుంగు దీ
వెవ్వఁడ వేమ లక్ష్మణుఁడ నేటికి వచ్చితి మిట్టికానకుం
జవ్వని సీత రోయుటకు జానకి యెక్కడ పోయె లక్ష్మణుం
డెవ్విధినున్న వాఁ డనుచు నేడ్చుఁ బరిభ్రమితాంతరంగుఁడై. 422

చ. జనకజ నిందుఁ గాన ముటజం బిది కాదొకొ రామచంద్రుఁ డా
జనకజఁ బాసి యొక్కనిముసంబును దాళఁగఁ జాలఁ డేనురా
మనరవరుండఁ గానో యనుమానము గల్గెడు నంచుఁ గ్రమ్మఱిం
జని యుటజంబున న్వెదకి జానకిఁ గానక వంత గ్రమ్మఁగన్. 423

చ. మనము వనమ్మున న్వెదకి మానిని సీతనుఁ గానకున్న నె
మ్మనము గలంగె నాకు వినుమా వినుమానిక మీఁద చిచ్చు వె
న్న నెడమకన్ను మున్ను నను గనుంగొనఁజాలుదు రెండునున్నఁ జ
య్యన నతి నాకుఁ జూపరు దయాపరివర్జితచిత్తవృత్తులై. 424

వ. అని విరాళిఁ బాలిమితూలింపం దాళఁజాలక యాలిం దలంచి. 425

ఉ. పాంథమనోధనాపహృతిఁ బ్రాభవుఁ డైనశుకాఖ్యుఁ డిప్డు పు
ష్పంధయశింజినీకలితసారబలంబగుతుంటవింట ద
ర్పాంధత సూనమార్గణచయంబుల నోడక గ్రుచ్చి నాదుహృ
ద్గ్రంథి నలంచె గావున సుకంఠి భవద్వచనామృతంబునన్. 426

వ. అని వగచి. 427

క. క్రమ్మఱ నిట్లను బృథుశో, కమ్మున హా జనకతనయ కడువడి నన్నుం
గ్రమ్మినతాపము దీఱునె, కమ్మనికెమ్మోవిపానక మ్మీకున్నన్. 428

వ. అని పలికి యలుక వొడమ నమ్మహీసుతాప్రియుండు. 429

క. సాధుచరిత్ర యనందగు, మైథిలి నొప్పింపకున్న మహి నిప్పుడ సం
బాధింతు నస్మదీయ, క్రోధోద్రేకంబు వెలయఁ గ్రూరాస్త్రములన్. 430

క. నను రాజమాత్రుఁ గాఁ దలఁచిన సురగంధర్వయక్షసిద్ధాదులఁ ద్రుం
చినఁ గాని తీఱ దిదె కన్గొను మనరామునకు లక్ష్మణుం డిట్లనియెన్. 431

గీ. అంబుజాసననిర్మితం బైన కరంబుఁ, బోలుపు నొందుజరాచరభూతకోటి
నీవు గాపాడువాఁడవు నీఱు సేయు, టుగ్రకర్మము తలపోయ నుడుకుదక్క. 432

గీ. ఏల తాలిమిఁ దూల సీతాలతాంగి, నిచ్చోట నచ్చోట వెదకుద మెట్టులైన
నేను గొనివత్తు సంశయ మింతవలవ, దగ్గిలో నున్న నబ్ధిమధ్యమున నున్న. 433

వ. అని పలుకుటయు రామచంద్రుం డుపశమితపరితాపుండై క్రోశమాత్రంబు ధరణీ
కుమారిక నరయుచుం జని మార్గమధ్యంబున. 434

ఉ. ఖండితపక్షుఁ డై మిగులఁ గాఱునసృక్ప్రరిషిక్తవక్షుఁ డై
తుండము ధాత్రి నూఁదికొని తోరపుమూర్ఛ మునింగి జేవుఱుం
గొండవిధంబునం ధరణిఁ గూలినపక్షివరేణ్యుఁ గాంచి మా
ర్తాండవరాన్వవాయకలశాంబుధిసోముఁడు రాముఁ డుగ్రుఁ డై. 435

వ. రాక్షసుం డనుతలంపున. 436

క. నీ చమతి సీత నీరజనీచరుఁడు గ్రసించి యిట్లు నిష్కపటుక్రియం
జూచితె లక్ష్మణ నసలం, జూచి తెరువులోన నిశ్చేష్టుఁ డుక్కుచుఁ బడియెన్.

క. కావునఁ గడుఘోరం బగు, నీవనమున సంచరించు నిక్కపటాత్మం
జీవనము గొనెద వెస విల్లీవన యనునంతలోన నిట్లనె నతఁడున్. 438

సీ. ఘనులార రామలక్ష్మణులార రోషము రాక్షసుఁడను గాను మీజనకుఁ డగుద
శరథభూమీధవసఖుఁడ జటాయువ, న్వాఁడ రావణుఁడు దానవవిభుండు

జానకిఁ గొని యాకసంబునఁ బఱచుచో, నాపె దీనాలాప మాలకించి
వాని నెదిర్చి దుర్వారతదీకూసి,పాతంబునఁ బ్రభగ్నపక్షయుగ్మ
గీ. కుండనై సీతవార్త మీకుం దెలుపఁగ, వలసి నిలిపితిఁ బ్రాణము ల్నిలువ విపుడ
తొలఁగెద నటంచుఁ దనతలఁ దోర్చికొనుచు, విహగవిభుఁ డంతఁ బ్రాణంబు
వీడఁటయును. 439

ఉ. పక్షికులాబ్ధిపూర్ణహిమభానుఁడ మామఁ గూర్మిమీఱ మా
పక్షము వచ్చి నీవిటులు ప్రాణము వీడితి విప్డు నిన్నుఁ బ్ర
త్యక్షముగాఁగఁ జూచి కడు నారనిశోకము మించె మానవా
ధ్యక్షుఁడు తండ్రి పఙ్క్తిరథుఁ డంతమునొందు టెఱుంగ మీక్రియన్. 440
ఉ. ఎట్టికి రాముదేవిఁ గొని యేగెదు రాక్షస నీ వటంచు మి
న్నెట్టికి నడ్డ మేగిన మహీధ్రవధీశువిభంగి నాఁగి త
త్పాటితపక్షకుండ వయి ప్రాణము వీడితి వయ్యొ దైవ మె
చ్చోటు నదృష్టహీనుఁ గృపఁ జూచినవానిక చేటు గూర్చెడిన్. 441
క. అని వగచి వగచి తగునిం,ధనములు సోదవేర్చి పక్షినాయకుఁ బయిఁ జే
ర్చి నిబిడశోకు లగుచు న,హ్ని నొసఁగి రయ్యన్నదమ్ము లిరువురు సువిధిన్. 442
వ. తదనంతరంబున. 443
క. నరనాథులు ఖగనాథున, కఱచేతిద పుణ్యలోక మనుచుం గోదా
వరి సాఁకి మృగామిషమున, నురుపిండముఁ బెట్టి రొగిఁ దిలోదక మొప్పన్. 444
వ. ఇట్లు జటాయువుం బుణ్యలోకచిరనివాసిం గావించి. 445
సీ. ఓషధీశ్వరుని బీయూషరసంబు ప్రార్థింపఁ బోయినభంగిఁ జీవ లోక
నంబు ముట్టిన యరణ్యంబున రామల,క్ష్మణులు దురంతశోకప్రభగ్న
హృద్వృత్తు లగుచు మహీసుత నరయుచుఁ, జని చని మించు క్రౌంచవతిఁ గ్రౌంచ
వతిఁ బ్రవేశించి యావలఁ దమసాఁదిఁ, గన్గొని తత్తీరకాననమున
గీ. నతనుబాణాతనుప్రణిహతమనోంబు,జాతయై లక్ష్మణునిఁ జెయిసాఁచి పట్టి
కొనినదాని నయోముఖిఁ గ్రూరఁ గామ,రూపిణి రక్కసిని వే విరూపిఁ జేసి 446
సీ. పటుదీర్ఘబాహులబ్ధప్రాణిసంఘుఁ గ,పనశీలి యగుకబంధుని భుజాంత
రంబునఁ జిక్కి ఘోరం బగుతద్వక్త్ర,తాకార మీక్షించి యద్భుతాంత
రంగులై వానికరంబులు ఖండించి, రామలక్ష్మణు లుగ్రరాహుముఖని
ర్గతచంద్రాబ్జినీనాథుల ననొప్పి, రాక్షణంబున శాపమోక్షు మంది

గీ. వారలకుఁ దనవృత్తి సర్వంబు నెఱుఁగఁ, జెప్పి చేదోయి నంత మోడ్చి వినయమున
నాకబంధుఁడు దాను దివ్యపురుషుఁడు, గానఁ దనతొంటిరూపంబుఁ గలుగ నిలిచి.

క. భూపవరులార యిదె మ,చ్ఛాపవిమోక్షంబుఁ బూర్వజన్మకృతమహా
పాపవినాశము నయ్యెన్, మీపదదర్శనముకతన మిగుల వెలిఁగితిన్. 448

చ. అని వినుతించి వాయుజననాత్మజయున్నెడ వేఁడినన్ మహీ
జనవరులార మీరలు వెసం జని మంత్రులఁగూడి ఋశ్యమూ
కనగనగంబులం దిరుగుకంజహితాత్మతనూజు వాలియ
న్వనచరనాథుసోదరు నవశ్యముఁ జూడఁగఁబొందు ధీరులై. 449

క. ఆసుగ్రీవునితో సహ,వాసము గావింపుఁ డతఁడు వనచరుల మహో
ల్లాసమునఁ బిలువనంపి ధ,రాసుత వెదకింపఁజాలు రభసత ననుచున్. 450

క. ఈవిధమున దనునాముఁ డ,నావిలమతి నెఱుఁగఁ జెప్పి యరిగిన హరివి
శ్వావిద్భల్లుకహరిశర,భావనవనభాగమందు నరుగుచు నెమరన్. 451

ఉ. ఆశ్రమము న్లతాంతసులతాంతముఁ గూజితకోకపైకభృం
గాశ్రయము న్రసాలవకళార్జునతిందుకనింబువారస
మ్మిశ్రము న్వ్యపేతభయమేదురగుల్మయుతంబు నొక్కపు
ణ్యాశ్రమముం గనుంగొని రమాపతితేజులు రామలక్ష్మణుల్. 452

వ. కనుంగొని. 453

క. వెసఁ జొచ్చి యందుఁ గన్గొని, రసమానవ్రతసమాగతాయాసభరి
న్నసరిత్ప్రస్నానపిశం,గసటాపటలప్రకలితకబరి న్శబరిన్. 54

క. కని తచ్ఛబరాంగన భ,క్తిని వేనర్ఘ్యాదివిహితకృత్యము లొనరిం
చిన సంతసించి నరవరు, లనవద్యులు ఘనులు దశశతాంగతనూజుల్. 455

వ. పరమపవిత్రకుశాస్తరణంబుల సుఖాసీనులైరంత. 456

చ. పొసఁగఁగ భక్తిఁ దచ్ఛబరి భూనుతకీర్తికి రామమూర్తిక
ప్డొసఁగినకందమూలమధురోరుఫలంబులు తృప్తిదీరఁగా
మెసఁగి నరేశ్వరుండు హితమేదురవాక్ప్రకరంబు దానితో
నెసఁగ రచించుచు న్మిగుల హృన్ముదమొప్ప వసించె నయ్యెడన్. 457

చ. తనదుహితప్రవృత్తి విదితంబుగ రామునకు న్వచించి యా
తని వినుతించి రాఘవవృషభంబుల నొద్దల మోపి మ్రొక్కి వే

తనువుఁ దొఱంగి తత్క్షణమ తచ్ఛుభరాంగన వొందె సత్తపో
ధనులకు నంద రానిసుపదంబులు భక్తికి యోగ మెక్కుడే. 458

క. తనివిసనక యీవిధి నా,తనివినుతు లొనర్చి శబరి తనువుఁ దొఱఁగినం
గని యబ్బురపడుసోదరుఁ, గని యప్పుడు పలికెఁ గౌతుకస్ఫురణ మెయిన్. 459

ఉ. సూక్ష్మము భక్తియోగము విశుద్ధమనస్కులు కానిపూరుషు
ల్లక్ష్మ నెసంగువారు పదిలక్షలు వెట్టిన సంతసింతు నే
లక్ష్మికి బాహ్యు లయ్యును ఫలప్రద మన్న నెఱింగి మావు
ల్లక్ష్మణ భక్తి నెంగిలిఫలంబులు వెట్టిన నుల్లసిల్లుదున్. 460

గీ అని పలికి రాముఁ డనుజసహాయుఁ డగుచు, నాశ్రమంబున కవ్వల నరిగి కాంచె
నధికతరవారికేళీసమాగతాప్స,రోవరం బగుపంపాసరోవరంబు. 461

వ. చూచి మంజులతామంజపుంజరంజితం బగు తత్తీరంబుఁ జేరం బోవు నవసరమ్మున.

చ. అరవిలయుండు లక్ష్మణుఁ డహాస్పతితేజున కన్న కిట్లనున్
నరవర చూచితే మును మృణాలముఖంబునఁ దాము గొన్న శం
బరముల సన్మగంధము నెపంబునఁ గ్రమ్మఱ నొల్కెడున్ మనో
హరతరపంకజాతనిచయంబులు ప్రత్యుపకార మొప్పదే. 463

ఉ సారసగంధియు న్విమలశైవలవాలయు నుత్పలాక్షియుం
జారురథాంగపీవరకుచద్వయమయుం గలహంసయానయు
న్సారమృణాళబాహువుఁ గుశభ్రమనాభియు నైశనర్చిడి
క్స్రీరఘురామ చూడు సరసీమణి దాసరసీమణి క్రియన్. 464

క. తీరస్థితంబు లగుధా,త్రీరుహములు ప్రతిఫలించెఁ దెలియుము నది ను
ర్వీరమణ వనాంబుజహ,స్తారమణీయ ప్రకల్పితముకుర మొకో. 465

చ. నరవర తన్ను నాడినజనంబులపంక మధోగతంబు సే
యురుచిరమూర్తి యున్నది పయోరుహజాత పరాగయోగని
ర్హరిత షడద్విరేఫ మవినాధిక యాటఁ దలంపఁ జిత్రమే
యరయ గజప్రదాత యగునాతఁడు తోత్ర మొసంగకుండునే. 466

క. అని పలుక రాముఁ డానదిఁ, గనుఁగొని తన్మధ్యకమలకైరవవిచర
ద్ఘనభృంగములం గని క్ర,న్నన సీతావిరహవేదనాహతమతి యై. 467

వ. తమ్ముని వీక్షించి. 468

చ. వనమున రాక్షసాపహృతభార్యుఁడనై వగ నొందు నన్నుఁ గ
న్గొని తనయింతి దానవులు కోరిహరించెద రంచు భీతిచే
ననిశముఁ బెంట్రిఁ బాయదురథాంగము చూచితివే వనాంతర
మ్మునఁ గజపర్ణశాల ననుఁబోలునభాగ్యులు లేరు చూడఁగన్. 469

క. మరుఁడైదవశరమున న, న్నురవడి నేసెడిని గాకయున్న న్సరసీ
వరతీరంబున నాకు, న్మరదశమావస్థ నిట్లు కలుఁగఁగ నేలా. 470

మ. తగ నిన్నద్యుదకస్ఫురత్కుముదపద్మస్తోమగంధంబుఁ దీ
రగతాశోకరసాలకుందసుమసౌరభ్యంబునుం గ్రోలి యా
శుగ ముగ్రత్వము దాల్చి నాకు హృదయక్షోభంబు వెంచె న్మరా
శుగపంచాహతి వోలె లక్ష్మణ బుధస్తుత్యోల్లసల్లక్షణా. 471

తే. తాపహారియున్న దీపవనంబు సం, తాపకారి యయ్యెఁ దరుణిఁ బాసి
యున్నవాఁడ నగుట నురుభుజ నాకు సీ, తాపహారిఁ జూపు మే పడంతు. 472

వ. అని రోషావేశుండై పలుకుటయు సహోదరుండు సాంత్వనవచనంబున ననునయిం
చె నంత. 473

ఉ. శోకముఁ దక్కి రాముఁడు విశుద్ధమతిం జని కాంచెఁ బుష్పితా
శోకముఖద్రుమాగ్రపరిశోభితబర్హిశిఖండినీకులా
స్తోకముఁ గూటకోటిపరిశుద్ధనిశాపతికాంతవేదికా
నేకము సానుసంచరదహీనచమూకము ఋశ్యమూకమున్. 474

కని తదుపాంతకాంతారాంతరంబున ననుజసహితుండై రాముండు ధనుర్బాణతూ
ణంబులు సహాయంబులుగా నుండె నని చెప్పి మహానందంబున. 475

ఆశ్వాసాంతము.

మిత్రామిత్రవిభేదశూన్య బుధసన్మిత్రాఖిలామిత్ర భ
క్త్రాణైకపరాయణా నిరతవృత్రఘ్నార్చితాంఘ్రిద్వయా
పత్ర్యధ్యక్షుహామోదయా సుహృదయాబ్జా వేంకటాఖ్యోల్లస
న్గోత్రాభృన్నిలయా సురాహిమలయా క్రూరోగ్రయామ్యాలయా. 476

అధివ్యాధిహరణ భ, క్తాధీనాంతఃకరణకజారుణచరణా
సాధుజనావనచణ భవ, పాథోనిధ్యుత్తరణ కృపాప్రాభరణా. 477

కవిరాజవిరాజితము.

సరసిరుహోదర సన్నుతపాదరజఃపరిపూతరసాతలయా
పరమకృపాకర పామరభీకర భానుసుధాకరకోటివిభా
తరుణశుభాంగ మహీహృదయంగమతార్క్ష్యతురంగమ దీనదయా
పర మధుసూదన ప్రణుతసుధోదన భవ్యవినోద నరాదహరీ. 478

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యానపరాయణ భూమధైర్య
వినయ రామనార్యతనయ పండితసేవాసముచ్చయ శ్రోత్రపల్లి
లచ్చయ ప్రణీతం బైన దాశరథివిలాసం బను మహా
ప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.



క. వీరలుశీతారివారలు, వీరలు మహనీయు లిట్టివీరల నొరు లె
వ్వారలు పంపఁగఁ జాలెదు,వారలు తముదామ యిటకు స్వచ్ఛందగతిన్. 7

వ. వచ్చినవార లని తలంతు నని పలికి మఱియు నిట్లనియె. 8

మ. హితవాచంయమివేషధారులఁ గృపాదృగ్జాలురన్ క్షత్రియా
కృతు లీవీరలు వాలి నేపడఁచి కిష్కింధాధిపత్యంబు స
మ్మతి నీ కీనిరుమేను లొప్పఁగ రమామానిన్యధీశుండు స
ద్గతి నేతెంచె ననందనర్చిరి జగత్కల్యాణచారిత్రులన్. 9

ఉ. వారివిధంబు సర్వము ధ్రువంబుగ నారసి వచ్చితే వేడుక
న్వారికి నీకు సఖ్యము నవశ్యముఁ గూర్చెద నట్టులైన నే
వారికి లోనుగాని బలవంతుఁడ వయ్యెద వట్టివైరులం
జీరికిఁగొందువే ప్లవగసింహుని వాలిని గీలి నేర్పవే. 10

క. అని వారిసమీపమునకుఁ, జని మాయాభిక్షుకత్వసంభృతుఁ డగుచు
న్వనమెల్లఁ ద తనూనూ,తనవీసన మొప్పఁజేయఁ దగిరయొడఁనిభృతిన్. 11

ఉ. చేతులు దోయిలించి కపిసింహుఁడు వాయుసుతుండు మ్రొక్కి ని
ర్భీతులు సద్వినీతులు నపేతకునీతులుఁ బూతులుం జగ
త్త్రాతలు మీరు మానులకిధంబున ఘోరవనావనీసమా
యాతులు గాఁగ నేటికి దయామతులార యెఱుంగఁజెప్పరే. 12

వ. అని యడిగి వెండియు. 13

క. చక్రీశసదృశబాహులుఁ, జక్రధరోపములుఁ జక్రచక్రాననులుం
జక్రహితరిపుఁభులు సువ,చక్రమపేశలులు సుకటిచక్రులు మీరల్. 14

క. మహి నెవ్వారలు వీరలు, బహుసుగుణావహులు నియమిభారవహు లనా
గ్రహులు మహామహు లియ్యెడ, నహిశయనునిద్వ్యక్కృతు లన నలరెద రనినన్. 15

ఉ. ప్రాణసతీసువార్తఁ గొని రాఁగఁ ధీరునిగా నెఱింగియో
స్థాణువరంబునం బరమసాధ్వికి నంజనకుం దగం జగ
త్త్రాణునిచేఁ బ్రజాతుఁ డగుధార్మికుఁ డంచుఁ దలంచియో సరి
క్షీణవిచారుఁడై ముదముఁ జెందెను రాముఁడు తన్మహోక్తులన్. 16

వ. ఇట్లు సంతసించి సహోదరుం గనుంగొని. 19

క. మనవృత్తము సర్వము లక్ష్మణ యితని కెఱుంగఁ జెప్పుమా యనవుడు స
జ్జనమణి సౌమిత్రి నరేంద్రుని యానతి మిగుల నతనితో నిట్లనియెన్. 18

# పంచమాశ్వాసము.

ఉ. భానుకులాబ్ధిపూర్ణహిమభానుఁడు పఙ్క్తిరథాధిపుండు త
త్సూనుల మీఁద నగ్రజుఁడు సువ్రతచర్యుఁడు రామనాముఁ డా
త్మానుజు నన్న లక్ష్మణసమాఖ్యుని గూడి కడంగి భార్యయుం
దాను ను వేడ్కఁ బంచవటిఁ దాత వచస్స్థితి నున్న యంతటన్. 19

క. ఈనుశ్లోకునిసతి సీ,తానతి రమియువుగమును దొడవ్వాల సం
త్రాసవనస్థితి మెలఁగెడు, నాసమయమునందు రాక్షసాహ్వాత యైన్. 20

క. తత్కాంతారత్నము నీ,తత్కాంతారస్థలముఁ గంను మను చరీ
జోత్కలిక వెదకి విపులా,పత్కలితుల మొక్కచోఁ గబంధు మహాంధున్. 21

క. కని వాని వానిశాపం,బును దగ్ధముగా నొనర్చి పొలుపుగ నపు డా
ధనునామునిచే సుగ్రీ,వుని విని తత్సఖ్యమున నవుం బను లెల్లన్. 22

మ. అని తన్మర్కటనాథదర్శనసమీహాబద్ధవ్యగ్రంధియై
విను మిచ్చో నివసించినాఁ డురుజగద్విఖ్యాతమూర్ధన్యమా
ర్గ ధన్యనితాంతస్ఫుటదీప్తివిశాలిశాటునాత్యంతప్రశస్తాంఘ్రిప
ద్మున శ్రీరాముని కబ్జజుం డగచరేంద్రుం గొల్వ రాఁ గటా. 23

వ. అని పలికి యున్న దెసకు విన్నవై కన్నీరు మున్నీరుగా వగచుచున్న యన్నరవరు
క త్తరుచరవరుం డిట్లనియె. 24

క. ఏపగిది నవార్యము లగు, నాపదలకు న  బోగల రార్యులు శోక
స్థాపితహృద్వృత్తులకుఁ, బైపయి నాప  వోడముఁ బలముఁ దొలంగున్. 25

వ. కావున సుస్థిరుండ వగు మని యనునయించి  నంతరంబున రామలక్ష్మణులం గని 26

క. బంటు నిటు వినుఁడు శోకం, బంటనిహ్వాంగములతోడ సజ్జనకసుతం
బంటు వెలఁదిమోముల దగు, పంటు వెదకి కాంచునట్టిపని నాగిమంచి 27

వ. అని యిట్లు. 28

క. తగఁగ నవిమలుల నవికలు, లగుఁడని లకుశాబిడ మగు  విదీక్షగం
బగువాలముఁ ద్రిప్పుదు న,య్యాగచరుఁ డిట్లనియె నైజ మగుగతిఁ దెలియన్. 29

క. అంజనకుఁ బ్రభంజనునిద,యం జనయు నొందినాఁడ హనుమద్విఖ్యా
తిం జను లెన్నన్ ఖలులఁ బ్ర,భంజన మొనరించుసత్ప్రభం జనువాఁడన్. 30

క. సుగ్రీవాగ్రసచివుఁడ న,దగ్రగ్రామాగ్రవాసినై మిముఁ గని భూ
పాగ్రణులు భవత్సఖ్యసు,సుగ్రామాప్తి నెదఁ గోరి యతఁ డిటకు నరున్. 31

ఉత్సాహ. పంప వచ్చి వాఁడ నతని పం పలంఘునీయ మా
పంప దాఁటి మీర లిందు బాణతూణధారులై
తెంపునం జరింపఁ గాంచి తెంపు లేనిభీతిచేఁ
ద్రిప్పికొనియె ధైర్యవల్లిఁ దిగ్మభానుసూనుఁడున్. 32

చ. వినఁ డతఁ డన్న దన్ఁ బరిభవించి సతీవిభవంబు లెల్లఁ గై
కొనఁడుఁ దదీయసత్తమునకుం బ్రతిసత్తము లేమి నాతనిం
జెనకఁ దలంకి యగ్గిరి వసించినవాఁ డగుట న్భవత్సహా
యనిశితఖడ్గధార నురుమాడఁ దలంచె విరోధిసాలమున్. 33

క. ఘనులార యతనిమిత్రత, కనుకూలత నొందుఁ డనుచు నట్లేని దగ
న్నీవు మాడఁ బోవుతీర్థము, చనుదెంచినయట్లు కాదె చయ్యన మాకున్. 34

క. స్మయరహిత నీవు చని నిశ్చయముగ సుగ్రీవుతోడిసఖ్యము మాకున్
దయఁ గూర్చిన నన్యోన్యప్రియకార్యుల మగుదు మనఁ గపిప్రభుఁ డాత్మన్. 35

గీ. పొంగి తగుభంగి నాప్తపుంగవులను, బూర్ణకరుణాంతరంగులఁ బూర్ణముగను
దోడుకొని ఋశ్యమూకంబుఁ దొలుతఁ గడచి, యధికసౌరభసుమనిలయము మలయము.

క. కని రాముని రాముని ర, మ్యుని తమ్ముని నందు నిల్పి ముదమున సుగ్రీ
వుఁ సుగ్రీవునిఁ గని యిట్లని యెన్నఁగరానిహర్షమై యిట్లనియెన్. 37

మ. రవి సన్నం దనఋశ్యమూకవసుధరప్రాంతార కాంతారవా
రవిహారస్థితు లైనవాకొమరులం బ్రావీణ్యము న్మాలి వై
రవిధాయాగతు లంచు నెంచుచు భయభ్రాంతుండ వైతిట్లువా
రవివంశప్రభవు ల్జగత్ప్రభువు లత్యంతప్రసన్నాత్ములున్. 38

వ. తదీయమహానుభావం బభివర్ణనీయం బని పలికి మఱియు నిట్లనియె.

క. విఖ్యాతిమీఱ నీదగు, సఖ్యాతిశయంబుఁ గోరి చనుదెంచిరి ప్ర
త్యాఖ్యాతవైరులత్యమ,లాఖ్యాతులు వారిఁ బొగడ నలవియె నాకున్. 40

తే. అనుచు వారియుదంత మాద్యంత మగచ, రేంద్రునకుఁ దెల్పి వెండియు నిట్టు లనియె
నీఁదపాపఁడు వెలిచి గట్టెక్కనేల, యిపుడు నీకష్టమెల్లఁ గట్టెక్కనమను. 41

ఉ. ఆచలినట్టుపట్టి నెనరారఁ గవుంగిటఁ బట్టి చిన్నవాఁ
డాచలికంటుఁ బం డనుచు నాఁకట మ్రింగఁగఁ బోయినట్టి నీ
వాచలిగట్టుఁ బిట్టువడ కాడఁగ మెట్టెడుఁదిట్ట విట్టివో
నాచెలి కాఁడవైతి వికఁ నాకుఁ గొఱంత ఘటిల్ల దొక్కఁడున్, 42

వ. అని ప్రశంసించి. 43

క. దృష్టమతిం బురుషార్థచ,తుష్టయ మనఁదగుసచివచతుష్టయ మొప్పం
దుష్టయము భువనపూర్ణో,త్కృష్టయశు రాముఁ జూడఁ దివిరెనుమదిలోన్. 44

క. నిటలతటఘటితాంజలి,పుటుఁడై మర్కటవిభుండు పులకపటలము
ల్పటుగతి మేన నలమికొన, నటు చని రాము న్మహాత్ము ననుజాన్వితున్. 45

సీ. కని పేద పెన్నిధిఁ గనినచందంబున, నత్యంతసంతోషి యై తదీయ
చరణారవిందసంస్పృశ్యితనిజఫాల, భాగుఁడై యానందబాష్పసలిల
పూరితాక్షుం డగుసౌరి సమీక్షించి, రాముండు గరుణాభిరాముఁ డగుచు
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చికొనియె ననంతరం,బున సుమిత్రానందనునకు మ్రొక్కి
గీ. యగనిమన్నన వడసె నయ్యవసరమున, రాముఁ డనుజన్ముఁగూడి తోరమగునొక్క
చోట నాసీనుఁ డయ్యె నవాటుఁ డొక్క, వలనఁ గూర్చుండెఁ దనసచివవరు లలర.

క. తగ నెల్లవారుఁ దమఁ గొల్వ,వఁగఁ గొలువలరించు రామవల్లభుఁ డపు
డయ్యగచరులు గొలువ నగమున, వగపునఁ గూర్చుండె దైవవంచన నకటా. 47

వ. అట్లున్నయవసరంబున సామీరి నుద్దేశించి రాముండు సౌరి కిట్లనియె.

క. ఈతనికతమున భవదీ,యాతతవర్తనము తెల్ల మయ్యెను మాకుం
బూతాస్మచ్చరితంబును, వీతాఘుం డితనివలన వింటివి నీవున్. 49

వ. కావున. 50

గీ. మిత్రసత్పుత్రఖండితామిత్ర నీదు,మైత్రి యనియెడుఘనయానపాత్రమునను
నిశ్చయంబుగ విపదంబునిధిఁ దరింపఁ, గోరినారము దగ నియ్యకొనుము దీని. 51

చ. అనవుడు సంతసించి తగ నట్టులసేయుచు మీరు నేము స
ఖ్యనిరతి నున్నవారము ప్రియంబునఁ బొం దొడఁగూడునేరిఁ జ
క్కనగు సమస్తకార్యములుఁ గంజహితాన్వయులార వేఱ వే
యనఁ బని యేల రాల నుదకాగ్రముల న్నిలుపంగఁజాలమే. 52

వ. అని పలికి మహానందుం డై రామచంద్రుం గనుంగొని. 53

క. తనుజాతబుద్ధియై భూ,తనుజాతహరించి మూర్ఖతను జరగినయ
ద్దనుజాతతజవసైన్యా,తనుజాత మడంచి మహిసుత న్వేసఁ దెత్తున్.

క. అని సుగ్రీవుఁడు పలికిన, విని సుగ్రీవుండు రామవిభుఁ డప్పుడ యా
తనిచేఁ దనచే నిడ న్యాతనిచేఁ దనచే నిడె న్ముదం బలరారన్. 55

వ. ఇట్లన్యోన్యంబును జేతం జేయి వెట్టి సఖ్యంబు గావించి మఱియు నగ్నిసాక్షికంబుగా నక్కార్యసాక్షినందనుతోడ సర్వసాక్షి యగు శ్రీరాముండు మిత్రత్వంబు సంఘటించె నంత. 56

క. లీనగతిం దొల్లి నీ యా,లీనగ లీనగమున రుచు లీనఁగ వైచె
న్యానురిభా యని జనకసుతానిక్షిప్తోలంకృతంబులు నూపక 57

క. ఆపోవని మూడ్కులనపు, డాపూపాన్వయవరుండు నాభూషణము
ల్చేపట్టి లక్ష్మణునకుం, జూపెట్టుచు రాముఁ డధికశోకాతురుఁ డై. 58

వ. మహీతలంబునం బరమమూర్ఛాపరవశుండై పడి కొంతవడికిం గొండొక తెలిసి నిజచరణసమీపంబున దుఃఖాతిశయంబునం బొరలుచున్న సౌమిత్రిం గనుంగొని. 59

క. ధరణీతనయామధురా,ధరసంపర్కగతఘన సుధాబిందులు నాఁ
గరయుఁ దనరారె నీముం, గఱముత్తియములను జూడఁగా సౌమిత్రీ. 60

క. వనగజకుంభంబులఁ బుట్టిన సతికుచకుంభముల నటించిన నీహా
రనికాయంబున కిటు వల,సెను జిక్కు వడంగ నెలవుఁ జెడ ఘన మగునే. 61

గీ. తగి తాటంకముల ధగద్ధగలు మాసెఁ, గాంచి కాకింకిణీక్వణక్వణన మడఁగె
లలితమంజీరపటుఝుళంఝుళలు డొంకెఁ, దరుణి నెడఁబాసియున్న కతమునఁ గాదె.

క. ధృతి నగ లేఁతిఁ దాల్తుం, బతిఁ బాసితి ననుచు భూమిపతితిమ నేయం
గతిమాలి భూషలిదె నా,గతి వైరాగ్యంబుఁ దాల్చెఁ గాంచితె వత్సా. 63

వ. అని యనేకవిధంబుల వగచి వగచి పుడమిఁ బట్టి నప్పుడ యెడఁబాసినట్టులఁ జిత్తంబుల నుత్తలంబు గ్రొత్తసేయం బవనసుతుండు ప్రియవచనంబుల ననునయింప నూఱడిల్లె నిట్లు సుగ్రీవునితోడం బద్ధసఖ్యుండై యవ్వానరేశ్వరు నుద్దేశించి ప్రమదాతిరేకంబున. 64

ఉ. మిత్రతనూజ పాత్ర మగుమిత్రుండ వైతి వమిత్రగోత్రగో
త్రత్రుటికాస్వరప్రకటితప్రబలాస్మదమోఘపత్రుల
న్శత్రులు నీకుఁ గల్గిన వెసం దునుమాడెద వన్నఁ బుణ్యచా
రిత్రుని రాముఁ గన్గొని హరిప్రియపుత్రుఁ డనంతతోషియై. 65

వ. సకరుణంబుగా నిట్లనియె. 66

క. నా కగ్రజుండు వాలి వృ,నాకోగ్రేసరుఁడు బలిమి నాయాలి రుమం
గైకొని వెడలఁగనడిచిన, నా కీగ్రావమున వేదనం బడవలసెన్. 67

క. నయ మొక్కింతయుఁ దలఁప క, నయమున బాధింప రామనరవర యిచ్చో
నయమును జెడి తిరిగెద వే, న యమునిం జూడంగ వాలి ననుపుము శక్తిన్. 68

వ. అని పలికి యంత నిలువక. 69

శా. నిష్కారణ్యుఁ డగారిదారకుఁ డురన్నిశ్శేషశుష్కద్రుమో
చ్చిష్కుండ వనం దనర్చి వెస భస్మీభూతుఁ గావించి ధా
నుష్కాగ్రేసర పుష్కరాక్షులను నన్నుం బ్రీతి వీక్షించినం
గిష్కింధాధిపతిత్వ మొందెదఁ గదుం గీశుల్ప్రశంసింపఁగన్. 70

క. తనయాలి విడుచునతఁడుం, దనయాలి న్విడుచునతఁడు దశరథభూభృ
త్తనయా లేశంబును వే, తన యాలిక కుందుదురు గదా తలపోయన్. 71

వ. అని పలికి మఱియు నవ్వాలి ధైర్యస్థైర్యాదిగుణంబు లగ్గింపం దలంచి యిట్లనియె 72

స్రగ్ధరావృత్తము
మాయావిం దన్ని చీల్చె న్మదమహిఁ బ్రబలోన్మాదుఁడై తన్నుఁ జీర
న్మాయావిం దుందుభి న్నామమడఁచి మడిసె న్మానకన్నన్ని నిత్య
మ్మాయావిశ్వంభరాభృద్వ్యసననిరతుఁగా హాక్రియం దోలె శ్రీరా
మా యావీరాధివీరు న్మఘవసుతుని సామర్థ్యమెన్న న్వశంబే. 73

వ. మఱియు నబ్బలాధికుండు. 74

క. దుందుభి నడంచి దివి సుర,దుందుభులు సెలంగ శక్తితో నప్పుడ త
న్మందరనిభకుణపంబు న, మందరభసుఁ డగుచు వీచె మహామాధికుఁ డై. 75

వ. ఇట్లు ఋశ్యమూకాచలాగ్రంబునకు. 76

క. జొటుజొటు నెత్తు రురుల వ్రీచుటయుం దప మాచరించుచుఁ జట్రిలుఁ డొకఁ డ
చ్చొటునుండి కటకటు లదరఁ, బటుపటు పికటుగతిఁ ద...తపటులి గొలుకుచున్. 77

ఉ. క్రొవ్వున నిన్నగాగ్రమున కుం గుణపం బిటువైచె నేఁ
డెవ్వఁ డతండు వారిజభవేశ్వరు లడ్డ మైనఁ జచ్చుఁబో
యివ్విపులాధరాగ్రమున కెక్కినయంతన యంచు శాపమి
చ్చె న్విపులోగ్రవాక్యనిచయంబులు వింటిమి నేను వాలియున్. 78

వ. ఇవ్విధంబున మతంగమహామునీంద్రుండు శపించుటం జేసి యీనగంబునకున్న నన్ను
మాయన్న వెన్నడింప వెఱచియున్నవాఁ డని పలికి యతనికిం దనకుం గలపూర్వ
వైరకారణంబు సవిస్తరంబుగా నెఱింగించి విషాదఖేదవాదోదూయమానమానసుం
డగు భానుసూను ననునయించి మేఘగర్జితసంకాశంబులగు భాషణంబులఁ బూష
కులభూషణుం డిట్లనియె. 78

క. ఆలింపుము రవిసుత నీ, వాలిం గూడెదవు నిశ్చయంబుగ నిఁక లే
దాలస్యము జవవచ్ఛర,కీలిం గీలించి వాలి గీలిం గాల్తున్. 80
క. నేలఁ బడఁగూల్తు వాలిసుతు, నేలఁ బడంజాలి వానరేశ్వర నీచే
నేలఁబడుం దత్పద మిఁక, నేలపడఁతికూఁతు వెదక నీపని సుమ్మీ. 81
వ. అని నమ్మికదోఁప నాడుటయు సుగ్రీవుండు జడస్వభావంబుగా నిట్లనియె. 82
క. మాయన్న మున్ను దుందుభి,మాయన్నశియింపఁజేసి మడపినకాయం
బోయన్న కదల్చినఁ జూ,మ్మీ యెన్నఁగవచ్చు వాలి నణఁచెద వనుచున్. 83
చ. అన విని నవ్వి రాముఁడు మహామహుఁ డందఱుఁగూడి వాసవి
ప్రణిహతదుందుభిప్రకటరాక్షసకాయము హేయముం గనం
గొని చరణాంగుళి న్మెఱయఁగోటన మీటినఁ దచ్ఛవంబు యో
జన మగుదూరదేశమున శైలమన న్వడిఁ గూలెఁ గూలినన్. 84
క. కని విస్మయంబు మనమునఁ, బెనఁగొన వానరులు రాముఁ బ్రభుహర్షమునం
గొనియాడి రంత నారవితనయుం డిట్లనియె సద్భుతప్రమదమునన్. 85
ఉ. వాలి జవంబున న్విసరి వైచినకాయ మితండు గాలిపె
న్వ్రేలునఁ దూలమీటెఁ గడువింత యనంజన దిప్డు డెందుఁటం
దేలిక యయ్యె నాతని వధింప సమర్థుఁడవేని పూని యీ
తాళము లొక్కకోల వసుధం బడఁ గూల్చినఁ జాల నమ్మెదున్. 85
క. అని తాళసప్తకముఁ జూ,పిన దశరథనామకాశ్యపీనాథసుతా
గ్రణియుఁ గపీశుఁడుఁ దను మెచ్చ నసల బాణంబు వింట సంధించి కడున్. 87
చ. లలి విడువం గలంబ మవిలంబగతిం దృణరాజసప్తకం
బిలనొకవెట్టఁ గూలి పడ నేసి ధర న్వెస దూసి ధారుణీ
తలమును దాసి భోగుల పదంబు క్షణంబున డాసి రాముని
మ్ముల పొదిఁ జొచ్చె నెల్లరుఁ బ్రభూతభయాస్పదులై కనుంగొనన్. 88
క. తాళములఁ గూల్చి వెసఁ బా,తాళముఁ గని బాణ మత్యుదగ్రత వెడలం
దాళక భూతంబులు బే,తాళంబులు భీతి నొందెఁ దక్షణమాత్రన్. 89
క. తాళ్ళు దెగె నింక దనుజుల,యాళ్ళయొడళ్ళఁ గల మంగళాభరణములం
ద్రాళ్ళు మనకాళ్ళసంకెల,త్రాళ్ళును దెగు ననుచు దివిజతతి దివి నలరన్. 90
క. అప్పుడు తాళము లొఱఁగెడు,చప్పుడు కకుభముల నిండ సకలకుభంబు
ల్చొప్పడువాలిం దునుమక, తప్పఁ డితం డనుచుఁ దరణితనయుఁడు వొంగన్.

వ. మఱియుం దదమనంబున నపరిమితానందంబు నొందె నయ్యవసరంబున. 92

శా. బంధూకారుణభానుసూనుఁ గని భూపాలుండు సుగ్రీవ కిం
ష్కింధాద్వారముఁ జేరి వాలి ననికిం గిల్కొల్పు మే నంతటు
న్నధాభార్గవుఁ డీతఁ డంచు జను లెంచ న్నించుబాణంబున
న్స్కంధాంతర్విహితప్రవృత్తి వాలి నెగుతుం గ్రౌర్యం బవార్యంబుగన్. 93

క. అని సుగ్రీవుం బురికొల్పి నరేశ్వరుఁ డనుజాఁడును గలీముఖముఖ్యు
ల్దనఁ గొలువ నేగి తత్సవిధనగాంతరమున వసించె ధానుష్కుండై. 94

ఉ. వాలి నెదిర్చి పోరుబలవంతులు లే రనుచుం గడంగి దే
వాలినుతు ల్సెలంగఁ గడు నర్హితవప్రముఖోజ్జ్వలద్యశో
శ్శాలి నొనర్పనో తరులచాటున డాఁగెను వాలిఁ గూల్పఁగా
కాలములోన రామునకు నడ్డమె వాలియుఁ గూలి గీలియున్. 95

వ. అంత ననంతసంతోషితస్వాంతుం డగుననంతమణిసంతతి కిష్కింధానగరద్వారంబుఁ
జేరి మీఱి. 96

ఉ. ఏ సుగ్రీవుఁడ వాహవోన్ముఖుఁడ నై యేతెంచితి న్నిన్ను నీ
తా సుగ్రీవునొనర్తుఁ జంపు భయదాహ్వానంబుఁ గావింపఁ దా
రాసౌందర్యవతీమనోహరవచఃప్రాగల్భ్యతాకర్ణన
వ్యాసంగుం డమరేంద్రనందనుఁడు దుర్వారుండు దర్పోద్ధతిన్. 97

గీ. క్రాలి విలయకాలకాలకాలుఁడు కేలి,గూల మొక్కమూలపాలు చేసి
వాలివచ్చుచున్న వాఁ డన నవ్వాలి, తాఁకెఁ దనయమిత్రుఁ దరణిపుత్రు. 98

వ ఇట్లు. 99

క. తలపడ నినతనయుఁడు ను,త్తలపడనిమనంబుతోడఁ దాఁకెఁ గరుణముం
దలఁపఁ డనివార్యుఁ డీతని,తలఁబడ నేయుము వెస దశరథసుతుండను మన్. 100

క. అబ్బలియును లబ్బరంబుగఁ, బొబ్బలిడుచు బొబ్బమొకయు బొబ్బమొకంబున్
బెబ్బులియున్ బెబ్బులి యున్, గుబ్బలి గుబ్బలి యుఁ జలముకొని కవియుఁగలన్. 101

క. దంతంబులఁ గఱచుచు నఖ,కుంతంబులఁ జీఱుచుం బ్రకోపు లగుచుఁ బ
ల్వంతంబులు వలుకుచుఁ దదు,పాంతంబులశిలలు నలఁగఁ బదహతు లెసఁగన్. 102

ఉ. ఫాలము లెఱ్ఱవాఱ దిగిభశ్రుతిదారణకారణాహవా
స్ఫాలితబాహులై రిపువిఫాలనతత్పరులై కరంబుల
న్వాలము లెత్తి త్రిప్పుచు నవారణ వారణయుగ్మకంబునాఁ
బోలి పెనంగి రాప్లవగపుంగవు లింద్రదినేంద్రనందనుల్. 103

వ. మఱియు నన్యోన్యమర్మవిదారణకారణంబు లగుసంభాషణంబు లాడుచుం బోరాడుచున్న సమయంబున. 104

క. అద్రినగరుద్భితస్వానున, కద్రికనూజునకు భేద మారయ లేమి
న్విద్రావితారివారుఁడు, భద్రాయితమూర్తి రామభద్రుఁడు శంకన్. 105

క. వదనంబులు రదనంబులు, బదము లుదరములు నురములు బాహులు నఖము
ల్పొదవు లొకరూప వాలికి, దదనుజుఁ డైట్టితరణితనయున కరయన్. 106

గీ. కానలెస్సఁగ సుగ్రీవు వానవాలు, పట్టియు నిరర్థకం బగునట్టియస్మ
దీయబాణంబునను వాలి నేయవలయు, ననుచు నెంతయుఁ దలపోయు నవసరమున.

శా. శౌనాసీరికి సౌరి పాఱి రఘువంశ్యస్వామినిం జేరి యి
ట్లౌ నా వాలి నెదిర్చి పోరు మని న న్నాజ్ఞాపితుం జేసి వే
వానిం దుర్మ కుపేక్ష సల్పితివి విశ్వాసంబుఁ బోఁద్రోఁచి నా
దేనిం గూల్పవె చూడు జర్జరిత మయ్యెం గాయ మెల్లం గడున్. 108

క. వాలి నను జంపఁ జిదప, న్వాలిం జంప ఫల మేమి వసుధేశ్వర న
న్నాలిఁ గొనఁ జేసెదె జను, లాలిఁ గొనం జేసితివి మహాత్ముఁడ వయ్యున్. 109

మ. అన నారాముఁడు నొచ్చి యిట్లనియె నీ కావాలికి న్రూపయౌ
వనసత్త్వాదుల వేఱు లేమిఁ గని దుర్వారాస్మదీయాస్త్రమో
చనముం జేయనితప్పు సైఁపు మెడఁద న్సందేహము న్మాను మి
ప్పుని కే నొప్పరికించి చూచెద నె ప్రభ్రష్టప్రతిజ్ఞుఁడ నై. 110

క. సమరూపాతిశయులు ఘనసమరము మీ రాచరించుసమయంబున మో
స మగు న్శర మిం దెవ్వరి, సమయించునో యనుచు విడువఁజాలక నైతిన్. 111

వ. కావున సాభిజ్ఞానుండ వై రణంబు సేయుము మనిన. 112

క. కంటికి నెప్ప యగుచు ము, క్కంటి యరుగుదెంచి వాలిఁ గాచిన విను మీ
కంటెల్లఁ దీఱ నీవాల్గంటిఁ గొనినవానిఁ బట్టి కండలూడ్తున్. 113

వ. అని పలికి పవనపుత్త్రుం గనుంగొని. 114

గీ. వాలితోఁ బోరునెడ నానవాలితండు, మాలి యైనను నీవంశుమాలితనయు
నలుత నొకరెత్తుఁ దగులుపు మరుగు మట్టు, లేని రిపుఁ గూల్తు నే నడ్డులేనికడిమి.

వ. అనంతరయుం దత్క్షణంబున. 116

ఉ. జ్ఞానినుతుఁడు సంగరవిశారదుఁడు న్మహనీయకీర్తి ప్ర
జ్ఞానిధి రామమూర్తిసముఖంబున వాయుతనూభవుం డభి

జ్ఞానము గాఁగ నెంతయుఁ బ్రయత్నముఁ నొనరించి తెచ్చి స
మ్మానముతోడ నుంచె సుమమాలిక నేలికకుఁ దపాలికన్. 117

వ. అంత. 118

క. కంధరధృతమాలికు ఘనకంధరనిభదేహు రవిజుఁ గని రాముఁడు ద
ర్పాంధు భవదగ్రజన్ము సుధాంధఃపతిపుత్త్రు బిల్వు మాహవమునకున్. 119

చ. అనవుడు సంశయంబు హృదయంబునఁ దోఁప నడంచికొంచు వే
చని విబుధేంద్రనందనుని సాహస మొప్పఁగఁ జీరెఁ బేరెలుం
గున సమరంబు సేయ నిదిగోఁ జనుదెంచినవాఁడ నంచు న
ధ్వని విని వాలి పంకజహితప్రభవు న్సమయింప నుగ్రుఁ డై. 120

వ. చనుదెంచునెడ నెదపొచ్చి నఖనిజితతార యగు తార యిట్లనియె. 121

క. ఏను బలవంతుని పెనుబ్రాపున వచ్చినవాఁడు తపనపుత్త్రుఁడు కాకు
న్నను బోరి పాతి మరలఁ, జనుదెంచునె కలని కిది విచారించు మెదన్. 122

క. హృదయేశ నామదిం గడుఁ, బెదరొదవిన దదియుఁగాక ప్రియ కుడిదెస నా
కదరుచున్నది పోఁగూడ దనుడుఁ దద్వచనములు పెడచెవులఁ బెట్టెన్. 123

వ. ఇట్లనాదరించి హితోపదేశిని యగునమ్మత్తకాశినిం గనుంగొని. 124

క. తరుణి నను జయింపఁగ న, త్తరణిసుతుఁడ వాఁడు నిశ్చితంబుగ విను మి
ద్ధరణిఁ బ్రయత్నంబున నవ,శరణము నొందఁగ వలదె వైనం బైనన్. 125

క. బోటీ నీమాటలు నా,బోఁటిమహావీరు నెడలఁ బొసఁగ వనుచుఁ గో
పాటోపమానసుండు న,నాటవిభుం డరుగుదెంచె నగ్రజుఁ డాఁకన్. 126

వ. ఇట్లు వచ్చి. 127

క. కోపరసం బొడ లూనెకొ,కో పరికింపంగ ననఁగఁ గురువరిభుజుతో
నోపంద మద్భుజాహతి, నోపం దర వానె తలఁగు మోటమి వచ్చెన్. 128

చ. అని వెస వాడి సౌరి నొకహస్తమునం గుదియించి యొంటికే
ల నతనిమస్తకంబునఁ బలం బెసలారఁగ గ్రుద్దినం గడుం
దనరెను బా పెటిలిగి తనతమ్ముని గాఁగిటఁ జేర్చి స్వాధికా
రనిఖిలభార మాతనిశిరంబునఁ బెట్టె నొకో యనం బరుల్. 129

వ. ఇవ్విధంబున. 130

క. గ్రుద్దిన నీడంబోవక, ప్రొద్దునిసువు వాలియురముఁ బొడుచు నిరువురుం
దద్దయు నద్దపిడిం జెన్నొద్దు లగుచు బ్రేటు లాడుచున్నట్టితఱిన్. 131

క. సుగ్రీవుఁడు మాలాసక్తగ్రీవుఁ డగుట వాలి నపుడు దెలిసి భూ
పాగ్రణి సమగ్రదోఃప్రబలోగ్రుఁ డగుచు వాలిఁ దునుమ నూహించె మదిన్. 132

ఉ. రాముఁడు ధార్మికుం డురుశరంబు గుణంబునఁ గూర్చి భానుజుం
డీమొనరించి యాతని వడిం గొనివచ్చినయట్టివాలి శా
ఖామృగశాలి పేరురముఁ గాఁడఁగ నేసెఁ గలంబముం దరు
స్తోమముచాటున న్నిలిచి నూట్రిదలిర్పఁగఁ గాలవేదితన్. 133

వ. ఇట్లు దృష్టిముష్టిసౌష్ఠవంబు వెలయుం దెగవాపుటయు. 134

ఉ. తాళము లేడుఁ గూల్చి వసుధాధరముం బెకలించి మించి పా
తాళముఁ జొచ్చి వచ్చినకదంబకు వాలి యురంబు దూసిపోఁ
జాలక నిల్చెనంత యును జానెసఁగ న్వెస వానిప్రాణవా
తూలము బీల్చుచున్న దనఁ దోయజమిత్రతనూజుఁ డార్వఁగన్. 135

వ అంత. 136

చ. సరభసవృత్తి రామునిపృషత్క మురంబున గాఁడినం దివీ
శ్వరతనయుండు హా యని దివాకరనందను వీడి ధాయణీ
ధర మురుభీకరస్వనపాతం బయి కూలినభంగి వాలి గం
హారిదిగఁ గ్రుంగ వ్రాలి తదనంతర మాన్పుఁ గాంచి దీనుఁడై. 137

ఉ. తార హితంబుఁ దెల్ప నతిధార్మికుఁ డౌరఘురామమూర్తి ని
ష్కారణ మేల నాపయిఁ బృషత్కము నేయు నటంచుఁ దద్వచ
స్సారము నీస చేసి పరుపక్రియ వచ్చి త్వదీయకైతవ
స్ఫారత నిట్లు పాలయితిఁ జావఁగ నీ కిది పౌరుషం బొకో. 138

క. మించినధార్మికుఁడవు కడుఁ,వంచన గావించి వృక్షవారమునడుమం
బొంచి నను గూలిచితి వెఱించి ననుం గెల్వ నవ్వీరించికి వశమే. 139

వ. అది యట్లుండనిమ్ము. 140

సీ. నసుఁ జేరఁబిల్చి తమ్ముని రాజ్యమునకేల, పాపి వాఁడ వటంచుఁ బల్కవైతి
వతనికి నీకుఁ బోరిత మెట్టు లయ్యె ము, న్నని తెలియంగ నన్నడుగవైతి
వతని కీహరిరాజ్య మంత యు నొసఁగిపొ, మ్మవలి కీ వనుచు న న్నాడవైతి
వినజునితో వైర మేల నీ కని సన్నుతింప సఖ్యము సంఘటింపవైతి

గీ వింతయేటికి న న్నెదిరించి పోరఁ, గ్రూరనారాచమునఁ బడఁగూల్పవైతి
వకటు రామ సమగ్గాఢధర్మ్యుఁ బొంచి, ప్రమందఁజేసితి విష్ణు దేవుండు నిన్ను. 141

క. అంధునకుఁ జాత్యంధుఁడు, పంథానము సూపలేనిపగిది ప్రాఁతసతీ
బంధుఁడగు నట్టి వారిజబంధుసుతుం డెట్లు నీకు భార్యం గూర్చున్. 142

క. పరుల కహితం బొనర్పక, తరుల గిరులఁ దిరుగుకపి వృథాహాలియింప
న్నరవర నీ కర్హమె న, న్నవలీలఁ గాఁ జేసినాఁడ వన్యాయముగన్. 143

క. విను సత్త్వహీనుచంద్రుఁ, బుధుఁ దరునికరంబునడుమఁ బొంచి మదమున
న్నను కపటంబునఁ బరిమార్చినవాఁడవు నీవు మానిసివె కలపోయన్. 144

వ. అని యిట్లు. 145

చ. అలసత వాలి రోషపరుషాక్షరగుంభితవాక్యసంతతు
ల్పలుక రఘూత్తముం డవనిపాలశిఖామణి రామభద్రుఁ డ
బ్బలిముఖుతోడ నీ కిటులఁ బ్రాణము వీడఁగ ధాత్రి వ్రాఁతమున్
గలుగఁగఁ దప్పునెట్టు లెఱుఁగన్వశమా నె పురాకృతంబులన్. 146

వ. అదియునుంగాక. 147

క. నిను నెవ్విధమునఁ బరిమార్చిన నాకుం బాతకంబు సిద్ధింపగు త
మ్ముని భార్య రుమం జెఱపిన పెరదోషివి సిగ్గు లేక ప్రేలెద వనుచున్. 148

క. వాలి దనుదూఱునుడువుల, కోలి సదుత్తరము లిచ్చు మన్నయెడలఁ దా
నాలించి కపికులాధిపు, నాలించుక తాల్మి లేక యవశతఁ గొంచున్. 149

మ. గళదశ్రూదకధార లై వికచముక్తాహారవిస్తార లై
చలదత్యల్పవినాలగ్న యయి విస్రస్తాసితాభుగ్నరుం
తల లై హస్తతలప్రతాడనవిధూతప్రోల్లసత్ఫాలభా
గలసత్కుంకుమచిత్రకప్రరుచు లై యత్యంతదీనాక్షు లై 150

క. చనుదెంచి జీవితేశుం, గనఁబోయి గుజీవితేశుఁ గని తార మహా
ధ్వని రామచంద్రునకు న, య్యినజునకుం గరుణ మానహింపఁగ నేడ్చెన్. 151

వ. ఏడ్చి రామరాజన్యకంఠీరవశిలీముఖముఖవిభిన్నుం డగు నాథుఁ బ్రకటబాహుం గనుం
గొని 152

క. వానరనాయక యిపుడీ, వానరనాయకునిబాణహతి నీగతి నె
మ్మేనయఁ బొరల నగును, మ్మేనవలోకింపవలసె నే మన్నెనరున్. 153

క. శైలశరాసునివాసము, కైలాసముఁ దొల్లి బంతిగా నెత్తియ
ప్పౌలస్త్యుని వాలమ్మునఁ, గీలించినదిట్ట వట్టి కిట్టితె కట్టా. 154

క. దారం దారను విభవో, దారదుదారగుని హరిపదంబు విడిచి బ్రం
దారకలోకమునకు బృం, దారకరాజసుత పోవఁ దలఁచితివె మదిన్. 155

వ. అని మఱియును సతీసాహసాదిగుణంబు లగ్గించి విలపించుచు. 156

క. ధరణిం బడి పొరలెడు తరు,చరవరు శిర మంకపీఠి సంధించి తదీ
యరమణి నిజాశ్రుకణసం,భరితానను జేసి మిగులఁ బరితాపమునన్. 157

చ. నను గనువిచ్చి యొప్పరగ వాథ కనుంగొను మేను దార బా
రను ననుఁ జూడ నీకు మదిరాదు విశిష్టసుభాగ్య నాటనీ
తనయు నంగదప్రవిజితస్ఫురదంగవిలాసు శత్రుసై
న్యనికరభంగదు న్మణిమయాంగదు నంగదుఁ జూడు మర్మిలిన్ 158

క. కను విచ్చి ననుఁ గనుంగొను, మని యఱచుచు నంగదుఁడు పదాంతికభూమి
న్నిను పొరలుట యువరాజ్యం,బున కిది నను బూన్పు మనుచు మ్రొక్కుటయొప్పతీ.

క. ఇనజుఁడు సుగ్రీవుఁడు నా, యనుజుఁ డనక యతని వైభవాహృతి సేయ
న్మనుజునిచేఁ జావలసెఁ, జను నే యెవ్వరికి సహజశత్రుత్వంబుల్. 160

వ. అని ధర్మంబుఁదోఁప నాడి. 161

గీ. మఱియు శోకాంబురాసినిర్మగ్న యగుచు, హస్తయుగ్మకమున నిజమస్తకంబు
మోఁదికొనుచును దనతొడమీఁద నున్న, ధవునితల డించి తార రాఘవునిఁ గాంచి.

క. ఒకతోఁ బోరెడు నావరు, నురుతరుషండంబులోన నొదిఁగి యొదిఁగి సం
గరధర్మకోవిదుండవు, ధరణింబడఁ గూల్చితివి విధాత్మనిచేయుదిన్. 163

ఉ. నీసతి సీత నెత్తికొని నింగిఁ జెలంగుచు నేగ రావణుం
డామరవృత్తి నాసురగణారి వధింపక నీవు నావిభుం
జేసితి కాలగోచరుఁగఁ జెప్పెడి దేమి యొకండు నేరమిం
జేసిన కతన వేఱొకనిఁ జేసితి సామ్యము చెప్పినట్లుగన్. 164

క. మిత్రతనూజన్ ఘనుఁ డగు, మిత్రునిఁ గా నెంచికొని యమిత్రత్వంబుం
గోత్రరిపుసుతునిపై నో,ధాత్రీశ్వర చూపు టధిక ధర్మము గాదే. 165

వ. అని పలికి యంత నిలువక. 166

క. పాలను నిరీతి నో భూ,పాలక భార్యాసుతులకుఁ బాపితి విపుడీ
వాలినిఁ జెప్పెడి దేమీ, వాలిని బిడ్డలను గూడి యలయుదె కుఖివై. 167

వ. అని పలికి పెండియు ననేకవిధంబులం బలవించుచుండె నయ్యవసరంబున. 168

చ. అదరుచు వాలి యాలిఁ బ్లరగాళలి మేదినిఁ వ్రాలి యున్నయం
గదుని మనోహరాంగదుని గన్గొని వేదన పెక్కి గాఢగ
ద్గదిక నెలుంగు రాలుపడఁగా ననియె న్నినుఁ డేల చాలనం
గదమురపిల్ల నెల్లరకుఁ గాలమునూఁడినఁ జేటు తప్పునే. 169

క. ఇట్టి పుత్త్రసత్కళత్రా,దికబంధుసహోదరప్రవృద్ధతర మగుప్రేం
దిక వారిం గడచనియెం గుం,దక ధైర్యము నూఁదుఁడీ మనమ్ముల మీరల్. 170

వ. అని పలికి తనవారి నెల్లం గలయం గనుంగొని. 171

ఆ. మున్ను నన్నుఁ గొల్చి యున్న చందంబునఁ, దపనపుత్త్రుఁ గొల్చి తదనువర్తు
లగుచు మెలఁగుఁ డతఁడు దగ వర యతనిని,దించి కాదె చావుఁ దెచ్చికొంటి 172

వ. అని పశ్చాత్తాపపరవశుండై. 173

క. దారం దారను నఖజిత,తార స్మితకాంతిదంతతార స్మణిమం
జీరం జేరంజీరిగ,ఖిరోక్తుల వగపు మాన్చి ప్రియ మిగురొత్తన్. 174

మ. కొడుకుం గౌఁగిట జేర్చి మోహమునఁ జెక్కుల్ నొక్కి ముద్దాడి యో
ర్కుఁడు మోహంబున వాలి యిట్లనియె నీకు న్వేడుకం దండ్రి పెం
దొడపై నాడుట తీఱె నిన్నుఁ గనుసంతోషంబు నా కింతటం
గడతేఱెం గలకాల మెవ్వరికి నేకాకారతం జెల్లునే. 175

క. అని మఱియుఁ దనయు నుచితవ,చనముల నూరార్చి బాష్పసలిలోద్గముఁడై
తనయుదుర మిగుల వగ నొం,దునలి హితసుతున కంగదుం జూపి దయన్. 176

చ. అనుజుఁడ చింతఁదక్కి పరమాదరణంబున నాదు వాక్యము
ల్వినుము మును దుర్వివేకి నయి వేయువిధంబుల నిన్ను బాధప
ట్టినఫల మీవిధంబున ఘటించె నటుంచుము దాని నీవి నా
తనయునిఁ బూర్వమత్కృతనిధంబుఁ దలంపక ప్రోవుమీ దయన్. 177

వ. అని తనయునకుం దగినవచనంబులు వెండియు నుపన్యసించి యొప్పగించి తమ్ముఁ
డా నీకు సర్వంబునకు రాముండ కలం డని నిశ్చలాంతఃకరణంబున రామచంద్రున
కభిముఖుం డై. 178

క. కలలో నెవ్వనిపదములు, దలఁచిన నఱచేతి వగుచుఁ దనరుచు నుండుం
గలలోకము లప్పదములు, గలలోనైననుతు నిన్నుఁ గంటి న్కంటిన్. 179

మ. అని తద్దివ్యపదాంబుజద్వయమరందాసక్తహృత్షట్పదాంగవ
రన్నఁడై తృష్ణ నిరాకరించి భవహర్తా రామ శ్రీరామ రా
మ నను న్సత్కరుణాకటాక్షమున సన్మానింపు మంచుం దొరం
గ నొగిం బ్రాణములేనఁ బొర్లుచును సుగ్రీవాగ్రజుం డొక్కటన్. 180

వ. ఇవ్విధంబున సకలసద్గుణశరధి యగు దాశరథిశరపాతపాతితపాతకుం డగుచుండు.

గీ. ఫలము లాకులు దిని దిగంబరతఁ దిరుగు, నట్టివనచారు లేగడున్నట్టిగతికి
ఫలము లాకులు దిని దిగంబరతఁ దిరుగు, వట్టివనచారి యయ్యెఁ దా నపుడు చనియె.

వ ఇట్లు దివిజరాజనందనుండు దివిజరాజరాజధానిం బ్రవేశించుటయుం బ్లవంగాంగనలు నింగి వగుల వగలం బొగిలి రందుఁ దార శతారాయుధనందనుం దలఁచి. 183

క. భిదురనిభం బగురామ,ప్రదరం బుదరంబుఁ గాడి పడిపోయితివా
పద రవిసుతుఁ డార్వఁగ న్యాయది నపగతశూర భూరమణి యని తలఁతుక్. 184

క. ఆహార మెడలి కడు మ,క్తాహారత నివ్విధమున నలఁగితె యిచ్చో
నాహా నాబాహాబల, మాహవమున నగటుఁజెత మయ్యె నని కటా. 185

వ. అని మఱియు నతని గుణ బు ల్గగ్గించి పొవయుచున్న సమయంబున. 186

ఉ. రాముని యాజ్ఞ లక్ష్మణుఁ డరాతిభయంకరు నాంజనేయు ను
ద్దాముఁ బురస్కరించుకొని తారను దారకుమారకుం గపి
స్తోమము నర్కనందనుని సొం పగుమాటల నూఱడింప సు
త్రామజనూభవుక్ హితవిధానము నం దహియించుపూనికక్. 187

వ సుగ్రీవుం డంగదుం బురస్కరించికొని సమస్తవానరచమూసమేతుం డై సనుత్పాటితరామసాయకుం డగు వానరనాయకుం డగ్గఱి డగ్గుత్తిక వెట్టి యేడ్చుచు నొకింత సేపునకు ధైర్యంబు జిక్కంబట్టి యక్కుణపంబుఁ బవిత్రజలపరిప్లుతంబుఁ గావించి గంధమాల్యాద్యలంకరణశోభితంబుఁగా నుచితవాహనంబున నిడి బలవంతు లగు బలీముఖప్రకరంబు మోచికొనిరాఁ బ్రేతభూపరిసరకాననంబునకుం జని యుక్తక్రమంబున శిబిక డించి చందనాదికసౌరభపదార్థసంచయంబుఁ గూర్చి పేర్చి నకోకంబునం జితి పేర్చి యప్పాడమై వాలికళేబరంబుఁ జేర్చి యప్రదక్షిణంబుఁగాఁ దిరిగివచ్చి శిరఃప్రదేశంబున నంగదప్రయుక్తయుక్త బగు నప్పార్చిఁ బ్రవృద్ధార్చిఁ గావించి విరక్తియుక్తు లాడుచు నుచితక్రమంబున నగ్నికార్యబుద్ధ పెనంత వానరవధూవిలాపంబు లాకర్ణించి దిక్కులఁ బ్రువం బిక్కటిల్లె నందుఁ దార వనోవల్లభు నుద్దేశించి. 188

ఆ అతులసుందరాంగ యుతుండ వగుచుఁ దార, రతిఁ గరంచి సంగరంబునందు
హరికుమార భస్మ మయిపోయితివె యక్క, టకట రాజమాళియంబకాగ్ని. 189

క. అని మఱియుఁ బెక్కుదెఱఁగుల, వనిమిషపతి సుతునిఁగూర్చి యార్చెడు తారం
గొని పంపాతీరమునకుఁ, జని సుస్నాతు లయి గిరిచరవరులెల్లక్. 190

వ. ఇట్లు పవిత్రస్నానంబులు గావించి. 191

క. వలయుఁదిలోదకములు ని,శ్చలభక్తి నొసంగి షోడశమహాదానం
బుల నన్నదానములఁ దృప్తులఁ జేసిరి బ్రాహ్మణులఁ గవులఁ దగురీతిక్. 192

వ. మఱియు నవ్వానరేంద్రుఁడు కపురేంద్రలోక స్థితినివాసకరంబు లగు కరణీయంబు లెన్నియేని నడిపి యశుచిత్వాపనోదార్థం బప్పుణ్యనదీతీరంబునఁ గొన్ని దినంబు లున్న యనంతరంబున రవినందనుండు రఘునందన చరణారవింద సందర్శన కందళిత హృదయానందుండై చని. 193

క. అంగదునింగూర్చి ప్లవంగాంగనలం బురికి ననిపి యంగము పొంగా
రం గుముదరిపుసుతుఁడు సర్వాంగాలింగితవసుంధరావలయుం డై. 194

భుజంగప్రయాతము. ప్రణామంబుఁ గావింప రాముండు జూచ
ద్ఘృణామందహాసప్రకీర్ణాననుండై
గుణాఢ్యుం బవిత్రాత్ముఁ డాభానుసూనున్
మృణాళోరుబాహుద్వయిం గ్రుచ్చియెత్తెన్. 195

వ. ఇట్లు గాఢాదరపూర్వకంబుగా గారవించి కరుణారససముద్రుం డగు రామభద్రుండు పవనతనయానుజాలం గనుంగొని. 196

ఆ. వాలిచేతమున్ను పాలితంబగు కపి, రాజ్యమునకు నినజుఁ బూజ్యలీల
నాచరింపుఁ డాభిషేచనశోభనం, బింకఁ దడవు సేయ నేల మనకు. 197

క. అనవిని సౌమిత్రిపవనతనయు లలఘుతరము లజానితనయుండును ద
క్షిణకపియూథపులుం జయ్యన నాతనిఁ జుట్టుముట్టి యతులితలీలన్. 198

ఉ. బాంధవ మొప్పఁగూడికొని బంధురతూర్యరవంబు లష్టది
క్సింధురకర్ణగోళయుగళంబులఁ జిందఱవందఱ సేయ నిద్ధగ
ర్వాంధత వానరుల్ నడవ నల్లనఁ దోడ్కొనివచ్చి రప్పు గి
ష్కింధకు దేవకోమలరుచిప్రతిభానుని భానుసూనునిన్. 199

వ. ఇట్లు దోడ్కొనివచ్చి.

క. శ్రద్ధఁ బ్లవంగాంగనలు సమిద్ధగతి నివాళులీయ నినజుఁడు సొచ్చెన్
స్నిగ్ధాంతఃకరణుం డగుచు, శుద్ధాంతారూఢసిద్ధశుద్ధాంతంబున్. 200

వ. ఇట్లంతఃపురప్రవేశంబుఁ గావించె నంతకమున్న పౌరులు. 201

ఉ. కట్టిరి తోరణంబు లెసఁగన్మణిమట్టినతోరణంబులం
బెట్టిరి పూర్ణకుంభములు మేదురలీల మృదంగకాహళ
ల్గొట్టిరి పుష్పమాలికలు గుమ్మనఁ దావులు గ్రుమ్మరింపఁగాఁ
జుట్టిరి ద్వారదేశముల సూర్యతనూభవుఁ డుల్లసిల్లఁగన్. 202

క. ఫలయుతరంభాక్రముకంబుల సొల్లెడఁ బొందుపఱిచి పునుఁగుజవాదిం
గలయంపిఁ జిలికి కస్తురి, నలికి యిడిరి యాణిముత్తియపునుఁ బ్రముగ్గుల్. 203

వ. వేదియుం బరమశోభనంబుఁ గావించి రప్పురవరంబు సమస్త సంభార సంభరితంబును వారాంగనా నృత్తగీత విచిత్రంబును మంగళ తూర్యరవ సంగతంబును సకల జననయనానంద కరంబునై కరంబు విలసిల్లుటయు. 204

ఉ. అంతననంతసమ్మదంబుజు నంబుజమిత్రపుత్త్రు న
త్యంతమనోహరాంబరనవాభరణాన్వితుఁ బుష్పమాలికా
క్రాంతగళప్రదేశు నొడికంబుగఁ దోడ్కొనివచ్చి తత్సభా
భ్యంతరసింహపీఠమున నాతనిఁ గూర్చి రమాత్యులొప్పుగన్. 205

క. చామరము లిడిరి వేల్పుఁ, జామల కెనవచ్చు ప్లవగచంద్రముఖులు ని
స్సీమాభిరామభూషా, స్తోమ ఝుళఝుళలు సన్నుతులు సేయంగన్. 206

గీ. తిరరాఘవుఁడు కృతప్రతిజ్ఞుఁడయ్యెఁ, గాన నీవును బ్రత్యుపకారపరుఁడ
వగుమనుచుఁ బుత్త్రునకుఁ దెల్పనరుగుదెంచె, మిత్రుఁడననొప్పెసఁగసితచ్ఛత్రమంత.

వ. పట్టాభిషేకసమయం బాసన్నం బగుడు హనుమజ్జాంబవదాదు లవనీసురసహాయు
లై పుణ్యాహవాచనపూర్వకంబుగా హోమవిధి యథావిధి నిర్వర్తితంబు గావించి.

చ. కలుషహరంబు లంబువులు గల్గినభూరిసువర్ణకాంచనో
జ్జ్వలకలశంబు లందికొని వానరరాజ్యవరాభిషేచనం
బలకడ నాచరించిరి మహాగుణశాలికిఁ బ్రొద్దుమాలిక
యనఘులు రామచంద్రుని దయామృతముం జిలికించునట్లుగన్. 209

క. అమరి నమరావతికి నయ్యమరు లమరనాథునిం గ్రహాధికృతికి న
ర్యము మున్నభిషేకించిన, క్రమమున సుగ్రీవు నఖిలకపిపదమునకున్. 210

క. అభిషేకం బొనరింపఁగ, నభిషిక్తుఁడయ్యె భాస్కరాత్మజుఁడు కపి
ప్రభుఁడగుచుఁ దారకామధ్యభాగభాగమృతకిరణు నాకృతి నంతన్. 211

గీ. సకలవానరులకు రామచంద్రునకు మహాముదముగాఁగ నప్పుడ యంగదునకు
విదితమగు యౌవరాజ్యసంపదకు నర్హుఁ, జేసి పట్టాభిషేకంబు సేసెఁ గరుణ. 212

వ. ఇవ్విధంబునం గోత్రక్షిత్పుత్రునకుం బూజ్యయౌవరాజ్యపట్టాభిషేచనం బాచరించి ప్రాజ్యసామ్రాజ్యంబు వడసి మార్తాండనందనుండు రెండవ చండకిరణుం డనం బ్రజ్వరిల్లె. 213

ఉ. అత్తటి వానరాంగనలు హారతులీ సచివప్రయుక్తుఁడై
పత్తనమెల్ల నెల్లన సభార్యకుఁడై ప్రచరించి రాజ్యసం
పత్తిఁ గరంబు రాగిలి కృపాలతనూభవదివ్యదర్శనా
యత్తమహత్పదబ్జుఁ డబ్జహితాత్మతనూభవుఁ డుల్లసంబునన్. 214

క. చనిబద్ధాంజలిపుటితాననుఁ డున్నయవినయభయవినమితశిరస్కుం
డును నగుచు రామచంద్రుం గని మ్రొక్కె నతండు ప్రీతిఁ గౌఁగిటఁ జేర్చెన్.

వ. అపరిమితానందభరితాంతఃకరణుం డగుచు నతని కిట్లనియె. 216

క. ప్రతిన నెఱపితివి నీవు, ప్రతిహతబలశాలివగుట బ్రతికితిఁ గృపనన్
బ్రతివీక్షింపుము ప్లవగ, ప్రతతిం బంపింతు నీవు ప్రమదాన్వేషకన్. 21.

చ. అనవిని సంతసించి నలినాప్తతనూభవుఁ గాంచి రాముఁ డి
ట్లను బురికిప్డు పొమ్ము శరదాగమనమ్మున నమ్ము ధారుణీ
తనయను వార్తఁ దెమ్ము విదితమ్ముగ నిప్పుడు వానకాలమం
దనఘ వసింతు సోదరసహాయత నిగ్గిరిగహ్వరంబులన్. 218

క. కర్షకజనదయనయనోత్కర్షము వర్షబు వరుసఁ గాఁ గపిసేనా
ఘర్షితభూభాగుఁడవై, హర్షమ్మున రమ్ము కార్తికాగమనమునన్. 219

చ. అనుడుఁ దదాజ్ఞ వానరసహస్రసమేతముగా మహోద్యమం
బునఁ బురికేగుదెంచి కపిముఖ్యుఁడు భాస్కరనందనుండు త
జ్జనకసుతాగవేషణకుఁ జాలినమర్కటకోటిఁ బిల్వఁ బం
చి నిఖిలమంత్రిపుంగవవిశిష్టసహాయుఁడు పేర్మి నెంతయున్. 220

క. రమణీమణియగు తారా, రమణిప్రియుఁడగుచు భాస్కరసుతుఁడు మెఱసె
న్నును నధికభూషణ మనోరమఁ గూడి ప్లవంగరాజ్యమున కధికృతుఁడై. 221

వ. ఇట్లు సంప్రాప్తమనోరథుండై మహాసుఖంబు లనుభవించుచుండె నంత నక్కడ
రాముండు సౌమిత్రిద్వితీయుండై ప్రవర్షణగిరిబిలంబుల సీతావియోగసాగరం
బు నిస్తరింప నుపాయంబు గానక సంతప్తచిత్తుండై యుండునంత. 222

క. కాలమునం దోఁచెఁ దొలకరి, కాలము నిబిడీసకాళికాకాలము భే
కాల మతిరిక్తశైత్యము, నాలము పాంథజనములకు శూలంబగుచున్. 223

క. ప్రాఙ్ముఖగతబహుళశుభ జలముఙ్మాలాపిహిత ముగతమోమయము చతు
ర్దిఙ్మాలిన్యము దరదహి, భుఙ్మ్యము వర్షబుకువు పొలుపు వహించెన్. 224

చ. ప్రబలితవలాహకంబులు నభంబుఁ ఘూర్ణిలుచుం దటిల్లతా
ప్రబలత లోకమెల్లఁ దిమిరస్థగితంబుగఁ బర్చి చప్రదే
శబలభిదుగ్రచాపవిలసత్స్థితి యొప్పఁగ వృష్టిఁ గల్గఁ జే
సె బహుళభూతకోటులఁ గృశింపఁగఁ జేసినతాప మాఱఁగన్. 225

క. వెనుమిత్తిది పల్లంబిసె, యనిజనముల కేర్పరిప నవళంబుగ వృ
ష్టి నిరంతరధారాపాతనమున భువనంబు భూమ్యేకమయము న్యెన్. 226

గీ. పాంథకలహంసహృదయనిర్బంధకంబు, నమితనాగకుమారభయప్రదంబుఁ
గాఁగ నెంతయుఁ గేకికేకారవంబు, గ్రాలె నెల్లెడఁ బర్వతాగ్రంబులందు. 227

వ. అత్యవసరంబున.

చ. అతులితరీతి గోతతికి హర్షము వృద్ధి నొసంగుచుండఁగా
నతి రమణీయబాలతృణ మంతట నెంతయు నొప్పుమీఱె సం
తతకనకాభ్రవర్ష వితతస్ఫురదంబులసత్ప్రవాహసం
గతమున భూతధాత్రి సురగాత్రికిఁ బ్రాఁకుడు వట్టెనో యనన్. 228

క. కమలాకరములు నిండియుఁ, గమలంబులు దెలివిఁ దూలి కమరెఁ గమలినీ
రమణుండు ఘనపిహితుండై, సముదం బెడలి వోకోకోయునం దద్వేళన్. 229

గీ. వనములెల్లను ఝిల్లికావనములయ్యె, భువనమెల్లను సంపూర్ణభువనమయ్యె
నభ్ర మభ్రమయంబయ్యె బ్రమముగను, నవినవారిదప్రావృడ నేహమునను. 230

శా. ప్రోదిన్ త్ర్యంబకదీప్తి గర్జితరథాంగారావముం బ్రస్ఫుర
ద్వ్యాదశ్చోణిత మింద్రగోపభయదోద్యన్మాసఖుండై పస
చ్చాదోమేదము వర్షబిందు లసదస్త్రం బభ్రమాతంగము
న్మోక్షీభూత సమస్తభూతముఁ బతన్మక్తాసిలేశంబునై
శోధింపంబడె వానకాలము రణక్షోణీశక్రక్రియన్. 231

ఆ. అఖిలభూతకోటి కాప్యాయనంబగు, నట్టివానకాల మగుడఁ బుడమి
పట్టియగుడు రామభద్రుండు జలరాశి, దగుపిరాశిఁ దూలి తాల్మి మాలి. 232

వ. తమ్మునిఁ గనుఁగొని.

గీ. లక్ష్మణ క్షణప్రభాప్రభాలక్షితంబు, మేఘనిర్ఘోషఘోషసమ్మిశ్రితంబు
నతుల ఝంఝూసమీర సమావృతంబు, నైన యికాలల మధికభయంబు గాదె. 233

క. పస పిడుగులజడికంటెను, గడు బెడిదము లిమ్మయూర కంఠధ్వను లె
క్కుడు విసదారుల మెసపిన, వడిశిసమదిసెకునె యొట్టి రంతలఁ బడినన్. 234

క. అని మఱియు స్వీను మనుజుండ, పెనుగతిఁ బ్రావృట్ప్రయోదపిహితములగుని
ద్దినములు దుర్దినములుగా, కనఘా సుదినంబులెట్టులగుఁ బాంథులకున్. 235

క. అశుగము నాకుస్మరపుఁ, జాశుగనిహతిఁ దలెఁ దాపమధికముఁ జేసెం
గ్లేశవినాశని జనక, క్ష్మేశసుతం బాసియున్న కృపణుండ నగుటన్. 236

వ. అని మఱియుం దద్వియోగకృశానుయోగ సంతప్తమానంబగు మానసంబున సౌమి
త్రి ప్రీతివచనరచనామృతంబునం దనుపు చుండునంతం గతిపయదినంబులకు. 237

సీ. ద్యోధునీనిర్మల పాథోంతరపరిస్ఫుటత్పుండరీకషండంబులనఁగ
వ్యోమకేశునిజటాపూర్వభాగంబునఁ బూసిన వెలిబూది పూఁతలనఁగ
ఖచరులు దడివోవఁగా నాకసంబున నాటఁగట్టిన తెలిచీరలనఁగ
దొలుకరిఁ జిటిన నలమానసముఁ బాసి పఱతెంచు రాయంచ బారులనఁగ
గీ. మంచుపగవాని గర్భీకరించినట్టి, నింగిజవరాలిగండపాండిమములనఁగ
జకితచాతకజాతసంజాతపాండు, రాభ్రములు మించెఁ దచ్ఛరదాగమమున. 238
గీ. భూసతీస్తనగిరుల మున్నూసికొన్న, లలితకస్తూరికాదంబు దొలఁచిఘనసి
తాభ్రయోజితచంద్రకం బలఁదేనఁగ, నలరెను సితాభ్రము లభ్రతామ్రములను. 239
క. అడఁగె న్భేకంబుల రొద, లడిగె న్సేచంబు లంచ లబ్జవనములం
గడఁగె న్విధుండు శరములు, గడిగె స్మరుఁడేచి విరహిగణముల నొకఁగన్. 240
చ. కలువలఁ దొల్లితీరములఁ గాచి కభూరుహకోటిఁ గూల్చి త
త్కలుషతనిట్టులయ్యె సనఁగా నదు లెంతయు నిర్జవంబులై
వెలవెలఁబాఱి జొచ్చె నది వింతయు నంజన దెట్లుఁ గాంచనో
ర్మ్యులుగలవారికిన్ ఘనతయిచ్చునట్టు లొకర్వుఁ బాడియే. 241
వ. అంత. 242
ఉ. దక్షిణగాములైన జలదంబుల కొక్కధరాధరుండు ప్ర
త్యక్షముగాఁగ ద్రుక్కుచుఁ బ్రమాణము మానినవో యనంగఁ బ్రా
గ్దక్షిణభాగమందున నగస్త్యమహోదయమైన మేఘమా
లాక్షయమయ్యె నంబరమహార్ణిశమొప్పె శరత్సమాద్యుతిన్. 243
సీ. మఱియుఁ దచ్ఛరదాగమంబునఁ దనరి నంతరిక్షమువోలె రాజహంసలఁ బెనంగి
పక్షిరాడ్ధ్వజభూరివక్షస్స్థలమువోలె లాలితకమలాలవాలనగుచు
ధర్మాభిరతసభాస్థానంబువోలె నలక్షితపంకకలంకమగుచుఁ
బ్రమథనాయకునిశిరఃప్రదేశమువోలె విమలభాసురనదీవిహితమగుచు
గీ. దంబుమీఱెను చంద్రమండలమువోలె, నధికతరచారుకువలయహర్షమగుచు
నట్టిజలదాంతసమయసమాగతప్ర, చిత్రతరపాత్రశారదరాత్రులందు 244
క. వెగవరి లోకేశుఁడు త, స్కరజారవ్రజముల నెఱిఁ జలిచీఁకులవై
మురుగతిఁ జల్లినమ్రుగ్గను, కరణిఁ గువలయాను మోది కౌముది ప్రబలెన్. 245
ఉ. అట్టిశరన్నిశన్ హిమకరాతప మాత్మకు నాత్రిగూర్పఁ దోఁ
బుట్టువు కేలువట్టి రఘుపుంగవుఁ డాలి విరాళిఁ దూలి వ

స్పొట్టులికింపఁ జొచ్చిరతిభీకరు లీస్మరవారిజారులీ
పట్టునఁ బ్రాణముల్విడుతుఁ బ్రాణములేటికి సీతఁబాసితిన్. 246

వ. అనిపలికి చంద్రోపాలంభనపరుఁడయి లక్ష్మణుం గనుంగొని. 247

క. ఇతఁ డమృతకిరణుఁడే కాఁ, డతివిషముఁడు గాకయున్న ననుజూఁడ దారా
యుతుఁ గానినన్నుఁ దారా, న్వితుఁ డేఁచం దగునె యామినీచరవృత్తిన్. 248

క. తగనెందుం గువలయహితుఁ,డగు రాజుక ళాప్రపూర్ణుఁ డగుఁగాక కడుం
దెగనిక్కృతఘ్న మిమ్మల విబుధగురుద్వేషి కఁగని తక్కునె చెపుమా. 249

క. అకలంకుఁడ సన్మార్గుఁడ నకుటిలుఁడనటంచుఁ బొంగు నమవసఁ గ్రుంగు
న్సకలంకుఁ డసన్మార్గుఁడు, సకుటిలుఁడుం గాన్యుఁ డితనిచంద మెఱుఁగమే. 250

వ. వీనిరాకపోకలు జనంబులెఱుఁగరే యని వెండియు. 251

ఉ. ఈతఁడు చోరకోటికి ననిష్టుఁడటందురు కొంద ఱీతఁడే
ఘాతయొనర్పఁ బాంథుల నకారణ మిమ్మిహిరాంశుఁ డెంతయు
ద్యోతకుఁడంచు లోకములు దూఱఁగ నించుక సిగ్గునొందఁడా
పాతలపోయఁ గార్యుఁడగు నాతఁడు లజ్జ నెఱుంగఁడేకదా. 252

వ అని యివ్విధంబున. 253

క. వనజారిదూఱి మిఱిన, జనకసుతావిరహవహ్ని సమసిన ధృతి న
మ్మనుజేంద్రుఁ డంతఁ గఁద,న్ననుఁగూర్చి విశేషరోషపూరితముఖుఁడై. 254

క తుఱటుకలుఁ జిలుక తేజియు, నంటినఁగసుగందుపూవుటమ్ము లెవరికిం
గంటఁబడని సచివుఁడు మ,క్కంటి నుదుటికంటిమంటఁ గాఁగిననీకున్. 255

క. అట్టివిలుకాఁడ వీవే, యట్టున విరహిజనహృదయపాటనమునకుం
దిట్టవయితి వూహింపఁగ, నిట్టివిగావే విధాతృకృతచిత్రంబుల్. 256

చ. కటకటపూవుబాణములఁ గమ్మనివిల్లునఁదాల్చి చెక్కుతే
రటునిటుఁ ద్రిప్పుచు న్హరిసహాయత నెంతయు దర్పకుండవై
యిటుఁ దపం బొనర్చుచు ఘరత్మజఁ బాసిన రాజమౌళిపైఁ
బటుగతి నేలపోయెదవు భస్మముగాఁగల కంబకాగ్నిచేన్. 257

వ. అని పలికి నిట్టూర్పునిగుడించి. 258

క. తమ్ముల శోకమ్ములఁ గుఁ, దమ్ములు నందమ్ములగుచుఁ దనరారెడుచూ
తమ్ముల నేయకు ననుఁ గుసు, దమ్ముల నేయుము మటుమైనఁ దనువుఁ దొఱఁగుదున్.

క. అనిపలికియు నిర్వేదంబున, వనజారిన్ దూఱిదూఱి వసుధేశుఁడు మె
ల్లనిచల్లని గాడుపుం బి, ల్లెతెఱుఁగున గోరువంకఁ జలంబలిపలుకున్. 260

చ. అనిలుఁడ విన్ము నిన్నాహారంబు ననంతుఁడు పట్టి మ్రింగ నా
తనిజఠరాగ్ని నించుకయు దగ్ధము గాక తదాస్యనిశ్వస
ద్ఘనవిషవహ్నితోఁ దుదవడంగా విహగవ్రజశుష్కకాననం
బనయతనేర్చి పేర్చెదు దయాపరిహీనుఁడవుగ్రమూర్తివై. 261

సీ. ఘనజాలముల నెల్లఁ గాసి యొకర్చెద వొకచోటఁ గాదు నీయునికిపట్టు
జనులెల్ల నినుఁ బ్రభంజనుఁడని పలుకుదు రెట్టివారల నైన నెదిరికొందు
వంతవు దెసనుండి యరుగుదెంచెదు వలపట్టిరహస్యంబు బైటనిడుదు
పుగడలకడుఖలనుండి వచ్చెదు వరతరులఫలంబుల నరులఁ ద్రోతు

గీ. వాటిపోయెదు పపులాగ్ని వా అనీవు, బీదవారలఁ గనుఁగొన్న బిట్టునేతు
వట్టినిన్ను జయ్రత్పాణుఁ డనిఁపంక, జాసనుం డేమి చతురాస్యుఁ డరసిచూడ. 262

వ. అని వెండియు బహువిధప్రలాపంబులు గావించుచుఁ బురోభాగవిఫలారుణకిసాలర సాలసాలాగ్రంబునం గండుమీఁ జెటు కీరకిశోరంబు నవలోకించి విభ్రమితాంతఃకర ణుండగుచు నిట్లనియె. 263

చ. అలరు ఫలోపయోగము సహాయసవర్తనముం దనర్చు ను
జ్జ్వలనిగమాంశవాస మహాప్రకలాయత నొంది రాముని౦
గలుగుట ప్రాణిహింసనము మానుట యిట్లఖిలత్వ మెంతయుం
గలిగిన యోశుకద్విజముఖ్యబున రాగముఁ బూను టుగ్రమే. 264

చ. అనుచు విరలిందూలి తనయాలి కచాలివినీలిమంబవో
లినవధు లిట్టుకంబు లురులీలసు గానము విస్తరించుచుఁ
ఘనలతికాలతాంతవృదుకల్పితడోలికల న్సమీరణుం
డనుచెలియూఁచఁ నూఁగఁగని యాఁడు సీతఁదలంచి యార్తుఁడై. 265

క. సీతాయుష్మద్విహారో, జ్జాత నలవెట్లు నాకుఁ జల్లాయంభవ
చ్ఛీతానపమారుచి, స్ఫీతకటాక్షేక్షణాక్షిమేకము లేవిఁక. 266

క. అళుకొదుఁవ మరుఁడు కైదువ, జళిపించెడునట్లు నీసాలకిసాలం
బళికచచలిఁచెనెఁకయుఁ, గళవళమందెఁ మనంబు కావంది గదే. 267

క. అఁటఁ నాఁటనెయ్యము నేనో, లలనా యొక నిముసముం దలంపక మఱవం
గలనా శుకశారికల, కలనాదము లిప్పుడు వనము గలఁపఁగఁ జొచ్చెన్. 268

వ. అని పలవించి తదీయవియోగంబు సహింపక. 269

ఉ. తావులు గ్రుమ్మరించెడు లతాభవనంబులఁ దూఱివచ్చుఁ గ్రొ
మ్మావుల నీడ కేఁగు నట మానికొలంకులఁ జేరఁబోవు న
వ్వావెడలుం బరిస్ఫురితసూనరజంబు నలందు మేన సీ
తావిరహార్తి రాముఁ డొక తావునఁ గాల్నిలువంగ నేరఁడిఁకన్. 270

వ. పరితాపంబువొందుచుఁ బరిభ్రమించుచుఁ బరవశత్వంబునొందుచుండు నుచితవచన
శిశిరోపచారంబులం గొంత సేదదేర్చి లక్ష్మణుండు. 271

ఉ. ఏలపరిభ్రమించెదు మహీశ మహోగ్రనికల్పితావకా
భీలశరావలీజ్వలనభీమశిఖోష్ణసహిష్ణు లప్పటి
క్ష్మాలురు సత్యరౌష్యగిరిపాలురు గా రటులైన సాధ్వి నీ
బ్బాలలనాకుమారి నృపపుంగవ ముందఱఁ దెచ్చియుంచరే. 272

ఆ. అంతయేల యినజుఁ డాంజనేయాంగద, జాంబవత్ప్రముఖసారువాచర
భల్లుకోత్తములను బటుగతిఁ బిలిపించి, సీత వెదక నాజ్ఞ సేయుమన్న. 273

చ. అనుటయుఁ గ్రోధశోకపరవశాత్ముఁడు రాముఁడు లక్ష్మణుం గనుం
గొని కనుఁగొంటివే ప్లవగకుంజరు వాలి వధించి తన్మహా
ఘనవిభవంబు లిచ్చుటయుఁ గైకొని దుర్మదమెక్కి సంతతం
న్మనలఁ దలంపఁడయ్యెను రమాపతి గోఁతుల నమ్మఁజెల్లునే. 274

క. అనిపలికి మఱియు నతఁ డిట్లనుఁ గిష్కింధాపురమున కరిగి యతఁడు భూ
తనయానరయఁ బూనుట మదిఁ, గని నైజము కాకయున్న ఖండింపవా. 275

మ. అని యిట్లానతియీ రయంబున సుమిత్రాత్మజుఁ డేఁగి కాం
చె నభోల్లేఖితశాఖికాఫలరసస్వీకారసమ్మోదన
ర్తనశాఖామృగశాబకోత్కరయుతాక్రాంతోరుకాంతారము
న్ఘృణిపిస్తాజితాంధకారమును గిష్కింధాపురీద్వారమున్. 276

వ. కని చేరంబోవు నవసరమ్మున నచ్చటి ప్లవంగపుంగవులు తమలోన. 277

మ. అహిమాంశుండు మహానురాగమునఁ బుత్రాలోకనాపేక్ష ని
మ్మహిఁ గేతెంచెననంగ నొప్పెడు జగన్మాన్యుం డనంతాభరో
ద్వహనాత్యంతసమర్థుఁ డీతఁడని తత్సౌందర్యగాంభీర్యస
న్మహిమాలోకనదర్శనంబులను సంభ్రాంతాత్ములై చెచ్చెరన్. 278

క. చని సుగ్రీవుం దారా, వనితాప్రియుఁ గాంచి మ్రొక్కి వానరవరు లి
ట్లని రోదిననాయకసుత, విను మొకవిన్నపము విన్నవింతుము తెలియన్. 279

చ. అని సచివాళిఁ దోడ్కొని యహర్పతినందనుఁ డావమారుతోఁ
జనియెను రామునిం బ్రథితశాశ్వతగోత్రవిరామునిం గనుం
గొనినటు లేగి రాఘవునకున్ హృదయంబునఁ గ్రోధశాంతికై
మును మును లక్ష్మణుం గనిచి మోదముతో నతఁ డట్లొనర్పఁగన్. 293

వ. మోహ్పాంగేలు ఘాలంబునం గీలించి. 294

క. పదపడి కపసుతుఁడు తత్పదపద్మంబులకు మ్రొక్కి ప్రస్తుతు లెసఁగ
న్మది యదరుచుండ నప్పుడ, య్యాదితేయసమానముఖుఁ గొయ్యావఁ బలికెన్. 295

క. శాంతగుణాకర చతురా, శాంతంబుల నున్న యాద్రిచరముఖ్యుల నే
నింతకు మును పిలిపించితి, సంతోషము నొందు మిపుడ చనుదెంతు రనన్. 296

వ. దీనదయాళుం డగు రఘునందనుండు మహాసంతసంబునం దపవనందనుం దదమాత్యులం గనుంగొని కనుఁగొనలఁ గరుణారసంబు జాలువాఱ వారలం గలపికొనియుండె నంతం గతిపయదినంబులకు. 297

శా. లాంగూలోచ్చలనోదితక్ష్వపటలీలాధూతధారాధరో
త్తుంగుల్లాంగలదీర్ఘదృష్టి లధికోద్యుక్తు ల్మహీభృన్మహా
భీలాంగు ల్నఖరాయుధోద్ధతులు నిర్భీతు ల్చతుర్దిక్కులన్
లాంగూలోత్తము లేగుదెంచిరి మనోల్లాసంబు సంధిల్లఁగన్. 298

వ. మఱియును. 299

క. దాశరథులకుం గిష్కింధేశునకు న్సంతసం బహీనతనొందం
గీశులు సనుదెంచిరి నా, కేశసమూహంబు లవని యీనికరణిన్. 300

క. గిరినిభుఁడు గంధమాదనుఁ, డరిపంకజమత్తకుంభి యగు నగ్గజుఁడు
న్హరిక్రముండు కేసరి, యరుదెంచి ప్లవగసైన్యులై వేర్వేఱన్. 301

సీ. అపరిమితాద్రిచరానీకములు గొల్వ, నరుదెంచెఁ గుముదాఖ్యుఁ డనునతండు
కొలఁదివెట్టఁగరాని కోఁతిమూఁకలతోడ, నరుగుదెంచెఁ గవాక్షుఁ డనునతండు
గణుతింపరాని వృత్తచరభటాళిఁ దోడ్కొనివచ్చెను శరభుం డనునతండు
లెక్కయిడఁగఁజాలలేని వానరులతోఁ, జనుదెంచె వడిఁ దారుఁ డనునతండు

గీ. లలి నసంఖ్యాకకీశబలసహితముగ, నర్థి నేతెంచెఁ గుంజరుం డనునతండు
నరయ నంతింత యనరాని తరుచరాలి, తనరఁ గనుపట్టెను పనసుం డనునతండు. 302

క. వివిధవిపినాటసైన్యపరివృతులు పరిమథనులు నపరిమితబలులు వ
చ్చి విడిసిరి వినతమైంద,ద్వివిదులు నలనీలదధిముఖప్రముఖుల్. 303

చ. అతిబలు లుగ్రవేగులు మహాశనికర్కశదీర్ఘబాహు లు
ద్ధతతను లన్యసైన్యవిపినశ్వసనాకృతు లిద్ధకేసరి
శతబలులైన వృషభగసైనికు లెంతయుఁ దన్నుఁ గొల్వఁగా
శతబలి వచ్చెఁ బద్మహితసంభవు పంపిన పంపొనర్వఁగన్. 304

క. నల్లనిమేనులు నెంతయుఁ, దెల్లనిమోరలును గల్గి దిశ లెల్లను భే
దిల్లఁగ బొబ్బలు వెట్టుచు, భల్లుకములతోడ జాంబవంతుఁడు దోఁచెన్. 305

క. మానవనాయక భాస్కరసూనులకు న్సంతసంబు సొంపువహింపం
గా నేగుదెంచెఁ దరుచర, సేనలు దనుఁజుట్టి రా సుషేణుఁడు కడిమిన్. 306

క. అద్రులఁ గనకాద్రిసురల, రుద్రుఁడు తారకల హిమకరుండును బోలె
న్భద్రం బగుకపిసుభటసముద్రంబునఁ బవనసుతుఁడు ముఖ్యుం డయ్యెన్. 307

క. తతవర్షబిందుతారాతతికిం బరమాణుసైకతలవంబులకు
న్మితి వెట్టఁగాక నక్కపి, వితతి న్లెక్కింప విధి యధిఁబడదు న్నే. 308

వ. ఇవ్విధంబునం గట్టాయితం బగువనచరచమూసమూహంబు సముద్రజలంబులం బుడిసిలింపను, బ్రహ్మాండభాండంబు వగులింపను కులాచలంబులు విసరివేయనుం జాలి కయ్యంబునకుఁ గాలు ద్రవ్వుచుండె మఱియును. 309

క. అనుపమతరహరిసేనా, వననిధి ఘననీలగజగవయశరభనిశా
తనఖరకకేసరీవేష్టనమునఁ బనసకుతరంగశస్త్రతఁ బొలిచెన్. 310

వ. భుజబలాంగదుం డగు నంగదుండును విపులకపిసేనాసమేతుండై సేనాముఖంబునకుఁ గన్నాకై నిలిచె నట్టియెడ. 311

ఉ. అక్షులకుం బ్రియం బొదవునట్టిప్లవంగమసేనఁ గాంచి రా
మక్షితినాథుఁ డాదరసమగ్రుఁడు భాస్కరపుత్రుఁ గాంచి ప్రా
గ్దక్షిణపశ్చిమోత్తరపథంబుల జానకి రోయ నెంతయుం
దక్షుల ఋక్షవానరులఁ దప్పక యిప్పుడ పంపు మింపుగన్. 312

క. అనవుడు మహాప్రసాదం, బని తను యటులు చేయువాఁడ నని కపిసేనం
గని పొంగి జనకజావిచయనతత్పరచిత్తవృత్తి నర్కజుఁ డంతన్. 313

క. వినతు న్వినతాసుతజవవినుతుం గని నీవు నూఱువేల్ప్లవగులం
గొని నేర్పునఁ దూర్పునకుం, జని జనకజ వెదకి రమ్ము చయ్యన నెలకున్. 314

మ. అని తద్దిక్షితభూరిభూభృదురుగోష్ఠారామపల్లీగుహా
ఘనగంభీరసరిత్ప్రవాహములు వేడ్కం దేటతెల్లంబుగా

నిజముం డానతి యా నెఱింగి వినతుం డై గ స్వడిం బూర్వది
గ్వనితాకర్ణపుటప్రపాత విరావాపూర్ణసైన్యాఢ్యుఁడై. 315

వ. తదనంతరంబున. 316

చ. అనిలసమానవేగు ననిలాత్మజు నాత్మజసన్నిభుం గనుం
గొని రఘువంశశేఖరులకుం దగ నాతనిఁ జూపి వారి కి
ట్లనియె దృఢవ్రతుండు జతురాగమవేదియుఁ గామరూపకుం
డనిలసమానవిక్రమవిహారి మహారివిహారి యారయన్. 317

సీ. కనకాద్రి మెచ్చ దీతనిధైర్యరమ మించు జడదారిదొరకుఁ జేపడియె ననుచుఁ
దపనుని మెచ్చ దీతనితేజ మెక్కాల మొకరీతిగా నుండ నోఁడు ననుచు
నుదధిని సరకుసేయదు వీనిగాంభీర్య మలమంథనగముచేఁ గలఁగె ననుచు
నీమహామహుజవం బీఁదఁ గాదను నది యురుమనోరయమున కోప దనుచు

గీ. నీకటునితాల్మి భూతధాత్రీవనితను, గేలిఁ గావించుఁ జంతుప్రకృష్టభార
శమన మెదఁ గోరి యొక్కొకసారి బ్రహ్మ, విష్ణురుద్రాదులకు మొఱవెట్టుననుచు.

క. అంతియకా దీతఁడు తనుకాంతి మనంబుల జయించెఁ గంతుని గారి
కాంతునకె యగు నీహనుమంతుఁడు ధృతిమంతుఁ డంశుమంతుఁడు కాంతిన్. 319

ఉ. చాలు నితఁడొకండ కులశైలసదృగ్ఘనబాహుబలుం దిశా
పాలపురంబులు న్వెదకి భామిని సీత నెఱింగి రా యశ
శ్శాలి మహాత్ము నీతని వెస న్నియమింతు నవార్ధిగర్విస
త్త్వాతివహీంద్రభూరుహనికుంజముల న్మహిపుత్రి రోయఁగన్. 320

వ. అని పలికి కరువలిపట్టిఁ గౌఁగిటం బట్టి సస్నేహంబును, సబాంధవంబును,
సగౌరవంబును, సవినయంబును సాదరంబును గా నతని కిట్లనియె. 321

క. అతిబలకపిసేనాపరివృతుఁడ వగుచు యామ్యదిశకు వేచని తద్ది
క్షితధరణి వెదకి రమ్మా నృహితనూజ న్నీవ పరమహితుఁడవు నాకున్. 322

చ. అనవుడుఁ బొంగి నింగి నొరయం దనవాలము వెంచి భానుజ
న్మనకు నరేంద్రసూనులకు మ్రొక్కి మహామతి యప్డు వారి కి
ట్లను ననిలాత్మజుండు జనకాత్మజఁ గన్గొని వచ్చువాఁడ నం
బునిధిఁ గడాచియైనను జము న్విదళించియు నైనఁ జెచ్చెరన్. 323

వ. అని పలి. 324

గీ. లత్తుణము దక్షిణమునకుఁ దరలనన్న, వానుమఁ గన్గొని రాముఁ డత్యంతవ్యాప్త
చిత్తుఁడై నిజకార్యసంసిద్ధి యితని, కతన నగునని తలఁచి యాఘను నుతించె. 325

క. మానక వెండియు నప్పవమానసుతుం బొగడి రామమహీనాథుఁడు ప్ర
జ్ఞానిధి జనకజకుం బ్ర,జ్ఞానార్థం బంగుళీయకం బొసఁగుటయున్. 326

వ. స్వామికార్యధురంధరుం డగు గంధవహనందనుండు గంధగజంబు తరుణకిసలయం బుఁ బరిగ్రహించు చందంబున నయ్యంగుళీయకంబుఁ గరంబు రాగంబుమీఱం దత్క్ష ణంబ దక్షిణకరంబు సాఁచి. 327

క. కొని హరివాక్యముల నూఁ,కొని వానరసమితిఁ గూడికొని వారల వీ
డ్కొని దక్షిణపథమునం గై,కొని యేగె నొక్కెడ మలమికొని హెచ్చింపన్. 328

వ. ఇట్లనిలనందనుం డంతసత్త్వసంపన్నులగు నల నీల గజ గవయ గవాక్ష గంధమాదన దధిముఖాంగదజాంబవదాదిమహావీరపరివృతుండై యెల్లవిధంబులం బుడమిపట్టిం గనిపట్టి వచ్చుపట్టి ప్రతిన వట్టి చనియె నంత. 329

ఉ. ఆదశ నున్న యున్నతమహామహిభృత్సరసీవనంబు ల
త్త్యాదర మొప్పఁ దెల్లముగ నాతనికిం జూపించి భీమసం
పాదిప్లవంగసైన్యము నపారముఁ దోడ్వడ నంపె నా ప్రతీ
చీదిశ సీతఁ జూడఁగ సుషేణుని వైరివనీకృశానునిన్. 330

క. అతనికి నొకమాసంబు, న్మితి వెట్టి యనంతరమున మిహిరసుతుఁడు ద
గ్గతపర్వతగహనాదులు, వితతమతిం దెలిపి రామవిభుఁడు నుతింపన్. 331

క. ఒక్కొక్కఁడె చాలి నాలుగు,దిక్కులు వెదకంగఁ జాలు ధీరులఁ గపులం
బెక్కండ్రఁ దోడుచేసియు, దక్కకుభంబునకు నా శతబలిం బుచ్చెన్. 332

వ. అతండు నొక్కమాసంబునం జనకతనయాన్వేషణంబుఁ గావించి మరలువాఁడై చనియె నిట్లు. 333

క. కాష్ఠామాత్రమునఁ జతుః,కాష్ఠావిచయనసమర్థగతులు కపివరుల్
స్ఫేష్ఠాహంకృతు లెసఁగఁ గ,రిష్ఠాత్ములు చనిరి గహ్వరీసుత నరయన్. 334

వ. ఇట్లరిగి. 335

క. తరుచరవర్యులు మునుమునుఁ, దరుణిం ధరణీశసూనుఁ దడవిరి మిగులన్
దరుల నదీనదంబుల, దరులం దిమిరప్రగాఢతరులం జరులన్. 336

సర్వలఘుసీసము.

మఱియుఁ దరుచరులు మసలక యవనిజ వెదకఁగఁ దొడఁగిరి వివిధగతుల
బులుఁగులు మెకములు మెలఁగెడు నెలవులు బులుఁగులరుతములఁ బొదలుపొదలు
నుతువులఁ బొరువులు మలలును శిలలును బొలములఁ గొలఁకులఁ బులినములును
బురములు నుపవనములు నిష్కుటములు నహులవివరములు గహనములును

గీ. మునులు దపములుసలిపెడువనములును శబరులయునికులఁ దలిరుఁబరఁగులతలు
నుటజములు నవటములు బహుళశిఖరము, లపరిమితభయదకరము లగుతలములు. 337

వ. ఇట్లరయుచు వెండియు. 338

ఉ. భానుసహస్రచారుతరభానుపరిస్ఫుటధాత్రి నీఁగఁ గా
లూనిన యంతవట్టయిన నూనమునొందక యుండునట్లు గా
జానకి సర్వరాత్రియు జానుగ రోసి యెఱుంగలేక యా
వ్వానరు లెల్లఁగూడికొని వచ్చిరి క్రమ్మఱ దైన్యచిత్తులై. 339

వ. దక్షిణదిశాపరిశోధనార్థం బరిగిన యశోధనులగు హనుమదాదులు తక్కం దక్కిన యక్కపులెల్ల నొక్కమొగిం దిక్కులద్రువం జనుదెంచి రాజపుత్రరవిపుత్రులం గాంచి నమస్కరించి తమపోయివచ్చినచందం బెఱింగించువారై యిట్లనిరి. 340

మ. సితకీర్తి ప్రియులార యేమఁ బ్రతీచీప్రాగుదీచీదిశ
స్థితశృంగోన్నతపర్వతంబులఁ బయస్సీతాపగాతీరవి
స్తృతకాంతారములం గుడంగముల ధాత్రీపుత్రి శోధించిన
చ్చితి మెచ్చోటను వార్తయైన విన మాసీతానిమిత్తంబుగన్. 341

క. ఇఁక నెందు వెదకువారము, పెకలింతుమొ భూతధాత్రిఁ బెల్లగిల న్స
ప్తకులాద్రులఁ ద్రొత్తుమొ వా,నుకొలఁకుల వెదకుదుమొ యశోధనులారా. 342

గీ. ఆజ్ఞ యొసఁగుఁడు మా కని రంత రామ,లక్ష్మణులు నినజుండును దక్షిణంబు
వెదకఁబోయిన యమ్మహావీరవరుల,మీఁదఁ బ్రాణంబు లిడియుండి రాదరమున.

వ. అంత నక్కడ దక్కినంబునకుం జనినవనచరు లాలస్యంబుఁ దక్కి యెక్కిన ప్రాఁకులు మరల నెక్కి వీక్షించుచుఁ, దడవిన ప్రదేశంబులు వెండియుం దడవుచు, నేమ మేమ జనకజం బొడగాంతుమని ప్రతినలు వట్టుచు రాఘవుండు మహానుభావుండు తదీయకార్యనిర్వాహకుండ నర్వోత్కృష్టుం డని యాడుచు హనుమంతుం గొని యాడుచుం జని చని. 344

సీ. కొలఁకులు శోధించి కొలఁకుల లేమిన్నఁ, గొలఁకులు బురదగాఁ గలఁచివైచి
పొదరిండ్లు పరికించి పొదరిండ్ల లేమిన్నఁ, బొదరిండ్లు బయలుగాఁ జిదిమివైచి
తరువులు వీక్షించి తరువుల లేమిన్నఁ, దరువులు వ్రేళ్ళతో నురులఁద్రోచి
నగములు గనుఁగొని నగముల లేమిన్న, నగములు బిట్టు పెల్లగిలఁజేసి

గీ. గుహలు దఱఁగాంచి సీత కద్గుహల లేమి, గుహలు నగ్గోలువఱిచి యక్కోఁతులిట్లు
తరులుగిరులున బొదలుబొదలుకొలఁకులు,గుహలు శోధించియమ్మహావనములువఱియు.

వ. సీతాన్వేషణంబు గావించుచు, 346

చ. ఫలములు గాంచిరేని దమపార భుజింపరు పువ్వు దేనియున్
గలముల గాంచి క్రోల దమకింపరు పెద్దచరించియున్ న
మలసత నొందినారు మన రాకలిదప్పియు లెక్కసేయరుం
గలగరు నాన కెందకును గాలికి గార్యధురంబు పెంపునన్. 347

సీ. అచ్చోటు జనకజ నరయుదు మనిపోము, రచ్చోటు లేకున్న దైన్యము వహింతు
రాకడ సీత నాలోకింతు మనిపోదు, రాకడ లేకున్న నలసు లగుదు
రాచక్కి మహిపుత్త్రి జూచెద మనిపోదు, రాచక్కి లేకున్న నలగబడుదు
రందు రాఘవుదేవి గందు మనుచు బోయి, రందు లేకున్నను గుందుచుందు
తే. రంబుదత్సతి గన్గొందు మందు రకట, కడచని యొమాస మందుర కపులు మనకు
నాత్రి బవలేల తచ్ఛ్రవవార్త విందు, మంచు రొకకొందఱికతి నందు మఱియు.

సీ. రాముని బల్కు కీరరమణి సీతగా, నూహించి నిలిచెద రొక్కమాటు
దాతచ్ఛద యుగులతాతన్వి జానకి, యోయని చూచెద రొక్కమాటు
ఘనకలాపకిహీనక గలకంఠి భూపుత్త్రి, యొక్కయని తలంతు రొక్కమాటు
ఘటునిశాచరవిద్ధ పద్మిని రఘురాము, సతిదగా భావింతు రొక్కమాటు
తే. పోతు బాసితపింఛకపోతి మహిజ, యున్నదని చేరబోవుదు రొక్కమాటు
శూన్యవృత్తుల మై రవిసూను జేర, జంపు నను భీతి గొందఱు శైలచరులు. 349

ఆ. మఱియు వివిధగతుల వసలక జనకజ, యున్నచో టెఱుంగ కున్నతంబు
లైనపర్వతములు నగములు శోధించి, యలసి సొలసి యున్న యవసరమున. 350

మ. అభయగతిం బిలంబు నొక డారసి తారసిలంగ దత్స్వయం
ప్రభగుహ జొచ్చి గాఢతిమిరంబు గ్రమించుచు బోయి యాత్మకీ
ర్తిభరితసన్నికృష్ట నొకతె గని భక్తి నమస్కరించి త
చ్ఛుభకరుణాగ్రదృష్టి గుహ సొంపుగ వెల్వడి రొక్కపెట్టునన్. 351

వ. ఇట్లు మహాయాసంబునం బెక్కుదినంబులు సొచ్చిన యాబిలం బనాయాసంబున నొక్కక్షణంబున వెల్వడి ప్రభావతీప్రభావంబున కచ్చెరువు నందుచు నిరాశ్రిత క్షుత్పిపాసార్తులై యుండి యాన్యోన్యముఖావలోకనంబు సేయుచు నిట్లనిరి. 352

ఉ. ఇక సేయగలకార్య మెద్ది మన కయ్యిక్ష్వాకువంశోత్తరుం
డకలంకుండగు రాముభార్య గన నెట్లా సెల్లచో ట్లింత ద
క్కక శోధించితి మెందునుం గనము శోకధ్వాంతవిచ్ఛేదకం
బకటా చంద్రముఖీసువార్తనగు గా కన్యంబులం దీఱునే. 353

క. అని యంత నంగదుం డిట్లనియె న్వానరులకుఁ జాల మవనిజ నెటకుం
బనిగలదే పోవఁగ మన, కనువగుఁ బ్రాయోపవేశ మందఱ కరయన్. 354

సీ. అనుచు గద్గదకంఠుఁడై యెల్లవారల నీక్షించి మఱియుఁ దా నిట్టులనియె
నవనిజఁ గనుఁగొన మని యటువోయినఁ జంపుఁ గాని యనుగ్రహింపఁ డర్క
నందనుం డాట రా నందుల కిచ్చోటఁ బుచ్చెగ నసువులు పోండు మీర
లెల్ల మీమనమున కిష్టగు నెలవుల కనుచు మోమున దైన్య మాక్రమింప
ఆ. నశ్రు లురులుచున్న యంగదుఁ గనుఁగొని, యఖిలవానరులు మహార్తిఁ దూలి
నిశ్చయముగ నేము నీతోడివారము, గాక మాకుఁ బోవఁ గలదె మఱియు. 355

వ. సమగము రామచంద్రునకు సమ్మతిగా నొనరించి పుణ్యలో
కములు జటాయు వెంతయు సుఖంబునఁ బొందినయట్లు రామకా
ర్యమున సుప్రపంచముఁ దిరంబుగ వీడితిమేనిఁ బుణ్యలో
క మెమరు వచ్చునంచుఁ బ్లవగప్రభు లాతనిఁ జుట్టి యేచ్చినన్. 356

వ. దైన్యహీనవంతుం డగుహనుమంతుండు వారల కిట్లనియె. 357

క. మనము పరమాత్ముఁ డగు రాఘుని మనముం బడయలేమి మార్గముల మని య
య్యనఘుఁడు నిజచారణవం,దనిపీక్ష్యలఁ జేయుఁ జచ్చినం జాకున్నన్. 358

ఉ. కావున ధైర్యము న్విడి యకారణ మిగ్గిరిగహ్వరంబులం
జావఁగ నేల యప్పరమసాధ్వి నిలాసుతఁ గాంచి పోయి ధా
త్రీవరుమన్ననం బడసి తేజము నొందఁదలంపుఁ డిట్లసం
భావితచిత్తవృత్తు లగుపాలసులట్లు తలంక నేటికిన్. 359

వ. అని వెండియు నుచితవచనంబులం దేర్చి. 360

క. కడఁగుండు సీతవెదకం, గడఁగుండు ముఖంబు లశ్రుకలితంబులు న
న్నడుగుండు కార్య మనునెడ, నడగుండు పగిది విహంగనాథుఁడొకఁ డొగిన్.

వ. సంపాతి యనునతండు. 362

ఉత్సాహము. అచటనుండి వారి క్రింగ నరుగుదెంచువాఁడు త
ద్వచనసరణిఁ దనదుమద్దుఁదమ్ముఁ డీల్గుటరసి వృ
త్తుచరనాథ వరులఁ జేరఁ జనుదునపుడు కాంచి వా
నిచరితం బెఱుంగలేక నిఖిలకపులు భీతులై. 363

ఉ. కాలినపర్వతంబుక్రియఁ గల్గినమేనునఁ గూటపెూ యనం
గ్రాలుగళంబు నెత్తికొని క్రచ్చఱవచ్చెను నొక్కభూతమ

ఉ. దేవరయెలర్కభాను మును జేరఁగనోపుదు నేననేనయుం
బావిపులాద్రికాయుఁడు జటాయువు నేనునుఁ బిన్నదంబునం
బోవఁగ సూర్యరశ్మి మును బొందిన నమ్మహనీయువేగికి
న్బావులలావులెల్ల వికలత్వము నొందుచువచ్చెఁ జెచ్చెరన్. 374

ఉ. తమ్మునిపక్షయుగ్మకము దగ్ధము గొందుట గోర్వలేక శీ
ఘ్రమ్మున నెద్ది మూర్ఛిలి ధరాపతనోన్ముఖుఁడైన వానినా
గ్రమ్మున నాత్మపక్షములఁ గప్పిన నప్పుడు కాక నా పత
త్రమ్ములు గాలె నాతఁడు సురక్షితుఁ డయ్యె మదాత్మ వొంగఁగన్. 375

వ. ఇట్లు చండకిరణప్రచండకిరణదగ్ధగరుద్వయుండనై. 376

క. ఇక్కుధరంబునఁ బడి కదుఁ, జిక్కినవాఁడఁ దగుసేవ సేయుచు నిచటం
బెక్కుదినములుండి యతం, డెక్కడకేని చనె యర్థేచ్ఛాపరుఁడై. 377

వ. నాఁటంగోలె వానికుమారుండు సుపార్శ్వుండను సుపార్శ్వుండు నిత్యంబు నాహార ప్రకరంబు నిర్వర్తించుచుండ నంబడంపడి జటాయువుముని స్థానంబగు జనస్థానంబు సుస్థాయంబుగా నున్నవాఁడ నివింటి నొక్కసమయంబున మదీయపూర్వసంపాదిత పుణ్యకర్మవశంబున బాలసఖుండగు నొక్కతపోధనుం గనుంగొని సభక్తిక సాష్టాంగదండప్రణామంబు లాచరించి ప్రార్థించిన నస్మద్దీనదశాకారణంబుఁ దనదివ్యతపోమహానుభావంబున నెఱింగి నావలన వెండియుం దెలిసి యక్కరుణాకరుండు నాకుం గరుణించి పత్త్రివరా ధరాసుతాన్వేషణంబు నెపంబుగ నగచరులు రామాజ్ఞ నెన్నండేని యివ్వనంబునకు నరుగుదెంతు రమ్మహాత్ములకు సీతావృత్తాంతంబు దేటపడం దెల్పి లబ్ధపక్షుండవు గమ్మని దీవించి వేంచేయుటయు నాఁటంబట్టి మీ రాకఁ గనిపెట్టి ప్రాణంబులు చిక్కంబట్టియున్నవాఁడఁ గృతార్థుండ నైతినని పలికి తమ్మునిం గూర్చి యార్చిపేర్చినశోకం బుడిపికొని యవ్వానరోత్తముల సహాయంబునం బుణ్యనదీస్నానంబు గావించి జటాయువునకుం దిలోదకపిండప్రదానంబు వెట్టి పవిత్రుండై వారలం గనుంగొని. 378

చ. నగచరులార యింక మరణవ్యవసాయము మానుఁ డిప్డు సీ
తఁ గనువిధంబు మీకు విదితంబుగఁ దెల్పెద దూరదృష్టి మా
కుఁ గలదు లంకనున్నది యకుంఠితసద్వ్రత రాముదేవి యి
మ్మగ శతయోజనంబులు సముద్రముఁ దాఁటుఁడు కానవచ్చెడున్. 379

క. అని మఱియుఁ బెక్కుభంగులు, వనచరులకుఁ దెల్పి పక్షివర్యుఁడు సంపా
తి నిజపత్త్రమ్ములు గల్గిన సంతసమంది వారికిం దగ ననియెన్. 380

ఉ. ఎక్కలు వారు నత్తబిసి యేనిక్కపం బ్రభవించె సత్త్వమిం
పెక్కుపతివ్రతామణి వహీసుత వీఁపునఁ బెట్టి లంకతో
నిక్కడఁ దెత్తునో కడు నహీనజవాధ్యు మదీయపుత్రకుం
జక్కఁగఁ దోడ్కొనర్తునో ప్రశస్తగుణాస్పదులార చెప్పరే. 381

చ. అనవుడు సంతసించి శకునాధిప జానకియుండె లంకలో
నని తెలియంగఁ జెప్పితి సహాయము గాదొకో నీవు నీసుతుం
డును జనుఁ డిట్టివర్తనఁ గడుంబటుపైన సముద్ర మెవ్విధం
బునవయినం దరించి మహీపుత్రిఁ గనుంగొన నేముచాలమే. 382

క. అని పులుఁగుఱేనిఁ బోవం, బనిచి కపిప్రభులు నెఱఁగుబంటిదొరలు ను
బ్బున నాడుచుఁ బాడుచుఁ జని, చని దక్షిణవారిధితీరశైలోత్తమముక్. 383

చ. మలయగిరిం బ్రదక్షిణనమస్కృతు లొప్పఁగ నెక్కి వానరా
వలి గనియె స్సముద్రము నభంగతరంగరవాతిరౌద్రము
న్లలితనిజోరుఫేనరుచిలజ్జితనిర్మలతప్తశూద్రము
న్జలచరభద్రము న్మహితసాగ్రప్రవాళలతావిసద్రముక్. 384

క. కని తత్తరంగశీకర, జనితపరమశైత్యముం బ్రసన్నతలీలం
గొని మలయసమీర మెదు, రొక్కని తనమార్గశ్రమంబు కొంచెపఱుపఁగన్. 385

క. ననుఁ బ్లవగు లెట్లు కడచెద, రని నవ్వోహుభంగి ఫేన మడరం బోని
త్తునె వీరల నాఁగక నన, ననువున భంగంబు లంతకంతకుఁ బెరుఁగన్. 386

వ. ఘూర్ణిల్లుచున్న వారాకరంబుఁ గనుంగొని భయభ్రాంతు లగువారును మూర్ఛాపరవశ
త్వంబు నొందువారును మహానందంబు నొందువారును తరుగుల్మలతాగ్రంబులనుండి
వీక్షించువారును విస్మితులగువారును, సరకుసేయక తత్తరంగంబుల నోలలాడువారు
నై రంత నంగదుండు తమవారిదెసఁ గలయం గనుంగొని. 387

క. ఎవ రెన్నియోజనంబులు, జవమున జలరాశి దాఁటఁ జాలుదు రనిన
న్నవదశయోజనములు దాఁ, టక వచించిరి ప్లవగభల్లుకప్రభుముఖ్యుల్. 388

గీ. ఇట్లు తమతమకొలఁదుల నేర్పఱించి, యఖిలవనచరులును దెల్ప నాలకించి
యింద్రనందననందనుం డిట్టు లనియె, వారలెల్లను సంతోషవనధిఁ దేల. 389

చ. అసదృశవేగి వాలి కెన యానధికుండగుఁ గాని తక్కుగాఁ
డసమున నీతఁ డంచుఁ గపులందఱు సంస్తుతిసేయ వారిరా
శి సరభసంబునం గడచి సీతఁ గనుంగొని లంక నుగ్రకే
ళిసలిపి మామనంబు లమలీమసవృత్తిఁ దలిర్ప వచ్చెదన్. 390

వ. అని తాను శతయోజనంబు లవలీల దాఁటునోపుట యుగ్గడించి యొక్కింత విచారించి
వెండియు నత్తరుచరులతో నతండు. 391

క. తరుచరు లానందింపఁగ, శరనిధి వెస నుత్తరించి జనకజఁ గని త
త్పురిఁ గాలఁ జమరి క్రమ్మతి, యరుదెంచుట నాకు శక్య మౌనో కాదో. 392

వ. సంశయంబు గలదని పలికి ధైర్యాతిరిక్తంబున వెండియు. 393

చ. అది యటులుండనిందు మదమారఁగ నియ్యెడ నుండుఁ డేను బో
యెద నిదె పల్వలాకృతి వహింపఁ బయోనిధి దాఁటి నాఁగ నం
గదుఁ గని వారలెల్లను సగౌరవ మొప్పఁగ నాడి రీవు చా
లు దుదధి గాఁటి యెల్లపనులు న్నన దూటిచి మమ్ముఁ బ్రోవఁగన్. 394

క. అయినను నీవేగినఁ బ్రదటి, యయినను నే మోర్వఁజాల మనయంబున మా
నయనములు చల్లఁగా నీ, దయినశుభాంగంబు గాంచి యలరుదు మెపుడున్. 395

క. ఈకడలి వెడలి తగనవ, నీకన్యం జూచి రాఁగ నీవోపుదు నీ
పోక కపివరులయసువుల, పోక సుమీ కలమె నిన్నుఁ బోమ్మని పలుకన్. 396

సీ. పసితనంబున ఫలభ్రాంతి నుక్కఁ బాలభానునెవ్వాఁడు చేపట్టవిడిచె
దుష్టవర్తనుల దైత్యులఁ బట్టి పాలార్చి మునులచే నెవఁడు దీవనలువడసె
దివ్యాస్త్రముల కసాధితుఁడగా బ్రహ్మాదిసురలచే నెవ్వాఁడు వరములందె
నితనిచే మనపనియెల్లఁ దీరునటంచు మద్రి కేవ్వనికి రాముం డొసంగె
గీ. నెల్లవిధముల జానకి నేనకాంతుఁ బ్రకటగతి నని యెవ్వాఁడు ప్రతినవట్టె
నట్టిహనుమంతుఁ డతిశాంతుఁ డరికృతాంతుఁ, డుండ మనకేల యోయఁగ దుండడనగర.

వ. అని యివ్విధంబున నాంజనేయుండు వినుచుండం బలికి వెండియు నమ్మహావీరు
జన్మబలపరాక్రమప్రకారంబు లుగ్గడించి యయ్యంగదుం బురస్కరించికొని జాంబ
వదాదులు హనుమంతుం బ్రశంసావచనంబుల నగ్గించుచు నుగ్గడి. 398

శా. ఖద్యోతద్యుతినిర్జితాత్మరుచి లోకప్రాణసత్పుత్ర నీ
వుద్యచ్ఛ్రమగతిం బయోధితరణోద్యోగంబు గావించి యా
పద్యుక్తం బగు వానరావళిఁ బ్రబద్ధప్రాణవాతంబుగా
విద్యాజీవ కడంగుమా జనకజాన్వేషార్థ మర్థించుచున్. 399

క. వనచరు లివ్వనరాశిఁ, గని భీతిల్లెదరు తమకుఁ గడవఁ గొలఁదిగా
దని పురుషోత్తమ నీకి, వ్వననిధిపటుపుఁ దాఁటు టెంతభరమూహింపన్. 400

క. గురుఁడగు హరియము భవద్గురుఁడగు హరియముఁ బక్షిఘోటకుఁడు జగ
ద్గురుఁడగు హరియమున నీగురుయమున కెట్టు లెనయగు న్హరివర్యా. 401

వ. అదియుంగాక. 402

చ. ఒకనిముసంబునం బహుళయోజనముల్చను ప్రౌఢతేరితో
నొకనిముసమ్ముఁ బాయక తదుష్ణము నోర్చి నభఃప్రచారివై
సకలకలావిభూతి రవిసత్కృప నేర్చినయట్టినీకుఁ జో
టకడలి దాఁటు టేపని కటా యిటు లొప్పరికించి మాచెదే 403

వ. అని మఱియుం బెక్కుభంగులం బ్రార్థించి యగ్గించుటయు వానరేశ్వరుఁడు వారి దైనదైన్యంబు వాయం బొంగుచు నిట్లనియె. 404

మ. రయతం బిచ్చుకగుంటఁ గేసరికిశోరం బెట్టులంఘించు నా
క్రియఁ బాథోధిఁ గడాచి యందుఁ జని పఙ్క్తిగ్రీవు లంకాపురీ
తుయసౌధోపవనోపకంఠముల నాక్ష్మాపుత్రి నీక్షించి యా
ర యనన్ముద్రిక నిత్తుఁ దెత్తు ముదమారం బ్రత్యభిజ్ఞానముల్. 405

క. అని పలికి వారలెల్ల, దనమోమునఁ జూడ్కు లునిచి తద్దయు మోదం
బునఁ జూచుచుండ నవుడు పవనజుం డొప్పారె హైమవతసింహాగతిన్. 406

వ. మఱియును.

చ. అతులితపర్వతాగ్రమున నాహనుమంతుఁడు వొల్చెఁ బూర్వప
ర్వతశిఖరోదితోజ్జ్వలదివాకరబింబసదృక్షుఁడై సమా
వృతకపివక్త్రపద్మములు విస్ఫురితంబులు గా నిజాననో
ద్ధితరుచిభాను లొప్పఁగ మహీచరఖేచరకోటి కబ్బురన్. 407

క. ఇప్పగిది నొప్పి యొల్లరుఁ, దప్పక దీవింప నిజపదద్వంద్వంబుం
గుప్పించి యుప్పరంబున, కప్పుడెగసెఁ బర్వతాగ్ర మవని సమముగాన్. 408

వ. ఇట్లు లీలావాలోచ్చాలనంబుఁ గావించి నిఖిలవానరమనోనయనానందకరుండును రామకార్యపరాయత్తచిత్తుండు నగు నప్పవనప్రియనందనుండు దక్షిణాభిముఖుండై సముద్రలంఘనంబు గావించి. 409

క. గిరిచాపవినిర్గతమై, యురుజవమున నిగుడు శరమొకో యన లంకా
పురదహనార్థ మడరె నం,బరచరులకు విస్మయంబు మల్లడిగొనఁగన్. 410

వ. వెండియు నత్తరుచరసత్తముండు. 411

క. ఖేటకసురీతి వాలముఁ, బాటవమునఁ ద్రిప్పికొనుచుఁ బటురభసమునన్
ఖేటములఁ బట్టికొన నా,ఖేటమునకుఁ జనినయట్లు కీర్తికుఁ డయ్యెన్. 412

వ. అంత. 413

గీ. ఘనమహోరయువాయువేగగరుడజవ,శరశరభసంబులను మించి చనుచునున్న
హనుమఘనదేహ మంతయు నంత కక్షి,గోచరము గామిఁ బ్లవగులు చూచు టుడిగి. 414

వ. మోముల విన్నందనంబు గదుర నమ్మహాత్ము రాక వార్చి తత్తీరసికతాతలంబులం
బ్రాణంబులు చిక్కంబట్టియుండి రంత. 415

క. ఆ కార్యపరత్వము నిర్భీకత్వము దృఢరయంబు బీర మరసి య
ట్లాకాశంబున నేగుమహాశయుం గాంచి పొగడి రంబరచరులున్. 416

గీ. ఇట్లు ఖచరాభినుతగతి నేగునమ్మహాత్ము కాయోద్ధితశ్వసనాహతాబ్ధి
పాథయిచ్చుటయొప్పె నప్పరమసాధ్వి, నందు వెదకుచుఁ జనియెనో యనిన కరణి.

వ. ఇవ్విధంబునం బరమసాహసంబున నేకచరుండై ఖచరసంస్తూయమానగమనంబు
నం జను నయ్యగచరవర్యు నుద్దేశించి నిజకుక్షిసురక్షితంబగు మైనాకక్షితిధరంబున
కంబుధి యిట్లనియె. 418

ఉ. ఇమ్మహిరుట్ప్రరోత్తముఁ డహీనజవాఢ్యుఁడయైన నిట్టులో
ఱ్ఱమ్మఁడి సాహసించి శతయోజనము ల్చన దప్పి వుట్టుఁబో
మ్మమ్మహనీయ వేగు భవదగ్రమున న్నిలుపంగ రామకా
ర్యమ్మున కెవ్వరేనియు సహాయము సేయక మాననేర్తురే. 419

క. ఈకడలి వెడలి మత్ప్రియు, మీ కార్యముఁ దీర్పనోపు దీవెట్లును మే
నాకక్షిఁ బుట్టినాఁడవు, నాకుక్షినవృద్ధిఁబొందినాఁడవు గానన్. 420

ఆ. అనుడు నట్లొనర్తునని శింశుమారక,ర్కటకశాఖలొప్ప ఘనవిశుద్ధ
పాదశోభి యగుచుఁ బాథోధిమిత్రత, బయలు మెఱయ వెడలెఁ బర్వతంబు. 421

వ. ఇట్లు కడలి వెడలి హనుమంతున కభిముఖుండై. 422

ఉ. ఓకపివంశసాగరపయోరుహశాత్రవ వాయుపుత్ర మై
నాకుఁడ వార్ధిపంపున ఘనత్వరితంబున వచ్చినాఁడ సౌ
మ్యాకృతి గొంతసేపు నిలు మస్మదురూన్నతకూటకోటి ని
శ్లేకరయంబునం జనఁగ నేల శ్రమంబు జనింపఁ దెంపునన్. 423

వ. అని పలికి వెండియు. 424

క. హాలసదృశనఖర కోలా,హాలబహుళం బిప్పయోధియం దునికి హాలా
హాలగళుఁడు బావ కోలా,హలుఁ డన్న హిమాద్రి కన్నయా తఁడు నాకున్. 425

చ. అనఘుఁడు నమ్మి వానిపయి హస్తము సాఁచి ధరేంద్ర వార్ధిబం
ధినఁ జనుదెంచితంటి కడుఁ బ్రీతమనస్కుఁడనైతి జానకిం

గనుఁగొని కాక విశ్రమముఁ గాంచుట మేలె తలంప నూఱుయో
జనములమాత్ర దాఁటుట యసాధ్యమె పొమ్మని వీడుకొల్పుడున్. 426

వ. అగ్గిరిచుమ నచ్చెరువందుచు నమ్మైనాకుండు సనుటయు మున్నిటు మిన్ను దఱిసి పోవుచు నబ్బల్లిముండు. 417

క. సురఖేచరగంధర్వోత్కరవిస్మయకామరూపధగణము పేర్మిన్
సురసమ్మతి నేతెంచిన, సురస మ్మతివొంగ సనిచి సుస్థిరుఁ డపలన్. 428

శా. ఛాయాగ్రాహిణి తన్ను నాఁగిన నవష్టంభంబునం జేర్చి త
న్మాయాజాలము లెల్ల మాన్చి వెస నన్నక్తంచరీప్రోజ్జ్వల
త్కాయంబు న్నిజవాలపాశముఁ జిక్కంగట్టి యంభోధివి
స్ఫాయుద్భంగనిమగ్నఁ జేసి విలపింపం జంపి తా నేగుచున్. 429

క. వే లవణాబ్ధిఁ గడచి య్యావేలం బవనాత్మజుండు వీక్షించె మహో
ద్వేలశతయోజనాంబుధి, వేలఁ గుసుమసౌరభాతి వేల సువేలన్. 430

క. దండిమగఁ డిట్లుకనియె,ద్దండగ దాదండవాలదండ మెసఁగ న
క్కొండపయి న్వెఱ్ఱోకనడ, గొండపగిది వ్రాలెఁ బిట్టు కుతలముగ్రుంగన్. 431

ఉ. హనుమంతుండు సువేలమీఁదడిగి శైత్యాపాదిమందానిలం
బనుకూలంబగుచుండఁ గన్గొనియెఁ దుంగాంచద్విటంకాకరి
స్థగసౌధస్థితదర్పణాంశులహరీఖద్యోతశంకాకరిన్
దనుజాహ్వానగజేంద్రబృంహితమహాధ్వానోగ్రలంకాపురిన్. 432

వ. కనుంగొని నిజాంతర్గతంబున. 433

క. గోపుర వలరాజునకుం, గాఁపుర మలకాపురంబు గనుఁగొన నీలం
కాపురమున కెన యగునే, కాపురమయ్యె న్నిశాటగణభరితంబై. 434

క. ఈవీటు సురభయంకర, రావణపాలిత మగుటఁ గరంబొప్పదు సా
మ్యాకృతియైన విభీషణు, చే వెలయు నటంచుఁ దలఁచెఁ జిత్తములోనన్. 435

ఉ. ఈగతి నెంచి తత్పురి మహీసుతరోయఁ దలంచి భూరిహే
మాగసదృత్తకర్కశనిజాంగముఁ గుంచి సమీరనందనుం
డాగిరి డిగ్గి డిగ్గి యలనందము లైన పురోపకంఠభూ
భాగములం దలిర్చువిరిపందిళులం గని యాత్మ మెచ్చుచున్. 436

సీ. నవరత్నఖచిత సుందరవేదికాహృద్య లసితంబులైన యాలయవరములఁ
గహ్లారచక్రచక్రమరాళశైవల స్ఫారంబులైన కాసారములను

మకరందబిందు సమార్ద్రిత మేదినీ భాగంబులైన యుపవనములను
రత్నకంబళ మహారజతసింహాసన స్థానంబులైన యాస్థానములను
గీ. జవలనంటి వెలింగెడు సౌధములను, నతిపవిత్రతరమహేశ్వరాలయములఁ
గామరూపధరుండగు కపివరుండు, వెదకి జానకిఁ గనలేక విహ్వలించి. 437
గీ. మఱియు నర్తనశాలలు మందురలును, నాయుధాగారములుఁ గృత్రిమాచలములుఁ
బ్రాకటశిరోగృహంబులుఁ బ్రబలు ప్రపలు, నంతిపురములు నరసి యనంతరమున.
ఆ. అనిలసుతుఁడు రావణాంతఃపురంబున, నవనితనయ నరయ నరుగువాఁడు
లంక బింకమింక లంకిణి నిశ్శంకఁ, బిలుకుమార్చెఁ గడిఁది బీరమొప్ప. 439
ఉ. వంచనఁ దత్పురంబుఁ జొరవచ్చిన వారి నెఱింగిపట్టి బా
ధించు నిశాటి తన్ను నవధీరణసేయుచు వచ్చి చంపనూ
హించిన నివ్విధంబున మహిం బడ మెట్టునఁ దాఁచుడున్విలా
పించుచుఁ గూలె లంక యరిబృందముచే పశునంచుఁ దెల్పుచున్. 440
క. లంకాస్వరూప యగువా, లంకిణి గూలుటయు నిష్కళంకుండు నిరా
తంకుండు నగుచు మణిప, ల్యంకము సొరపేట్రి కానిలసితం బగుచున్ 441
వ. అశోకవిధాలంకరణ శోభితంబగు లంకాధ్యక్షు శుద్ధాంతంబున శుద్ధాంతఃకరణుండగు వృత్తచరాధ్యక్షుండు మానవాధ్యక్షు శుద్ధాంతంబు నరయుచుం జని చని కాంత విధుకాంత శిలాస్థగిత విశాలరమణీయతరంబగు నొక్క ప్రదేశంబున. 442
సీ. మణిమద్యపుత్రికా మహిత నిజప్రతిబింబభేదముఁ జలనంబు కతన
వీణావిరాజత్స్వీవాక్ప్రకర విభాగము దగు దాశీమానము కతమున
రమణీయ దీపికా రత్నదీప ప్రభాన్యతా దము నొందు నష్టము కతమున
చంద్రికాపాండుర సౌధవీథి ప్రచ్ఛటాంతరము చకోరమోదంబు కతనఁ
గీ. దగనెఱింగి యమార్గ్నితాతారతమ్య, మళననిద్రా విహారభోగాదికములఁ
దెలిసి భావగతంబుఁ జూపుటన తెలిసి, సకల కార్యంబులను నవసరము దెలిసి 443
క. స్వస్త్రీ సమానలగు ర, క్షస్త్రీ నివహంబులు పరిచర్యలొనర్పన్
వస్త్రాభరణంబులఁ గను, మాత్రశరప్రతిమ దేహయష్టి వెలుంగన్. 444
క. ఈమేనిపుద్ధిగాఁ దగ, దామేలికడాని దీని కనుమానములే
దేమేనిఁ బసిండికిఁగల, దేమేలగు తావి యనునుతికిఁ బాత్రంబై. 445
వ. ఒప్పు మెఱయుచున్న 446
గీ. కాంచనామోద దేహముక్తాఫలప్రవాళరదన రదచ్ఛద వారణపతి
యాన లసమానయపమాన మానగుణభ్రరితఁ గృశోదరి మందోదరీసమాఖ్య. 447

క. డబ్బాటునఁగని జనకజ, సబ్బాగఁగఁ గంటి నని మహోజ్జ్వలుఁ డెవలో
నబ్బా కీడు దలంచితి, నబ్బాలిక వేడ్క సల్పు నాయిబ్బంగిన్ 448

క. పతిఁ బాసిన కతమున స, మ్మతిలేమిం వాల్మిఁమాలి మగువ రఘువరు
న్మతిఁదలఁచుచు మేనుఁ గను, మతిరజము వహ్ని వగల మఱుఁగక యున్నే. 449

వ. అని లెస్సతలంపుచేసి మఱియును రావణవిహారస్థానంబు లగు నయ్యాయి ప్రదేశం
బులఁ బరమపవిత్రచరిత్ర యగు జనకపుత్రీసమన్వేషణపరుం డై యెందునుఁ బొ
డసూపకున్న హనుమంతుండు నిజాంతర్గతంబున 450

సీ. కడుఁ బ్రయత్నమున లంకాపురి శోధించి, కాంతాతిలకమును గందునో కో
కని రామచంద్రుఁ డిచ్చిన యభిజ్ఞానమే, తక్కుడు వేడ్క సీతచే నిడుదునో కో
యిడి ప్రత్యభిజ్ఞాన మేలమిఁ గైకొని కపి, శ్రీరిపు వసతి లంఘింతునో కో
లంఘించి శ్రీరామలక్ష్మణ సుగ్రీవు, లకు శుభవార్తఁ దెల్పఁగలనో కో

గీ. తెల్పి జలరాశి దాఁటి పృథ్వీవధూటి, పుత్రిఁ గని కపులిచ్చు నబ్బోటిపాటి
మరల రాఘవులకుఁ దెల్పు మారుతియును, హాగడునఁ బాత్రభూతుఁ డనగుదునో కో

క. అని తలఁచి యనిలతనయుం, డనిలజవుం డంత నొక్క హర్మ్యము నెమరం
గనుఁగొని తదగ్రమున కొ, య్యన నెగయున కెగయు హరిక్రియం దాఁటితగన్. 452

క. రామరమణియగు సీతా, రామామణి నరయునంత రహిఁ నచ్చెంత
న్నామాగ్ర పూగ బహుళా, రామ మొకటిఁ గాంచె నంతరంగము వొంగన్. 453

చ. ఫలదళబంధురప్రసవబంధన చారుశలాటుమంజరీ
లలితలతామహీరుహవిలక్షితనిష్కుటము న్గాంచి య
వ్వలనికిఁ జేరఁ బోయి హరివర్యుఁడు తన్మహితాంతరంబునం
గలయఁ జరించి భాగ్యమునఁ గామినినొక్కెత రాక్షసీవృతన్. 454

సీ. మంచుబొట్టులఁ బసమించని తమ్మికైవడి మోము కన్నీటు వాడుదోఁపఁ
దామరతూండ్లు బెండడి డిందువడు మాడ్కిఁ బుజములు చుక్కన బ్రుంగుడువడ
నెండచే నొగిలిన యివురునా వేఁడి నిట్టూర్పుచే వాతెఱ యొప్పుఁదప్పఁ
బొగచుట్టికొనదివ్వె జిగివట్టిన గతి మాపుమఁ బుట్టుమున మేని పొలుపుతూలఁ

గీ. దడి మకిలవొందినట్టి యద్దముల కరణిఁ, జెక్కుటలఁ గ్రమ్మచెమటుచేఁ జెన్ను దొఱఁగ
మానినియలంత నొక పెనుమ్రానినీడ, నుల్లముడుకఁ బ్రలాపించుచున్న దాని. 455

సీ. అపయశంబునకుఁ జోటైతి నాహాయని, విన్నని మోముతో నున్న దాని
బతిభక్తి సతుల కాపద్దారియనిరాము, నడుగకఁ దలఁచుచు నున్న దాని
మనుజాదులు గ్రసింతురని భీతి సంగంబు, చెన్నఱ వడఁకుచు నున్న దాని
నాథుఁ జూడంగల్గునా యనుతలపోత, నుల్లంబు మఱుగుచు నున్న దాని

గీ. దుష్టచేష్టాసురీసమావేష్టనమున, సిద్ధసఖకేసరీప్రతిరుద్ధబాల
మృగియనఁగ నెంతయుం దనహృదయమునదర్పనుసులు విడువంగఁగమకించుచున్న దాని

క. అసలీనతాంతం జింతా, వనతవదన పిహిత కృత్త వస్త్రాంత స్త్రీ
హనుమంతుఁ డంతనంతం, గనె దుఃఖాక్రాంత రాముకాంత న్స్వాంతన్. 457

క. కని మునికన్నెయగుట భూతనయయగుటఁ దెల్పు నవ్విధంబున జడల
ల్లిన కేశపాశమున మన్ననఁ బొరలెడు జానకిం గనుంగొని వంతన్. 458

చ. తగునె విధాత కిట్టియువిదం బతిఁబాయఁగఁ జేఁత సీతయు
ప్పగిది నెసంగుచున్న పతిభక్తి విశేషముచేత నొప్పెడుం
దగనియలంత మోము వెలిదమ్మి దుమారమున న్మసంగ హీ
నగతి మలీమసార్ధవసుస్థితి నెంతయు నొప్పకుండియున్. 459

క. క్రిక్కిఱిసియు రక్కసులలో, నిక్కంజదళాక్షియొప్పు దించుకయును బ
ల్లక్కసుల నాగవల్లిక, చిక్కి క్రియ యయ్యెనేమి సేయఁగవచ్చున్. 460

క. మతిచెడి రాక్షసుచేనవ, మతినొందితి నిట్లు దిక్కుమాలి మిగులదు
ర్మతినంచు దూఱుకొంచుం, బతివ్రతాతిలక మింత పడునె కటకటా. 461

గీ. మధుకరవ్యాప్తి సుపరాగ మహిత పంకజాతమునుఁబోలె నిమ్మహీజాతమోము
చూర్ణకుంతలభృంగసంకీర్ణమగుచు, భూపరాగపరాగసంపూర్ణమగుచు. 462

వ. అని వెండియు ననేకప్రకారంబుల శోకించుచు జానకీసమాశ్రయాశోకానోకహ
శాఖోపశాఖావిలీనుండై తదీయలక్షణంబు లిమ్ముగ విమర్శించుచుండె నంత. 463

చ. బలిమిఁ గుబేరునిం గెలిచి పంతమెలర్పఁగఁ దెచ్చికొన్నయు
జ్జ్వలరుచి పుష్పకం బసురవారిజనేత్రలు గొల్వనెక్కియ
క్కలనికివచ్చి సీత నతిఖిన్నఁ గనుంగొని మానినీ కరం
బలమటు మాని నీసుహృదయంబున నన్గయికొన్నఁ గూడదే. 464

క. నినుఁ గానవిగ రాముఁడు, ననుజన్ముఁడును జాకయున్న నంబుధిఁ గడువం
జనునే కడచిన మనుజాదనుల గెలుచుటెట్లు వారిఁ దలఁచు టుడుగుమీ. 465

సీ. జగదీశ్వరుండగు శర్వావాసంబుఁ గైలాసంబు బంతిగాఁ జేసినాఁడ
శక్రునంతటివాని సాధించికట్టితే వలతియౌ పుత్రుండు గలుగువాఁడ
నలకాధిపతి నన్న యనక మానంబుతోఁ గొల్లు విమానంబుఁ గొన్నవాఁడ
దేవతలకునైనఁ దేటిచూడఁగ రాని పట్టంబు జలధిఁ బడసినాఁడ
బ్రహ్మ చంపకుమని నను బ్రస్తుతించి, విడువు మన జము నుండల విడచినాఁడ
నట్టి నన్నెల్లిదముసర్చి యధికభోగ, భాగనుత్తమ వీశ్రమ వడటమేలె, 466

క. పతి నీవ యనుచు ననుఁ బలు, పతియుం దివస్పతియుఁ బ్రేతపతియును సంభః
పతియును గొలువఁగ మతిఁ బతి, పతి యని పలవింతువొ యరిఁ బామరు నరునిన్. 467

ఆ. పద్మహస్త కరుణఁ బట్టి కైకొనవు మన్మథుఁ డేఁ గాను జారనాయకులను
దలఁపు దీర్చ నన్ను దౌవారికునిఁ గాఁగఁ, జేసి యేల రాదె చెప్ప నేల 468

వ. అని మఱియుం గామోపహతుండు గావున నవివేకభాషణంబు లాడుటయుం
జలించి, 469

క. పరపురుషులఁ జూడని యప్పగమపతివ్రత తృణంబు బరికించుచుఁ దాఁ
బరుషవచనుఁ డసురుం డిప్పగిదిని నాడుటయు నొవ్వఁబడి యిట్లనియెన్. 470

శా. సారాచారవిదూర క్రొవ్వినమతిన్ శార్దూలి గామించునా
సారంగంబును బెంట్రిసింగమును వాంఛం జేర నూహించునా
సారంగంబును శాతతన్నఖరవిస్తారాహతింగూలు న
ట్లామూఢి న్నను సాధ్వి నాసపడి చా నంతఃకృతిం దోఁచెనే. 471

క. ప్రభుతిలకుండగు రామప్రభు భార్య న్నన్ను నాసపడియెదు వహ్ని
ప్రభఁ గాంచి చేఁబోవు శలభవృత్తియుఁ గాదె నీ చలం బూహింపన్. 472

క. ననుఁ గారింపక దనుజాంగనలకు నాజ్ఞాపనంబుఁ గావింపుము భూ
తనయ గ్రసింపుఁ డనుచు నీ, తనయుక్త నిట్లాడకుము వృథావచనంబుల్. 473

క. భోగేచ్ఛ లేదు ప్రాణ, త్యాగేచ్ఛయె కాని నాకు దనుజాధమ ని
ర్భోగేచ్ఛ నన్నుఁ గోరక, భోగేచ్ఛుఁడ వైతి గానఁ బొమ్ము రఘుపతిన్. 474

వ. అని పలికి తన్నుద్దేశించి. 475

ఆ. కలుషమార్గఁ గామిఁ గామిఁ గామికి నీకు, నెట్లు తెలియవచ్చు నిపుడు రామ
చంద్రు సాంపరాయసాయసాయకముల, నవని నొఱగిపొరలునపుడు గాక. 476

వ. అనియథోవదనయు నవిరళబాష్పజలపూరితకపోలయు నేకాకినియునై చెక్కిటఁ
జెయిఁ జేర్చి తలయూఁచుచు దైవంబుఁ దిట్టుచు నిట్టూర్పు నిగిడించుచు నూర
కుండుటయుఁ బఙ్క్తిగ్రీవుండు సీతం గాచికొనియున్న రాక్షసీనికాయముల నిరీ
క్షించి రూక్షాక్షరవచనంబుల నిట్లనియె. 477

క. ఈకరణిఁ దపింపక సొ, మ్మ్యాకరణము రెండు నెలలకయినఁ గలుగు నే
ట్లేకరణి నేని దీనివ, శీకరణ నొనర్పుఁ డనుచుఁ జెప్పుచుఁ జనినన్. 478

వ. పొలదిండిపొలంతులుం బుడమిపట్టిం జుట్టుముట్టి రావణుం జెట్టవట్టు మని బిట్టుబాధ
లం బెట్టి పట్టి యొక్క యవసరమ్మున. 479

క. కావలివారలు జనకజ, కావలిదెస నిద్రనొంద నపుడెటిఁగి యశో
కావనిరుహంబు డిగియెం, బావని ఖేదమునఁ బరమపావనిఁ జూడన్. 480

వ. ఇట్లు డిగి. 481

మ. వినయంబెల్లఁ గపిస్వరూపమున నావిర్భూతమైనట్టి చా
దువున సామీరి నతోత్తమాంగుఁడయి మోడ్పుంగేలు ఫాలప్రదే
శనిబద్ధంబొనరించి భక్తి మెసఁగన్ క్ష్మాజాతమున్ జేరఁ బ్రెమొ
క్కినవిభ్రాంతభయాంతరంగయగు మం గీశున్నిరీక్షించుచున్. 482

క. ఇతఁ డెవ్వఁడొకొ ప్లవగా, కృతి నామందొంచె రాక్షసేశ్వర మాయా
కృతి నేతెంచినయట్టి సుకృతియేనిం బట్టి మ్రింగఁడే యెనలరన్. 483

వ. అని బహుప్రకార విచారంబులమం జొచ్చి తలంచుచున్నంత శాంతస్వాంతుండు హనుమంతుండు సాంత్వనస్వనంబున నక్కాంత కిట్లనియె. 484

క. మాయమ్మ రాముదూత సు,మీ యమ్మ లికంబు వాయు మాపద లెల్లన్
బాయునమ్మకు నీయులుకసుమీ, యమ్మకు నంక రావణాసురపతికిన్. 485

చ. అనఘుఁడు భానువంశుఁడు మహాత్ముఁడు రాముఁడు సంతసింపఁగా
జనకజ నిన్నుఁ జూడఁగఁ బ్రశస్తుల వానరుల న్విధింప వా
రునరిగి యెల్లదిక్కులను రోయఁగ మత్సుకృతంబు పేర్మి ద
క్కినయున కేనువచ్చి కృతకృత్యత నొందితి నిన్నుఁ గాంచితిన్. 486

క. హనుమంతుండనువాఁడఁ బ,వనపుత్రుఁడ నేకలోకవంద్యుఁడ జగతీ
తనయఁ బొడఁగంటి నని రా,మునకు న్వినుపింపఁగనుట ముదితాత్మిలకా. 487

క. విను మారీచుని మాయ,న్మరిఁగిన శ్రీరామలక్ష్మణులు నినుఁ గోల్పో
యినవారలగుట లజ్జా,వనతవదనులగుచు నరయువారొక్కయెడన్. 488

ఉ. ఆయటవీస్థలంబున జటాయువుఁ గాంచి త్వదీయవర్తనం
బాయనఘుండు దెల్పి తదనంతర మాత్మఁ బరిత్యజింప శో
కాయతవృత్తిఁ బజ్క్తిరథునాత్మజుఁడు న్విలపించి తత్పత
త్రాయమునకగ్ని సంస్కృతి నొనర్చిరి నాకజగన్నివాసిగాన్. 48

వ. తదనంతరంబున భవన్నిమిత్తంబుగా మహారణ్యపథంబులం బరిభ్రమించువారు. 490

గీ. బంధురహితానుబంధుఁ గబంధుశాప, మోక్షితునిఁ గా నొనర్చి లోలాక్షి శబరి
శబరిభక్తినొసంగు పూజలు గ్రహించి, పంకపర్వతశంప నప్పంపఁ గడచి. 491

వ. ఋక్షవానరచమూకంబగు ఋశ్యమూకంబునకువచ్చి భక్తినతగ్రీవుండగు సుగ్రీవు
తోడ నగ్నిసాక్షికంబుగా మత్సన్నిధిం జెలిమిఁ గావించి. 492

క. తరణిసుతుఁ డోలి నాతని, తరుణిం గైకొన్న వాలిఁ దనుచరశాలిం
ధరణీశకులుఁడు శ్రీరాముఁడు, ధరణింబడఁ గూల్చి తత్పదం బొసఁగె దనున్. 493

క. పేర్చినధృతి వాలిం బరిమార్చి యతనివైభవంబు లన్నియుఁ దన్నుం
జేర్చిన వానరుల న్నను, కూర్చి యనిచె నాల్గుదెసలకు న్నినురోయన్. 494

వ. ఇవ్విధంబునం బ్రత్యుపకారపరాయత్తచిత్తుండగు మిత్రపుత్రుండు 495

ఉ. పంపినవానరోత్తము లపారబలాఢ్యులు మారుతత్వరు
ల్గుంపులుగట్టి యద్దెసలకుం జనఁ గొందఱ మేము యామ్యది
క్కుంబరిశీలనార్థము వెసంజనుదెంచి కనంగలేక పెం
దెంపునఁ బ్రాణము ల్జలధితీరమున న్విడువందలంచుచున్. 496

క. చావఁ గలదె మీరు గడుం, జేవగలిగి జలధి దాఁటి సీతఁ గనుఁడు ల
జ్జావనతవదన యగుచుం, జావఁ దివిరియుండె లంక జానకి యనుచున్. 497

క. ఖగపతి యొకండు దెల్పిన, విగతప్రాయోపవేశవృత్తులమై వా
ర్ధి గనుంగొని ననుఁ బొమ్మని, నగచరు లనుపంగ దాఁటినాఁడఁ బయోధిన్. 498

వ. ప్లవంగసంప్రార్థితుండనగు నేను బూర్ణశతయోజనవిస్తీర్ణఘూర్ణమానమహార్ణవావతీర్ణుండనై సమయానురూపరూపంబున లంకాపురం బంతయుం బరిశోధించి రావణుండు నీతోడ దుర్భాషణంబు లాడునప్పు డవసరజ్ఞుండనై వానిపయిం దెంపు సేయక యియ్యశోకానోకహాగ్రంబున నొదిఁగియుండి యద్దురాత్ముండు వోయినం బొడగట్టితి నని పలికి యెల్లవానరుల నుద్దేశించి వర్ణియవ్వారవర్ణిని కిట్లనియె. 499

ఉ. ఆదటఁ భూరిధైర్యకనకాచలు లందఱుఁ గామరూపు ల
య్యాదటఁ సారవేగహసితానిలు లందఱు శూరులైన వా
రందఱు నిన్నుఁ గాంచి చరితార్థత నిమ్మెయి నొందియున్న వ
న్నందరు పుణ్యకీర్తుల ననం దరుచారికి బ్రహ్మచారికిన్. 500

ఉ. అన్నలినాక్షి యిట్టనియె నన్న భవద్వచనోద్గమత్సుధా
క్లిన్నమనస్క నయ్యు నిటుఁ గృత్రిమవానరరూపమూని మా
యన్నను గాఁటియుంబలుప నారయు రక్కసుఁ గాఁగ సంశయా
పన్నహృదబ్జనై యొకఁడు వల్కెద నేర్పడ విన్నవించెదే. 501

క. రాముని దూత ననుచు నా, తో మొదలం బల్కితివి ముకుందవు నాకు
న్నీమోముఁ జూచుటం జే, తో మోదంబయ్యెఁ బల్కు దున్నితోడన్. 502

ఉ. రాముఁ డరణ్యభూములకు రాఁ బనియేమి తదీయ భీమసం
గ్రామములోన నెవ్వరు పరాజితులై రతఁడే వ్రతంబుపైఁ

ప్రేమవహించియుండు మహీభృత్స్వామిఁ డే క్రియ మేనివాఁకు త
త్స్వామియుఁ దమ్ముఁడుం గడుఁ బ్రసన్న మనస్థితి నున్నవారలే? 503

క. సౌమిత్రి యెట్టివాఁడొ, రామునకు నవిజునకుఁ జిరంబగు సఖ్యం
బే మెయిఁ గల్గె బయోనిధి, నేమెయి దాఁటితివి తెల్పు మేర్పడ నాకున్. 504

చ. అనవుడు నమ్మనిట్లనియె నమ్మ భవత్పతి కైక వాంఛకై
కనలక వచ్చెఁ గానలకుఁ గయ్యము సేయఁగ నోడె భార్గవుం
డనితరసాధ్యుఁ డాన్నృపతి కాతనిచే మృతినొందిరట్టి వా
రవయులు తాటకాదులు ఖరాదులు ఘోరవనాదు లంగనా. 505

వ. మఱియు నమ్మహాధనుర్ధరుచే మారీచాదు లనేకులు బంచత్వంబునొందిరది యట్లుండనిమ్ము. 506

క. వాలమునఁ గ్రూరు రావణుఁ, గీలించి చతుఃపయోధికీలాలములం
దేలించిన యవ్వాలిం, గూలించె నరేంద్రుఁ డొక్కకోల న్లీలన్. 507

క. సువ్రత రామున కేది ప్రియవ్రతమని తొలుత నడిగి తాలింపుము స
త్యవ్రత మది యొకఁడేల పతివ్రత ప్రియమేకపత్నీవ్రతముఁ గడున్. 508

క. రాముఁడు మేచకజలద, శ్యాముఁ డతఁడుఁ దమ్ముఁడుం బ్రసన్నప్రాయులై
కామిని యెట్లుందురు నీ, తేమినిఁ గదు జిత్తములు చలించుచునుండన్. 509

తే. లక్ష్మణుఁడు లక్ష్మణుఁడు కృతలక్షణుండు, తప్తకాంచన భాసురధామ దేహుఁ
డన్నయెడఁ భక్తిగలఁడు నిన్నాత్మఁ దలఁచి,తలఁచి వగనొందు హాతల్లి తల్లి యనుచు.

క. నీవు ధరాపతితంబులు, గావించిన భూషణములు గాన్పించిన సు
గ్రీవునితో బద్ధస్నేహావేశితబుద్ధి యయ్యె నధిపతి మిగులన్. 511

వ. రామలక్ష్మణులకు నావిషయంబునం గల యనుకంపావిశేషంబును మజ్జనకుండగు
జగత్ప్రాణుని ప్రసాదంబు కలిమిం గడలిఁ గడచి వచ్చితి మదీయాగమనంబున
కెదురు చూచుచున్న కపినికరంబు కరంబు నానందంబునొంద న్భవదనుగ్రహంబు
నం బయోరాశి మరల నతిశ్రమంబునం దాఁటిపోవంగలవాఁడ నని పలికి వెండియు

క. భూవిభుఁ డనంతుఁ డనఁదగు, నావిభుతమ్ముఁడు ననంతుఁ డతులితబుద్ధి
న్నీవు ననంతవు తుదకు,న్నావు ననంతటను జనకనందన ప్రీతిన్. 513

చ. వెడవెడ నమ్మ యిట్లనియె వీరవరా మదధీశునాజ్ఞ ని
జ్జడధిఁ గ్రమించి వచ్చినయసాధ్యబలాఢ్యుఁడ వౌదు రామభ
ద్రుఁ డిటకు వచ్చి దానవులఁ ద్రుంచి బలంబెసలార నన్ను నె
ప్పుడు గొనిపోక గల్గు నను బోటికి దుఃఖము పారమొందునే. 514

సీ. ఇందాఁక నను ఁ బాసి యెందుండితి వటంచు, విభుఁ గూర్చ వచ్చితివే యటంచుఁ
గడలి నెవ్విధమునఁ గడచి వచ్చితివంచు, నీ వెట్లు పాసితి నృపతి నంచు
నీవున్నఁ దెచ్చె నే రావణుం డనుచును, రాముండు నను జూడ రాఁడె యనుచు
రామలక్ష్మణులకు క్షేమమే యనుచు న న్నెంత పాపప్రజన్మమో త్రికనుచుఁ
గీ. చేర్చు హృదయమున శిరమునఁ జేర్చికొనుచు, భర్తసన్నిధి వడసిన పగిది నధిక
మోహమందుచు మణియు నమ్ముద్రికాళి, నీకు నామెచ్చి పల్కెఁ బృథ్వీతనూజ.
క. మేనికిఁ బ్రాణముఁ దెచ్చితి, దానవు మద్ధితమునకు నిదానవు గానం
దానవుఁ గూల్ప నరేంద్రుం, డేనవు నవుఁ బాటుగల్గదే తేనన్నన్. 526
క. నీవిట వచ్చినపుడు నీ, తో విభుఁ డేమనియె నన్నుఁ దోడ్కొనిపోవం
గా వచ్చితివే యని యా, పోవని మూఁకల్లు నిగుడ్చెఁ బొంగుఁ జెలంగన్. 527
వ. ఇవ్విధంబున నతిరిక్తహర్షపరాయత్తచిత్తయగు నమ్మత్తకాశిని యుత్తరచరోత్త
మున కిట్లనియె. 528
క. నీవసమానుండవు నే, నే విధమున నీ ఋణంబు నీఁగుదుఁ మనిసం
భావిత నీకతనఁ బునర్జీవిత నైతిం గదుం బ్రసిద్ధముగాఁగన్. 529
ఉ. నా పడుపాటులెల్లఁ బవప్రియనందన చూచినాఁడ వ
బ్బూపతితోడఁ దెల్పి రఘుపుంగవుఁ దోడ్కొనివచ్చి రావణు
న్నూపటిఁ జూపరు ల్వొగడ రూఢివధింప నొనర్చి నన్ను సం
ప్రాపితశైర్యఁ జేయుము కృపాపర మ్రొక్కెద వేయు నేటికిన్. 530
వ. అనుటయు నప్పవనతనయుం డమ్మలికమ్ముద్రమ్మదేవి నయ్యమ్మకు నెయ్యమ్ము
గా నిట్లనియె. 531
క. ఖరనఖరంబుల నరహరి, హిరణ్యకశిపున్వధించు నేడై అదోఁప
న్ఖరశరంబుల రాముఁడు, దురాత్ము రావణువధించు దురమునఁ దరుణీ. 532
ఉ. సందియమేల రాముఁ డనుజన్మసమేతముగాఁ బ్లవంగపు
ల్పొందడిసేయ నెట్టియిన సాగరము న్వెస నిగ్రహించి దై
త్యుం దును మాడి యంతఁ బరితుష్టమనస్కత నొందియాతఁడో
సుందరి నిన్నుఁ గైకొను విశుద్ధచరిత్రవు శోక మేటికిన్. 533
వ. అని పెండియుం దగిన వచనంబుల నూఱడించి. 534
క. నారాక కెదురు సూచుచు, నీ రాకఁ దీగభూమి నిలుతురు ప్లవగు
ల్వారా కపివర్య యనుచు, నోరా కాచంద్రవదన యొసఁగుము సెలవున్. 535

క. నాపైఁ బ్రాణములిడి రఘు,భూపతియుం దదనుజుండుఁ బూవసుతుండుం
జూపులు దీపులుఁ ట్టఁగ, భూపుత్త్రీ మాతు రిపుఁడ పోవఁగవలయున్. 536

ఉ. జానకిఁ గాంచి వచ్చితి నసాధ్యజవోన్నతి లంకనంచు భూ
జానికిఁ దెల్పఁగం గడు నిజమ్ముగ నమ్మఁగ నీకు మ్రొక్కి ప్రత్యభి
జ్ఞానము నావుడుం జనకకన్యక సంతసమంది యమ్మరు
త్సూను మొగంబు గాంచి పరిశుద్ధపరిస్ఫుటభాషణంబులన్. 537

ఉ. భాసురచిత్రకూటకృతపర్ణకుటీరమున న్వసింపఁ గా
కాసురుఁ డేఁగుదెంచి నను నార్త్రియొనర్ప నరేశ్వరుండు ని
ష్కాసితుఁ జేసె వాని నొకకన్నువగిల్చి యెఱుంగ రెవ్వరుం
బ్రాసవిదూర యివ్విధము రాఘవు లిర్వురు నేనుఁ దక్కఁగన్. 538

క. కావున నీ కెఱిఁగించిన, యీవిధము నరేశ్వరునకు నేర్పడఁజెప్పంచో
నీవు నను గాంచి వచ్చుట, భావించుటఁ జూచి దెలియఁబలికి ముదమునన్. 539

క. వీఁడు ధరానందనఁ గ, న్నాఁడని రాముండు మిగుల నమ్మును సతీ
చూడామణి యొసఁగెన్నిజ, చూడామణి బ్రహ్మచారిచూడామణికిన్. 540

ఉ. నూత్నసరోజగంధి సువనోహి తమూర్తికి నిప్పృథి న్నిన్నో
రత్న మొసంగినం గొని శిరంబునఁ జేర్చుచు నమ్మణిన్ మహా
యత్నముతోడఁ దాఁచి పవనాత్మజుఁ డెంతయు వేడ్క మానినీ
రత్నము వీడుకోల్కొనఁడసి రాత్రి సవంశపరిక్షుయార్థియై. 541

క. దుర్భరపరుషాక్షుఁ యుత, దుర్భ్రమలు జనకకన్యతో రావణుఁ డ
బ్భార్భటినాడ పినట న్నా, దుర్భర క్రోధవహ్నిపరవశాత్ముండై. 542

వ. సహింపక హనుమంతుండు లంకాపురాభిముఖుండై కేళీవనోద్యానంబు చొచ్చి. 543

క. తోఁటలుఁ బూఁదోఁట లనఁటి, తోఁటలు ననఁదమలపాకుఁదోఁట లగల్చె
న్వాటములు వాజిశాల, వాటము లురువేదికాకవాటము లూడ్చెన్. 544

వ. వెండియు. 545

సీ. విస్తారఫలతరువిస్తారములు రాల్చె సాలము ల్సాలము ల్వ్రేఁగలపు
సారమ్ములైన కాసారమ్ములు గలఁచెఁ గొమ్మలు గొమ్మలు గూలఁద్రోయు
గోపురస్పర్ధులు గోపురమ్ములు వ్రాఁకు ఖగముల ఖగముల కడకుఁదోలెఁ
బోటుల గుండుల పోటులఁ బెదరించు ధామము ల్ధామము ల్నమడఁచెఁ

గీ. దావలమ్ముగ భద్రదంతావలమ్ము, లున్నశాలలు నురుమాడు నుగ్రవాల
జనితవాతూలవిభ్రమజ్జలదశకల, సంభవుండగు బవమానసంభవుండు. 546

క. వారనికింక న్లంకాద్వార మధిష్ఠించి దైత్యవారము దన్నుం
దూరమునఁ గాంచి సింహకిశోర మనుచు మిగుల భీతిఁ జొచ్చి కలంగన్. 547

క. విహరించుచుఁ బ్రాణంబు లపహరించుచునున్న ప్లవగపతిఁ గాంచి భయా
వహమగుచుఁ బాఱెఁ దనుజని, వహము పులిం గాంచి కదుపు వాఱువడువునన్.

ఉ. అంతం గొందఱు మానవాదనులు రక్షోధ్యక్షునిం గాంచి య
త్యంతంబున్ భయశోకవిహ్వలాత్ములగుచున్ హాహాధ్వను ల్మీఱ ని
స్స్వాంతోద్వేగంబుగ నిట్లు పల్కిరి దశాస్యా పట్టనద్వార మా
క్రాంతంబయ్యెఁ జుమీ యొకానొకప్లవంగస్వామిచే నెంతయున్. 549

చ. కటకట యిట్టి యద్భుత మొకప్పుడుఁ గానము బ్రహ్మచారిమ
ర్కటుఁ డొకఁ డీవు దెచ్చిన ధరాసుతకుం దగు మాటలాడి యు
ద్భటగతి నిందు వచ్చి మనపట్టణతోరణ మెక్కి క్రవ్యభు
గ్భటకమలాకరంబుఁ గలపం దొడఁగెం గరివోలె నుగ్రుఁడై. 550

క. ఈ పవనములు పవనహతి, న్వ్రప్రలాపతితంబులైన విధమున మిగుల
న్నొవ్వులతదర్థితవాలవి, నిపాతితములయ్యె నొక్కనిముసములోనన్. 551

క. కపిమాత్రుఁడు గాఁడు వృషా, కపిమాత్రుఁడు గాని లోకకంటక వాని
న్నిపుణత శిక్షయొనర్పక, నృపఁ జూచితివేని జాఁగీడగు మనకున్. 552

వ. అనవుడు. 553

ఉ. కన్నుల నిప్పులొల్క దశకంఠుఁ డకుంఠితబాహుసత్త్వసం
పన్నులఁ గామరూపుల నపారజవాఢ్యులఁ బల్వుర న్నిరా
పన్నుల దైత్యులం గని కృపారహితాని మర్కటేశుని
న్మన్ననఁ గల్పిరండు మిము మన్నన సేయుదు నంచుఁ బల్కినన్. 554

క. ధృతిఁ గతిఁ దన్సేనా, చతురంగములను మృదంగశంఖారవముల్
చతురాశాధ్వరితముగఁ, జతురత నడిపించి రసురసైన్యాధిపతుల్. 555

వ. ఇట్లు సైన్యంబులు నడిపించుచు. 556

ఉ. దంభులు జంభజిద్రిపు లుదగ్రభటేశులు నేకుటప్పురు
త్సంభవుఁ జుట్టుముట్టి నిశితప్రదరంబుల నొంపఁ దోరణ
స్తంభము జృంభితుం డమితసత్త్వుఁడు వాయుతనూజుఁ డాహవా
రంభుఁడు పెర్చి కృతానిశరమ్ముఁ గరమ్ములఁ బట్టి వైచుచున్. 557

తనుజులు వాఁడిమ్ములకధంబునఁ బైఁగొని బాణవర్షము
న్ననిచినఁ గొండకైవడి వినిశ్చలవృత్తి వహించి వాలసం

జనితమరుద్ధతిం దనుజసంఘమురుద్ధతి మాన్చి వెండియున్
మొనసిన నుగ్రుఁడిట్లుఁ గపి మూర్తి వహించె ననంగ రాల్పఁడై. 558

క. పదవాలకరనఖరముల, నదిమి విసర్రివేసి వచ్చి యశ్వశ్రేణిన్
మదగజతురగస్యందన, పదాతులహరించెఁ బవనభవుఁ డొకమాత్రన్. 559

వ. ఇవ్విధంబునం జతురంగంబులం బొరిసమరి. 560

ఉ. రూఢధృతి న్విరోధుల శిరోధుల వాలము చుట్టి తోరణా
రూఢుఁడు వాయునందనుఁడు రోదసి పిక్కటిలంగ నార్చుచుం
గాఢజవంబునం జలధిఁ గల్పుచుఁ బేర్చుచు నివ్విధి న్నని
త్రైవిధిమ ఖేచరాలి దనుఁ బ్రస్తుతిసేయఁ జెలంగి యాడుచున్. 561

ఉ. వారక వెండియుం దనుజవారము దన్నెదిరింప నయ్యెడ
ద్వారముఁ జేరఁబుచ్చుచు నవార్యబలోద్ధతిమై తగ న్బహి
ర్ద్వారముఁ జేరి నిల్వఁ దనవారల చావు గరంబుఁ బందలా
వారలచే నెఱింగి పరివారముఁ గాంచి దశాస్యుఁ డార్తుఁడై. 562

ఉ. ఘోర విచిత్ర మొక్క ప్లవగాధముఁ డిందఱ రాక్షసోత్తమా
చారుల సద్విచారుల విచారవిమానులఁ జంపె నద్దురా
చారునిఁ గూల్చి రండని ససంభ్రమత న్నియమించెఁ బాపవి
స్తారచరిత్రులన్ దివిజశత్రుల నేడ్వురమంత్రిపుత్రులన్. 563

ఉ. తప్తహృదబ్జుఁడై విభుఁడు దమ్మిటు పంపఁగ సత్వరంబున
న్నప్తహయోగ్రమంత్రిసుతసప్తక మెంతయు నుబ్బుమీఱ న
త్తప్తభుజుల్ నిశాచరులు దారుణరావులు గూడి కొల్వ సం
తప్తసువర్ణభాసురరథద్విరదాశ్వచమూసమేతమై. 564

క. చని పవనతనూజుం గనుఁ, గొని పొడువుం డేయుఁ డనుచుఁ గొల్లలసేయన్
హనుమంతుఁడు తనమనమున, ననుమాన మొకింత లేక యతిమాత్రుండై. 565

క. గొదకొని మదకరిపదముల, జెదఁ జదిపినభంగి శుక్రశిష్యబలంబుం
జిదురుపలుచేసి మద మెదుగ దనుజమంత్రిసుతసప్తకముఁ గిట్టి వేసన్. 566

క. వాలము కరవాలముగా, సాలము గావించె మర్కటాధ్యక్షుం డా
భీలముగా దనుజులకుం, గాలముగా నప్పు డీనుపగాలం బగుచున్. 567

గీ. ఇట్లు పోరాడి యిరువుర నెత్తి కేలఁ, బట్టి శిరముల నొండొండఁ బగులవేసి
దానవామాత్యపుత్రసప్తకము నొక్క, పెట్టఁ బంచత్వ మొనరించి పేర్చి యార్చి.

క. పంచత్వం బొనరించె న, పంచగ్రీవుఁ బంచభూతసహోత్థులం ద
త్పంచకము మంత్రిపుత్రక, పంచత్వం బెఱిఁగి దనుజపతి మతి వోవన్. 569

క. ప్రాప్తసువాలభ్రమణ, వ్యాప్తజగత్త్రాణఘనసమీరసుత హనుమ
ద్దీప్తాగ్ని మంత్రిపుత్రక, సప్తకవన మిట్టులేర్చె సరభసవృత్తిన్. 570

వ. క్రమ్మఱ నెప్పటి యట్ల తోరణస్తంభాధిరూఢుం డై విజృంభించుచుండె. 571

క. హతశేషులచేఁ దనమంత్రితనూజులు దెగుటవిని యధికరోషసమ
న్వితుఁడగు రావణు నానతి, నతనిసుతుఁడు వెడలె నక్షయబలుండగుచున్. 572

సీ. కాలకింకరసదృక్కాలదేహంబులఁ గ్రాల పార్శ్వయుతుల రాక్షసులు నడువ
రథనేమిహయఖురసింధురఖురపదోద్ధితరజము నాకధునిఁ గర్దమము సేయ
నింతవిక్రమశాలి నీకఁ జూడనని తండ్రి తనలోన నమితమోదంబు నొంద
నక్షయుం డితఁడు ఫాలాక్షుఁ డుఁడుపత్యసమృద్ధవని సురావలి వడంక

గీ. నధికరాక్షసవంశకుటుంబుఁ డెల్ల, వితతముగఁ బక్షులపసవ్యగతులఁ దిరుగ
నరదమునఁ డెక్కి యున వ్రద్దలాడుచుండ, నెలమి రావణనందనుం డిట్లు వెడలె

క. అక్షయుఁ డీక్షించె న్హర్యక్షసదృక్షు నృపక్షరక్షాదక్షున్
న్పృత్తచరాధ్యక్షు నసృగ్రక్షశ్శిక్షాపదక్షు రాజితపక్షున్. 574

వ. కనుంగొని. 575

క. తలపడి తనకంటె న్మును, దలపడి పోరాడి పరఁ దనయుని బాహా
బలజలధిమగ్నమగు నిజ, బలజలధిం గాంచి రోషభరితుం డగుచున్. 576

క. కోల లసురుఁడేయ న్వారి, గోలలక్రియ హనుమ లెక్కగొనక బలువిడి
న్వాలములు గురియ నసురక, సాలంబులభంగి వానిఁ జక్కడఁచి వెసన్. 577

ఉ. వెండియుఁ జండకాండములు వ్రేసిననాజ్యము గ్రుమ్మరింపఁగా
మండెడు నగ్నివోలె హనుమంతుఁడు పేర్చి దశాననాత్మపు
త్రుం డెరచావుచావ నొక దొడ్డశిలం దలఁ వ్రేయ నొచ్చి యా
తం డవశత్వ మొందియుఁ బడంపడి విక్రమదోహలంబునన్. 578

చ. మనుజవిరోధి తన్ను వెడమాయలు వన్నినఁ గోపమెత్తి య
ద్దనుజవిరోధి యక్షయకృతప్రకృతు ల్దెగవొందనీక యా
తని మెడ నాత్మవాలకలితమ్ముగఁ జేసి ధరిత్రి వ్రేయుడుం
గనుఁగవ నశ్రుధార లొలుక న్విలపించుచుఁ గూలె సోలుచున్. 579

క. క్షయరహితుఁ డనిలసుతుఁ డక్షయుం రహితప్రాణుఁ జేయఁ గ్రమ్మఱి దనుజు
ల్భయవృత్తిం బుత్రపరిక్షయ మెఱిఁగించుటయుఁ బఙ్క్తికంఠుం డార్తిన్. 580

క. అక్షయుఁడు దైత్యసుపుత్రుఁ, డక్షులకును గమ్యోరక వేగముల తలరిగిన
రక్షకు నరాధ్యక్షు బ్రతి, శిక్షింపఁగఁ దేరటుఁ జింతమునంగన్. 581

చ. అతిరిపుమానసం దకనునఁ గ్రగుఁ డింద్రజిహ్వాయునుం ద
్రడికలఁపు దీప్తి నేరని వడిం జతురంగచమూపమేతుఁడై
వితతరథప్రబద్ధహయవేగముఁ జాపము మెచ్చఁ ద్రోణ
స్థితు హనుమంతునిం దొడరుధీరత వెల్వడి యొం దురుద్ధతిన్. 582

ఆ. అట్లు వెడలి యక్షకుమారకు వకతఁ, బవ్వుఁ గాంచి పవనసాహసుఁడుఁ
జేరనరిగి జంభజిజ్జైత్రుఁ డిట్లని, పలెకెఁ గనులనిప్పు లొలుకుచుండ. 583

ఉ. ఇక్కడ వచ్చి కొందఱ విహీనపరాక్రముల న్వధించి నీ
వెక్కుడు సత్త్వశాలి వని యెంతయుఁ బొంగెదు మచ్చరాహతిం
జిక్కితివయ్యె యొక్కి నసాన్యుఁడవంచుఁ దలంపవచ్చు నం
చక్కటి నాతుఁ డాత్మ చతురంగములం బొరికొల్ప నుగ్రుఁడై. 584

సీ. గంధాంధసింధురఘనఘటాబంధము ల్బ్రాయుఁ గేసరికిశోరం బనంగఁ
బటుతరోచ్ఛ్రితవీరభటవిమర్దనకేళి వర్తించు నలయుగ్రమూర్తి యనఁగ
రథరథిసారథి ధ్వజకోటుల నీవ లావలఁ గావించు హరి యనంగఁ
బజ్జకకటుర దైత్యపతిని దోఁక బిగించి వనధిఁ ద్రోఁ బడ ముంచు వాలి యనఁగ

గీ. నట్లు సంగరకేళీవిహారమగ్గ, లింపఁ దన్ను నిలింపు లగ్గింప మెఱయు
చున్న పవనతనూజాతు నురుభుజావి, జృంభణమునైన కయ్యెప్రజితుఁ డలిగి. 585

మ. తనపై సాలదయంబువైన వదికుంతంతన్ని వర్తించి యా
తనిపైఁ దీక్ష్ణశరంబు లేయుటయు దైత్యుండాను భీతిల్ల న
శ్శని కాయంబులు మిక్కిలి నెంతయు సరోషస్ఫూర్తి నవ్వానరేం
ద్రుని టాలాంబుజము స్వలీముఖకులం దూటించి వెల్లార్చెనన్. 586

ఉ. వానరుఁ డొక్కగండశిల వైచినఁ జూర్ణమొనర్చి యెంతయుం
బూనికవైమదిన్యశరము ల్హనుమంతుఁడు పొల్లుసేయ న
ద్దానవుఁ డంబుజాసనకదంబము దేవకదంబమెల్ల వా
హౌనినదంబు సేయఁగ రయంబెసఁగం దెగవాపి యేయుచున్. 587

క. మంతుసమావేశితు హను, మంతుం జుట్టికొని బ్రాహ్మ్యమగు నయ్యస్త్రం
బంతఁ బ్రబంధించెం గడు, బంతంబున బ్రహ్మ యగగ వల్లలనాడన్. 588

స్రగ్ధరావృత్తము. భీమబ్రహ్మాస్త్రపాశాపిహితు హరిసుతుం భీమకాటోపబర్హి
ష్ఠప్రామేయప్రకాశు న్విభగచరితు నక్షోభ్యవక్షూద్రుమవ్యా
ప్తిప్రామిత్యప్రతాపు న్పృథుమహితయశోర్ధి న్మహాబాహు దీర్ఘా
యుష్మంతుం బాపఁ దద్దైత్యుఁడు గని యధికోన్మత్తుఁడై చేరి యంతన్.

క. పట్టికొని నిజరథంబునఁ, బెట్టికొనియెఁ గానియితఁ డభేద్యుఁ డెవరికిం
బట్టువడఁ డివ్విధంబునఁ, బట్టువడుట లీలయనుచు భావింపఁ డెవన్. 590

వ. ఇట్లు దురభిమానంబున నవ్వనచరేంద్రు నిజరథంబునం బెట్టికట్టి మహానందంబున శంఖ
భేరీ మృదంగ ప్రముఖ నిఖిల జయధ్వానంబులు నింగి ముట్టం గదలి. 591

చ. పురమున నెల్లవారుఁ దను బోరనఁ గీర్తనసేయ నాతఁ డు
బ్బురమునఁ దేల నిట్లు కపిపుంగవుఁ దోడ్కొనివచ్చి రాక్షసే
శ్వరునకు మ్రొక్కి చూడుము నిశాచరనాయక కట్టితెచ్చితిం
దరుచరునంచుఁ జూపిన ముదంబునఁ బుత్రకుఁ గౌఁగిలించు మున్. 592

ఉ. తోరణమెక్కి రక్కసులఁ ద్రుంచుచు నక్షయుని న్వధించి యా
ధోరణముఖ్యులం జగిపి దోర్బలనిర్జితశక్రజిద్వైనసీ
తోరణమావరించుటకుఁ దోఁచినవానరుఁ బట్టితెచ్చితే
కౌర కుమార నిన్నుఁ గొనియాడఁగ నేరితరంబు చెప్పుమా 593

వ. అని మఱియుం బ్రియనందను నపరిమితమధురవచనంబుల నగ్గించి రక్షోధ్యక్షుండు
వృక్షచరాధ్యక్షు నిరీక్షించి రూక్షాక్షరపరుషవచనంబుల నాక్షేపించి. 594

క. ఎవ్వఁడ వెవ్వఁడు పుత్తెనీ, వివ్వనరాశిం దరించి యేతెంచితి ని
న్నెవ్వఁ డిటఁ బంపె ననవుడు, నవ్వనచరుఁ డసురుతోడ నవ్వదరంగన్. 595

ఉ. రామునియాజ్ఞఁ జెచ్చితి ధరాసుతఁ గన్గొన వారిధి న్రఘు
స్వామియనుగ్రహంబున జవంబున దాఁటితి వాయుపుత్రుఁడ
న్నీమది నొవ్వ దైత్యుల ననేకులఁబట్టి వధించితిం గపి
స్తోమము సంతసింప నినుఁ జూచి భవత్పురిఁ గాల్చి పోయెదన్. 596

వ అని పలికి వెండియుం. 597

క. అవినీతిపరుఁడ వగుచు ని, న్నవనీపతి సంహరించి యవనీతనయా
నవనీతదేహఁ గొనిచను, నవశ్యమున రాక్షసేంద్రుఁ డాగ్రహుఁడవు మన్. 598

క. ఈతరుచరవరుఁ గపటా, న్వీతుఁ వధింపుఁ డనవుడు విభీషణుఁ డురుని
ర్ధూతాఘుఁడు వారించెం, దూత యవధ్యుఁడని పలుకుదురు బుధులనుచున్. 599

క. ఈకరణి నివారింప మ,హాకోపము నొంది రావణాసురుఁ డసురా
నీకములఁ గాంచి యీకపి, తోఁకకు నగ్గిఁ దవిలించి త్రోలుం డనినన్. 600

మ. దనుజుల్ తైలవిలిప్తవస్త్రవితతిం దద్వానరాధీశవా
లనిబద్ధం బొనరించి ఘోరగతిఁ గీలాప్రస్ఫురద్ధవ్యవా
హనుఁ గీలించి సురేంద్రజిద్విహితబ్రహ్మాస్త్రప్రబంధప్రమో
చనువాతాత్మజుఁ బొమ్మ పొమ్మనిరి హాస్యంబుల్ ప్రసంగించుచున్. 601

ఆ. ఇట్లు సోఁకుమూఁక లెలమి నవ్వుచుఁ దను, జిష్ణుసంతసింపఁ జేరి వాని
తోఁక రవులఁబెట్టి త్రోలఁగి పొమ్మనుటయుఁ, గాలిచూలి మిగులఁ గసరుకొనుచు

క. కీలిప్రకలితనిజఘన, వాలాలాతభ్రమణవివర్ధితవహ్ని
జ్వాలాజాలుఁడై యా,గ్గోలాంగూలోత్తముఁడు సకోపుం డగుచున్. 603

క. పురమునఁ గల బంధుర సుం,దరమందిర వారణాయుధస్థలగర్భా
సురుచిరలసత్ప్రాసా,దరథంబుల కొక్కెవెట్టి దహనము వెట్టెన్. 604

క. పొగవెదలి యెల్లదిక్కుల, బుగబుగ మనుమంటు లెగయఁ బోరిబోరిఁ దనుజా
ల్యాగనొంది ప్రత్తికఁ ఘరుఁ, దెగఁ జేరి సతిసీత నేల తెచ్చె నటంచున్. 605

వ. అంతం గ్రమక్రమంబున సప్తార్చి ప్రవృద్ధార్చియై పేర్చి. 606

క. దళమగు వహ్నిజ్వాలలఁ, జళ పెళయని ఱితిగి సౌధబృందము పడఁగా
గళవళ మందుచు హుతభు,క్ప్రళయముగా వగచి మిగుల భయపడి రసురుల్. 607

గీ. రామకోపాగ్ని యిట్లు దుర్ఘటశేవర, ఘూని లంకాపురము నేర్చు చున్న దనఁగ
వాయుతనయుండు గొఱప్రైవడి విజోక, వాలదండంబు ద్రిప్పుచు వర్తిలంగ. 608

సీ. ధామము ల్స్నిగ్ధధూమధామముల్ చేసి జోకమరుపూఁదోఁటలు గమఱఁజేసి
వర్త్మంబులను గృష్ణవర్త్మంబు లొనరించి భూతికాంతయును విభూతిఁ జేసి
కలశాలెల్ల నింగలశాల లొనరించి జాలంబులను శిఖాజాలముంచి
యవరోధ మధిఃధూమావరోధముఁ జేసి పటురూపములు విరూపము లొనర్చి

గీ. మండపంబులు మండెడు మంటఁగలిపి, గుమ్మములనెల్ల నిప్పులు గుమ్మరించి
కాయమానంబులు ధగద్ధగాయమాన, ములుగ నొనరించె హరివాలకలితవహ్ని. 609

వ. ఇట్లాత్మవాలాభీలవహ్నిజ్వాలాజాలంబుల వాతూలబాలుండు లంకాపుటభేదనం
బు భస్మంబుఁ గావించుచుండె నట్టియెడ. 610

ఆ. కంటిమంటఁ దోఁక కంటించికొనివచ్చి, క్రాలుచున్న కాలకాలుఁ డనఁగ
నీతఁ డొప్పెననుచు హృదయంబులు చలించు, చుండ నసురు లుష్ణ మోర్వలేక.

చ. కోలఁకులఁ జేరువారుఁ దమకుం బొగచుట్టిన నగ్నివారిక
న్గోలుకులఁ గాఁచువారుఁ గపికుంజరుఁగాంచి భయాతిరేకులై
కేలఁబులఁబోలువారుఁ గడుఁగేకలు వెట్టెడువారు నెంతయు
న్వేలవెలఁబారువారునయి విహ్వలమందిరి రాక్షసాధముల్. 612

సీ. బడబాగ్ని జడనిధి వెడలి లంకాపురి, నేర్చుచున్నదని యూహించువారు
నదె విభీషణుఁడు పుణ్యాత్ముఁ డాతని యిల్లుఁ, జేరదగ్గని వీక్షించువారు
నీకపిలయరుద్రుఁ డిది ప్రళయంబుగా, నితరంబు గాదని యెంచువారుఁ
గొని తెచ్చికొనినట్లు క్రోఁతతోఁకకు నగ్గిఁ, బెట్టి నేలయటంచుఁ దిట్టువారుఁ
గీ. బూర్ణమై మండుచు హుతభుక్షిఖాక, లాపముల మ్రందువారు విలాపమందు
వారు బంధులఁ బేర్కొనువారుఁ బాలు, వారునైరక్కసులు గడవగలఁబొగులు. 613

క. వాయుసుతుండేసకొల్పఁగ, వాయుసఖుండు పేర్చి ఘరమవారణ నేర్చె
న్వాయుజవాశ్వరథభర, ధ్వాయత కేతననికేతనాదులతోడన్. 614

గీ. కపికులాధీశ్వరుఁడు దాపికాఁడుగాఁగఁ, బొదలుధూమతమంబునఁ బురమునొచ్చి
ముఖ్యధనధాన్యపరిధానములు హరించె, గాలిచెలికాఁడు జిచ్చను కన్నగాఁడు. 615

ఆ. సమనివార్యభావిసాగరబంధన, సాధనోపకరణసవనముల
నధికయత్న మొప్ప నంగారములు గాల్చె, చందమొందె బవననందనుండు. 616

వ. తదనంతరంబున నిజలాంగూల ప్రభవ శోణిమధన సముద్భూత హావనీయాగ్నిం బూర్ణసుధాశనరుధిరాజ్యధారాచ్ఛటాసేకంబునం బ్రవృద్ధంబు గావించి మంత్రిసుత సప్తకాక్షకుమారాది పశువిశసనంబుఁ గావించి వేల్చి పురందరాది బృందారక సందోహంబు మహానందంబునొంద రక్షస్స్త్రీశాప మంత్రంబులతో లంకాపురంబుఁ బూర్ణాహుతిఁ గావించి తద్ధూమాఘ్రాణంబున ఖచర కిన్నరీ కాంతాసంతానంబులు మొదల సాంజనేయ సోమయాజి యాజిలీలామఖంబు నిర్విఘ్నంబుగా నానందసాగరావబృథస్నానంబు గావించి శాంతిఁ బొందివరలు వాఁడై తనమనంబున. 617

క. వాలాగ్నికీల మరుత్సై, వాలగతిం జల్లఁగఁ దసుధాతనయో
ద్వేలకరుణాసుధారస, మూలంబని తలఁచికొని ప్రమోదభరితుఁడై. 618

క. తనసేమముఁ గోరెడు భూ, తనయ యిఁక గ్రుణమిల్లి పోయెదనని తదాజ్ఞం
జనికాంచె వారిరాశిం, జనితపరమశైత్యలతితజనతాక్లేశిన్. 619

ఆ. కనిన వసుంధరించి కాశేరిజాక్షుఁ, డగుచుఁ గడలిఁదాఁటె నగ్రమమునఁ
దన్ను నెదురుసూచు తరుచరవర్యుల, ప్రాణవాయువనఁగ బవనసుతుఁడు. 62(

వ. ఇట్లు మహాబలులగు నిజవీర్యకర్కశలాంగూలవిక్షేపప్రసూతప్రభూతమహాబలంబున సముద్రంబు పాయవడఁజేయుచు ననుదెంచు హనుమంతుని నవలోకించి ముఖ్యులు వన
లోన. 621

మ. చనుదెంచుం బవనాత్మజుఁ గని ఘుర్ఘూరాసతారావమో
దనవీతెంచెడుఁ దద్రవోదితరవం బందుం బ్రతీక్షించు ము
ఁడ నభోభాగము భూమియుం దెసలు నిండన్ బర్వ తేజంబుతో
ఘనుఁ డాకీశవిభుండు వచ్చెఁ బ్లవగోత్కంఠతం బన్తంబుగన్. 622

ఉ. దక్షిణవార్ధితీరము ముదంబెసలారఁగ నిట్లుచేరవ
వ్యాప్తుచరోత్తముం గని ప్రహృష్టమనస్కత వానరాళి ప్ర
త్యుతుసమీరణుం డితఁడటంచు నుతించి కవుంగలించి తా
రాక్షితిపుత్త్రివార్తఁ గని యూఁతఁడు వమ్మ్చెటుకెంగి యుబ్బుచున్. 623

ఉ. గంతులువైచి రంతఁ బ్లవగప్రభు లంగదముఖ్యు లమ్మరు
త్సంతతిఁ జుట్టిముట్టి కడు సంతసమందుచుఁ బల్కిరీవు స
త్సంతతి సన్నుతింపఁగ బలం జలరాశిఁ దరించి ధారుణీ
సంతతిఁ జూచి వచ్చితి వసాధ్యబలుండవటంచు నెంతయున్ 624

క. వేయువిధంబుల సన్నుతి, సేయ న్మనమునకు వేడ్కసేయం దగన
వ్వాయుతనూజుండపుడుఘు, నాయతగర్జాధ్వనిప్రహాసితధ్వానితోన్. 625

గీ. జలనిధిఁ దరించి క్రమ్మఱ సాగరంబు, దాఁటివచ్చుట మొదలుఁ దుదయును గాఁగఁ
గలుగు వృత్తాంతమెల్ల నక్కపివరులకుఁ, దెల్పెనొడికముఁ బుణ్యసద్వ్రతుండు. 626

క. సతి రాజమహాళిఁ బాసిన, గతిఁ బ్రాణముఁ జిక్కఁబట్టి గతిలేమిన సం
గతి సిలుగుమిగులసీతా, సతియుండెది రాజమహాళి సన్నిధిలేమిన్. 627

క. కావున వేవేగ న్మన, మీవిధము రఘూత్తమునకు నెఱిఁగింపుటయుం
బోవుద మనవుడు విని సం. భావనమెసఁగం గపిప్రవరులు ముదమువడన్. 628

క. ఆడుదురుఁ బాడుదురు గుమి, గూడుదురు సమీరజన్ముఁ గొనియాడుదు రే
ట్లాడుదు రోడుదురుత్సర, మాడుదురు మనంబులధికహర్షంబులు గాన్. 629
630

వ. తదనంతరంబున.

ఉ. అంగదజాంబవద్ధనుమదాదు లతిత్వర నమ్మహోదధి
స్సంగతతీరము న్విడిచి శైలశిలామహీరుట్ఛతామహో
త్తుంగనదీవిశాలమగు ఘోరపుమార్గమువట్టి యంత ను
ప్పొంగుచు భల్లుకప్లవగపుంగవు లెంతయు హెచ్చరింపఁగన్.

వ. నిరంతరప్రయాణంబులం జని చని కిష్కింధాపురసమీపగతమధువనంబుఁ గనుంగొని.

క. ఉల్లంబుల వెల్లివిరియ, నుల్లాసలసల్లహరిక నోలాడి కపు
ల్భల్లుకవరు లవ్వనముం, బల్లవ విలువంగఁజొచ్చి భయవిరహితులై. 634

సీ. ఫలములనెల్ల నిష్ఫలములుగా రాల్చి యాకులప్రోవుఁ జీకాకుపఱిచి
విరిపిండిఁగోసి వావిరిపిండి గావించి లతములు గాఁగఁ బల్లవములూడ్చి
మూలంబులెల్ల నున్మూలము ల్గావించి యూడల ప్రేలాడి యూడఁదీసి
కలకంఠములనొప్పు కలకంఠములఁ జోపి గములయి వఱలు భృంగములఁ దోలి

గీ. ఘనలతాకులయములు బరిత్యుఁలు మొనర్చి, కపివరులు వనమెల్లనుఁ గాసిచేసి
రవనిజావార్తఁ దెచ్చిన యట్టివార, లగుట నించుకయేని భయంబులేక. 635

క. మధుపానం బొనరించుచు, మధుపానమొనర్చినట్లు మత్తులగుచు న
మ్మధువనముఁ గాచువారల, విధువనముం జేసి రసమవిక్రమవృత్తిన్. 636

క. జనకజఁ గనుఁగొనఁ జనమును, వనరాశియు కాదె యాడ్డువచ్చె ననుచు న
వ్వనరాశిఁ గాసిచేసిరి, వనచరు లనివార్యశౌర్యవర్తను లగుచున్. 637

ఉ. తద్వనరక్షులాతుణము తాపఁగ గాంచి నమస్కరించి భా
స్వద్వ్యగపుత్ర చిత్ర మొకవార్త వినందగు నంగదాదులు
ద్యద్విరదంబులో యన భయంబు బొమాత్రము లేక వీఁకయు
ష్మద్వనమెల్లఁ గొల్లఁగిల సొల్వడఁజేసి రొకింత లోపలన్. 638

క. క్షితిప్రగతినేము చని ప్లవగప్రభులంగాంచి యడుపఁగా నడుగక వా
రప్రతిహతప్రభావు ల, గప్రతిముఁలు నగుచు నవనిఁ గలిపిరి వనమున్. 639

క. ఇందిందిరములు కుడుచు మ, రందముగ్రోలు నెడ సుస్థిరత నంఘ్రులు మో
పందలఁకునట్టి మధువన, మందఱు వనచరులుఁ గలఁచి యాడిరి స్వేచ్ఛన్. 640

చ. అని వనముం గలంచిరని యాడినమాటకుఁ బొంగి జానకిం
గనుఁగొని వచ్చి రిట్లగుటఁ గాదె భయంబు బొకయింతలేక య
ద్వనమున సంచరింతు రనివార్యపరాక్రము లంచు రామచం
ద్రున కనుజన్ముఁయుక్తునకుఁ దోయజమిత్రకులీనుఁ డిట్లనన్. F41

క. మన హనుమన్ముఖ్యులు రా, మున కేళ్వాగ సంతసంబు వల్లడిగొనఁగా
జనుదెంచి యిపుడు మన్మధు, వనముఁ గలఁచి యాడుచున్నవారట వింటే. 642

• కృతకార్యసిద్ధి నరుదెంచితిరని సంతోషభరితచిత్తులగుచు వా
రతిలోకపరాక్రము లీ,గతి వర్తింతురని మదికిఁ గానఁగ వచ్చెన్. 643

ఆ. అనిన రామచంద్రుఁ డనుజన్మసహితుఁ డ,త్యంతహృష్టమానసాబ్జుఁ డగుచు
నినము స్వామికార్యనిర్వాహకుల కిట్టి, చనవు దగునె కాదె యనెఁ దనూజ. 644

వ. అని పల్కె నంత ధాత్రీపుత్రీకళత్రసుమిత్రాపుత్రులు తదాలోకన సీతానువార్తా
శ్రవణపరాయణచిత్తవృత్తులై యుండి రయ్యవసరంబున. 645

క. ఆవల నిర్విఘ్నమున వీ,తావన మొసరించి పృథురయంబు మెఱయ న
ప్పావని మున్నిడికొని ప్లవ,గావలి సనుదెంచె ధరణి యంతయు నద్రువన్. 646

ఉ. ఆత్మజవాపహాసితరయంబు చెలరేఁగ నిట్లు రా సమీ
రాత్మజుఁ డాత్మజన్మవిజితాత్ముఁడు జాంబవదంగదాదిపు
ణ్యాత్ములఁ గూడి హర్షవినయంబుల ప్రోవన నేగి కాంచె శు
ద్ధాత్ముల రామలక్ష్మణులఁ దంతకశత్రుల సచ్చరిత్రులన్. 647

ఆ. కని నమస్కరించి కరములు జోడించి, తనముఖంబుఁ గాంచి తరుణి ధరణి
తనయ నితఁడు గాంచి చనుదెంచె ననిరాముఁ, డాత్మఁ బొంగ నిట్టులనియె నతఁడు.

మ. కనుఁగొంటి న్నతిసీత నశ్రుకణముక్తాదామసంవీత నే
కనికృత్తాంబరపూత ధర్మసలిలాక్రాంతాననాబ్జాతఁ బా
వనసౌశీల్యసమేత భీమ్యదనుజీవ్యావారసంభీత నా
త్మని రుద్ధోగ్రభవద్వియోగపరిభూత న్ఘోరలంకాపురిన్. 649

సీ. అతిభయదోల్కాసహస్రంబులోపల నొక్కతె రోహిణి యున్నయట్లు
శాతకంటకలతావ్రాతాంతరంబున నొకకదళీవల్లి యున్నయట్లు
ప్రసవితేహామృగప్రకరమధ్యంబున నొక్కటి సారంగి యున్నయట్లు
బహువిధశ్యేననివహసమీపంబున నొకతెడు బాలకపోతి యున్నయట్లు
గీ. ప్రబలమార్జారికాకదంబంబులోన, నొంటిమైఁ గీరి కనకచు నున్నయట్లు
క్రుద్ధదైత్యాంగనాప్రతిరుద్ధ యగుచు, నున్నయది సీత సన్నుతాపన్నజాత.

వ. అని విన్నవించి ధీమంతుం డగుహనుమంతుండు. 651

క. ఏ మరిగి యావ్యదిగ్గత, భూమీధరతరునికుంజపుంజంబుల న
బ్భూమిజ వెదకి కానక, యేమనిపోదుమని వికలహృదయుల మగుచున్. 652

ఉ. వెండి కదంగిరోయుచుఁ గుభృద్వివరం బొకఁ డేముఁ గాంచి మా
ర్తాండమరీచికావిరహితంబగు నగ్గుహ సొచ్చి యందు నిం
దుండన కొల్లునానన తోఁ దప మొప్ప ఘటించుచున్న యా
ద్దండమహానుభావ నొకతెం గని భక్తి నమస్కరించుచున్. 653

వ. నిజప్రభాపటలతిరోహితగుహాతిమిర యగు నాస్వయంప్రభ మమ్ము నాశీర్వచన సముచితాతిథేయంబులం బ్రియంబు నొందించి యమ్మహాబిలంబు వెలువరించినం దదుపాంతకాంతారాంతరంబున భవత్కాంతామార్గణార్థ చింతాక్రాంతుల మగు మేము త్తరశిరస్కుల మగుచుం బ్రాయోపవేశంబు సేయం గుశాస్తరణంబుల శయనించియుంటి మయ్యవసరంబున. 654

క. మృత్యర్థుల మగు మాకాఱ, కత్యర్థస్వాదు వాదుం డగునొక్కండు సం
పాత్యభిధానుండు గోత్రా,పత్యస్థితిం దెలిపి చనియెం బ్రముదితుం డగుచున్. 655

ఉ. ఆఖగేంద్రుం డిట్లు నెనరాగ మహోదధిమధ్యమంబున
రావణుపట్టణంబున ధరాసుత యుండుటం దెల్పి పోవ నే
మావనరాశిం జూచితి మనంతర మెంతయు వానరాళి సం
భావన సేయ వార్ధి సులభంబునం దాటితి ద్వద్దయాదృతిన్. 656

ఆ. ఇట్లు కడలి గడచి యెడనెడ విఘ్నంబు, లెన్ని యేని గలుగ నేను గలుగ
కప్పురంబు సొచ్చి యచట లంకిణి వచ్చి, తిరిగితిరిగి యొక్క తరువునీడ.

మ. కనుంగొంటి న్నతి సీత నశ్రుకణముక్తాదామసంవీత నే
కనికృత్తాంబరవృత ఘర్మసలిలాక్రాంతాననాబ్జాతం బా
వన సాశీల్యసమేత భ్రామ్యదసురీవ్యాహారసంభీత నా
త్మనిబద్ధోగ్రభవద్వియోగశిఖిభూత న్ఘోరలంకాపురిన్. 668

క. కని వినయంబునం జేరం, జనునప్పుడ రావణుండు సనుదెంచి జగ
జ్జననియగు సీత బరుషవచనముల నొప్పించి యతండు చనియెం బెలుచన్. 659

శా. రక్షోధ్యక్షుం డిట్లు పోవుటయు సంరక్తాత్మలై భీమకృ
ద్రక్షోగామిను లాక్షణంబునను గర్జారావము ల్మీఱం బ
ద్మాక్షి రావణుం జెట్టపట్టుమని రూక్షాకారలై బిట్టుం ద
న్నాక్షేపింప ధరాకుమారి పటుదైన్యాక్రాంతయై మూర్ఛిలన్. 660

క. నీకు శుభంబగు నసురా, నీకశుభకరము గాఁగ నేఁ గలఁగంటి
న్నోకింప నేల యని సీ,త కాంతం దేర్చెం ద్రిజట తగువాక్యములన్. 661

వ. తత్సమయంబున. 662

క. మాయమ్మ రామదూత న్సుమా యిమ్మలికంబు వాయు మాపద లెల్ల
న్మాయమ్మగు నీయలుక సుమా యమ్మగు నింక రావణాసురపతికిన్. 663

క. అనుచు వినీతుండనై యుల్లసన్మోదక్కుడ నన్న సకలసతీమణి న
మ్మనివ్రాదయంబునం బో వి ప్రమ్మని పక్కున నేను కీరపాఠ్కుండ నగుచున్. 664

క. మన్నిజరూపముతోన జ్జగన్నుతభవదంగుళీయకముఁ జూపిన నే
దన్నన్ను నమ్మి మిగులఁ బ్రసన్నహృదయ యగుచుఁ జనకజాత ప్రియమునన్.

వ. భవదీయసుందరచరణారవిందంబులు డెందంబునం దలంచి వందనంబులు గావించి సుమిత్రాపుత్రు నేమంబడిగి మీకుం బ్రత్యభిజ్ఞానార్థంబుగాఁ జిత్రకూటచిత్రకూట కృతకృతక కాకాసురకథాకథనంబు నడిపి యప్పతివ్రతాశిరోమణి శిరోమణి యొసంగి సెల వొసంగినం బ్రణామంబు గావించి నామగిడివచ్చునప్పుడు లంకాపురాభిముఖుండనై యెదిరికొనిన దనుజమంత్రిసుతసప్తకంబుఁ బంచత్వంబు నొందించి యక్షువుం బరిక్షయంబు గావించి తదనంతరంబున నింద్రజిచ్చతురాననశిలీముఖపాశప్రబద్ధుండ నగుచు మదీయవాలాగ్రంబున నద్దనుజపతి యగ్గి ముట్టించిన నయ్యనలం బస్మద్గోత్రోద్రేకవాయువశంబునం జేర్చి కరంబు దన్నగరంబు భస్మీభూతంబుగా విరచించి కాంతుండనై తరుచర చమూసాగరమ్మున కానందంబు గ్రమ్మం గ్రమ్మఱ సాగరమ్ము గడచి యేతద్వృత్తాంతంబు నీకెఱింగింపం గంటిం గృతార్థుండనై మంటి నని పలికి సీత నుద్దేశించి వెండియు నిట్లనియె. 666

క. కన్నీ రుపవనంబునఁ బడి, సన్నగిలుంగాని కాల్వ సాఁగుట లేదే
మన్న విను జనకతనయా, తన్నగమతిరిక్తహృదయతాపము పేర్మిన్. 667

చ. అడిరొకఁ డేమిశంక హితుమన్న లినాయతనేత్రవంత వ
ట్పదములుగాఁచి పుష్పరసపాన మొనర్పవు గండుఁగోవిల
ల్లినుమవు పల్లవంబులు ద్విజిహ్వులు వాయువుఁ గ్రోల వేమిచె
ప్పఁ దరు లిఁకప్ప వాగ్రఫలభక్షణ సేయవు పక్షు లక్కటా. 668

తే. హెచ్చి దశకంధరుఁడు చెఱదెచ్చిపెట్టి, ఖచరకాంతలు దమచెంతఁ గట్టిపెట్టి
యంతఁగరంబుల మహిజాకాంతఁ గూర్చి, చింతనొందుదు రిఁక వేఱ చెప్పనేల. 669

వ. అని పలికి రామచంద్రుం గనుంగొని. 670

క. జగతీసుత సంతోషాభిగమ యగుచు నీకుఁ బ్రత్యభిజ్ఞానార్థం
బుగఁ జూడామణి యొసఁగెన్, జగదీశ్వర చూడుమని పొసఁగఁ జేనిడినన్. 671

క. మణిఁ గాంచి జనకకన్యామణిఁ గాంచినయట్లు పొంగి మహివిభుఁడు నభో
మణివంశజుఁడు సద్గుణమణి లక్ష్మణుఁ గాంచి మధురమందమృదూక్తిన్. 672

గీ. రత్నగర్భాతనయ శిరోరత్న మిట్లు, పంపు టరయంగ నిజభార్య పరమదుఃఖ
భరితయై యుండ నోర్చి తెప్పగిదిఁ గఠినహృదయుఁడవటంచు నను దూఱుచేమొ వత్స.

వ. అని పలికి కన్నీరొలుక నూరకున్న యన్నం గనుంగొని సుమిత్రాపుత్రుండు విషాదం
బడర నిట్లనియె. 674

క. అవనిజ యమ్మణిఁ గాంచి, త్యవిహీనతఁ బెంపు దూలు ... సూచించెన్
భవదంగుళీపలాలిత, మవు నిమ్మణి తొంటి యట్ల నల...గంటే. 975
క. పద్మభవుచెయిది రక్షు, స్సద్మపగనోపవాసగంస్థితివల...
బద్మాలయోపమను స, చ్ఛద్మమతిని ట్టు లనదచాడ...గట్టా. 676
క. అని వగచుచున్న తమ్ములఁ, గనుఁగొని రాముండు ... గద్గదకంఠం
బున నేడ్చె ధరణిసుతఁ బేర్కొని తరణిసుతుండు ...డికొని శోకింపన్. 677
వ. తదనంతరంబున హనుమంతుని పలికిన శాంతవచనంబు... వలు దెలివినొంది రఘు
హీ...భుఁడు పవనపుత్రుం బ్రియవచనంబుల నభినందించె. 678
మ. బహునక్రోద్భటతుంగభంగవిచలత్పాథోధి లంఘించి...
ర్వ్యహగస్థితి ...తుయాదిదనుజవ్రాతంబు ఖండించి ...
ద్గృహసౌధాదిక మాత్మవాలకలితాగ్నిజ్వాలఁ జ...య
మ్మహిపుత్రీశుభవార్తఁ దెచ్చితివి సామాన్యుండవే ...నీ. 679
క. క్షోణీసుతవార్తఁ బరిక్షీణీకృతమయ్యె ననుచుఁ జీ... చెడు మ
త్ప్రాణము నిలిపితివి జగత్ప్రాణాత్మజ వశమె నిన్నుఁ బ్రస్తుతిసేయన్. 680
క. అని మఱియుఁ బవనతనయుం, గొనియాడె రామవిభుండు గుముదరిపుజుండుం
గొనియాడె లక్ష్మణుండుం, గొనియాడెం బ్లవగతతియుఁ గొనియాడెం గడున్. 681
మ. తను నిట్లందఱు సన్నుతింపఁగ జగత్ప్రాణాత్మజన్ముండు రా
మనరేంద్రాదులఁ గాంచి యిట్లనియె సాక్షాత్పుత్రి లంకాపురి
న్ఘనదుఃఖాబ్ధి మునింగియుండఁగ నుపేక్షావృత్తి గాదింక నూ
ల్కొనఁ డంభోధి దరింప రావణుఁ గుశీలుం బట్టి సాలావ్వఁగన్. 682
క. అని యట్లనిలతనయు చెప్పినపని కనుకూలు రగుచుఁ బృఘుహార్షాబ్ధి
న్మానిఁగి రని చెప్పి వెండియు, ననుమోదరసార్ద్రహృదయుఁడై యిట్లనియెన్. 683

మత్తేభకందగర్భితసీసపద్యము.

సు-జలమేఘాకృతి సాధుపోషణరతీ సామాగమోద్యన్నుతీ మహేశ
సు-లలితానందద సారసాంచితపదా లాక్షణ్యనాభీనవాక్షితిధర
ప్ర-బలదైత్యోత్కర పర్వతాశనికరా పాపాఘుదర్వీకరా పరేశ
య-ఖిలబాధాపహహారి సద్గుణగుహా కీశోరుసౌఖ్యావహా శశిముఖ
విమలయశ పండితావన। సమరవిజయ, చక్రహస్త సర్వాత్మక సా। రమకుటు
గరుడతురగ వి। శ్వమహిత పురపవృషభ, విభవవిహితవర్తి మునివినుతయుక్తి. 684

చతుర్విధకందము.

హంసశశినేత్ర దైవవ్రతహంసా। శంసితచరిత్ర। దైత్యస్వ। శంసా।
హంసహాయశంద్యసారశు, భాంసా హంసనుత నిర్దయావిధ్వంసా.

మాలిని నిగమనిగమవాసా నిస్తులస్వర్ణవాసా, వికతవిగతదోషా వేదనిందాబ్జదోషా
సుగుణసుగుణరుద్ధా శుద్ధపాపీ. రుద్ధా, జగతిజగతిగోశా ఛత్రవత్కృత్తగోశా.

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యానపరాయణభూసుర ధైర్యవినయ రామశార్య తనయ పండితసేవాసముచ్చాయ క్రొత్తపల్లి లచ్చయప్రణీతంబైన దాశరథిలీలా సంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము



శ్రీరామ.

# దాశరథివిలాసము.



## షష్ఠాశ్వాసము.



క. శ్రీమానినీమనోజ్ఞ శ్రీల, తామరసమకరందపానతాత్పర్యమిళిం
దా మేయతుల్యవేంకట, ధామమహామభృదళిందదాయకముకుందా. 1

గీ. అవధరింపు మధికశాస్త్ర వాల్మీకిమహర్షి యిట్టు లని యె నట్లు సంత
సాధ్వి మునిఁగి రాముఁ దర్కనందనుఁ గాంచి, యిట్టు లనియెఁ బ్రేమ మెసక మెసఁగ.

క. ప్రాణంబులు మనకు జగత్ప్రాణాత్మజుఁ డకరుణఁ జేసి క్రమ్మఱఁ గలిగెం
బ్రాణము లాశింపక మత్ప్రాణేశ్వరి వెదకె నితఁ డుదధిమధ్యమునన్. 3

చ. ఇతని నుతింప నాకు వశమే యుడి యిట్టుల యుండె నిమ్మనీ
వతులబలాఢ్యులై నప్లవగాధిపుల న్సమకూర్చ నబ్ధి ను
చ్ఛ్రితఘనభంగ లబ్ధిఁ దరించి దశాస్యు హరించి మించి మ
త్సతి సతి సీతఁ గాంచక యసాధ్యమనఃపరితాప మాఱునే. 4

సీ. శశికాంతవేదికాస్థలవిరచితసుమశయ్యాతలంబుల జందవార్ద్ర
దేహలై సౌరభోద్గీర్ణకారణతాళవృంతానిలాలోలవిపులమూర్ధ
కుంతలలై మనుత్కాంతాసద్భక్తపరిచారికాశతసహస్రములు గన్న
నైన నాడికములు సల్ప మద్బాహుద్వయోపలాలితలై యయోధ్య సౌఖ్య
లీల మెలఁగుచుట్టిలేమకు ఘరవాంతరమునఁ గత్రికేనేల రాక్షసీమ
హోగ్రతర్జనముల నొక్కతి వణఁకుచు, నుండవలసెఁ జిత్ర మొకఁడు గాదె. 5

క అని మఱియును వగచు రాముం, గనుఁగొని సుగ్రీవుఁ డేమి గలుగ విచారం
బున కిడయీకుము ధరణీతనయాపహారువధ సలుపు నయము మద మొదవన్. 6

వ. అని యిట్లారాధనసాధనపోషణంబు లగు భాషణంబు లాడి యప్పుడు. 7

క. అవనిఁ గలప్లవంగమపుంగవులన్ జతగూర్చి తెచ్చి కనుఁగొంటె మహా
పావకర్కశాంగు లయోధ్యాధవముల కడ్డమె విరోధిదైత్యబలంబుల్. 8

ఉ. సంభరియింపఁ జాలునె యసాధ్యతరం బగుమద్బ్రగంబు వి
శ్వంభర యంచు నీ ప్లవగసైన్యము దాఁటెను నభ్రవీథికిన్

దంభ మొకింత లేదు వసుధావర చూడుము నావుడుం గ్రవో
జ్జృంభితచిత్తుఁ డై ప్రతిసింహలుంకను సంతస మంది యిట్లనన్. 9

క. కడు సంతస మందితి నీకుఁ దడ, వేటి కబ్ధిఁ జేరఁ దరుచరబలము
న్నడిపింపు మనుడు సూర్యసు,తుఁడు సంభ్రమ మెసఁగ సమరదోహలుఁ డగుచున్.

క. హనుమద్గజగవయగవా,క్షనలాంగదపనసదధిముఖప్రముఖకపీం
ద్రనితాంతావన మగు,సైన్యనికాయము నావహంబునకు నూల్కొలుపన్. 11

సీ. కుంభినీధరముల గ్రుద్ది ప్రద్దలు సేయఁ జాలినహస్తము ల్సాఁచికొనుచు
ఖచరకాంతాపువ్వకంబులు సుడివడి తిరుగ వాలంబులు ద్రిప్పుకొనుచు
దిక్కుదదంతిశ్రుతిస్ఫుటత్వంబుగా సింహనాదంబులు చేసికొనుచు
వెలయు డెబ్బదిరెండు వెల్లువ ల్గలకపిసేన వెలసిన వీక్షించి రామ
చంద్రుఁ డధికహర్షసాంద్రుఁ డై యప్పు డి,నేంద్రనందనాంజనేయజాంబ
వత్ప్రముఖవనాటకల్లుకప్రవరులఁ, గాంచి యిట్టు లనియె గారవమున. 12

క. భద్రముగాఁగ నపూర్వస,ముద్ర మనం గంద మిగిలి మొన వెడలెడు ని
ర్నిద్రగతి నింక శాత్రవ, విద్రావణకేళి కిపుడు వెడలుద మనుడున్. 13

శా. తద్వాక్యోద్ధతి నాథు లెంతయు మహోద్యజ్జైత్రయాత్రాప్రశం
సద్వ్యాక్యానగుణప్రయత్నభరితోత్సాహంబునం బొంగి మా
ద్యద్వేదండకరకధీరణభుజద్వంద్వంబు లుప్పొంగఁ గా
నుద్వాహోద్వహనార్థులట్టులు సమీకోద్యోగులై రంతటన్. 14

క. ఉదయగిరిశిఖరవిస్ఫురి,తదినేంద్రేంద్రు లన దశరథసుతు లనిలజాం
గదభుజశిరఃప్రదేశము,లఁ దీర్చిరి చూచువారలకు ముద మొదవన్. 15

వ. ఇవ్విధంబున మహారథు లగు నద్దాశరథుల కిరథులై పొలిచి నడిచి రంతి వనచర
సమూహంబును భాస్కరసుతప్రేరితంబై పుడమి వడవడ వడంకఁ గడువడి న్నడు
వం దొడంగె నట్టియెడ. 16

క. తతవానరసైన్యసము,ద్ధితభూమీరజము వొలిచె దివినద్దంగా
స్థితరక్తసరోరుహసం,తతికిఁ బరాగ మయి యద్భుతస్థితిదోఁపన్. 17

క. పౌన్నుఁ జెలఁగతి వాలము, లన్నిటి దివి నొరయఁ ద్రిప్పి యాడుచు విసతో
మిన్నెటిఁ గూడఁ బొంగెడు, మన్నిటికిఁ జేర నడిచె మొన యలఘుగతిన్. 18

చ. ముదమున నిట్లు రెండవసముద్ర మనం గపిసైన్య మేగి త
త్పదమలతీరపాండురపికాలలసత్పులిన ప్రదేశముం

గదిసె ననంతరంబ పొడగాంచిరి రాఘవభానుసూను లా
పదపథసన్నిరుద్ధఘనభంగవినిద్రము నాసముద్రముల్. 19

క. కని యంత రామలక్ష్మణు, లనఘులు పవనతనయాంగదాంసతలంబుల్
ఘనమతులం డిగిరి గిరియుగ్మమును డిగు హైమవతసింహములజంట యనన్. 20

వ. ఇట్లు కల్పకతరుస్కంధంబులంబోని తరుచరస్కంధంబు లవతరించి చమూనాథపరివేష్టితులై సమవిశాలచంద్రికాధవళచిత్రశిలాస్థలాసీనులై సముద్రతరణోపాయంబుఁ జింతించుచుండి రంత నవ్వనచరజలంబులును దత్తీరపర్వతగహ్వరంబుల విడిసె నయ్యవసరంబున లంకాపురంబున దశకంధరుండు. 21

క. ఈలీల రామలక్ష్మణు, లాలమునకు వచ్చి విడియుటాలించుట నో
డ్డోలగమున మంత్రులఁ గా, ర్యాలోచన మడుగుచున్న యపు డతినిర్భృతిన్. 22

మ. దశకంఠానుజుఁ డవ్విభీషణుఁడు భ్రాతం జేరి కేల్మోడ్చి పీ
తశతుం డిట్లనిపల్కె శిష్టుఁడ యమర్త్యశ్రేణి ప్రార్థింప భూ
రిశతారాయుధధారి వైరికుల మెర్వం గూల్ప నీలీల మ
ర్త్యశరీరంబు ధరించె రాముఁ డన సీతావ్యాప్తిసోజాలిరై. 23

క. అని నారదాదిమునివరు, లన విందుము శాకయన్న నసురులమీఁద
న్మనుజులు చనుదెంతురె చెప్పినపని గాచుచునే కపిప్రకరంబుల్. 24

చ. ఒకకపి మున్న రామునినియోగమునన్ జలరాశి దాఁటి జా
నకిఁ గని యూఱడించి తదనంతర మొక్కట మంత్రిపుత్రస
ప్తకము వధించి యక్షయు నపక్షయశౌర్యమదం బడంచి తా
వకపురి గాల్చి పోవఁడె భవత్పరివారము మాచుచుండఁగన్. 25

క. వాలి నినుఁ గొన్న హైహయుఁ, దూలించి భార్గవు న్విధూనముఁ జేసె
న్వాలిం గూల్చుట నీ, వాలించితి చలము విడువు మాప్రతిపయిన్. 26

వ. అని పలికి వెండియు. 27

క. ఎదిరిం దమ్ము నెఱుంగక, వదరెడు ప్రెగ్గడలపలుకుబడికి నెడందం
గుదురుకడ నీకయేని, న్బెదరు విడిచి బ్రదుకఁగలరు పిన్నలుఁ బెద్దల్. 28

క. వనరాశి మనుజు లెవ్విధమున దాఁటెద రని తలంపఁబోకుము మది న
ల్గిన శరధి నిర్వుఁ జేయఁడె, మనుజేంద్రుఁ డగస్త్యదత్తమార్గణవహ్నిన్. 29

క. ప్రణమించి వేడ నానతి, గణియించి నిశాటకోటి గణియింపక నై
పుణి వెలయఁగఁ జని పాదప్రణతజనంబు భద్రు రామభద్రుం గనుమీ. 30

ఉ. కనకరథంబునన్ జనకకన్యక నుంచి నరేంద్రమౌళిక
ప్పన మొనరించి కావుము కృపాంబుధి యుండటితప్పు సైఁచి కో
పనుఁడవు గావు నీ వనుచుఁ బ్రాంజలివై ప్రణమిల్లు దేని యే
మనియెడువాఁడు గాఁడు శరణార్థి నిమం గరుణించు నర్మిలిన్. 31

క. కొలము న్నొనరించితి నా, కొలము న్నిల్పు మని నృపునివరుం బ్రణమిల్లం
దలపకుట మానుఁ గృతమూఁ, దలఁపఁ దటుగ్గా నన యిపుడ తగు నిటు సేయన్. 32

చ. వననిధి దాఁటి వారిటుల వచ్చుటకు న్ముందు గాఁగ జానకిం
గొని చని రామలక్ష్మణులకు న్శరణం బని సంధి చేయుటొ
ప్పు నను మ నెల్లభంగులను బోఁడిమి నెంతును నీవు సీతఁ దె
చ్చినదినముం దొడంగి తగఁ జేయుము సౌమ్యత రాజమౌళికిన్. 33

వ. అని మఱియు ననేకభంగుల నుపన్యసించుచు. 34

ఆ. వె. దోషరహితుఁ డవ్విభీషణుఁ డిట్లను, నింక నొండు తలఁపు లెల్ల మాని
సీత నిచ్చి రాముఁ జేరి ప్రార్థించుట, కంటె బ్రదుకుఁ దెరు వొకండు లేదు. 35

చ. అన విని క్రోధతామ్రనయనాబ్జుఁ డిర్వదిట స్సహోదరుం
గనుఁగొని చాలుఁ జాలుఁ దెగి కయ్యము చేయఁగఁ జాల వేని క్రే
వనొదిఁగి యుండఁ డిట్లు బలవంతులు మానవు లంచుఁ దెల్పుచు
న్మనుజభుగాళికిం బిఱికిమాటలు దెల్పఁగ నేల బేలవై. 36

ఉ. యక్షులమీఁద దాడి చనునప్పుడు యుద్ధవిడిం బ్రవిష్టపా
ధ్యక్షులఁ ద్రోలునప్పుడు భయం బొకయింతయు లేని రాక్షసా
ధ్యక్షుఁడ వొక్కమర్త్య నభయుం బని వేఁడుట యెట్లు విద్విష
త్పక్షముఁ బూని నాకు నహితం బొనరింపఁ దలంచి తాత్మలోన్. 37

సీ. తపమున మెప్పి ధాత వరంబు లీయ రా నెంచి యక్షుద్ర మాసించినావు
బుద్ధి చెప్పుటకునై యుద్ధవాధీశుఁ డంపినదూతఁ జంపింప మిడిసినావు
బలిమిమై నిర్జరభామలఁ జెఱదెచ్చునప్పుడు వలదని చెప్పినావు
అలనాఁడు వాఁడరఁ బిలుసుమాఁపఁగనీక మించినపురముఁ గాల్పించినావు
నిందుకొలువుగ మనుజుల యండఁ జేరి, కొలిచి బ్రదుకు మటంచు వాక్రుచ్చినావు
వేడబంబుగఁ దలపోసిచూడ నీవు, మొదలనుండియు నవగుణమ్ములకు తావు. 38

వ. అని తనమనంబున నితండు మదీయవైభవబలపరాక్రమంబులకు నసూయాగ్రస్తుండై
పలుకువాఁడు గాకేమి యని నిశ్చయంబు గనుంగొని. 39

మ. వికటభ్రూకుటిదుర్నిరీక్షుఁడగుచు న్వీఁ శ్యాంభరాదేవవై
రికటుస్పందన మాచరించి ప్రబలార్చిష్మచ్ఛిఖాజాలవ
త్ప్రకటక్రోధకషాయితాక్షుఁ డగుచుం బాదంబునం దన్ని య
న్నికటంబు న్వెసఁ బాసిపొమ్మనియె న్నిష్కారణాహంక్రియన్. 40

ఉ. పొమ్మని తన్నియు న్సుగుణభూషణుఁడైన విభీషణుం డ్మహో
గ్రమ్మగుమాడ్కిఁ జూచి దశకంఠుఁ దమంతితలీలఁ జంద్రహా
సమ్మున వ్రేయఁ బూనుడు ససంభ్రమునుఁడై పఱతెంచి మాను ఘో
రమ్మని యాఁగ నయ్యెడఁ బ్రహస్తుఁడు హస్తము చాఁచి రావణున్. 41

క. తన్నివ్విధమునఁ గనలుచుఁ, దన్ని వెడలు సునుఁడు శోకతాపితుఁ డగుచుం
దన్నికృతి గోరక భ్రా,తన్నిష్ఠురవచనముల నతం డిట్లనియెన్. 42

ఉ. ఎల్లములోన నీ చెడుట కోర్వక యింతయు నొత్తి చెప్పిన
న్నొల్లవు ప్రాణమారుతము నొల్లనివానిక్రమంబున న్మహీ
వల్లభుఁ గానఁ బోయెద నవశ్యము నిప్డు దొలంగి సజ్జనుం
డెల్లెడ నెట్టి యాప్తుఁ డగు నేనిఁ ద్యజించుట నీతి దుర్మదున్. 43

క. అని పలికి మ్రొక్కి వీడ్కొని, చనుదెంచి సభక్తిపూర్వసాష్టాంగంబున్
జననిఁ గొనరించి యాపెను, వినిచె నిజాగ్రజుఁడు పరిభవించుటఁ దెలియన్. 44

చ. ఇటు వినిపించి రావణునకే నళియాలిగ నైతిఁ దల్లి నీ
విటు విను మింక రాఘవమహీశ్వరునిం గొలువంగఁ బోయి త
త్పటుకరుణాకటాక్షపరివర్ధితవర్తన నొంది యుండెదం
గటకటపాటు మాని గజగామిని వే సెలవిమ్ము పోయెదన్. 45

క. అనవుడు భయ మందుచుఁ దజ్జనని కుమారకునిఁ గాంచి స్వాంతములోన
న్మనుపాటిక నిజభర్తవచనములు దలపోసి వీతసంభ్రమ యగుచున్. 46

శా. సంతోషంబు సుపుత్ర నీ కనుచు వాత్సల్యంబునం బల్కి యా
త్యంతప్రీతిఁ గుమారుఁ గౌఁగిటికిఁ దీయం బొంగి యవ్విశ్రవః
కాంతారత్నము వీడుకో ల్వడసి రక్షఃప్రాణవాతాశిభూ
కాంతు న్రాము సలక్ష్మణుం గనునపేక్ష న్సంభ్రమాయత్తుఁడై. 47

మ. కరమర్థిం జని యాత్మదార సరమం గాఢోల్లసన్మందహా
సరమ న్వీడ్కొని రాఘవేశ్వరపదాబ్జద్వంద్వసందర్శన
స్థిరబుద్ధి న్నిజమంత్రు లెంతయుఁ బ్రపత్తి న్నల్వురుం గొల్వఁగా
వరపుణ్యుండు విభీషణుండు జలధివ్యాకీర్ణ మా తత్పురిన్. 48

క. రామునితో నెదిరిచి సంగ్రామము శివుఁడైనఁ జేయఁగాలేఁడు రఘు
గ్రామణి శరణుసొరుము సీతామణి నొసఁగి యని కడు హితంబులు సెప్పన్. 59

ఉ. బుద్ధులు సెప్ప నెవ్వఁడవు పొమ్ము మహాత్మ యెఱుంగ కిట్లు సం
బద్ధపుమాట లాడెదవు ప్రాణము లైనఁ ద్యజింతుఁ గాని యా
త్మోద్ధతి తూల మర్త్యునిసమున్నతి సైఁచుట యెట్లు రావణుం
డిద్ధబలాఢ్యుఁ డేల యొకహీననరు న్శరణంబు వేఁడెడిన్. 60

క. అని వెలువనాడి పరిభవ, మొనరించిన నతనియొద్ద నుండక నిన్నుం
గని కొలిచి బ్రదుక వచ్చితి, ననఘచరిత యే విభీషణాఖ్యుండన్. 61

తే. మాటలకు నెల్ల నోర్చి నా మాట మింత, లేక యాతని బ్రదుకునకై కడంగి
యొత్తి చెప్పఁగ నీరస మెత్తి బిట్టు, కాల దన్న నెవఁడ బెట్టు కాలదన్న ! 62

వ. అని సకరుణంబుగా నాత్మప్రవృత్తి సమస్తము నెఱింగించి భవద్భృత్యకోటిం
గలిపికొని రక్షింపు మని ప్రార్థించినఁ రాముం డతనిం గటాక్షించి కపులదెస నిరీక్షిం
చుటయు. 63

క. పగవానితమ్ముఁ డితఁడుం, బగవాఁ డగుఁగాక యెట్లు మైత్రి యొనర్పం
దగువాఁ డగుఁ గడు నికృతిం, దగువాఁ డగుఁగాక యనిరి తరుచరు లెల్లన్. 64

తే. అంత హనుమంతుఁ డితఁ డతిశాంతుఁ డింద్ర, జిద్విధాతాస్త్రవినిహతిఁ జిక్కియున్న
సమయమున రావణునిచేత సమయకుండ, నితఁడ కాఁడె నన్వాడిపించె నిద్ధబుద్ధి. 65

క. జాతి కితఁ డసురుఁ డేనిని, సీతాత్ముం డెవ్విధమున నిందార్హుఁ డగున్
జాతిరిరి కను విహీనుని, చేత మిగుల వలచు నిది ప్రసిద్ధము యనుచున్. 67

క. అనిలసుతుఁడు నుడివినయది, యనుకూలము లగుడు రాముఁ డయ్యసురవరుం
గనుఁగొని యభయం బొసఁగితి, ననుమానం బేల డాయ నరుదె మ్మనఘా. 67

చ. అని నెనరారఁ బల్కి యతఁ డానతుఁ డైనఁ గవుఁగిలించుచు
న్వినుము విరోధితమ్ముఁడవు నిన్గణించుట వింత గాదు న
న్ననిశరణంబు వేఁడిన జగత్త్రయవాసులు మెచ్చ రావణుం
డనుమక తమ్ముఁడు న్మిగుల దుర్మతికి న్శరణార్థి వధ్యుఁడే. 68

వ. అని యివ్విధంబున నభయం బొసఁగి కృపాతిశయంబున. 69

క. కలుమకలుషితాత్ముఁడు మొక్కలుఁ డగుభవదగ్రజన్ముకాయము నలియ
క్కలిఁ జేసి యాతనిపదవి క,కలుషమతీ నిన్ను విభునిఁ గావింతు దయన్. 70

వ. అని యతనిఁ గలిపికొని యాతనిమంత్రుల గారవించి తన్ముఖమున శ
త్రుని బలపరాక్రమాదులు, వినుచు నుద్యమ్మునొందుచున్న వేళ నిభృతుఁడై. 71

వ. పోనుచుంతుం డిట్లనియె. 72

చ. కరము దుర మెుక్కనర్చి దశకంఠునికంఠము లూడ్చి తత్సహో
దరునకు వానియేలెడుపదం బొనగూర్చుట యెంత పెద్ద నీ
కరయ విధాతఁ గాదని తదంచితశాశ్వతసత్యలోకసు
స్థిరవిభవంబు భారతులఁ జేర్చగ నోపుదు వాత్మ మెచ్చిచెన్. 73

క. అన విని భవత్సహాయంబున నాకుం గడఁగి తీర్పఁ బోలని కార్యం
బనఘా యొకఁడుం గల్గునె, యని యతని మెచ్చి రాముఁ డభినందించెన్. 76

వ. తదనంతరంబున సుగ్రీవాదులు రామచంద్రుఁ గరుణాసాంద్రుం డనిపొగడిరి విభీష
ణుండును మంత్రిచతుష్టయసహితంబుగా సంతోషించె నంత రాముండు నిజాంత
ర్గతంబున. 75

క. అంభోరాశి గభీరము, గుంభితనక్రాదిజంతుఘోరము విపులో
జ్జృంభితకపివారము నిర్దంభస్థితి దీని నెట్లు దాఁటఁగ నగునో. 76

వ. అని కించిన్మీలితలోచనాలోచనుండై. 74

క. తుష్టి నుదధిఁ గొల్చి తదుపదిష్టసరణి గపికులాంబుధి న్నడిపి మనో
భీష్టముఁ బడసెద ననుచుఁ బ్రహృష్టహృదయుఁ డగుచుఁ దలఁపు లిగురొత్తంగన్.

క. అంతముఁడు శుచియై దర్భాంచితపత్రితాసనాసీనతగా
వారాంచన్నావృతహారవిహారంబులు మాని జలధి నారాధించెన్. 79

ఆ. మఱియుఁ భక్తియుక్తి మానసంబునఁ బయోరాశిఁ గుదురుపఱిచి రాచవిభుఁడు
భావమేకముఖము గావించి సదుధిక ప్రౌఢి మెఱయ నిట్లు ప్రస్తుతించె. 80

క. సరిదోఘంబెల్లను దమిసుసుఁడ వగు నిన్నుఁ జేరి సమ్మోదించున్
ధరణిస్థితి భవదీయా, దరణంబునఁ గాదె నిలిచెఁ దలపోయంగన్. 81

వ. నీవ సుగుణరత్నాకరుండవు గంభీరుండవు కవిశ్లాఘనీయుండవు నపారుండవు భువన
ప్రశస్తుండవు నని మఱియు ననేకవిధంబులఁ బ్రస్తుతించి కరకమలంబులు ముకుళించి.

మ. మఱి నాపైఁ గరుణించి యాత్మగమసన్మార్గంబు దోఁప న్సరి
త్పతి నాపైనము నిర్వహింపు మనుచుం బల్మాఱుఁ గీర్తించి యా
నతుఁడైనం గరుణించి రాముని జగన్మాన్యత్వం గనం బోఁ డపాం
పతి నిర్గంధుఁడె యాతఁ డంచు విబుధుల్ వైపై ప్రసంగింపఁగన్. 82

క. ఇటు పొగడి జలధి నాకుం, దటుకున సాక్షాత్కరింపఁ దలఁపఁ డనుచు ను
త్కటరోషదీప్తుఁ డగుచుం,గటము లదర నిల్చి ఘోరకార్ముకధరుఁడై. 83

శా. క్రోధోద్రేకమనోంబుజాతుఁ డగుచుఁ ఘోరాస్త్రముం బూని య
ప్పాథోరాశి హరింప నిష్ఠురకృతప్రారంభుఁడైన న్నభో
వీథి న్మాసె నినుండు తారకలు పృథ్వింగూలె ముల్లోకము
ల్బాధం జెందెఁ గులాచలంబు లొరగెన్ ద్రస్సెం జతుర్దిక్కటుల్. 84

శా. తద్బాణత్రఁబున గొట్టఁ బుట్టుటయుఁ బాధస్స్వామి భీతిం గడు
న్నస్మారంబున రామచంద్రపదపద్మాక్రాంతకాయత్తస
ద్ధ్యానాద్యస్థితి నొందెఁ గాని పటుభక్తిన్ వేఁడుచున్నాఁడటం
చు న్నుజ్ఞాపగఁ బోవఁ డయ్యె జడరాసు ల్మానుల న్మెత్తురే. 85

వ. ఇవ్విధంబునం బొడము భయాతిరేకంబున. 86

క. బడబాగ్ని వేఁడికి న్నడి,వడి యొకనే నిపుడు రాముబాణాగ్నిఁ గడుం
జెడనె యని యతనిఁ జూడ, న్వెడలె జడధి మానసంబు వేగిరపడఁగన్. 87

తే. వెడలి తగురీతి మూర్తిభవించి జహ్ను,కన్యకాగౌతమీముఖ్యమాన్యనదులు
మూర్తిమంతంబులై తన్ను మొనసి కొలువ, నబ్ధి సానుకంపరసాబ్ధిఁ జేరి 89

క. వెలవెలఁ బోవుచుఁ జనిరా,ముల సచ్చరణయుగమునకు మ్రొక్కి వినీతిన్
జలనిధి వచించె నృపవర, పలుచని వారలము కలఁగఁబడమె యలిగినన్. 0

క. ఏ దెలియ నెంతవాఁడ మ,హామహిమా భవన్మహిమ బ్రహ్మాసురేం
ద్రాదులు నెఱుఁగరు శత్రువి,భేది మదపరాధ మాత్మఁ బెట్టకు మింకన్. 91

క. ఈయుదధి నెట్లు దాఁటుదు,నో యని తలపోసెదే యనఘ బుధవిబుధ
ధ్యేయుఁడవ మేయుఁడవు నా,రాయణుఁడవు నీవు మార్గ మడుగఁ గలయునే. 92

క. కట్టా యూరక నాపైఁ, గట్టలుక వహింపనేల గట్లం జెట్లం
గట్టి యొకఁడు కట్టక పోడ,కట్టునె మార్గంబు నన్నుఁ గడవఁగ మీకున్. 93

ఉ. సేతువు గట్టి రక్కసులఁ జీల్చి వధింపఁగ సేనతోడ నీ
వీతటి నేగు మంచు వచియించి సముద్రుఁ డదృశ్యుఁ డైనను
జ్జాతకుతూహలంబున నిశాచరజాతుల నబ్ధికుక్షిసం
జాతులఁ గూలఁ జేసె మునసాగరవేయఁగఁబూను కోలచేన్. 94

వ. అయ్యమోఘబాణుండు తదనంతరంబున నిజసైనికుల నాలోకించి కార్యదశానిరూప
ణంబుగా నిట్లనియె. 95

ఉ. గట్టులఁ జెట్టులు న్వేచి కంధిపయిం బడవైచి యడ్డుగాఁ
గట్టి యొకండు గట్టిన సుఖంబున లంకకుఁ బోయి రావణుం

బట్టివధింపవచ్చు నని పల్కిన రాముని భాషణంబులం
బుట్టినసంతసంబునఁ గపు ల్చెలరేఁగుచు నాడి రీగతిన్. 96

క. ఒకకట్టు గాదు జలనిధి, సకలంబును బర్వతముల సంపిహితము చేఁ
తమఁ జాలునట్లు గాఁగం, బెకలింతుమె మందరాదిపృథ్వీధరముల్. 97

క. అని పలికి మఱియు నిట్లని, రనఘా నీయానతిచ్చి నట్టులు సేయం
జనుఁ గాదె సేతుబంధన, మొనరింత మటంచు సంభ్రమోత్సాహమునన్. 98

క. బలిముఖు లవ్వననిధికి, న్నలినిధు లొనరించి విష్ణుపతి కెఱఁగి కడున్
బలిమి మెఱయ నందఱు గ,బ్బలులం బెకలించి తే న్నృపాలకునాజ్ఞన్. 99

వ. నలుదెసలకుం జని రట్టిసమయంబున. 100

సీ. లవణవారాశిఁ గాలువచేసి యినుమాఱు దాఁటినపవమానతనయుఁ డొకఁడు
తాతకంటెను బలాతిశయుఁ డితం డని పొగడంగఁ దగువాలిపుత్రుఁ డొకఁడు
నుత్తరాశాపార మొకక్షణంబునఁ జూచి వచ్చిరావలఁతి శతబలి యొకండు
మును శైలకూటంబు మునులకై మోఁకాలఁ బగులఁ జేసినఋక్షపతి యొకండు
దధిముఖుఁ డొకండు గంధమాదనుఁ డొకండు, నీలుఁ డొకఁడు సుషేణుఁ డన్వీరుఁ డొకఁడు
పనసగజగవయగవాక్షవినతతార,కేసరిప్రముఖులును దక్కినకపులును. 101

మ. విపులాభాగము సంచలింప విబుధు ల్వీక్షించి వార్షిఁ బఁగా
విపులాద్రు ల్పెకలించి తే నలుఁడు పృథ్వీనాథునాజ్ఞప్తిన
క్కపు లారీతిని దెచ్చి యిట్టి వుధ గ్రావాళిఁ జేసంద ని
క్కి పయోరాశిని వైచి కట్టఁ దొడఁగెం గట్టు న్మహోజ్జృంభతన్. 102

క. తానేమేని సముద్రుని,పైనించిన ముంపఁ డగుటఁ బటుకుధరంబు
ల్పెనంది నలుఁడు సేతువు,భానోన్ముఖుఁ డయ్యెఁ గడు నిదానము గాఁగన్. 103

వ. అప్పుడు. 104

క. ఒకతరుచరుండు పదిగిరు, లొకగిరిఁ బదుగురువనాటు లొకప్లవగచరుం
డొకగిరిగా నిర్వహమునఁ, బెకలిచి తెచ్చి రతితుంగపృథ్వీధరముల్. 105

చ. కడకొని వాలపాశములఁ గట్టి కుభృన్నిచయంబుఁ గీశుల
ప్వడు గొని తెచ్చు టొప్పె మును పూర్వసుధాశనులు న్సుధాశను
ల్గడఁగి పయోధిఁ ద్రచ్చి రదిగాదని ఘోరసముద్ర మొక్కఁడొ
క్కఁడె తరువంగఁ బూని రనుకైవడి నెంతయు నద్భుతంబుగన్. 106

క. వన్నిటజములఁ బీల్చి పరిణ్నాయకు వేఁడి తరుచరులు జలదములం
ద్రెన్నెఁ దడొక్కని కచ్చుచు, నపాన్నరఁ ద్రవ్వి తెత్తు రొగి ఘనగిరులన్. 107

వ. తత్సమయంబున. 108

క. అంగస్థాంధాంచితయ,జ్ఞాంగఫలప్రక్రియాబ్జజాండంబులచే
తంగొటులు విశ్వామిత్రక్రియం గాలికొడుకు దనర్చె నధికాద్రులచేన్. 109

సీ. ఏఁ గుంభకారుండ నివె కుంభము లటంచు నిరుగేలఁ గొండ లొక్కరుఁడు దెచ్చె
నేఁ దంతువాయుండ నివె యంశుకము లంచుఁ గఱకుఱాఁబలక లొక్కరుఁడు దెచ్చె
నేఁ గృషీవలుఁడ నిల్లివె హాలంబు లటంచుఁ బఱపైనఱాఁకు లొక్కరుఁడు దెచ్చె
నే రథకారుండ నివె రథంబు లటంచు గిరిశిఖరంబు లొక్కరుఁడు దెచ్చె
నొకరొకరిఁ జూచి మెచ్చక యుబ్బుమీఱ, నవ్వులాడుచు శతయోజనప్రమాణ
సేతుబంధనిబద్ధప్రసిద్ధహృదయు,వర్తనస్ఫూర్తు లగుకపిమూర్తు లంత. 110

తే. లంకలో నున్నఘోరసాలంబు లిట్లు, కఱుతు మనరీతి సాలము ల్పెఱిచి తెత్తు
రసురగోత్రఖనన మిట్లు యాచరింపఁ, దీఱు నని గోత్రముల్ ద్రవ్వి తెత్తు రొప్ప. 111

క. తమకెదురువచ్చుప్లవగో, త్తమాంగముల మున్న వేడ్కఁ దమ తెచ్చినగో
త్రము లిడి నిలిచెద రధిక,ప్రమోదమున భారవహనభర ముడుగంగన్. 112

ఉ. భూవనితాకుచాద్రులనుబోలు ఝరోదకచందనార్ద్రగో
త్రావలిఁ బట్టి యాడినకతంబున సంభవ మైనయట్టి పం
కావహవృత్తి లేక విమలాత్మత నొందఁగ నేమొ తత్ప్లవం
గావలి యుబ్బుమీఱ ననయంబు మహోదధి నీదులాడుటల్. 113

తే. సేతుబంధనదీక్షాప్రసితమనోంబు,జాతు లగుకపులకు భాస్కరాతపంబు
గలుగకుండఁగ నీరంధ్రగతిఁ దనర్చెఁ, బ్రబలఖచరవైమానికపంక్తి చదల. 114

వ. ఇవ్విధంబున వజ్రకఠిను లగు నమ్మహోపలు లగసగోన్మూలనంబుఁ గావించుట వింత
గాక యుండె నట్లు తేజోనలుం డగునలుండు భువనవిదితంబుగా సంఘటించిన
తత్సేతుబంధనం బనిమిషోల్లాసకరంబు గాకుండియు ననిమిషోల్లాసకరం బై వనచర
గమనానుకూలంబు గాకుండియు వనచరగమనానుకూలం బై పుణ్యజనత్రాసకరంబు
గాకుండియుం బుణ్యజనత్రాసకరం బై సమాచ్ఛాదితభంగంబు గాకుండియు సమా
చ్ఛాదితభంగం బై రవత్తృణవనోభిరామంబు గాకుండియు రవత్తృణవనో
భిరామం బై పంచదినపరిసమాప్తం బగుటయు. 115

క. గుఁడ్లు జంటఁ బెటఁ దేలన్, బెడ్డకరిణి నింతవింత పృథ్వింగలదే
పడ్డు గొలుసుకొఫ లింటిని, గుడ్లగుడు లె యనచు దెసజగణము నదిఁ దెన్. 116

సరసరుఁ డాత్మ మెచ్చి పవనప్రియనందన వాలిపుత్త్ర భా
స్కరసుతముఖ్యులం దగఁ బ్రసాదసుధార్ద్రదృష్టిఁ జూచి దు

ప్రకారముగ నప్పయోధి నొకకట్ట యొనర్చితి రీయశంబు సు
స్థిర మయి యుజ్జగంబులఁ బ్రసిద్ధికి నెక్కెడి సర్వకాలముల్ 117

క. అనఘపులు భవదనుగ్రహమునఁ గాక కపు లస్సముద్రమున సేతు వొన
ర్పను మావశంబె నీమనమునఁ దలఁచినకార్య మది యమోఘము గాదే. 117

వ. అని సన్నుతించి రంత నంతవృత్తాంతంబును దశముఖుం డెఱింగి కలంగి శుకసార
ణాదిమంత్రులతో మంత్రాలోచనంబు గావించి లంకాపురంబు సురక్షితంబు గా
వించికొని యుండె నద్దివసావసానంబున. 119

క. నూత్నమతి స్వనురాశిఁ బ్రయత్నంబునఁ దాఁచికొన్న యాతనిఁ బోలెన్
రత్నాకరుండు నంబరరత్నము లోఁగొని యెనఁగ రవి గ్రుంకెఁ దగన్. 120

వ. ఇట్లు కువలయవ్యథాకరకరగ్రహణంబు చాలించి యినుండు శాంతుం డగుటయు.

—: సాయంకాలాదివర్ణనము :—

సీ. పడమటిదొరసానిఫాలభాగంబున నవరించు కాశ్మీరజన్మ మనఁగ
సంఫుల్లలోధ్రకసానుసముచితాస్తమహీధ్రగైరికధాతు వనఁగ
రవిరథపతనకారణవిభాజితసరస్వన్మధ్యబాడబవహ్ని యనఁగ
బ్రాహ్మణార్ఘ్యోదకబాణప్రభిన్నమందేహదేహోత్థశోణిత మనంగఁ
గోకనదపద్మరాగబంధూకబింబశుకముఖాశోకతామ్రకింశుకలసత్ప్ర
వాళసురగోపజతుచక్రవాకపక్షకాంతి నిరసించి సాంధ్యరాగము రహించె. 122

తే. సాంధ్యరాగప్రథుచ్ఛవి సాగరోదకంబు కీలాలపద్ధతి గానిపింపఁ
జెలఁగి యసురులు తద్రక్తసేవ సేయఁ, దోఁచి రన నొప్పె నిరులు ప్రదోషవేళ. 123

చ. అనుపమదుఃఖపంకమలినాంగలతాఽపరిశుద్ధయై నవా
నవవనజంబు వాడఁ గఠినస్తనచక్రము లుబ్బువీడఁ బ
ద్మిని విషసంగ్రహం బనుసరించె మనోజశిలీముఖాహతు
ల్దనికిన నొవ్వలే కవుఁగదా యినుఁబాసినదోషహేతువుల్. 124

తే. విష్ణుపద మనువిఖ్యాతి వెలయుమండుఁ, గాన నయ్యెడఁ దోఁచు నఖంబు లనఁగఁ
గ్రమతరపద్మరాగప్రకాశమాన, తారకంబులు నభమున బూనటిల్లె. 125

వ. అంత నొక్కింత సేపునకు. 126

తే. రాజు చనుదెంచుచున్నవార్త విని పుష్కరాంగన నిజాననాంబుజ మలమికొనిన
భ్రమరకంబుల నెగయించి ప్రబలెననఁగఁ, జీఁకటులు వాసిప్రాగ్దిశ చెన్ను మీఱె.

క. పవలు కువలయము రవిచే, నవయుట విని యమృతసేచనము సేయ సుధా
నవకలశ మెంతయు స్వయవిధాత్రుం డెత్తె నన హిమాంశుండు వొడిచెన్. 128

క. త్రిజగత్త్రవిశదమగు తద్ద్విజరాజోదయము మసఁగు నధికరాజీవ
వ్రజము ముడింగె భువనముల, భుజంగవిలసన మడంగెఁ బో భువనములన్. 129

తే. ఇట్లు చంద్రోదయం బైన నెల్లదిశల, వెన్నెలలు పిండి చల్లినవిధము గాఁగ
దలిమడుంగులు వఱచిన తీరు దోఁప, నిండికొనెఁ గపు రెంతయు గందుమీఱి. 130

చ. హిమకరదీధితు ల్దనికి హేమమయం బయితోఁచు వార్ధితో
యమునపయిఁబీచు వీచులసహాయమునం జనుదెంచు మించు శై
త్యములయమారుతంబు మలయం బులినంబుల సేతుబంధన
శ్రమ ముడుఁగంగ భావిసమరస్థితు లాడుచు నిద్రఁ జొక్కఁగన్. 131

వ. హనుమదాదులును రామలక్ష్మణులమహోదయశంబునుం బోని యప్పండువెన్నెలబైట
నారాజశేఖరుం బరివేష్టించి నిద్రాసుఖం బనుభవించి రంత.

క. ద్విజసత్ఫలాప్తిఁ జెఱిచిన, వృజినము సచ్చక్రనిరతవేధాపటుహే
తుజనితదోషము రాజు ప్రభఁ జెఱిచె నన నిందుఁ డల్పభానుం డయ్యెన్. 133

వ. తదనంతరంబున. 184

సీ. తారాపథాంగన దాల్చుతారావళిఁ గనుపట్టు నాయకమణి యనంగ
జారచోరవికారకారియై పాంథుల నటునిటు నడిపించునౌషధ మన
నాకమహీరుహప్రాకటపూర్వదిశాశాఖఁ దగు గుళుచ్ఛం బనంగఁ
గమలారికరబిసకాండము ల్మెసవెడి యభ్రధునీచరద్ధంస యనఁగ
మిత్రుఁ డరుదెంచుట సహస్రపత్త్రములకుఁ, బద్మభవుఁ డెఱిఁగింపఁగఁ బంపినట్టి
ధర్మలేఖ యనంగఁ బ్రాగ్భాగమునను, వెలసె నంతయుఁ దెలువెక్క వేగుఁజుక్క

మ. అవనీజాగ్రము వార్ధి గట్టితిరి లెం డాలస్య మింకేల యో
యవనీజాటకులార! యంచు నవనీజాళు ల్వడి న్లేపుచు
న్నవనం గోకిలకేకికీరముఖనానాపక్షిసంఘాత మె
క్కువిధి న్మ్రోసె విశాలతుంగపటుశాఖాశాఖికాగ్రంబులన్. 186

వ. అంత. 187

క. ఉదయగిరి మండె ననఁ గెం, పొదవి న్ప్రాగ్దిశ వివస్వదుదయము రక్త
చ్ఛదమై ప్రతాప మాకృతి నొదవి యరుగుదెంచుచున్నదో యన మెఱసెన్. 188

వ. ఇట్లు లోకచక్షురాహ్లాదకరుండై భువనచక్షుం డుదయించుటయు. 139

ఉ. అంతకమున్న రాముఁడు సహానుజుఁ డక్కపికోటితోన ని
ద్రాంతము నొంది కృత్యముల నన్నిటిఁ దీర్చి దినేంద్రపుత్త్రజుం

ఘాంతకవాయుపుత్త్రులను భల్లుకనాథసుషేణముఖ్యవి
క్రాంతుల సేతుకృద్దధిముఖద్వివిదాదులఁ గాంచి యిట్లనున్. 140

క. దేవాసురవరులకేఁ, భావంబున నైన నిట్టి పని యొనరింపం
గా వలఁతులె యుదధి మహో,గ్రావంబులు నిల్పి మీరు కపులే తలపన్ 141

వ. అని మఱియు ననేకవిధమధురవచనంబుల నగ్గించి కార్యవచనంబులు ప్రసంగించి 142

శా. గర్జాభీషణలాశివాగ్విహితలంకాద్వీపము న్ముంప వి
స్ఫూర్జద్బాహుతరంగవానరబలాంభోరాశి దుర్విస్విమ
న్నిర్జరస్థితి నేఁడు వట్టులు మది న్వీక్షింపుఁడీ రంచు స
చ్ఛ్యూర్జన్మూతవపుర్విలాసుఁ డగుగోత్రానాథుఁ డామోదుఁడై. 143

చ. అనవుడుఁ బావనిప్రముఖు లాతనితో భవదీయసేనపై
దనుజులమీఁది గాలి యును దాఁకఁగ నేర్చునె యుద్ధయాత్ర కీ
వనుమతి చేసినప్పుడ జయావహమైనముహూర్త మట్లు గా
వున నెడసేయ కిప్పుడె తప్పుం జన లంకపయి న్మహీశ్వరా. 144

వ. అని పలికి యమ్మహాయోధు లాయోధనంబునకు నూల్కొలుపుటయు నక్కపి యూథంబు యూథపనాథసనాథంబై విబుధవరూథినీవిధానంబున గండు మిగిలి రాకానిశాకరోదయంబునకుం బొంగు నీరాకరము ననుకరించి పొలిచి వెడలు నత్యవసరంబునం బరస్పరాహ్వాననినదంబును దేవదుందుభిధ్వానంబును జలధితరంగ విరావంబును నేకీభవించి దిక్కులు పిక్కటిల్లె నంత రామలక్ష్మణులు వనచర స్కంధస్యందనాధిరూఢులై సప్తజిహ్వుండు ద్విముఖంబులు దాల్చినచందంబునఁ బ్రతాపంబు మే నైనవిధంబున సేనామధ్యం బలంకరించి మహాకపివీరపరివృతులై వంశకరుం డగుఖరకరునకుం గరంబులు జోడించి యంబుధిం బూజించి ప్రార్థించి యాంగికంబు లగు శుభనిమిత్తంబులకుఁ జిత్తంబులు హర్షపరాయత్తంబు లగుచుండ విభీషణుండు మంత్రిచతుష్టయసహితుండై యంతరిక్షమార్గంబునం బఱతేర సేతుమార్గంబున లంకాపురాభిముఖులై నడువం దొడంగి రయ్యెడ. 145

క. మీఁ దెదురువచ్చు దనుజా,నీకంబుల యుబ్బ విరియ నిజ మిట్లనున
ట్లాకడలిఁ దరంగంబు ల,నేకంబులు వెడలి విఱుగు నెదురఁ గపులకున్. 146

సీ. అంబుధి న్నుభయపార్శ్వంబులఁ గనుఁగొని నడికట్టువడుచు నడుచువారు
మేరమీఱి జగంబు ముంగక పాథోధి నిలుచు టబ్రం బని తలఁచువారు
జలనిధికుక్షి నిశాచరు లెట్లు వసించిరో యనుచు నూహించువారు
మేటికడలి యుద్ధిమేఖలామేఖలాకృతి కహించె నని తర్కించువారు

దర మొకింతయు లేక సాగరములోన, నీఁదులాడుచు సేతువు నె
మించి చనువారుఁ జాల వర్షించువారు, నైకపు లాహవాపేక్ష

వ. ఇవ్విధంబునం గపిచమూసాగరంబు సాగరంబుపై నురవడించి చను

క. వారిధితరంగశీకర, వారంబుల లెక్కవెట్టవచ్చు ధరణి నె
వ్వారికిఁ బ్లవగచమూవి, స్తారమ్ము గణింపవచ్చుఁ జాతుర్యమునన్.

చ. అని ఖచరు ల్నుతింపఁ బ్లవగౌఘ మమోఘరయంబు మీఱఁగాఁ
జనిచని వార్ధితీరమున నిశాచరహేయము లంక దవ్వులం
గనుఁగొని క్రోధఘూర్ణితముఖంబగుచున్ దరిఁ జేరి రాక్షస
ధ్వని విని యంత నిల్చెఁ బ్రవిదారణకేళికి నుత్సహించుచున్.

చ. నిలిచినసేనఁ గాంచి తరణిప్రియపుత్త్రుఁడు చేయి వీచి పే
రెలుఁగున లంకచుట్టు దిగుఁ డింక భయం బొకయింత లేదు వా
బలిముఖు లన్నిశాటకులపాలకుఁ బ్రోలికిఁ బోవ నొక్కట
న్వ్రాలుపడి యెక్కి రున్నతనువేలము సద్విటపీవిశాలమున్.

వ. ఎక్కుటయు నక్కపిధరగహనంబు ధరాసురం బయ్యును నప్పుర
కాననసంయుతంబునుంబోలె నత్యావసరంబునఁ గపులు

సీ. అరివినిర్భేద్యసుస్థిరతరామోఘయద్వారబంధకవాటతతులు గలిగి
పృథులోగ్రదంభోళ్యభిన్నతుంగోరువప్రత్రపుస్థగితకుడ్యములు గలిగి
దనుజసంరక్షితదారుపాషాణయంత్రప్రకల్పితగోపురములు గలిగి
శిఖరసంస్థాపితాసితచ్ఛురికాఖరశాతశకలసాలగణము గలిగి
యుగ్రబాణబాణాసనయోధవీర, బృందధనధాన్యఘాసరసేధ్మసలిల
కఠినబహువిధయంత్రసంగ్రహనికాచ, యప్రమాషితఘోరదుర్గములు గ

క. భృంగాకర్షితమదమా, తంగపవనజవపరిహాసితసుగంధరో
త్తుంగరథవీరభటసే, నాంగచతుష్టయము గలిగి యతులితభంగిన్.

క. ఒప్పారుచుండు లంకాపుర, మప్పుడు వీక్షించి ప్లవగు లధికౌత్సుక్యం
బుప్పతిల దానిచుట్టుం, గప్పికొనిరి ఘోరవార్ధికైవడి నంతన్.

చ. విడిసినసేనయున్ దనుజభీషణహుంకరణంబు మీఱఁగా
విడిసెడుసేనయున్ న్విడియ వేఁడక నొందెడుసేన సేతువు
న్నడిచెడుసేన పొంగెడుమనస్థితితో వెసఁగట్ట నెక్కఁగా
వెడలెడుసేన యయ్యె రఘువీరున కెంతయు సంతసంబుగన్.

వ. ఇట్లు లంకాపురంబునలుదెసలం బుడమి యీనినక్రమమ్మునం గ్రమ్మికొనిన యత్తరుచ
రవాహినీవిస్తారంబు. 157

క. నాపుత్రికహృదయపరీ, తాపము వాయు నని తలఁచి ధరణీసతి హ
ర్షాపరిమిత గా మేనునఁ, జూపట్టెడుపులకపటలశోభం దనరెన్. 158

ఆ. వె. అట్లు లంకయను మహాలతాభవనంబు, నలమికొనిన వనహుతాశన మన
నున్న సేనఁ గాంచి యుల్లంబు సంతోష, మగ్న మగుచునుండ మనుజవిభుఁడు. 159

వ. సోదరసహితంబుగా వనచరస్యందనావతరణంబు గావించి త్రికూటప్రాంతసమ
విశాలరమణీయప్రదేశంబున యోధవీరసహితంబుగా సమాసీనుండై విభీషణుం
డయ్యాయిప్రదేశంబులు వేఱువేఱ నిరూపించి చూపుచున్నయవసరంబున. 160

క. కోపారుణలోచనుఁడై, భూపాలవరుండు లంకఁ జూడఁగ నటఁ బెంపొం
దూపుల నేర్పక తత్పురిఁ, జూపుల నేర్తునుభంగి శోభిల్లంగన్. 161

క. అంత దశాస్యుఁడు తద్వృత్తాంతము విని చింతనొందు తదవసరమున
సంతోషము పెరుఁగఁగఁ దత్సంతతి యగుశక్రజిత్తు తా నిట్లనియెన్. 162

ఉ. ఏఁ గలుగ న్విచారపది యేటికి మర్త్యుల నాప్లవంగుల
న్నేఁగఁగఁ గాంచి బెబ్బులి చలింపఁగఁజేసి వధించునట్లు లా
భోగుల నుగ్రుఁడై ఖగవిభుండు హరించెడునట్లు త్రుంతు వా
రీఁగలు గంధసింధురము నేను ననుం జెనకంగ నేర్తురే. 163

చ. అనునెడ ఖడ్గహస్తుఁడు ప్రహస్తుఁడు రావణుతోడ నీకుమా
రున కిదు శక్య రక్కసివరూథిని నొక్కఁడ త్రింగఁ జాలుఁ ద
క్కినపిశితాశులుం గడఁగి కీశుల నాశము సేయ నేర్తు రీ
వనితరసాధ్యవిక్రముఁడ వాత్మ విచారము సేయ నేటికిన్. 164

వ. అని బరవసంబు సేసి పల్కె నంత నతికాయ మహోదరాయ మహాపార్శ్వ సుపార్శ్వా
దులును బ్రథనసన్నాహసముత్సాహపోషణంబు లగుభాషణంబు లాడుచుండియు నద్ద
శాననుండు గండుమిగిలి భండనంబునకు లెండు లెం డనుడు నద్దండు లగు దండ
నాయకులు తత్క్షణంబ. 165

సీ. కాలజీమూతసంకాశదేహంబులఁ గ్రాలురక్కసులఁ జక్కంద్రోఁ గూర్చి
కాటుకకొండలకైవడి నిరసించు కరులమొత్తము లనేకములు గూర్చి
పృథులనేమ్యారవబధిరీకృతదిగిభకర్ణంబు లగు తేరిగములు గూర్చి
పవమానవేగంబుఁ బరిహాస మొనరించు నశ్వరత్నము లసంఖ్యములు గూర్చి

భూరికాహళభేరికాఘోషనినద, పూరకసము దీటుకొనఁ జతురంగబలము
నిర్వ్యథంబున సమకూర్చి నేపురేఁగి, యవనియీనినక్కైవడి నతిశయిల్లె. 166

క. ఝంకారసహితస్థితి భటు,హుంకారమ్ములును మదమహోత్కటగజకృ
ద్ఘీంకారము లనురథను,ష్టంకారములుం జెలంగె సైన్యములోనన్. 167

వ. ఇట్లు కట్టాయితం బై రాక్షసబలంబు కయ్యంబునకుఁ గాలు ద్రవ్వుచుండె నటి
యెడ. 168

క. రాముఁడు సాధుపికైకా,రాముఁడు పరిహసితశశధరాముఁడు సీతా
రాముఁడు దర్పితశత్రువి,రాముఁడు కరుణారసాభిరాముం డగుచున్. 169

## — అంగదుని రాయబారము —

క. వాలికుమారుఁ గుమారుం, బోలినబలశాలిఁ గాంచి భూమివిభుఁ డెదన్
జాలి మిగుల నిట్లనియెను, వాల ముడిగి రాయబారమం పెడుబుద్ధిన్. 170

క. వృత్రారిపుత్రపుత్ర జగత్త్రయశత్రుఁ డగు పఙ్క్తికంధరు దుశ్చా
రిత్రుఁ గని నీవు వాగ్వై,చిత్రి మెఱయఁ బల్కు మేము జెప్పినభంగిన్. 171

ఉ. వాయనుజుఁడు నేను గహనంబునఁ గ్రుమ్మరువేళ జానకిం
దోయజనేత్రఁ దెచ్చితివి దొంగతనంబున దానఁ గోప మ
త్యాయత మైన వానరబలాంబుధితో జలరాశి దాఁటి యం
హోయుతు నిన్నుఁ గూల్పఁగ మహోగ్రత నీపురి కేగుదెంచియున్. 172

చ. మతిఁ గరుణోద్భవం బగు తమ సుతఁ దోడ్కొని వచ్చి తప్పునే
పితిఁ గరుణింపు మంచు నను జేరినఁ బ్రాణముతోడఁ గాతు ను
ద్ధతిఁ దొడరం దలంచిన విధాత్రుని జొచ్చియయేని మచ్ఛరా
హతి మరణంబు సిద్ధము కటా! తగునే బలవద్విరోధముల్. 173

వ. అని యేనాడినచందంబున నేర్పడం బలుకు మని చెప్పి మఱియుం దగినవచనంబు
లుపన్యసించి. 174

క. లంక విభీషణునకు నక,లంకధృతికి నొసఁగి నిశ్చలమతి నాకుం
బంకజముఖి సీత నొసఁగి, శంకవిడిచి బ్రతుకు మనుము సారవిచారా. 175

చ. అపుడు నంగదుఁడు భకరస్త్రహితం గడనొచ్చి భీతి ని
న్గని శరణంబు వేఁడ టుకుఁ గా దశకంఠుఁడ యిందు వచ్చు నీ
వనుపమ సత్కృపానిరత మైనమనస్స్థితి రావణాసురుం
గన నను బంపనేల సముఖంబున కేఁగియు రాయబారమే. 176

క. అని నీపనుపున కేఁదురా, డినతత్పాదముమింపు నని వడిం దక్షిణ మ
వ్వనచరుఁడు లంకపైకుత్తెకె నసురనాశకరధూమకేతువు నాఁగన్. 177

ఆ. వె. వినయ మెసఁగ రామవిభునకుఁ బ్రణమిల్లి, యతనియాజ్ఞఁ గొని రయంబు మెఱయ
లంక మీఁది కిట్లు లంఘించి పంక్తికం, ధరుసభాంతరంబుఁ డజియ నరిగి. 178

ఉ. ఇంచుకయేని భీతిని వహింపనిచిత్తముతోడ రావణుం
గాంచి నయంబు మీఱ దశకంధర! రాముఁడు రాయబారము
ర్థించి భవత్సమీపమునఁ దేటపడం దగుమాటలాడఁ బు
త్తెంచిన దూత నాటఁ జనుదెంచితి నప్పని నిర్వహింపఁగన్. 179

క. అంగదుఁడ భూతముల కపీ, తాంగదుఁడం బటుభుజాబలాంగదుఁడను నీ
వంగద నొందక తెలియు వి, నంగదవయ్యా మదీయనయవచనంబుల్. 180

ఉ. రాముఁ డమోఘగోచరుఁ డరాతిభయంకరుఁ డమ్మహాత్ముతో
సామ మొనర్చి బ్రహ్మకు నసాధ్యుఁడ వైనను గొప్పఁ గాక, సం
గ్రామము సేయువాఁడ సుముఖస్థితి రామున కేను భూమిపు
త్రీమణి నీ వటంచుఁ గుమతీ చెడనొప్పెనె దుర్వివేకి వై. 181

తే. గీ. లంక నీతమ్మునకు నకలంకమతి వి,భీషణున కిచ్చి రఘుకులభూషణునకు
జనకజాత సమర్పించి శరణుసొచ్చు, కంటె బ్రదుకఁదెరువొకఁడుగంటె చెపుమ.

వ. అని తెగనాడి రాముండు తానాడినచందంబున నాడుమని యానతిచ్చినవాక్యంబు
లన్నియు నుగ్గడించి వెండియుం దగిన వచనంబులు ప్రసంగించి యంగదుండు. 183

క. సింధువు దాఁటియుఁ గరుణా, సింధు వగుచు నీగతి న్వచింపఁ బనిచె ద
ర్పాంధత చన రామునితో, సంధి యొనర్పు మిది మేలు సకలంబునకున్. 184

క. మహిపుత్రి నొసఁగి రాము, న్మహితాత్ము శరణు సొచ్చి మనుట కడుఁ దగు
న్బహుపుత్రమిత్రనాశన, మహాహవ సైరింప నెట్టు లగుఁ గలహమునన్. 185

క. కడు సంధి గోరి బలవం, తుఁడు దూతం బనుప వానిఁ ద్రోచిన మిగులం
జెడుట నిజము ఘనవైద్యునిఁ, గడపినరోగిక్రియఁ బంక్తికంధర వింటే. 186

ఉ. నావుడు నవ్వి క్రొవ్వి కపినాటు నిశాటకులాధినాథు న
న్నీవిధి నొవ్వఁ బల్కె దక్షహీనులు మర్త్యులదెంత మున్నచు
ర్త్యావలిఁ దోలియాడిన మహాబలశాలికి నాకు లంకయున్
దానవదంబు వానరపతంగముల న్వడి మ్రింగ కుండునే. 187

తే. గీ. బద్ధి చెప్ప నిటకుఁ బంతెంచినటికి, బద్ధి నచ్చు నిన్నఁ బొలియఁజేయ
నని దురుద్ధతిన్ దశాననుఁ డంగదుఁ, జట్టి చంపు మనియె భటులతోడ. 188

ఉ. అట్టియెడ న్మహోగ్రబలుఁ డంగదుఁ డింద్రుని మన్మఁ డట్లు ద
న్నట్టఁగవచ్చు రక్కసులఁబట్టి నఖంబులఁ దన్ముఖంబులన్
బిట్టు వగిల్చి వాలమున బెట్టు నొగిల్చియు మెట్టుమెట్టి య
ట్టిట్టు విదిర్చియు న్వడి ననేకులఁ జంపె విలాసశాలి యై. 189

క. ఇటులు పొలియించి రోషోత్కటుఁ డగుచున్ దశముఖుండు గనుఁగొనుచుండం
బటురక్తసిక్తనఖుఁడై, తటుకున రామావనీంద్రు దరికిం జనియెన్. 190

ఆ. వె. చని నమస్కరించి సకలంబు వినిపించి, రఘుకులాబ్ధిచంద్ర రాఘవేంద్ర
చేటుమూఁడెఁ బంక్తిశిరునకు నతఁ డేల, యాలకించుఁ బథ్యమైనదాని. 191

వ. కావున ననుమానంబు మాని భవదీయదివ్యచిత్తంబున నవధరించిన తెఱంగున మాకు
నాజ్ఞాపింపుం డని కపులం గేపికొని పలికిన మందస్మితసుందరవదనారవిందుండై.

క. రశ్మినిభదీర్ఘవాలుర, నశ్మసదృక్కర్కశాయతాంగులనతినూ
త్నశ్మశ్రుకు విశాలాసుఁడు ఖర, రశ్మికులజనాథుఁ డాదరము నిండారన్. 193

చ. రవిసుతముఖ్యభూరుహచరప్రభుసత్తములార మీర లా
హవమునకుం దిరం బగు ప్రయత్నము సేయుఁ డనంగఁ బొంగి నిం
గివగుల వాలదండములు గేల నమర్చి విదిర్చుచు న్రఘు
ప్రవరుని యానతిన్ క్షితిధరద్రుమవార్ధ్రవదుగ్రపాణులై. 194

ఉ. క్రుద్ధులు బాహువిక్రమసమృద్ధులు వానరు లంత యుద్ధస
న్నద్ధులు గాఁగఁ గాంచి నరనాథుఁడు రాముఁడు లక్ష్మణుండు ను
ద్బద్ధసమిద్ధహస్తులు ముదంబున నిల్చిరి వెన్నుదన్ని య
ట్లుద్ధతి మోహరించిన మహోగ్రబలు ల్కపు లల్కఁ బెంపునన్. 115

— యుద్ధారంభము —

శా. పాషాణంబులు వైచి కూటములఁ దీవ్రప్రక్రియన్ జువ్వి వి
ద్వేషం బుప్పతిల న్మహీరుహములు ద్వృత్తిం బ్రయోగించి దీ
ర్ఘేషాకర్కశవాలసంహతిఁ గనత్కేతువ్రజం బూడ్చి య
ట్లీమద్భీతులు గాక లంకపయి న్సర్వప్లవాటు లాటోపతన్. 196

సీ. సాలము ల్పెనుశస్త్రఁబుచే రాల్చి కూటము ల్గూటపంక్తులఁ బగిల్చి
నఖములచే హస్తినఖములు గోరాడి వరగోపురముల గోపురము లడఁచి
వాటంబు లైనకవాటము ల్విదళించి గసులచే వెడలురక్కసులఁ గూల్చి
యశ్వశాలలను గండాశ్మము ల్చిండించి దంతావళముల దంతములు వెలికి

స్యందనమ్ముల నురుతరస్యందనముల, గ్రందఁ గదుమోవి దానవమందిరావ
రోధవ్యాధయావరోధనిర్ఘోషు లరిజిగీషు లత్యంతరోషులు కీశు లెల్లు. 197

వ. చలము సాధించుటయు నప్పుష్టసంబునం గలవా రామలత్వం బొంది హాహాకారంబు
లొనర్చి రంత. 198

క. మండిపడి దశాననుఁ డు, ద్దండులఁ దనదండ నున్న దండాధిపుల
స్యందనములను వరూథిని, గండుమిగుల నడుపుఁ డని సగర్వస్ఫూర్తిన్. 199

క. వప్రములు వెడలి శరశా, లాప్రముఖాలయములం గలఁచి యాడిరి ప్ర
క్షిప్రప్రక్రియఁ దరుచరు, లప్రతిహతవిక్రమాఢ్యు లగుచు బెలువన్. 200

క. తరసము మెసవెడు మీశాం, తరసము గడు మేలుగాను తలపోయంగా
తరసమ్మత మది కలహాం, తరసుఖులఁ దరుచరులను దలుముఁ దురవడిన్. 201

వ. అనుటయుం జేర్చి చతురంగసైన్యంబులం దత్సైన్యాధిపతులు జన్యంబునకు నాయ
కొలుపుటయు. 202

చ. నరభుజు లాహవోపకరణంబులతో రణభేరికోరుభాం
కరణముతో మదేభతురగంబులతో రథరథ్యకోటితో
నురవడి గర్జితాభ్రములలోకోయఁగ నోయని యార్చి తాఁకి ర
త్తరుచరవర్యులం బనమదారుణచర్యుల ధైర్యధుర్యులన్. 203

వ. ఇవ్విధంబునం దలపడుటయు నంతకుమున్న కట్టాయితంబై యున్న యస్వాఁచర
బలంబునుం బొంగి నింగిపగులు సింహనాదంబులతోడం దాఁకుటయు. 204

చ. తరుశరకోటుల న్నఖరదారుణకుంతములన్ ధరేంద్రము
ద్గరముల వాలఖడ్గముల దంతకుఠారములన్ దృషద్భయం
కరపరిఘంబుల న్నగనికాయము గన్గొని పొంగఁ గ్రుంగ న
క్తంచరమానుషాదు లతిదర్పితులై సమరంబొనర్పఁగన్. 205

ఉ. మేదశ్ఛాదము లస్థితీగము లిషుర్మింబులున్ ఛత్రస
త్పాదంబంబులు ఖేటకూర్మములుఁ జక్రగ్రాహసంకీర్ణము
లాదండాహులు రక్తవాహినులు రక్తోరణ్యసంభూతము
ల్యాదోనాథునిఁ జేరె మస్తకశిలావ్యాప్తంబులై యత్తతిన్. 206

లయగ్రాహి.

విచ్చిచననొచ్చియు నియచ్చరులు మెచ్చఁగ మహోచ్చనగముల్విఱిచి తెచ్చి యసురాళి పై
వ్రచ్చి చలముచ్చలను జొచ్చి కడునచ్చెరువు నెచ్చెరఁగ మ్రుచ్చులఁ గ్రచ్చ్యో...ఖీఁ

వ. సమరతలంబున. 486

గీ. దనుజశరకోటి తను నంత దాఁకకుండ, నాఁగి యమ్ముల శోణితం బానకుండ
నుచ్చి చననేసి యసురుల నుక్కడంచెఁ, గడురయంబున నొక్కనిఁ గడపకుండ.

గీ. రాముఁ డరుణాంబుజముఖాభిరాముఁ డగుచుఁ, దక్కు నిశాచరుల నెల్ల నుక్కడంచి
మీఱి యంతకుమును మూర్ఛదేఱియున్న, యనుజుఁ బొడఁగాంచి కపిరథం బవతరించి.

వ. గజగవయగవాక్షగంధమాదననలనీలసుషేణపనసవినతతారకుముదవేగదర్శివృషభమైంద ద్వివిదసుగ్రీవాంగదపవనతనయకేసరిశతబలిదధిముఖప్రముఖవలీముఖపరివేష్టితుం డై సముల్లాసంబునం దేలుచుండె నంత నక్కడ లంకాపురంబున నెట్టకేలకు నొక్కింత భయంబు దక్కి దశముఖుం డాప్తుల నవలోకించి. 489

క. హరికులిశము హరిచక్రము, హరువరశూలమును గ్రౌంచహరు శక్తియు నా
హరిభీకరతరదండము, సరిగా శ్రీరామచంద్రుసాయకములకున్. 490

చ. ప్రథితయశు న్రఘూత్తము నృపాలశిఖామణి నోర్వలేక దై
ర్యధనుఁడ నయ్యు వైరినిచయంబులు నవ్వుచు సంతసింప వే
పథువు జనింప లంక కిటు పండవిధంబునఁ బాటివచ్చితి
గ్విధి విపరీతవృత్తిఁ బ్రభవించిన యాపద కింత యేటికిన్. 491

వ. అని పలికి విషాదవేదనావోద్దూయమానమానసుం డై యూరకుండి. 492

ఉ. నాయనుజన్ము నస్యకపిఁ బ్రబలార్భక కాండజన్ము నా
గాయుతసత్త్వుఁ బర్వతసమానసదృశోగ్రవిశాలవక్త్ర
క్త్రాయతచారునేత్రుఁ బితామహదత్తవరప్రలబ్ధని
ద్రాయతుఁ గుంభకర్ణుని నదభ్రవిదారితకుంభికర్ణునిన్. 493

క. బోధింపుఁ డాతఁ డైన విరోధివరూథిని వధించి రూఢధృతిమను
ష్యాధములఁ గూల్చి లవణపయోధిఁ గలపి మరలివచ్చు నొకనిముసమునన్. 494

గీ. కాన నాతమ్ము సుఖసుప్తి నూనియున్న, వాని మేల్కొల్పి యావారవర్తనంబు
నిర్వహించి మదీయసాన్నిధ్యమునకుఁ, దోడికొనిరండునా నరాదులు కడంగి. 495

క. ఘననిశ్వసనోచ్ఛ్వసనో, జ్జనితధ్వనిభయము నతినిశాచరమయము
న్మనజాస్థికలచయముం, జని కాంచిరి కుంభకర్ణశయననిలయమున్. 496

వ. కనుంగొని యతిప్రయత్నంబున. 497

క. చేరి ఘటకర్ణకర్ణ, ద్వారంబులు రెండు బిట్టు ప్రయ్యలు గాఁగన్
ఘోరనారినాద ఘనశంఖారవము లొనర్చి నిద్రఁ గదలకయుండన్. 498

సీ. కృష్ణవర్త్మనిశాతకీలలఁ గ్రాఁగిన తైలంబు కర్ణరంధ్రములఁ జొనిపి
ధారాకఠోరకుఠారసంహతులచే ముఖమున నంటంగ మొనసి మోఁది
మత్తదంతావళమల్లంబుఁ గొనితెచ్చి కడువడి నురమున నడువఁ జేసి
పలువురు బలియురు పనివడి తెచ్చి గండశైలజాలంబు దేహమున విసరి
గదల నడిచియుఁ బొడిచియుఁ గఱచియు మఱి, యెన్నియే న్యాయనలొనరింప నిట్టునట్టు
పొరలి వెస నావులించుచుఁ బొంగ నీల్గి, యెట్టకేలకుఁ దెలివొంది యిట్టు లనియె.
గీ. దివిజరిపులార నన్నుఁ బ్రబోధింపనేమి, యవసరం బిప్డు వచ్చె దశాననుండు
రోషవిషమనుండు బలవద్విరోధ మెదిరి, తెచ్చికొనియెనో తెల్పుఁడు దడయకుఁ గాక.
క. కులభూషణుఁడు విభీషణుఁ, డలఘుగుణుఁడు కుశలియే కదా యతఁడున్నం
గలుగదు విపరీతపుటా, కులపా టిపుడేల మేలుకొలిపితిరి నన్. 501
గీ. పెద్దనిదుర వేల్పు పెద్ద వరం బిచ్చె, నెడల బలిమి నెవ్వరేని దెలుప
నాఁడు పెద్దనిదుర వీడ్కొందుఁ దప్పదాన, లేచెనేని జగము నేఁచుననియె. 502
వ. అట్లు గావున నూనషాణ్మాసికసుప్త్యవస్థుండ నగు నాకు యుద్ధంబున మరణంబు
సిద్ధం బని పలికె. 503
సీ. ప్రకట నిద్రాభంగరక్తలోచనము లంగారధానికల ప్రకార మొంద
నలసత దోఃపంగ నావులించినవక్త్ర మద్రిగహ్వరలీల ననుకరింప
నాఁకలిగొని వెన్ను నంటిన జఠరంబు డింకినజలరాశి కీడుగాఁగ
దంతసందష్టనోద్గతభైరవారావ మభ్రంబు పెట్టి లెసునట్లు గాఁగ
నున్న కుంభకర్ణు నుజ్జ్వలానలవర్ణు, నగ్రభాగమునకు నరుగ వెఱచి
పార్శ్వముల వసించి ప్రణుతించి యల్లన, నిట్టు లనిరి దైత్యభృత్యవరులు. 504
క. ఓయన్న మహాకార్యము, మీయన్నకుఁ గల్గి నిన్ను మేల్కొలుపఁగ న
త్యాయతమతిఁ బుత్తెంచిన, నీయన్నెడ కరుగుదెంచి నిపుణత మెఱయన్. 505
క. నిను లేపితి మన్న వలన, విన దగు కార్యంబు లెల్ల విందు బుభుక్షా
వినివృత్తి గాఁగ మాచే, సిన వంటకములను దృప్తిఁ జెందు మనవుడున్. 506
క. కాల్యములు దీర్చి గంధస, మాల్యాదులైన శాకసూపమహితఘృతశరు
కల్యాన్నకుధరములు దధి, కుల్యంబులతోడ భక్ష్యకోటులతోడన్. 507
వ. పాతాళవివరంబునుం బోని నిజకంఠబిలంబునం దిగవైచి వెండియు నక్కుంభకర్ణుం
డనేక మార్జారమాంసంబును నపరిమితకుక్కుటపలలంబును నిశేషమహిషామిషంబు
నా బహుసృగతరసంబును నగణ్యఖ్యాతసూకరక్రవ్యంబును నగణితమానవపిశితంబును

నధికగోధికాధాతువును సమధికమూషికపిండికయును నతిరిక్తవిహంగమకాళికయును
సమగ్రజలచరపలలంబును రాశీకృతశష్పస్తంబును మెసవి. 508

క. శతఘటశోణితముఁ దశశతఘటమద్యమును బంచశతఘటమధువున్
శతఘటగోఘృతము న్నవశతఘటతైలంబుఁ ద్రావి సమసుం డగుచున్. 509

మ. విపరీతాకృతి ఘోరహుంకృతిఁ గులాద్రివ్యభృత్సదృక్షోన్నతిం
జపలప్రకృతి రాజపద్ధతిని జేర్చున్ భ్రాతృవీక్షాప్రలో
లుపబుద్ధిం జనుకుంభకర్ణు ఖలశీలుం గాంచి నిశ్చేష్టమై
కపిసంఘంబు భయార్తిఁ జేరెను రఘుశ్రేష్ఠనాథుసామీప్యమున్. 510

వ. మహోద్భుతలంకాసముద్భాసభూతంబు చందంబున నరుగుచున్నం దదీయవికృతాకృతిం గాంచి వెఱగి పఱచు తనుచరుల నోడకుం డని ధనుర్ధరుండును సత్త్వయుండు నగు పూర్వవంశభూషణుండు దోషాచరకులవిభూషణుండగు విభీషణుం గనుంగొని.

మ. తనఘోరాకృతిఁ గాంచి భూతమనుచున్ ధైర్యంబు పోల్పెదఁ జే
తనరాహిత్యులపోలె వానరవరుల్ త్రస్తాత్ములై యుండఁగే
తనవస్త్రంబులు జానులగ్నములుగా దర్పంబునం బోవు నీ
తని పేరెయ్యది నాకుఁ దెల్పు మరియంత్రప్రక్రియావేదివై. 512

వ. అనుటయు నమ్మహాత్మున కవ్వినీతాత్ముండు. 513

గీ. వీఁడు రావణు ననుజుండు వీనిపేరు, కుంభకర్ణుండు నిద్రగూరియుండు
సమధికబలుండు సమరప్రచండుఁ డాజి, సుస్థిరభుజుండు నాకగ్రజుండుఁ జుండు.

క. సాగరముల నెఱుఁగక నిద్రాగరిమను నాఱునెల లితఁడు పవళించున్
జాగరమొకదివసము నాఁ, డోగిరము భుజించు సుఖసమున్నతిఁ గాంచున్. 515

వ. మఱియు నద్దివసంబున దివిజులకు వజ్రేయుండు నేఁడు ప్రజాగరణదినంబు గామి నెఱిఁగియు దశకంధరుండు భవదీయదివ్యాయుధశిథిలీకృతదేహుండైనవాఁడు గావునం గార్యాకార్యవినిశ్చయబుద్ధిహీనుండై ప్రబోధింపం బంచినం దెలివినొంది యగ్రజాలోకనాయత్తచిత్తుండును మత్తుండునై చనుచున్నవాఁ డిన్నండేని యన్యులచేత బలాత్కారంబున బోధితుం డగు నాఁడ మృత్యువుం జెందు నని బ్రహ్మవచనంబుగలదు గావున నితండు నీకశ్రమసాధ్యుండు గాని దుర్విభేద్యుండు గాఁ డని పలికె వెండియు నక్కుంభకర్ణు జన్మబలపరాక్రమప్రకారంబులు వేఱువేఱ విన్నవించి మఱియును. 516

క. కపులవెలుపు దీటఁగ నిక్కపుదైత్యుఁడు గాఁడు కాష్ఠకల్పితవివర
త్కపటాకృతి యని చాటం బనుపు మనవుడు మెచ్చి నృపుఁ డనుజ్ఞ యొసంగన్.

క. నీలుఁడు సమస్తసైన్యము, నాలోకించి కపులార యసురుఁడు గాఁడు
ద్వ్యంగ మగు దారుయంత్రము, పౌలస్త్యకృతంబు గూల్పఁ బతి యాప్రతిమన్.

చ. అనవుడు గ్రమ్మఱంగ విపినాటచమూనివహంబనీకసా
ధనమయి నిల్చె నట్లు ఖపథప్రవిలేఖనతుంగమస్తుఁడై
ఘనభుజవిక్రముండు ఘటకర్ణుఁడు దీవనఁ బ్రౌలు పుణ్యకా
మిను లురుసౌధకూటముల మీఁద వసించి పయి న్విదుర్పఁగన్. 519

మ. చని కాంచె న్నవరత్నకీలితమనోజ్ఞస్తంభసంవాహమున్
గనదభ్రంకషకేతువాతవిచలద్గాంగాంబుజవ్యూహమున్
మనుజగ్రాహము వైరిభీకరచమూమందీకృతోత్సాహమున్
దనుజవ్యూహముఁ బంక్తికంధరమహోద్యచ్ఛత్రసౌభాగ్యగేహమున్. 520

క. కని యాహాత్మనిరూపాత్మనిశుంభాద్యమితరిపుసంభృతగేహం
బనివారితుఁడై చేరం, జని యగ్రజు చరణసరసిజములకు మ్రొక్కన్. 521

క. మ్రొక్కి నిలిచిన సహోదరు, నక్కునఁ గదియించి యాద్దశాస్యుఁడు గడుపెం
పెక్కిన రత్నపుగద్దియ, గ్రక్కున నిడఁ బంచెఁ గుంభకర్ణునిఁ దగన్. 522

వ. పనుచుటయు బలిమురగు పలువురు రక్కసులు వెక్కసంబునం గొనివచ్చి యిడిన సముచ్చితంబగు పసిండిగద్దియ సుఖాసీనుండై హుంకృతుల నభోభాగం బవియించుచు నున్నం గనుంగొని. 523

ఉ. తెంపరులై నిలింపు లవధీరణ చేయఁదలంచిరో విరో
ధింపుము నష్టదిక్పతులు దేజిరొ సూనుఖరాళి వే
ధింపఁ దలంపు గల్గెనొ సుధీజనమేనుసమీరనక్ర బో
ధింపఁగ నేమి కారణము తెల్పుము నిద్దుర దీరకుండఁగన్. 524

చ. కలఁచుమనో పయోధి యుదకంబులు బొదసిగాఁగ మేదినిం
గలపుమనో నభంబు విలుగంబడఁ గ్రోఁచి దినేంద్రచంద్రుల
న్నిలుపుమనో నభోరసరణిం జనకుండఁగ నాకుఁ గార్యముం
దెలుపుము గాక నావుడు నతిప్రమదంబునఁ బొంగి యిట్లనన్. 525

క. మనవి వొస్పదరియగు శూర్పణఖ నిరపరాధఁ బట్టి ప్రసభంబున ఘో
రనిశాతశరాహతి ముక్కును గర్ణయుగంబుఁ ద్రెవ్వగోసి నాథేచ్ఛన్. 526

వ. జనస్థానంబున నుత్తమశక్తి ఖరాదులుం డొకండ ప్రియానుజప్రియాసహితుండై ప్రమత్త
రుచుస్సుం గనుంగొని సహింపక. 528

చ. అనఘమతు ల్చతుర్దశసహస్రనిశాచరసైన్యయుక్తులై
ఘనఖరదూషణాదు లసమానబలు ల్చని పోరొనర్చి త
ద్ఘనశరవృష్టిఁ బ్రాగినఁ బదంపడి కంచన సేయు గాలవే
దినగుచు వానిభార్యఁ గొనితెచ్చితి సీతఁ గజాతలోచనా. 528

క. పటుకపటంబునఁ దత్పతిఁ, దటుకునఁ దెచ్చుట యఱ నతఁడుఁ దమ్ముండును న
త్కటశోకవేగమున మర్కటులం గూర్చుకొని కడలిగడచె నెదలన్. 529

క. అర్కకులుఁడు రాముఁడు కోట్యర్కవిభుం డాదివిష్ణుఁ డనుచు మఱియు న
మ్మర్కటులు దివిజు లనుచుం, జేర్కొని వెలిపించె నను విభీషణుఁడు గడున్. 530

క. ఏనుమహీసుతరామున, కీనని పలుకుటయుఁ గోప మెక్కి వసుపతీ
జానిశరణంబు వేడఁగఁ, దా నప్పుడు వెడలిచనియెఁ దనమంత్రులతోన్. 531

వ. తదనంతరంబున రాముం డనేకవనాశానీకినీపరివృతుండై సేతుమార్గంబున లంకా
పురంబుపై విడిసి ప్రహస్తధూమ్రాక్షమహానాదమహాకాయాకంపనాదుల నరాదుల
ననేకుల సంహరించి మించి పరాక్రమించి యున్నవాఁ డదియునుంగాక. 532

క. హనుమంతుం డనఁగా నొక, వనచరుఁ డవనిసుత వెదకవచ్చి బలిష్ఠుండై
వినుమింతయు మును విక్రమ,మున నక్షయుఁ జంపి లంక గాలిచి పోయెన్. 533

ఆ. మఱియు నింద్రజిత్తు మహితోరగాస్త్రాళిఁ, జిక్కువడని రాజసింహు మిగుల
గడఁగి యేసపోయి కాందిశీకుండనై, జరగివచ్చితని నిజంబు దెల్ప. 534

క. నీవు సహజబలశాలివి, గావున బోధింపవలసెఁ గయ్యమున ధరి
త్రీవరుఁ గూలిచి నాచే,వీనవడయు మన నతఁడు ధృతిచలనుండై 535

గీ. కొంతతడవూరకుండి యక్కుంభకర్ణుఁ, డన్నఁ గన్గొని వింటె దశాస్య వీత
గాదె నరవానరులు వార్ధిగడచుటెల్ల, భంగిఁ దలపోయ దురము శుభంబు గాదు 536

మ. మునుముం దాటకసంహరించి భృగురాముం గెల్చి తోడ్తో విరా
ధునిఁ జక్కాడి ఖరాదులం జిదిమి మత్తుండైన మారీచునిం
దునుకన్సేసి బృహన్మదాంధునిఁ గబంధుం గూల్చి యేకాశుగ
మ్మున వాలిం బడనేసినట్టి రఘురాముం డేల మర్త్యుం డగున్. 537

క. సముఁడైనవానియెడ సా, మము దానం బధికునెడల మత్తునియెడ భే
దము హీనుఁడైనయెడ దండ,ము [illegible] 538

క. సింధురసైంధవరథభట, బంధువితతి తెగినఁ గాంచి పదపడి రిపుతో
సంధి యొనర్చిన నదియు, స్సంధి యగుంగాక మొదల సామము వలయున్. 539

క. లోకంబునకుఁ ద్రివిష్టప, లోకమునకు మన యొనర్చు లోపంబులు ము
ల్లోకములకు హితుఁడగు నా, లోకేశుఁడు మున్న శేషలోకేశునకున్. 540

మ. వినయం బొప్పఁగ విన్నవించుటయు నవ్విష్ణుండు దైవారి న
వ్వినయం బొప్పఁగ బ్రహ్మతో దశరథోర్వీనాథపుత్రుండనై
దనుజధ్వంసన మాచరింతునని యంతర్ధానముం జెంది య
వ్వినుతాకారుఁడు రాముఁడయ్యె బలవద్విద్వేష మింకేటికిన్. 541

క. మును విది యంతయు నారద, ముని విని చెం దద్వచన మమోఘము నాకుం
జనువు గలిగి తెలిపితి యో, జన సేయుము వలదు దుర్విచార మనవుడున్. 542

ఉ. పక్కున నవ్వి పెద్దయుని పాడి దలంపక నిండుఁగొల్వునం
బెక్కులు ప్రేలి నాఁడ వరిబృందము సంతసమందఁ నట్టినీ
వెక్కడి సోదరుండ వివి యేటికి నీతులు చాలుఁ జాలు నీ
వెక్కడ సంగరాంగణ మదెక్కడ నిద్దుర పొమ్ము పొమ్మిఁకన్. 543

చ. వెనఁగొను భీతిచే మున్న విభీషణుఁ డెంతయు నొత్తి చెప్పె నా
తని దొక చిన్నవెట్టి విదితంబుగ నీదొక పెద్దవెట్టి యా
తని క్రియ నన్ను దాటినకతంబున బింక మెఱుంగ కట్టి వీ
రుని నిను లేపు నాదొక విరుద్ధపువెట్టిగదా తలంపఁగన్. 544

క. రాముఁడె వలమురిదాల్పు వ్వలీముఖు లవ్వేల్పులైన లచ్చిపడఁతి సీ
తామానినియైనను నను, సామంబే నొల్ల నెల్లు సంగ్రామమగున్. 545

వ. అది యట్లుండనిమ్ము నిద్రాసక్తులు నంగనాసక్తులు భోజనాసక్తులును సంగ్రామంబున కర్హులుగా రీవధికనిద్రాసక్తుండవు భోజనప్రియుండవు భయభ్రాంతుండవు గావున నీసహాయం బేనొల్ల నెల్లభంగి సమరంబున విరోధుల వధింపక తక్కుమనే యని పలికి మొగంబు గంటువెట్టుకొని యూరకున్న యన్నం గనుంగొని కుంభకర్ణుండు తనమనంబున. 546

క. దుర్ణయుఁ డితఁడు వినీతవి, నిర్ణయవాక్యములు వినఁగ నేర్చునె యనుచున్
ఘూర్ణితలోచనుఁ డగు ఘట, కర్ణుం డిట్లనియె నన్నకర్ణము లలరన్. 547

చ. తెగనిసుషుప్తిచేఁ బలికితిం గలహాం బశుభం బటంచుఁ ద
ప్పుగొనకు మిప్డు లేచితి ప్రఫుల్లపు లెంతటివారు వైరులం

దిగిచి క్షణంబులోనఁ బగ దీఱ గ్రసించెద మేనఁ బ్రాణముం
డఁగ వసుధాతనూజ నరనాథున కీయఁగ నీయకొందు మే. 548

క. బాణకృపాణపటుతను,త్రాణంబులు వలదు బాహుదర్పమున రిపు
ప్రాణములు గొందు మూర్ధా,ఘ్రాణం బొనరించి కుంభకర్ణ ననుపుమా. 549

వ. అనుటయు సంతసించి. 550

క. వాలి నడిచి కపుల రవిజు, నేలించిన భంగి నిన్ను నేలించెద నై
త్యాలి రిపుఁ దునిమి యనుచుం, బ్రేలునఁట నృపుండు మన విభీషణునొద్దన్. 551

వ అదియునుంగాక. 552

క. నిద్రితుఁడవు నీవధికభ,యద్రుతుఁడను నేను నగుట నహితబలం బ
త్యుద్రేకము నూపెను న,య్యద్రిచరావలి వధింప నరుగు మనవు తున్. 553

సీ. శరశరాసనకవచస్యందనాదిరణోపకరణముల సజ్జగించి
యుపజయం బెత్తేఁగించు నమిత తూర్యధ్వనులకు నపశకునములకు వెఱవక
శూలంబుఁ జేదాల్చి శూలికైవడిఁ బొల్చి పురజను లొప్పరనఁ బొగడుచుండఁ
గతిపయభయదరక్షస్సైన్యయుక్తుఁడై తనదునిద్రాభంగమును విరించి
తనయువాక్యములను దలపోసి మరణంబు, సిద్ధ మగు టెఱిఁగి చింతలేని
మానసంబుతోడ మానవేంద్రునిచేతఁ, జావుఁ గోరి వెడలె సమరమునకు. 554

క. వడిఁ బుర నిర్గమమున వెలు,వడి పనివడి కలహమునకు వచ్చెను వాఁడై
క్కొఁడితండని కపులచ్చెరు,వడి చూచు నుండి కొంతవడికిం దమలోన్. 555

ఉ. నీలుఁడు చెప్పినట్లు రజనీచరరూపకకాష్ఠపుత్రిగాఁ
బోలును గట్టిబొమ్మఁగని పోఁడిమి దూలఁగ నేల రామభూ
పాలుఁడు దీనిఁ గూల్చు నని పల్కుచు నుల్కుచుఁ జూచుచుండ నా
భీలుఁడు కుంభకర్ణుఁడు విభీషణపూర్వజుఁ డాత్మయోధులన్. 556

క. తలకడచి దావదహనము, చలిచీమల నేర్చుపగిది సర్వకపులఁ గొం
దలమందఁ గుంభకర్ణుఁడు, లలిఁ ద్రిమ్మింగఁదొడంగెఁ బ్రవిపులముఖుం డగుచున్. 557

వ. భీషణాటోపంబునం గనిమసంగి వనచరులం దిగిచి యహార్యగుహాకుహారసదృశం
బగు నిజబంధురకంధరసుషిరంబునన్ బాఱ విడుచుచున్నం గనుఁగొని. 558

చ. పనివడి వానరు ల్పనసపంటికిఁ జీమలు చుట్టినట్లుగా
మునుకొని గంధభద్రగజము న్వడి నీఁగలు మూఁగులాగునం
బెనఁగొన నబ్బలిష్ఠుఁడు కుభృన్నిభమూర్తి విదిర్చి వెండియుం
గొనకొని బొక్కఁజొచ్చె రఘుకుంజరు లక్ష్మణుఁ గాంచి పొక్కఁగన్. 559

క. అద్రిచరావలి తనపై, నుద్రేకము మీఱ వైచు నుర్వీరుహఘో
రాద్రిప్రకరములు పృథు,చ్ఛిద్రము లొనరించి దనుజసింహుఁడు మఱియున్. 560

సీ. పలుపుర బలియుఁడై పట్టి యువ్వెత్తుగ దిగ్రమింగి వక్త్రంబు దెఱచి యార్చు
మఱియును వేఱొకమాఱు వేవుర ముద్దగావించి మేనునఁ గలయ నలఁచు
నొకమాఱు నూర్వుర నొగి శూలమున గ్రుచ్చి కావిఁ గ్రొన్నెత్తురు గ్రాక్రేఁచు
నింకొక్కసారి యనేకుల నేకులకైవడి చూర్ణంబుగా నిముర్చు
నివ్విధంబున దానవుఁ డేచి విలయ,సమయసమవర్తిసమవృత్తిసముదమూర్తి
సమయఁ జేయుచు సమరవసుమతి విడిచి, పాఱిరి వనాటు లసుర లేపారి మూఁక. 561

చ. సమరము సేయఁ జాలక వెసం బరువెత్తెడు సేనఁ గాంచి రో
షమహితుఁ డంగదుండు రభసంబున నడ్డమువోయి శౌర్యవా
క్యములు వచించి వానరులఁ గ్రమ్మఱ నాజికి నాలుకొల్ప నొ
క్కమొగి ద్రుమంబులన్ దనుజు కాయము గప్పిరి దాన నెంతయున్. 562

క లింగము మాలూరఫలా,లిం గప్పిన కైవడిం జలింపక యతఁడో
లిం గముల ఘటికి గ్రుంగఁ దొ,డంగిన ద్వివిదుండు గడు బెడంగు లీలన్. 563

ఉ రక్కసు పెన్నురం బురుభరాధరకూటము వైచి యార్వఁగా
నక్కతి నాత్మఁ దుక్కు మెఱయు న్నిజదేహహతిం బగిల్చి యా
చక్కటి వానరోత్తములఁ జక్కఁడఁపం గని మారుతాత్మజుం
డొక్కయహార్య మద్దనుజు డొక్కచిమంగఁగ వైచె వైచినన్. 564

క. తద్ధతి కించుకసోలి దు,రుద్ధతి నక్కుంభకర్ణుఁ డుద్దవిడి సమి
త్సద్ధతి చెడి మూర్ఛిల్లి బ,లోద్ధతు హనుమంతు నేసె నురుశూలమునన్. 565

సీ ఆలంబుమాని వాతూలబాలుఁడు నేల వ్రాలిన నీలుఁ డుద్వేలుఁ డగుచుఁ,
బాషాత్మ నిలు నిలు పాతిపోకు మటంచుఁ బాషాణపటలంబుఁ బఱపఁ జేయ
నది పిండిగాఁ జేసి యతఁ డున్నెడ గవాక్షనలవృషభాదు లనలసదృశులు
తన్నెదిరింప నందఱఘోరహుంకారమునన పాఱఁగఁ జేసి వనచరాలి
బిట్టు చుట్టుముట్టి పీనుంగు పెంటగా, వించుచున్నఁ జూచి విహ్వలించి
యాత్మసేన నిట్టు లలయించునే యుద్ధ,రాత్ముఁ డనుచు వాని కడ్డ మేగి. 566

క. వాలిసహోదరుఁ డురుతర,శైలంబున వైవ దానిఁ జక్కాడి వడిన్
శూలము విసరుడు నదివా,తూలసుతుఁడు మూర్ఛదేఱి తునుకలు సేయున్. 567

క. శూలంబుఁ గేలఁ దాల్పని,శూలిక్రియం బేర్చి రాక్షసుఁడు తపనజు ను
త్తాలాద్రికూటమున మూ,ర్ఛాలసుఁ గావించెఁ గపిబలాంబుధి గలఁగన్. 568

వ. ఇట్లు లంకామలయాచలకూటపాటనంబున సమ్మూర్ఛితుం గావించి యక్కొలుంగు తేని
పట్టిం బట్టుకొని భుజంబునం బెట్టుకొని. 569

క. లంకాభిముఖుం డై చను, లంకానాథానుజుం దలంకక శౌర్యా
లంకారుఁడు హనుమంతుఁడు, హుంకారముతో నెదుర్ప నూహించి మదిన్. 570

క. ఇనజుఁడు విక్రమఘనుఁ డే,చునొ తనదాన తెలిసి యరుదెంచు నరా
దను మోసపుచ్చి యీతం, డనితరభేద్యుఁ డని తలఁచు నంతట్రిలోనన్. 571

ఉ. అన్నకుఁ జూపువేడ్క హరిదశ్వసుతుం బృథుగాఢమూర్ఛితుం
గ్రన్ననఁ గొంచుఁబోవు ఘటకర్ణునిఁ గన్గొని పౌరభామ ల
త్యున్నతసౌధభాగములనుండి సుమంబులు పైవిదిర్చి రా
పన్నత వానరుల్వివిధభంగుల నేడిచి రార్తనాదులై. 572

గీ. అంతఁ గుంభకర్ణ వంసభాగంబునఁ, బుష్పమాలికయును బోలియున్న
రవిసుతుండు తేఱి రక్కసుచే నిట్లు, కట్టువడితిఁ దప్పెఁ గార్య మనుచు. 573

క. లోసంతాపము నొందుచు, నాసమయంబున విభీషణాగ్రజు చెవులు
న్నాసికయును మొదటికిఁ దెగఁ, దీసెన్ ఖరనఖరదంతతీవ్రత మెఱయన్. 574

క. ఉక్కుం జేవయు వెలయఁగ, ముక్కుం జెవులుడుగఁ గ్రుంచి ముదితాత్ముం డై
దిక్కుంజరములు క్రుంగఁగ, నక్కుంజరహితాత్మజన్ముఁ డవనిక నుఱికెన్. 575

చ. పృథివికి శాతకుంభమహిభృచ్ఛిఖరాగ్రవిహార పింగదృ
క్ప్రథుకము దాఁటు మాడ్కి నసువ్యాప్తుప్పటభేదకోటి నెంతయుం
బృథుగతిఁ జెంగలించి ప్లవగేశుఁడు కీశులభిష్టుతింప భూ
మిధవులు రాఘవేంద్రుల సమీపముఁ జేరెఁ గరంబు మెచ్చఁగన్. 576

ఉ. అంతటఁ గుంభకర్ణుఁ డవుగా విపరీతపు వానరంబు ము
క్కంతయు రక్కిపోయె నిఁక నన్నుఁ గనుంగొనఁ బోవఁజాల నా
గొంతుకక్రోవి నమ్మసలిక్రోఁతని వైచెదనంచు శోణితా
క్రాంతశరీరుఁ డాతుణము క్రమ్మఱియె రణ మాచరింపఁగన్. 577

చ. మిగిలినవానరాలి దిగ్ర్మింగఁ దలంచెడు కుంభకర్ణుని
న్నిగిలి నరాదు లుద్భట సమిత్ప్రసితాత్ములు పోనొర్ప రాఁ
దగిలినకిష్కు మర్కటవితానము దారొక్కని తద్బలంబులం
దగిలి నటించె నద్భుతవిధంబున నెత్తుట నీఁదులాడుచున్. 578

తన సైన్యము దైన్యముఁ గనుఁ,గొని రోషావేశుఁ డగుచుఁ గుంభశ్రవసుం
డనివారితుఁ డై మర్కటు,లను గారించుటలు చూచి లక్ష్మణుఁ డలుకన్. 579

శా. జ్యానాదస్తనితంబు నిష్ఠురధనుష్టంకారనిర్ఘాతము
ద్గ్రానేకాంబకవృష్టి మర్కటమహోద్యచ్చాతకామోదము
ర్వీనాథానుజధూమయోని ఘనమూర్తిం గుంభకర్ణాద్రిర
క్తానూనోత్సము ముంచె దానవవ్యాదబ్జామోదహీనంబుగన్. 580

చ. ప్రకటబలుండు రాముఁడును బాణపరంపరఁ బెల్లు ముంప మ
త్తకరికి సిబ్బు సూపిన విధంబున నున్మదలీల శాత్రవ
ప్రకరము నైజసైన్య మనుపాడి దొఱంగి కరంబు సాఁచి యం
దికొని గ్రసింపఁజొచ్చె నవధీరణఁ గ్రోఁతుల దైత్యజాతులన్. 581

వ. అక్కైకసీనందనుండు రామలక్ష్మణభయంకరాస్త్రవహ్నిజ్వాలాపిహితుండును వి
నాశితస్వసైన్యుండును విదారితనాసికాకర్ణకోటరుండును నిరాయుధుండును నిరవధి
కాయోధనశ్రముండును నయ్యును జలింపని ధైర్యంబున. 582

క. కరి తుంగమడువుసొచ్చిన, కరణి న్మందరము జలధిఁ గలఁచుపగిది ని
ర్జరముఖుఁ డరణ్యమేర్చు ప్రకరణంబున నలఁచెఁ గుంభకర్ణుఁడు కపులన్. 583

క. కట్టలుక నిట్లలంచుచుఁ, గట్టిడి యగునట్టి కుంభకర్ణుఁడు గనియెం
గట్టెదుర విభీషణుఁ దోఁ, బుట్టువు నంచద్గదావిభూషితు దుగఖిన్. 584

చ. కనుఁగొని తండ్రి కుందకు వగం దనుజాన్వయుమంతరింప నుం
డ నిలుపువాఁడ వీవ నరనాథు దయ న్మము నెల్లఁబాసిపో
తి వని మనంబునం దలఁపఁ దీరదు దుర్జనులైన బంధుల
న్మనుమును రోసి నిత్యసుఖముం జిరకీర్తియుఁ జెందఁ జెల్లదే. 585

క. నీకఱపులు వినని యప్రశ్రీకరుఁ డగు దశముఖుండు చెడుట నిజము సు
శ్లోకుండ వీవిధంబున, శోకింపఁగ నేల తొలఁగి చూడుము నన్నున్. 586

వ. అని పలికి తనకు నమస్కరించి యధోముఖుండును నిరంతరబాష్పసలిలధారాపరిపూ
రిత లోచనుండునై యూరకున్న విభీషణు ననునయించి యతనిం దలమిగిలి. 587

క. చని వానరు లడ్డము సొచ్చిన వారల నింత సరకుసేయక రాముం
గని యిదె వచ్చితిఁ గలహంబునకు న్రా రమ్ము తొలఁగి పోవకు మనుచున్. 588

చ. పొగరున నిన్నెదిర్చి సరిపోరుట జన్మఫలంబు పోరిలోఁ
దెగితినయేని వెండియును దేజము నొంద జనించి నీమెడం
బగ గొని గెల్తునందు నినుఁ బట్టి జయింపఁగఁ జాలనేని పొం
దుగ నినుఁ జేరి బంటు నగుదు న్విను మిట్లు ప్రతిజ్ఞ పట్టితిన్. 589

క. ఏను మనుజమాత్రుండన, గాననికాఁబోలు నింత గర్వించెదు నీ
తోనెనసి పోరవచ్చిన, యేను దనుజమాత్రుఁడనె రహిం దలపోయన్. 590

క. సర్గస్థితివిలయములు నిసర్గముగాఁ గలుగు నింద్రజాలుఁడవు గదు
న్నిర్గుణుఁడ వనుచు డాయు ధనుర్గుణసారణ విభుఁడు దనుజపతితోడన్. 59

క. నీకంఠము దునిమి మహోగ్రదేహుండగు రావణు న్వధించెద నిఁక ము
ప్పోకల్కఁబోయినఁ జెల్లను, మీకని దశరథసుతుఁడు సమీకోన్ముఖుఁడై. 59²

సీ. ఘటకర్ణసముదీర్ణకర్ణకోటరములు పటుపత్త్రులకు మన్కిపట్లుచేసి
పాపవర్తనునేత్రకూపము లిక్కిలి తఱచుగా శరపూరితములుచేసి
రాక్షసముఖగహ్వరంబు నానాజిహ్మగములకు వాసయోగ్యంబుచేసి
దశకంధరసహోదరశరీరకాంతార మతులబాణకదంబయుతముచేసి
కైకసీపుత్రు హస్తశాఖలను ఖగనివాసములుచేసి మఱియు నవ్యాసవారి
ఘోరవక్షఃకవాటంబుఁ గ్రూరనారసంబులకుఁ దావుచేసి రోసంబు మిగుల.

క. వాసి గలుగు వాలిం బడ, నేసిన యస్త్రమును దానికెక్కుడయగుబా
ణాసారంబున మించుచు, నాసురపతి నొచ్చియును మహోగ్రహుఁ డగుచున్. 594

క. గొదకొని వైరిబలంబుల, వదనంబున వైచికొనుచు వారనికిన్కన్
గదగొని కదనంబునఁ దుం, గదిసెం గాలాంతకప్రకారము గాఁగన్. 595

వ. కదిసి భయంకరసింహనాదంబు గావించుటయు సహింపక. 596

క. హస్తిసమప్రబలుఁడు కృతహస్తుఁడు వాయవ్యశరనిహతి దనుజుబృహ
ద్ధస్త్రము ద్రుంచుటయుఁ బటుప్రశస్తంబై పడియె గదయు జగ్గతితముగన్. 597

చ. గదయును బాహుదండమును ఖండములై పడ నొండుకేల ను
న్మదుఁడయి సాలముం బెఱికి మానవనాయకు వ్రేయఁబూనుడు
న్భిదురనిభేంద్రసాయకముఁ బెద్దయువేడుక నారిఁ గూర్చి నిం
డఁదిగిచి తత్కరంబును బడ న్వడినేసె నమోఘవేగుఁడై. 598

క. శరయుగమున ఘటకర్ణుని, కరయుగముం గూల్పఁ జెల్లు గానవియుసమి
ద్ధరణిఁ బడి చదిపె నసురోత్కరముం గపిబలము నద్భుతస్థితిదోఁపన్. 599

క. శాఖారహితమహోన్నత, శాఖిప్రక్రియ దశాస్యసహజుఁడు దురా
శాఖిలమానసుఁ డగుచువి, శాఖనిభుం గవిసె రామచంద్రు న్నింగన్. 600

క. పదహతులన్ ధరణి వియత్పదమున్ హుంకృతులఁ గ్రక్కదల బద్దలుగా
నెదిరించి యిట్లు గవియుచు, గదనవిశారదుఁడు సమధికబలోద్ధతుఁడై. 601

క. ఏనొకరుండన వైరులఁ, బూని వధించెదనటంచుఁ బోయి రిపులచేఁ
దాన మృతుఁ డయ్యెఁ బురుషుఁడ, దా నొకఁడు దలంప నొకఁడు దైవము దలఁచున్.

వ. అని బహుప్రకారంబులం బరిదేవనంబు గావించి తమ్మునిం జేర్కొని. 613

క. హా యను మేరుతులితదే,హా యను వక్త్రజితగిరిగుహా యను దగునా
హా యను రిపువనహవ్యవ,హా యను సుమనోమచాపహా యను మతియున్. 614

మ. అనుజా నిన్నుఁ ద్రివిష్టపస్థులును డాయన్లేరు నీపట్టి వో
మనుజాధీశ్వరమార్గణాగ్నిశిఖలన్ ప్రమందం గనుంగొంటి నే
నని జాలింబడి రావణాసురుఁడు ధైర్యాయత్తచిత్తంబునం
దనుజాలింగని యిట్లు వల్కెఁ బటుచింతాక్రోధఘూర్ణాక్షుఁడై. 615

చ. గతజలసేతుబంధనము గాదె మృతుండగు వానిఁ గూర్చి శో
కితమతు లౌట మీ రరిగి ఖేచరకోటి దలంక నష్టది
క్పతులు వడంక హాస్తిహయపద్గరథధ్వజినీసమేతులై
హితమతులార రాఘవమహీశులఁ గీశులఁ జంపి రం డనన్. 616

క. అంతకసన్నిభు లగుచు న,రాంతకదేవాంతకులు మహాపార్శ్వాదు
ల్వింతశకునంబులకు న,భ్యంతర మింతయును లేని యాత్మలతోడన్. 617

సీ. కాటుకకొండలు కదలి యేతెంచెడుభంగి నొప్పెడు మదేభనికరంబుఁ
బూర్వవాయువుల నుప్పొంగు సముద్రంబు తరగలఁ బోలు సైంధవచయంబు
సంవర్తసమయాగ్రజాకాల కాళికాక్రమము గాంచెడు శతాంగవ్రజంబు
సమవర్తికింకరసదృశఘోరస్వరూపప్రదీపితవీరభటచయంబు
నానావపట్టిష మమరుచుఁ దో నరుగుదేర, సమరభేరీరవంబులు చదలు నిండఁ
గదలి యుద్ధాశకంతు లుత్కంఠు లగుచుఁ, దాఁకి రహితబలంబులు తల్లడిల్ల. 618

క. తాఁకిన నంతకముఖ్యస,మీకోన్ముఖు లగుచునున్న మిహిరసుతాదుల్
డీకొని ప్లవంగపృతనా,నీకముఁ బురికొల్ప దురము నిష్ఠుర మయ్యెన్. 619

క. ద్రుమచరులు తరుశిలావ,ర్షము దనుజుల మీఁదఁ గురియ రాక్షసులుం ద
ద్ద్రుమచరులమీఁద శరవ,ర్షముగురియించి రతిలోకసాహసవృత్తిన్. 620

చ. అపుడు నరాంతకుండు సరయంబు హయంబు మరల్చి సాధ్వస
వ్యపగతవృత్తి వానరచయంబు గలంగఁ దొలంగఁ ద్రుంగ శ
క్తిపటిమ శక్తి వైవ వినుతించుచు దైత్యులు సందడించి ర
ట్లపరిమితప్రతాపగరిధియై దనుజాధముఁ డాక్రమించుచున్. 621

క. కని వానియేపు సైఁపని, హనుమంతుని కడ్డ మరిగి యంగదుఁ డురుసా
లనిహతి శిరంబు విపులా, శ్మనిహతి సర్వంబు గూలి చదియఁగ నేసెన్. 622

చ. అటుల విహీనశాంతకు నరాంతకు నంతకుచెంత కంపుచుం
గుటిలమనస్కులై రిపులు గూడిరి తోడన వాయుసూనుఁడుం
జటులరయంబునం బరమసాహసులం బృథుఘోరయుద్ధులం
బటుల నిశాటులం జదిపె బాహుబలంబుఁ జలంబు మీఱఁగన్. 623

వ. మరుత్పుత్రమరుత్ప్రేరితంబును వాలజ్వాలాజాలంబును రోమధూమావృతంబు నగు
వంగదానలంబు విరోధిసేనాకాననంబు దహింపం దొరకొనుటయు సహింపక. 624

క. అశనినిభుఁడు దేవాంతకుఁ, డుశనాంతేవాసిపతి మహోదరుఁ డసుహృ
త్పిశితాశి మహాపార్శ్వుఁడు, త్రిశిరుండును గడఁగి యానదీపితు లగుచున్. 625

శా. సుగ్రీవాంగదజాంబవత్ప్రముఖు లత్యుగ్రప్రభావాఢ్యు ల
త్యుగ్రగ్రావమహీరుహావలి సమీకోద్రేకముం జూప దా
నుగ్రీవాగ్రణు లాత్మ మెచ్చక ధనుష్టంకారము ల్సేసి తీ
క్ష్ణాగ్రామోఘశరౌఘము ల్వఱపి బాహాదార్ఢ్యము ల్సూపినన్. 626

క. అంగదు మునుమున ముసుభీ, తింగూరిన దైత్యబలము దేటీనకపులం
బొంగుచుఁ దలపడుటయు నురు, సంగరము బలద్వయమునకు ననుగతి నయ్యెన్. 627

క. తలఁప విపరీత మగుదణ, తలము గనుంగొనఁగ నద్భుతస్థితి నయ్యెం
దలఁపడు నెడయము న్వాఱను, ద్రుపడు నెడయుం గడంగి తలపడు నెడయున్. 628

వ. అట్టిక్రందుకయ్యంబునందుఁ గబంధపాఠీనబహుళంబులును విపులాస్థిమార్గసైకతప్రదే
శంబులును మాంసకర్దమంబులును వాలశైవాలంబులును గరవాలవ్యాళవ్యాళంబులు
ను గపాలపుండరీకషండంబులును నగు రక్తనదీప్రవాహంబులు వెడలి యనేకముఖం
బుల సాగరసంగమంబు లగుచుండె నట్టియెడ. 629

ఉ. ఆనన మెట్టివారిఁ బ్లవగావలి మీఱ మరుత్తనూజపం
చానన ముగ్రభంగి నఖరావలి శాత్రవకుంభికుంభము
ల్మానక త్రెక్కొలించుచుఁ బలాదనకాననవృత్తియన్న దై
త్యానుగుణంబు గాఁగ విబుధాంతకుఁడుం ద్రిశిరుండుఁ బావనిన్. 630

క. శరములు ముంచు నెడ మహో, దరుఁడు మహాపార్శ్వుఁడును మదంబునఁ దోడై
యరుదుగ నీలవృషభు లా, హరివరునకుఁ దోడువడ మహాహవ మయ్యెన్. 631

గీ. త్రిశిరదేవాంతకులఁ గులాద్రిప్రతిముల, నప్రతిహతప్రతాపుల ననిలసుతుఁడు
ఫిండి గావించె గండాశ్మ పిండిఁ జేసి, యుగమనోహారత్నరథయుగములోన. 632

క. దరమింతయు లేక మహోదరుని బ్రహాస్త్రాంతకుఁడు ముదంబునఁ గూల్చెం
దరుచరులు మెచ్చికొనఁ దత్కరియును ఘీంకారపూర్వకంబయి వ్రాలన్. 633

క. ఆదర మింతయు లేక మహోదరుసోదరు వధించి యొప్పెను నీలుం
న్మోని గూల్చె నశిరణాహ్లాది మహాపార్శ్వుఁ డట్టహాసముతోడన్. 635

ఉ. నీలుఁపయి న్నిశాటగ మవనీరుహచారులు తల్లడిల్ల నా
ఖీలతఁ బోవనిచ్చి శరభీకరవృత్తి వహింపఁ గాంచి య
న్నీలుని వెన్కఁ ద్రోచి యవనీరుహముం బెకలించి యెంతయుం
జోలిక లేనికిన్క వృషభుం డరిభిద్వృషభుండు వ్రేసినన్. 636

గీ. బిట్టు మూర్ఛఁ జెంది పెద్దతడవునకుఁ, దేరిమీఁద మూర్ఛ దేరియున్న
యవసరంబు గాంచి యమ్మహాపార్శ్వుని, వాతనెత్తురకల జాతనైచె. 637

వ. పవనతనయవృషభులచేతం ద్రిశిరదేవాంతకమహోదరమహాపార్శ్వులు గూలుటయుం
గనుంగొని కపిబలంబు లుప్పొంగి దనుజబలంబులం గలంపం దొడంగుటయు. 638

క. తుండంబులు దెగిపడు వేదండంబులుఁ బడెడు బాహుదండంబులుఁ గో
దండంబులుఁ దొరిగెడు హయఖండంబులు నగుచుఁ గ్రందుకయ్యం బయ్యెన్.

ఉ. చిట్టలుగాఁగ నాప్లవగసింహులతోడ నెదిర్చి పోరి తోఁ
బుట్టువు లేవునం బొలిసిపోయిన సద్గతశోకవేగుఁడై
కట్టలుక న్రథంబు నతికాయుఁడు వే మరలించి క్రోఁతులం
బుట్టలుగట్టులం జెదరి పోవఁగ నేసె మహాస్త్రసంపదన్. 640

క. ఇవ్వని నవ్వనచారులఁ, గ్రొవ్వాఁడికరంబు జేసి క్రొవ్వుచెఱిమము
న్నవ్వుచుఁ జివ్వకుఁ గదియుము, దవ్వుల నవ్వీరు రాము తమ్ముఁడు గనియెన్.

క. కని సరభసంబు మీఱం, జనుడెంచి తొలంగు మిఁక నిశాచరకులపాం
సన రిత్తచావు నముచ్ఛ్రొక్కనవన్నును నా దశాస్యుకొడు కిట్లనియెన్. 642

చ. ఇతఁ డతికాయుఁ డీతనిపయిం జనుదెంచితి పిన్నవాట న
ప్రతిహతబాహువిక్రముఁడు పంక్తిగళాత్మజనూనుఁ డుండఁగ
ప్రతియుఁ దనల్పుఁ డల్పుల దురంబున మార్కొనఁ డెంచు విక్రమో
న్నతు భవదగ్రజన్ముఁ గదనప్రియు రాము జయింపఁ జూచెదన్. 643

క. ఆలంబుల తెఱఁ గెఱుఁగని, బాలుండవు తొలఁగు మనుచుఁ బటుగతి విశిఖ
జ్వాలలు నిగుడింప మహీపాలానుజుఁడు న్మొగల్చెఁ బ్రతివిశిఖమునన్. 644

వ. మరలించి యాధాన్యమాలినీపుత్రుండు సుమిత్రాపుత్రుం డిట్లనియె. 645

చ. కదనము సేయ నిన్నెదిరి గర్వమెలర్పఁగ నున్న నన్నుఁ జా
ల్కఁదనము సేయుటన్న మె ప్రలాపములం దగు బంటువోలె నీ
వదలిచి యొండుచోటికి భయంబున వంచన చేసి పాఱిపో
వఁ దలఁచి తిట్లె కాక బలవంతుఁడవే గణికాకుమారకా. 646

గీ. అనిమిషారి యద్రిపైఁ బిడుగులు, వడి తెఱంగు గాఁగ బహుశరములు
వఱపి యట్టహాసభాసురుం డగుచుఁ గో, ల్పులివృషంబుఁ బోలెఁ బొదువుటయును.

క. హరినాథు నెదిర్చిన మద, కరినాథుని భంగి నిగ్రహఁగఁ బిలిచిన మహిభృ
త్పరగణి హరిఁ దాఁకు నైకటభు, కరణిం దాశరథి దాశకంఠి యెదిర్చెన్. 648

క. దివ్యాస్త్రరాజ మగు వాయవ్యాస్త్రం బహితుఁ డేయ నసనీడ దై
త్యవ్యాహతఘోరతరశరవ్యాపారం బడఁప రావణి కినుకన్. 649

క. దోషాచరులు నతిఁ బడఁగ, నైషికరౌద్రాస్త్రములు రయంబారఁగ న
ప్పూషకులీనుని వేయుడు, శోషించిరి కపులు నృపుఁడు ప్రముక్కఁటుంచున్. 650

క. అగ్నినిభైంద్రాస్త్రము ఘోరాగ్నేయాస్త్రంబు సేసి యవి పోడిదైన
న్భగ్నప్రభవటితాగుచు శర, మగ్నునిఁ గాఁజేసె నృపుఁడు మార్గణవహ్నిన్. 651

గీ. ఏసి విల్లు రెండు సేసి సూతుని మెడ, దీసి టెక్కెము వడఁ గోసి పగతు
డాసి పార్శ్వచరులఁ గోసి వారనికిన్నఁ, జేసి లక్ష్మణుండు వాసి మిగుల 652

క. అస్త్రశిఖామణి యగు బ్రహ్మాస్త్రమున నభేద్యకవచు నతికాయు ధను
శ్శాస్త్రవిధిజ్ఞు వధించెఁ గృతాస్త్రుఁడు రాజసుతుఁ డగచరావలి పొగడన్. 653

వ. కుంభకర్ణుండునుం బోని యతికాయుఁ గొండగూలిన చందంబునం గూలనేసి సింహనా
దంబు గావించుటయును. 654

క. వనచరులు సుమిత్రాసుతుఁ, గొనియాడుచు గుంపుగూడికొని చూడుచు రా
మునిఁ జేరఁ బోవుటయుఁ దమ్మునిఁ గౌఁగిటఁ జేర్చె నలఁగు ముదమున నంతన్.

క. రణహతశేషులు విప్రుల, వ్రణశోషులు దైత్యవరులు వడి లంకాప
ట్టణమునకుఁ బాటి యటరావణుఁ గన్గొని యిట్టులని వడఁకు నోడలితోన్.

గీ. సమర మొనరింపఁజాలక, సమసె భవదీయపుత్రషట్కము మేము
న్ననురవిముఖుల మగుచు నీ, సముఖమునకు వచ్చితిమి నిశాచరనాథా. 657

వ. అని యిట్టిట్టివా రిట్టిట్టివారిచేతఁ దెగిరని నిరూపించి చెప్పి, యేకనిశ్చయంబున నద్వితీ
యం బగు సంగరంబు త్రిలోకభయంకరముగా నాచరించి సేనాంగచతుష్టయం
బుతోఁ బంచత్వంబు నొందె భవదీయపుత్రషట్కం బనుటయు నత్యవ్యసనపరిభూ

తుం డగు రావణుం డప్పుడిక్కులుం బరికించి యఖిలవనజనయనపుండరీకంబు లెత్తువడి దశాననంబులెత్తి దుఃఖవశానిరుపణంబుగా నిట్టులనియె. 658

క. అమితబలాఢ్యు లతికా,యమహాపార్శ్వత్రిశిరనరాంతకులును ఘో
రమహోదరవిబుధాంతకు,లు మరణ మందిరిట దైవలోపమునఁ గటా. 659

క. ఏకముఖరావణుఁడు సు,ఖాకరరాఘవుని ఘటుకర్ణుఁ డతం
డేకరణి నీల్గెఁ బ్లవగా,నీకము లలర ధాన్యమాలినీసుతుఁ దరిచేన్. 660

క. సుతుఁడు వడుట విని హృదయము, శతఖండములగుట లేమిఁ జర్చింప నయః
కృత మని తలఁచెద దురిముఁ, నతఁడు వడిఁ బడియె దానవావలి యెల్లన్. 661

వ. అని పుత్రశోకవ్యాకులచిత్తుం డగు నైకసీపుత్రునకు మందోదరీపుత్రుం డిట్లనియె.

చ. వగవకుమయ్య పంక్తిరథ వైరుల నెల్లఁ దృణీయవ్యబా
ణగళితకంఠులై పృథురణక్షితిఁ గూలఁగఁ జేసి సంతసం
బుగఁ జనుదెంతు నీవనుచుఁ బొమ్మని నే సెల విచ్చి పంపినం
బగ యడఁగింతు రాఘవులఁ బట్టి హరింతు గ్రసింతుఁ గోఁతులన్. 663

క. అని మ్రొక్కి సుతుఁడు మోదం,బున సెలవొసఁగుమనవుఁ గాఁ ఘుమఘుమిఁగృశానన్
ఘనమగు పూజఁ దనిపి త,జ్జనితరథరథాశ్వకవచశరధిశరుండై. 664

. చతురంగతురంగసుభట,శతాంగఘనమదకరిప్రచారముకతనన్
క్షితి గ్రక్కదలఁగఁ గలఁగ,క్షితికి విజయలీల నింద్రజిత్తుఁడు వెడలెన్. 665

వ. వెడలి తూర్యఘోషంబులు శంఖారవంబులు సింహనాదంబులు ధనుష్టంకారంబులుఁ గరిబృంహితంబులు హయహేషారవంబులు సుభటక్రందనంబులు రథనేమివిరావంబులు నింగి వగిలించుచుండ శరాసారఘోరంబుగాఁ గవిసి విజృంభించుటయు. 666

చ. జయమునఁ బొంగుచున్న హరిసైన్యము దైన్యము లేక రావణ
ప్రియతనయు స్సహింపక కుభృన్నగగండశిలాశిలాళి దు
ర్జయగతి వైచి యార్చుటయు రాక్షసరాజతనూభవుండు న
త్యయసమయాష్టమూర్తి నయనాగ్నిసదృక్షరకోటి నించుచున్. 667

ఉ. వెండియుఁ జండకాండముల వేసిన నోడక చండభానుపు
త్రుండు మరుత్సుతుండు ద్వివిదుండు నలుండు గజుండు జాంబవం
తుండును వాలినందనుఁడుఁ దోడ్పడి భూరుహకోటి నింద్రజి
త్తుంపై మునుంగ వేసిరి విధూతవిరోధిచమూసమూహులై. 668

క. స్పర్ధ మిగుల నతిలోకధనుర్ధరుఁ డప్పంక్తిముఖతనూభవుఁ డసుహృ
త్పర్థవజయార్థి యప్రదం,శర్ధి వహించె న్మహారథసమేతుండై. 669

వ. అయ్యనేకవిధరణవిధానంబు లాంబకీపిధానం బై. 670

క. వడిఁ బిడుగులజడి వడుకై, వడి నురవడి బాణకోటి వఱపుచుఁ గనఁ జే
ద్పడి పడియెఁ బ్లవగబలమొక, యడుగిడఁగా వసువులేని యట్టులు గాఁగన్. 671

సీ. కఠినాత్ముఁ డొకమాటు గహనాటులు దలఁకఁ బటుగతిఁ బాషాణపటలి యుర్వి
దుర్మార్గుఁ డొకమాఱు ద్రుమచాయ లడుకొందఁ బనివడి ముండ్లుఁ గంపలును విసరి
క్రూరసాదుఁ డొకసారి తరుచారిగణ మీఁద సరగున రక్తవర్షంబు గురిసి
గతధర్ముఁ డొకవేళఁ గపిజాలము వడంక బలుపిడుఁగు జిల్లకోలలు నిగిడ్చి
కొఱవి గిరగిరఁ ద్రిప్పిన తెఱఁగు గాఁగ, ఘోరకలనుకాలరుద్రుని పగిది నట్ల
నైజమాయావినిర్మగ్న సకచరాలి, కెందుఁ జూచినఁ దానయై యేఁపురేఁగి. 672

తే. ఒక్కదెస నార్చుఁ బేర్చు వేఱొక్కయెడల, నొక్కచోఁ బాఱు నాఱు నింకొక్కచోట
నొక్కచోఁ దోఁచు వైచు నింకొక్కదిశను, బృథుశరావళి మత్తుఁ డయ్యింద్రజిత్తు.

వ. ఇట్లు మాయాతమోవిలీనుం డవ్యాసురకులీనుండు పేర్చినం జేయునది లేక యెల్ల
వానరులుం దమతమ వైచిన గండోపలంబులు విఫలంబు లగుటకు నచ్చెరువందువారు
ను గాలుఁ జేయి తునిసినం బడి పొరలువారును గపిప్రశంసుంబు గాఁబోలు ననువారు
ను గర్తంబుల డాఁగువారును వృశ్చికరిపుభటుని శరకబంధంబులం దూఁగువారును
రాఘవులం జీరువారును నమ్మక తెమ్మలం గిటికందూఁగాడుచు నెక్కడు చలంబున
బేరువాఁడి రక్కసులం దలపడి పోరాడువారునై మిక్కుటముగ నగుచుండ నను గొని. 674

ఉ. ఆహవకేళికిన్ దశరథాత్మజనూజులు మీఱ లేమి సం
దేహముఁ బొందుచున్న యెడ దివ్యశరాగ్నికి వైరికోటిఁ బూ
ర్ణాహుతి వేల్తునంచు దనుజాధముఁ డేడ్తెఱ గాఢశక్తి స
మ్మోహనబాణ మేసె మృతిఁ బొందుగతిం గపు లుర్విఁ గూలఁగన్. 675

గీ. ఇట్లు కూల్చి లంక కేగి తండ్రికి జయ, మెఱుఁగఁ జేయు నాతఁ డెల్లవారిఁ
గలయఁ జూచి పుత్త్రుఁ గౌఁగిటఁ గదియించి, యమితహర్షమున్నఁ డయ్యెనంత.

ఉ. చావనిశత్రుకోటి యెడ సందియ మించుక లేక యున్నచోఁ
బావని ద్రోణభూధరము భాసి విభాసితపాద్యమైన సం
జీవనిఁ జేసి వానరుల సేవయుఁ దెంచిరఁ గ్రమ్మఱంగ యు
ద్ధావనికిం దలంకక ప్రమాణ మొనర్చిరి కండుమీఱఁగన్. 677

వ. దివ్యాస్త్రబంధబాధితుండు గాని పవననందనుండు దనుజమాయామోహితుండు గాని
విభీషణుండు సహాయుండుగా నించుక తెలివి నొంది యున్న జాంబవంతునుపడే

తంబున ననేకయోజనదూరస్థితంబగు ద్రోణపర్వతంబు ననహాయశూరుండై సముద్ర
మార్గంబునం బెకలించి తెచ్చి ప్లవంగసైన్యంబు సముద్ధరించి రామచంద్రు నలరించి
తదాదేశంబున నద్దివ్యౌషధధరంబు యథాస్థానసంస్థాపితంబు గావించి వచ్చె నివ్వి
ధంబున. 678

క. సమ్మోహన శాతాంబక, సమ్మూర్ఛిత మగు వనాటసైన్యము సంగ్రా
మమ్మునకుఁ గ్రమ్మఱ గొనియెం, గ్రమ్మఱ బలగర్వసమధికస్ఫురణమునన్. 679

వ. ఆసమయంబున. 680

క. నతిక్రమింపు నితఁడు తేజస్స్ఫూర్తి రయమున ననుమఁ బవనపుత్రుని జూడ
న్మనమున సిగ్గువొడమ నేఁగు కైవడి నర్యుం డస్తగిరికిం జేరెన్. 681

క. పంకజహితుఁ డరుగుడు సాయంకాలపుసాంధ్యరాగ మతిశయ మయ్యెన్
లంకాపురమంతయు ఘూర్ణాకునిచే నిల్లుకాలు నని తెల్పఁగతిన్. 682

క. సంజీవనీప్రభావమున, సంజీవితమగు ప్లవంగసైన్యము గెలువం
గుంజరములు వనుదెఱచు గతిం జీకటులు లడరె నెల్లదిశలు మునుంగన్. 683

ఉ. వానరులంత రామనరవల్లభు నానతిఁబొంది ఘోరలం
కానగరంబుఁ గాల్పన కట్టి మహోల్ముకపాణులై యను
ష్ఠానలమంతటం దమ కర్గలమై పెంపొంద దనందఱు
న్వేఁగలు దిక్కులం దగులఁబెట్టిరి వహ్నిశిఖాకలాపముల్. 684

వ. అర్ధరాత్రసమయంబున. 685

క. దట్టించి లంక ననలము, ముట్టించి ప్లవంగవరులు ముఖ్యులు భయమున్
బుట్టించి రంత్రికింపరుఁ దిట్టించిరి సీత గేల తెచ్చినటులఁ మున్. 686

క. పొగ మిగుల నెల్లదిక్కుల, బుగబుగమను శిఖలు వెలుఁగఁ బోరిఁబోరి భమం
టుంగ శోకమంటఁగ జనము ఁటఁ గూడనిమేని వేల్పువరప్రబలుడున్. 687

క. సీతాశోకాగ్నిపరి, స్ఫీతమగు మలంకఁ జుట్టఁబెట్టె ననఁగ ఖ
ద్యోతనసమదయసముదయ, మాతతమయ్యెవన సూష్టచక్రజమైనన్. 688

సీ. వడిసవుల్బొగ్గని శిఖావళులు మీఱమి వాలవిపులవ్యజనముల విసరువారుఁ
దమరొక్కయెడు సౌధవితతి కాలిమాలఁగ నొండుగడలకు నెగయువారుఁ
గవ్వలఁ బోగచుట్టి కదలనేరక యున్న వారిఁ గన్గొని క్రేళ్ళుపాఱువారుఁ
దమ్మెదిరించి యుద్ధమొనర్చువారిఁ బట్టి మంటలలోనఁ బెట్టువారు
నింటివారలు బైటికి నేగుదేర, ఖండగొండ్లెమ్ములను బిగఁగొట్టువారుఁ
గొఱవులం దందఁ ద్రిప్పుచుఁ గొఱలువారు, నైరికపినాథు లుత్సాహసతిశయిల్ల. 689

క. ఈ లెడిమందిరము లొరగి, తూలెడి మందులు నడఁగుకొట్టములు నెక
న్నోలెతి సింధురములు దవ్వాలంబులు మిగుల నద్భుతి బొనరించెన్. 790

వ. అయ్యవసరంబున నప్పాప్పి బహుళాచ్ఛప్పే యనేకవిధలోహద్రావవిపరీతభానుండ
గుటఁ జిత్రభానువామభాగంబును రాక్షసప్రార్థనంబున శుక్రసమాహ్వానంబును
సార్థకంబులు గావించుకొనియె నప్పుడమునుది యురుణయుది జ్వాలాజాలాభివీక్షిత
మహోదధిపాయస్సులప్లావపప్రదీప్తసౌధంబులు కరఁగి నీరై ప్రవహించినచందంబు
ను గమలాకరతిప్రజలంబులం బ్రాణపరిక్షీణంబులై తేలియుండ జరఠకమఠపాఠీనం
బులు వారకులు వైతరణీ కూతలనొందు ప్రకారంబును గాన్పించె నాయుధాగా
రంబుల ఘంటలు వెడలుట వింతగాకయుండె రథంబులు ధూమధ్వజాభిరామంబు
లయ్యె నయ్యెడ. 791

ఉ. రావణువారలెల్ల సమరంబొనరింపఁగ నోర్వలేక ధూ
మావృతనేత్రులై గతభయంబు విభీషణువాలయంబునం
బ్రోవులుగట్టి యగ్నిభయమును దమఁ బొందమి నిల్చి రాక్షసం
భావితుఁ డీతఁడు మహాభంగుల నాతనిఁ బ్రస్తుతించుచున్. 792

క. ఘూతభయ కరలీలన్, ద్యూతిశిఖాజాతిమాన్యభగ్నాయణసం
పాతమున లంక భస్మీభూతమగుచు దైన్యమితి వాగిలెడు నెడన్. 793

క. సౌధంబులు త్వరగ్గా, రోధంబులు గాలె నని సరోజహితునకున్
బోధించుపగిది నసి రోధంబులఁ జక్రవాక రుతములు సెల్లెన్ 794

క. బలులంకాదహనంబునఁ, గలిగిన ధూమమున నభము గాటుకవారెం
దెలిమిన్నేటిజలంబులఁ, బోలఁగ రమకులనఁగ దెలుపు తూర్పునయ్యెన్. 795

క. తమజాతికెల్ల సంవాసము లుపవనములు పొరయుట చర్చించి విహం
గముల పిమర్శించు నప్పేతుకమొలవ వచ్చెన నరుణసముదయమయ్యెన్. 796

చ. అపుడరుణోదయంబు వెలయ న్మెలఁకుం దమపల్లవింగి తూ
రుప్రదేశం బంతరిక్షమునను దుర యుం బగుచున్మదంబునం
గపు లవిపుత్రముఖ్యులు సుఖమునఁ గాల్యములెల్ల దీర్చి భూ
మిపతుల రామలక్ష్మణుల మేలుఁ జేరి భజించిరంతటన్. 797

క. శతమఖజిన్మహాస్త్రమునఁ జచ్చినయా వానరులెల్లఁ బ్రస్తుతిన్
బ్రతికి పురంబుగాల్చి సమరంబొనరింపఁగ నుత్సహించి ర
ప్రతిహతులింక వీరల రణంబున గెల్చుట యెట్లొకో యని విం
శతిభుజుఁ డేకతంబున విచారమొనర్చుచుఁ గుందుచుండఁగన్. 798

శా. ఉద్గ్రీవుండయి చూచి కంపనుపయిన్ హుంకారమేపార భా
స్వద్గ్రావంబునిగిడ్చి తన్నిహతిమూర్ఛం దన్నికొంచున్న నం
చద్గ్రైవేయకచారుకంధరమిలాచక్రంబుపైఁ దూల ను
ద్యద్గ్రావంబున వైచె దానవుఁడు హాహాకారముల్సేయఁగన్. 710

వ. శిలాపాతంబున మూర్ఛితుండై పర్వతాఘాతంబున. 711

క. కంపనుఁడు పడినఁ గ్రోధనుఁ, డుపజడినభంబునిండ నంగదుఁగడిమిం
జంప్రదుసని రోసమున ని,లింపులు గుంపులయి దివినిలిచి భయమందన్. 712

క. మూఁడుశరంబులురంబునఁ, గాఁడించి యిషుద్వయము ముఖంబున నేయ
న్వాఁడిశరంబుల నతనికిఁ, దోడుపడి ప్రజంఘుఁ డంగదుం దలఁకించెన్. 713

ఉ. మూఁడుఁ బదాఱు నాఱు బదిమూఁడియుమూఁడుఁ బదేడు నేడు నీ
రేడునిశాతబాణముల నేసి వధించి నంగదుండు దూఁ
గాడియు నీడఁబోవక మహోగ్రమహావృత్తి నగంబువైచి చ
క్కాడెఁ బ్రజంఘునిస్తనుఁ గంపనుమూర్ధముఁ గ్రేణిసేయఁగన్ 714

వ. అదిగని క్రోధనుండు జంభాంతకపౌత్రుండగు ప్రజంఘాంతకుం దలపడియె, యూపాక్షశోణితాక్షులు మైందద్వివిదులను గుంభనికుంభులు సుగ్రీవపవనతనయులను మకరాక్షుండు పుండరీకాక్షుండగు లక్ష్మణాగ్రజుం దలపడుటయుఁ దక్కినరక్కసులు నయ్యాయి వనచరులం దాఁకిన. 715

క. కుంభములు పగిలి శోణిత, గుంభితగాత్రములఁ గాలికొండలభంగిన్
గంభీరవేదిపటుచుద, కుంభిసుతుఁ గూలెఁ బ్రథనకుంభినిఁ దఱచై 716

గీ. అంతమీఱి కంపనాంతకుం డంగదుఁ, డహితమార్గణంబు లన్ని తెంచి
తోఁక మెడకుఁ జుట్టి దుమ్ములునలఁగంగఁ, జెండివిసరఁ గ్రోధనుండు గూలె. 717

క. ద్వివిదుండు శోణితాక్షుఁడు, వివిధశరములేయ వాని విరియించి విరో
ధివరూథిని తలఁకఁగ వై, చె వనాటాగ్రేసరుండు శిలఁ దలవగులన్. 718

సీ. క్రుద్ధుఁడై యుద్ధసన్నద్ధుఁడై శోణితాక్షునితోడి యాతఁ డిషుదళకంబు
నాటింప వాని ఖండంబులు గాఁజేసి సాలంబుచే వనచరవిభుండు
వెండియు మైందుపై భిండిపాలమ్ములఁ బరశుముద్గరములఁ బఱపియార్వ
ద్వివిదుని సహాయుఁ డుద్వృత్తి నక్షత్రకుల్ వటమహీరుహములు వైచి రొచ్చి
వానిఁ బెట్టిపట్టి వక్షంబుఁ బిడికిట, బిట్టుఁబొడిచి కాలమెట్టి విడువ
శోణితము స్రవింపఁ బ్రాణంబు విడిచెయూ, పాక్షుఁ డక్షిగతుల నక్షులలర. 719

చ. పది నిశితాశుగంబులు నృపాలశిఖామణి నేయ రాముఁడుం
బదిశరముల్ దిగిడ్చి పరబాణముల న్విదళింప నొండియున్
గదఁ గొని రక్కసుండు సరగం జనుదెంచిన నంచుకేనియుం
బ్రిదులఁగనీక శక్తిఁ గడపె న్మకరాక్షుని శోణితాక్షుఁడున్. 731

వ. మకరాక్షుం గూల్చుటయుం దక్కినరక్కసులు. 732

క. తలఁకుగఁ బెరిఁగెడు భీతి, న్వెలిఁగి పురముఁ జొచ్చి దనుజవిభుఁ గన్గొని యం
దలి వీరలీల్గుట యాతని, కెఱిఁగించిన నుల్కిపడి విహీనస్వాంతుఁడై. 733

వ. అగ్రభాగవర్తియగు నగ్రనందనుం గనుంగొని. 734

చ తనయ మహేంద్రు గెల్చి విదితంబుగ నొందినవాఁడ వింద్రజి
ద్ఘనతరనామధేయము జగంబున నీవ మగండ వట్టి నీ
వనయముఁ బేర్చి శత్రునివహంబుల నోర్చి కరంబుఁ దండ్రి నె
మ్మనమునఁ బుట్టినట్టి పగమాన్పవు నీకిది వీరధర్మమే. 735

క. విస్ఫారంబుల జాండ ప్రతిస్ఫోటన మాచరింప రిపుల హరింపం
బ్రస్ఫురితధనుర్ధర బాహాస్ఫాలన మాచరించి యరుగు మనవుడున్. 736

ఉ. తామసవృత్తి దోషఁ దనతంత్రత వహించిన నింద్రజిత్తు సం
గ్రామమొనర్చువేడ్క బలగర్వముఁ దెంతయు నేకతంబునన్
హోమ మొనర్చి యందు దనకు మెండిన కృత్తి సహాయమొప్పఁగా
నామున దాడివెట్టెఁ జతురంగసమేతముగా నుదగ్రశన్. 737

వ ఉత్తరద్వారంబున దండువెడలి శకునరాసహితంబులై దారుణంబుగా నెదుర్కొను మారుతంబులను శివారుతంబులకుఁ దలఁకక నడిచి వనచరబలంబుం గనుంగొని నిజబలంబునకుఁ జేయివీచుటయును. 738

పూనికఁ దనుశరకోటులఁ, బూనముగా విసరికొనుచు యుద్ధము సేయ
న్వానరతతిస్సేనా, కాననములు రక్తవర్షకలితము లయ్యెన్. 739

క. అంతట నధికాగ్రహుఁడై, యంతకనిభుఁ డింద్రజిత్తుఁ డస్త్రతతితో
నత్యుగ్రుఁడై నభ, మంతయుఁ గానయయి మిగులనార్పులు సెలఁగన్. 740

చ. వితతగుణధ్వనిస్తనితవీరఘనుం డిలు మిన్నుఁ బ్రాఁకి ఘో
రతమిగ మావహించి సమరస్థలమం బకవృష్టి భూతస
మ్మతరుధిరప్రవాహమున మానక ముంపఁ దరింపలేక దు
ష్స్థితిఁ దమకూర్పు వుమ్ముచుఁ దీరక వానరుల్ భ్రాంతనాథులై. 741

క. ఘల్లనడి చూచుచుండ ర ణోల్లాసము మెఱయ మఱియు నగ్రాస్త్రములం
జెల్లాచెదరై పోవఁగ, నెల్లమెడలఁ దాన దాయె కపీంద్రుల నేయన్. 742

చ. దనుజుల కుబ్బుమీఱఁగ శతక్రతుజిత్ప్రథితాంబకంబుల
న్మునిఁగిన సేనఁ గాంచి రఘుముఖ్యుఁ డధిజ్యశరాసనుం డమో
ఘనిశితసాయకాఘ సులుకం బఱగించి విరోధిబాణఖం
డన మొనరించె భండనమునం బిశితాశుల రూపుమాపుచున్. 743

గీ. రఘుకులశిఖామణి భయంకర ప్రచండ, దనుజశరకోటి కపికోటిఁ దాఁకకుండ
నుడుశరంబుల మరలించుచుండె నింతె, కాని దానవుఁ డున్నెడఁ గానఁడయ్యె. 744

మ. దనుజుం డున్నెడ గానకున్నెడఁ బయోదస్ఫూర్తి నాకాశమె
ల్లను నీరంధ్రముగాఁగ నెంతయు రణోల్లాసంబు మీఱన్ దశా
ననపుత్రాగ్రణి వెండియుం బెరిఁగి నానాఘోరఘోరాస్త్రపం
క్తి నిగుడ్ప రఘునాయకుండు కనలం గెంజాయ రంజిల్లఁగన్. 745

చ. గుమిపడి సుప్రయోగవిశిఖుం డితఁ డంచు సుర లున్నతింప దెం
దములు కనొంద నద్దశరథక్షితిభృత్తనయాగ్రజుండు శా
ర్ఙ్గ మినుమడింప భీకరమహాస్త్రము వాంగిరసప్రశస్తము
న్నెక్కు మెఱయ నారిఁ గూర్చి రిపుఁ గూర్చి కడుం దెగలాగి యేయుఁడున్. 746

క. దిగ్ధ మొనరించె నధికవి, దగ్ధముగా నక్కడం బడపానము పేర్మిన్
స్నిగ్ధాయణసాంద్రతరా, స్పృగ్ధారాపిహితమూర్తిఁ జెన్నఁటికృత్తిన్. 747

క. కృత్తిమపు డిమ్మిధంబున, మిత్తిగొనిన శాంబరీకమిస్ర మడఁగుడన్
మత్తుఁ డగు నింద్రజిత్తుఁడు, చిత్తమెఱియఁ దోఁచెఁ గపులచిత్తము లలరన్. 748

క. మరుదుపకారపరాయణ, మరుదాదేశమున రామమహీకాంతుం డాం
గిరసాస్త్ర మేసి కృత్తిం, బరిమార్చ నంత బహులు పడియు వెఱవమిన్. 749

చ. తదనంతర మెందు నప్రతిహతంబయి వర్తిలుచుండ వాలినం
దనరవిపుత్రమారుతసుతద్వివిదముఖాత్మభవాత్మభూకుమా
రనలసుషేణముఖ్యులు ధరాధరభూమిరుహాశ్మజాలము
ల్పరగున నింపఁ బిండిగ రజంబుగఁ జూర్ణముగాఁగ నేయుచున్. 750

క. ఉన్ముఖుఁడు గాక యాహవ, మన్ముఖ్యుల నేచి యొంచి మాయాప్రౌఢిం
గన్మొఱఁగి యింద్రజిత్తుఁడు, సన్మాన్యుఁడు తొలఁగి చనియె సమరంబునకున్. 751

వ. చని హోమానోపాయుండై. 752

ఉ. పాతకవృత్తితోడ ననపాయత హోమము సెల్ల శాంబరీ
సీతనమర్చి సంగరము చెంతకు వేకొనివచ్చి వానర
వ్రాతము చూచుచుండఁ దల వ్రక్కలుసేసె నిశాతహేతి దుః
ఖాతిరయంబున న్రఘువరాయని యేడ్చుచు నేలవ్రాలఁగన్. 753

క. మాయాసీతం గపటో,పాయంబున నిట్లు చంపి ప్లవగబలము లా
హా యని వగ నొందఁగ నస,హాయుం డయి నికుంభిలకు రయంబున నరిగెన్. 754

వ. అరిగి స్థండిలాసీనుండై. 755

క. రిపువంశభయంకరము, స్స్వపక్షశుభద మగు నాభిచారికహోమం
బపరిమితక్రోధహృదయుఁ, డుపక్రమించి యతఁ డద్భుతోత్సాహమునన్. 756

వ. మధురమధురస మదిరారస సర్షప విశేషాసృగ్మాంసంబులవలనను దధ్యాజ్య
తైలాద్యాహుతిబహుళంబు వలనను దేవముఖు సుముఖుం గావించుచుండ నంతఁ గల
హోమముఖంబున. 757

ఉ. క్ష్మాసుత నిశ్చయంబుగ నిశాచరశాతకృపాణధారచే
తా సుత నొందె నింకఁ గలహం బొనరింపఁగ నేటి కంచుఁ దా
రాముశముఖ్యు లున్నయెడ రాఘవులం గని విన్నవించె ఘో
రాసురకృత్య మంతఁ బవనాత్మజుఁ డాత్మ విచార మందుచున్. 758

క. అశ్రుకలితాననయు డై,న్యాశ్రయవ్యాకులయునునై ధరాత్మభవ విశే
షశ్రమమున నేడ్వ నసం,ప్రశ్రితుఁ డదయుఁ డయి చంపి పడవైచె ననన్. 759

క. విని వినిహతమతులై యి,ట్లని రని పని దీరెఁ గటకటా విధిచెయిదిం
దనతను వభివినుతసతీ, జనజనకజ ద్రుంగెనే నిశాచరుచేతన్. 760

గీ. అనుచు వటీచయ మద్ధరాత్మజఁ దలపోసి, వసరి వసరి యొకట వసుధ కొరగి
రధికవాతవిపతితాశ్వకర్ణకయుగ, భంగి గాఁగఁ బ్లవగబలము లడల. 761

వ. మృతులచందమున మూర్ఛితులయి మహీతలంబునం బడి రంత గొంతవడికిఁ దెలిసి
రామచంద్రుండు ప్రేమాతిరేకంబునం బ్రేయసిం బేర్కొని. 762

చ. విధిఁ బతిఁబాసి శోకమున వేఁగియు నెన్నఁటికైన భర్తృస
న్నిధిఁ బడయంగఁ గాంతునొకొ నేనని ప్రాణముఁ జిక్కఁబట్టి వా
ర్నిధి నసురాధివాసమున నింద్యచరిత్రవు గాకయున్న దో
షధనుఁడు నిన్ వధించెనె సుజాత ప్రభాతకజాతలోచనా. 763

క. నను మాయలేడిఁ గొని తె,మ్మని పనిచిననాఁటఁ గోలె నతివ భవద్ద
ర్శన మెన్నఁ డగునొకో నా, కని తలఁచెద నత్తలంపు వ్యర్థంబయ్యెన్. 764

వ. నాకు నీతోడిద లోకం బగుంగాక యన్యధాత్వం బగునే యని నిజచరణసమీపం బునం బలవించుచున్న సుమిత్రానందనుం గనుంగొనుచు దుఃఖాతిరేకంబున నడలుచుండె నఖిలవానరులు బాష్పాకులలోచనులై చిత్రరూపంబులఁ జిత్రరూపంబులై చేష్టలు దక్కియుండిరంత నేతెంచి. 765

ఉ. భీతివిదూరచిత్తుఁడు విభీషణుఁ డెంతయు భక్తియుక్తుఁడై
చేతులు మోడ్చి యిట్లని వచించె మహీధవ ఘాతధాయిణీ
జాతకుఁ జావు గల్గుట మృషాస్థితి దుఃఖము దక్కు మాఖలుం
డీతెఱఁ గాచరించెఁ గపటేచ్ఛుఁడు నెమ్మది వ్రేగుఁ బెట్టఁగన్. 766

వ. అంతియకాని నిశ్చయంబుగ జానకి వధించుటలేదని నమ్మం బలికి వెండియు నసురకులవిభూషణుండగు విభీషణుం డిట్లనియె. 777

క. ఉద్ధామభయద మగునే, తద్ధోమము పూర్ణమగుడుఁ దజ్జనితమహా
యుద్ధోపకరణధరుఁడై, సిద్ధమతం డనికి వెడలి చెనకెనయేనిన్. 768

ఉ. చెప్పెడిదేమి బ్రహ్మకు నజేయుఁడు వాని నెదిర్చి చంపఁగా
నిప్పుడ లక్ష్మణుం బనుపు మీవన రాముఁడు సంతసించి నీ
వప్పని నిర్వహింపు మనఁ బాయన భక్తి నమస్కరించి పెం
పొప్పెడు దీవన ల్వడసి యుగ్రధనుశ్శరచాపహస్తుఁడై. 769

క. పవనజవతిరస్కరణముఁ, బవనజు నుదయశిఖరి భానుపగిది నె
క్కి విభీషణుండు ముంగల, గవిభీషణవృత్తి వెడలెఁ గలహంబునకున్. 770

క. కనకాచలనిభతనులుఁ, జనపద్వేశసదృశకర్కశశరీరులు గా
లనిబిడజీమూతతులిత, ఘనదేహులు కీశభల్లుకకులాధీశుల్. 771

ఉ. తారమరాద్రిఁ బాదముఁ దన్ని పగుల్పఁగ నోపువారు దు
ర్వారరదంబునం బలసి రా రఘువంశవరేణ్యుఁ డెంతయున్
దూరము వోయి దైత్యపరిదుష్టవిహారమున న్నికుంభిలా
ద్వారముఁ జేరి శాత్రవభిదాచణచిత్తుని శక్రజిత్తునిన్. 772

చ. కని రిపుహోమకర్మము విఘాతము సేయఁదలంచి వానిని
ల్పఁ జతురంగసైన్యములు పీనుఁగుపెంటలుగాఁగ నుజ్జ్వల
త్సునిశితసాయకాలి నృపసూనుఁడు దా నిగిడించెఁ గ్రవ్యభు
గ్వర [illegible] ఘనార్భటిన్. 773

ఉ. అంతకమున్న వానరబలాంబుధి వాలతరంగకోటితో
నేఁదియుఁ దాఁకి దానవబలోద్ధహరేణువు లెట్టు ముంచి బ

ల్వంతరణంబు మీఱ నతివేలపరాక్రమవృత్తి నొందు టీ
ద్యంతము గాంచి ఘోరబడబానలతుల్యమహారథస్థుఁడై. 774

క. యుక్తాభిచారహోమ, వ్యక్తుఁ డగుచుఁ బంక్తిముఖసుతశ్రేష్ఠుండా
రక్తనయనుండుఁ గలహో, ద్యుక్తుఁడునై యిల్లు వెడలి హుంకారమునన్. 775

వ. మెఱుఁగు మెఱసి నచందంబునఁ గొఱవి గిరగిరఁ ద్రిప్పినప్రకారంబున ఝుంఝుమారు
తంబు మూర్తీభవించిన తెఱంగున దశదిశలం దానయై కడంగి. 776

శా. చాపం బింద్రధనుస్సుగా నెసఁగు పర్జన్యుండు గాఁ దాను ద
చ్చాపోద్యత్పరుము ల్తటిత్సమితిగా జ్యానాదసద్భ్రధ్వని
వ్యాపారంబుగ నారణస్థలవనాటారణ్యమున్ముంచె భీ
మాపాద్యంబకవృష్టిశోణితము కల్యాగ్రక్రియం దాల్పఁగన్. 777

క. లెక్కయిడరాని ప్లవగుల, నొక్కొక్కని నగణితాంబకోత్కరములచే
నుక్కఱ మెఱయఁ ద్రుక్కించుట, యక్కజ మయ్యెం దివౌకసావలి కంతన్. 778

చ. కొఁగడుపడంగ నిట్లు ప్రతివీరుల నెల్లఁ గలంచి యాడి శ
క్రిగరిమ లక్ష్మణుం బ్రచురతీవ్రశరంబుల నొవ్వఁజేసి గం
ధగజము భంగిఁ బంక్తిముఖనందనుఁ డెంతయు వంచనామతి
న్మగుడఁగ నేగె హోమము సమాప్తముగా నెఱవేర్చు పూనికన్. 779

క. చని హోమంబు సమాప్తం, బొనరింపఁదలంచి యాతఁడున్న సుమిత్రా
తనయునకు విభీషణుఁ డిట్లని యెం గార్యదశ దెలియునట్లు నిపుణతన్. 780

క. అవశిష్టహోమకర్మను, సవనీశ ఘటించి మగుడ నరుదెంచిన దు
ర్వ్యవసాయుఁ బీనిఁ జంపఁగ, నవశమగుం బోడువ నిదియు యవసరమునుడున్. 781

క. క్రమ్మనకోపమ్మున నా, గ్రమ్ములగు శరమ్ముల నిరమ్ములు పఱపెన్
సమ్మెటప్రేటులటంచు స్రగమ్మదపాతమ్ము లనుచు రావణి నొవ్వన్. 782

వ. వెండియుం జందకాండంబు లొండొండ దండోపతండంబులుగా నిగిడింప నింద్ర
జిత్తు మండిపడి. 783

క. అపగతహోమకలాపుఁడు, వ్యపగతనిజసైన్యభీకరాలాపుఁడు న
త్యపగతకోపుఁడునై బిట్టుపగతునై నేగు నాతఁడు మహోగ్రుండై 784

వ. విభీషణుండు దృగ్గోచరుం డగుటయు సహింపని రోషాతిరేకంబున. 785

క. కన్నకొడుకు నట్టిఁడ నా, కన్న కొడుకు నీఁ డటున్న కరుణామతి లే
కన్న ననుఁ జంపఁ బో నీ, కన్నను వేఱ పగతుండు గలఁడే నాకున్. 786

గీ. శరుని జేరి బంధునాశంబునకు నోడి, గట్టి దయయు నీతి గట్టిపెట్టి
నాఁడ వట్టినీవు నాకు నెక్కుడిపిన, తండ్రి వనుడు సతఁడు తక్షణంబ. 787

సీ. సవ్విభీషణవృత్తి సవ్విభీషణుఁ డిట్లు పల్కు దురాత్మ నీ బాంధవంబు
చాలు పోనిక నోర్వఁజాలక బలవద్విరోధంబు వలదని రూఢభంగి
నీకు నీతండ్రికి నే నెంత యుక్తి చెప్పిన నిడుఁగొల్పఁ బ్రియములేక
యభియాతిరీతి నాకభిభూతి యొనరించినందున మిమ్ముఁ బాయంగవలసె
నదియుఁగాక దుష్టమైనబంధుకోటి విసర్జనీయమంత్రు సజ్జనులకు
నాఁటిమాటలాడ నేటికి నేఁటికి, మృత్యువశుఁడ వైతి కృపతిహీన. 788

చ. అనవుఁడుఁ గోప మెక్కి నరులాకలహంబున నుజ్జయించు వా
రని వెసఁ జాప మెక్కిడి జయానకము ల్మొరయంగఁ గ్రవ్యభు
గ్జనుఁడు త్రోఁక్కద్రొక్కిన భుజంగమపుంగవుచంద మొందినన్
దనుజులు పోక నిక్కి ప్రమదంబున మార్కొని రస్త్రసైన్యమున్. 789

క. మార్కొనుటయుఁ గపిబలము న్నెదుర్కొన నపిమ్మనలు రెండు దుర హోరించెం
బేర్కొని నెత్తురు పుడమిం, బేర్కొన భూమిచరఖచర భీకరము గాఁగన్. 790

వ. తత్సమయంబున విభిన్నరథాంగంబును విశీర్ణపుండరీకంబును విస్ఫారిప్రతాపంబును విజృంభమాణరాక్షససంచారఘోరంబును విస్పష్టమానసస్వస్తుకప్రకాశంబును నై సంధ్యాసమయంబునుంబోలె. 791

గీ. వరమరుత్సుతభుజపీఠి మరుదహార్య, శిఖరివిస్ఫురితంబగు సింహమనఁగఁ
బొల్చు సౌమిత్రి శరవృష్టిఁ బొదివె బంక్తి, కంధరసుతుండు కంధరక్రమము గాఁగ. 792

గీ. పొదివి చిక్కి తెందుఁ బోయెదు నిలుమని, చులుకుమాటలాడి కలకుటమ్ము
లాలునాలు వైవ నన్నిబాణంబులఁ, ద్రుంచె వాని నృపసుతుండు కనలి. 798

ఉ. త్రుంచి దురాత్మ నీశిరముఁ ద్రుంచెదఁ బ్రేలకు మంచు దైత్యు ల
క్షించి ప్రమత్తశత్రువినికృత్తవరంబు శరంబువింటు సం
ధించి బలంబునం దిగిచి తెంపున వానిమహోదరంబు భే
దించిన మృత్యుసంగతుఁగతి న్మహి నాతఁడు వ్రాలెఁ జెచ్చెరన్. 794

క. తెలిసి నరాదుఁడు పులిపై, బలిసిన వృషభంబు పోవుభంగిఁ జనుటయుం
దెలిసి నరేంద్రుఁడు వానిం, బలిసిన రక్షసులు వెఱగుపడి పఱవంగన్. 795

శా. విక్రాంతాక్షిసుతుండు రఘువుఁడు దోర్వీర్యంబు నిండారఁ జం
డక్రోధంబున వైరిభీకరధనుష్టంకార మేపార శా

గీ. గంధవహకుమారు వక్షంబు నాఁటు, నైదు నారాచముల నేసి యాస్ఫోటమును
సమరలంపటుఁ డహితురథ్యముల నేలఁ, గూలఁగా నేసె మెఱుఁగారు కోలఁ జేసి

వ. లక్ష్మణుండు తోడన వాని కోదండంబుఁ దుండెంబులు గావించుటయు నింద్రజిత్తు.

మ. విరథుండు న్వినికృత్తచాపుఁడును నిర్విణ్ణాంతరంగుండునై
సురసంఘంబులు పిచ్చలింపఁగ మహోష్ణస్తోమము ల్మించె భా
స్వరకోదండ మొకండు పుచ్చికొని తచ్చాపంబు ఖండించిన
న్వరయుం బారఁగ నొండు విల్లుగొనినం జక్కాడె సద్ధ్వయున్. 810

ఆ. వింటు లెన్ని యెక్కువెట్టిన విఱుచును, సున్నఁగాచి దైత్యుఁ డుక్కుదక్కి
యధికదుఃఖమగ్నుఁ డై యిట్లని తలంచె, హృదయమునఁ బ్రమత్తుఁ డింద్రజిత్తు. 811

తే. శంబసదృశంబు లస్మత్కలంబములు గలంబముల పోలె నాటవు లక్ష్మణునకు
శంబసదృశంబు లగుచుఁ దదంబకములు, తనువు నొప్పించు నెంతయుఁ దనువులయ్య.

ఉ. ఇంద్రు జయించి తద్విభవ మెల్ల హరించి విరించిచేత ము
న్నింద్రజిదాహ్వయంబు జగ మెల్ల నెఱుంగఁగఁ గాంచినట్టి దై
త్యేంద్రుఁడ నే సురేంద్రుని జయించుట దుర్లభ మయ్యెఁ బ్రీతిన
య్యింద్రుని బ్రోచు వేడుకను పేంద్రుఁడు మానవమూర్తి యయ్యెనో. 813

క. అని తగచి మతిమఱఁదన యే, సిన శక్తి ప్రముఖములు నశించిన లజ్జా
వనతాననుఁడై లక్ష్మణు, నని బాహాబాహిఁ జెనఁగ నాలోచించెన్. 814

క. ఈరీతిఁ దలఁచి దనుజుఁడు, కోఱలు వెలిగిన మహోరగునికైవడి వి
స్తారామర్షంబునఁ బ్రతి, వీరు నెదుర్చుటయు వాఁ డవిరళాగ్రహుఁడై. 815

చ. అపుడుగ శక్రదత్తమగు నస్త్రము వారి నమర్చి పేర్చి సు
స్థిరభుజశక్తి లక్ష్మణుఁడు శీఘ్రగతిం బరఁగింప గుండల
స్ఫురితము దైత్యమూర్ధము వసుంధరఁ ద్రెళ్లె మహాశుగాహతో
ద్ధురమరుదుర్విభృచ్ఛిఖరితో యమునన్మహి సంచలింపఁగన్. 816

క. తలఁకుడుఁగ నింద్రజిత్తుని, తల కుండలకర్ణశోభితం బగుచు మహీ
తలము దిగఁద్రుంగఁ గని యుమ్మలపడి సంగఫుల కతిముదం బొనరించెన్. 817

వ. తత్సమయంబున. 818

శా. ఆసారంబులు నిర్మలోదకములై కన్పట్టె లోకంబు శో
భాసారంబయి తెల్విఁ దాల్చె దిశలు న్భాసిల్లె నెంతేనియు
న్నాసారద్రఫలీకృతార్థకసుగంధస్ఫారమందార సూ
నాసారంబులు వెల్లిగొల్పె సురవేశ్యాలాస్యముల్మీఱఁగన్. 819

క. సురదుందుభిరవములు వా,నరుల జయజయధ్వనులు వినంబడ ధరణీ
వరుఁ డబ్ధి నీఁది పారము, వెఱవుఁ గైకొన్న వాని విధమున నలరెన్. 820

వ. మహానందంబున నిజయోధవీరపరివృతుండై నికుంభిలాద్వారంబు వెడలి వచ్చు నవస
రంబున. 821

సీ. మలయధరాధరోజ్జ్వలహరిచందనపృథ్వీరుహాళితోఁ బెనఁగులాడి
గంభీరతరవిశాలాంభోనిధితరంగశీకరంబులతోడఁ జెలిమిచేసి
మల్లికాజాతిచంపకకురవకసుమనోపవనంబులను బూలబంతులాడి
భాస్వత్ప్రభాసునీలికస్వాదుకార్తస్వరాంబుజాతముల నుయ్యాలలూఁగి
నందనంబున మందయానంబు నేర్చి, చైత్రరథమునఁ జైత్రుతో సరసమాడి
నట్టిరుచిరతరము హర్షమావహించె, భాసితులకు మరుత్సుమిత్రాసుతులకు. 822

వ. పిదప నమ్మహావీరుండగు లక్ష్మణకుమారుండు విజయవార్తాశ్రవణకుతూహలాయత్త
చిత్తుండగు రామచంద్రున కనతిదూరంబునఁ గపిరథావతీర్ణుండై. 823

క. రూఢధృతి నేగి వినయో,దూఢత నగ్రజుని చరణతోయజముల కా
రూఢప్రౌఢిమ మ్రొక్కుడు, గాఢాదరతత్పరమునఁ గౌఁగిటఁ జేర్చెన్. 824

క. స్నేహ మిగురొత్తఁగా నుప,గూహనసౌఖ్యంబు నొంది కొనియాడె మహా
సాహసు దానవవీరు ఘ,నాహవమునఁ జంపినాఁడ వనుచు నృపతియున్. 825

క. దేవాసురవరు లొక్కటి, యై వచ్చినఁ జిక్కఁ డమ్మహామాయికుని
నీవు వధించిన నస్మ,ద్భావం బానందపూర్ణమగ్నం బయ్యెన్. 826

వ. అని వెండియు ననేక మధురవచనముల నగ్గించుచు దారుణవిపక్షబాణక్షతశతం బగు
సహోదరు దేహంబు నిమురుచు నిట్లనియె. 827

క. నీ వింద్రజిత్తుఁ గూల్చితి, కావున నే నెల్లభంగి ఖండింతు దశ
గ్రీవుని దురమున మఱి సు,గ్రీవాదులు చూచి మిగులఁ గీర్తింపంగన్. 828

వ. అని తదనంతరంబున. 829

ఉ. సన్నుతు లొప్ప మారుతిఁ బ్రశంస యొనర్చి విభీషణుం గడు
సన్మానమాటలం దనిపి మర్కటకోటి బహూకరించి ధై
ర్యోన్నతి రావణుం దునుము నున్న యెడం దదనీక మెంతయుం
జెన్నువహించెఁ బున్నమ నిశిన్ శశిఁ గన్న పయోధితోయమై. 830

క. అట దశముఖుండు భయదో,త్కటసంగరమున సుతుండు గడతేఱుట నె
త్తుటఁ దేఱుట కలహవిముఖ,భటులవలనఁ దెలిసి విగతభావుం డగుచున్. 831

క. శరదంబుదములకై వడి, నరసంబులు మిన్ను ముట్టి యరుగఁగ నడిచెన్
ద్విరదంబులు మహిఁ దడుపుచు, శరదంబులభంగి మదరసస్రావములై. 853

క. సురరిపుతురగఖురాహత, ధరారజః పాతమున గదా గంగాభా
స్వత్కార్తస్వరజలజము, లురుపంకజములుఁ బరాగయుతములు నయ్యెన్. 854

వ. బడబాప్రదీప్తంబు గావున వనరాశిచందంబున సారస్యందనంబు గావున వనరాశికై వడి భయంకరాంతరంబైన యమ్మూకలబల వలాహకపటలంబు నిబిడంబై శరాసారంబున ముంచుటయుఁ బెచ్చుపెరిఁగి యవ్వనచరసేనాసస్యంబును దలమీఁటి కవిసె 855

క. వ్యూహములు రెండు సమితో, త్సాహమునఁ దలాతలిం గచాకచి బాహా
బాహి నఖానఖి సమ్మర్దాహవ మొనరించె ఖచరు లచ్చెరుపడఁగన్. 856

చ. అమృతనిమిత్తపూర్వబుధాయరసంఘములట్లు చండవి
క్రమమున దైత్యభూరుహచరప్రకరంబులు పోరొనర్చినం
గ్రమమున నేలువాఱె రుధిరంబది సంకులకాననాంతర
స్థమగు ప్రశోణగైరికవిశాలరసాలితప్రవాహమై 857

క. పలువురు బలియురు లొకనిపై, గలయుక మార్కొని పెనఁగు ట్టి యెడలు న
ప్పలువురు బలియుర నొకఁడుఁగ, నలి మార్కొని చలమునం బెనఁగెడు నెడలున్.

సీ. పాషాణములు పిండిభంగి రాలెడుచోట్లఁ బాషాణములఁ దలల్ వగులుచోట్లు
విచ్చుకత్తులు పట్టి విఱిచెడు నెడలును విచ్చుకత్తుల గొడలిచ్చు నెడలు
భూరుహంబులు చూర్ణములుగఁ జేయుపట్లును భూరుహంబుల మృతిఁ బొందుపట్లు
బాణజాలంబులఁ బాఱఁద్రోలెడునిక్కు లమితబాణంబుల నడఁగునిక్కు
లేనుఁగుల గుత్తులఁ బడనేయుతావు, లేనుఁగులు గుత్తులచేత నీల్గుతావు
లారలు తలములు నొరగింప నున్నతలము, లయ్యె వనచరదైత్యసైన్యద్వయమునఁ.

వ. అయ్యుభయవాహినీయోధనాథు లాయోధనమున నోహటింపక యోహరిసాహరిం బెనంగులాడునప్పుడు కేలువడినం బెఱకేలఁ బరాక్రమించువారును దలలువడినను లక్ష్యంబులం బడనేయువారును జిక్కువడియు నుక్కుదక్కనివారును బ్రేవులు వ్రేలాడినం బేరువాఁడిం బోరాడువారును బ్రాణంబులు విడిచియుఁ గృపాణంబులు విడవనివారును రుధిరంబునం దడిసియుఁ జలింపనివారును జచ్చియు ముఖంబులఁ గ్రోధంబు డింపనివారును విచ్చియుం బెచ్చుపెరిఁగి కమ్ముకొనువారును గాలుసేతులు దునిసియుఁ గఱవ నప్పళించువారును బడియునుం బోవపోకుమనువారును సహాయులు మన్నిగొనినను మెన్నివారును నైరయ్యవసరమ్మున. 860

క. కుల్యాశకలసైకతములు, శల్యతటంబులుఁ గబంధశవమీనంబుల్
కల్యాణ వాజిముఖము లస్రు,క్కుల్యాశతములుగ సమరకుంభిని వెడలెన్. 861

గీ. ఘోరవిజయశంఖభేరీరవంబుల, హుంకృతులును జాపటంకృతులును
జిత్తభయదకరణి సింహనాదంబుల, సంగరంబు ఘోరభంగి యయ్యె. 862

క. అసురాశుగాగ్నిప్రఘనక్రోధసమీరోద్రేక మగుచుఁ దఱిమికొని వనా
కసవన్యావాహము సేయుపయోముఖ రాఘవుఁడు మహోగ్రుం డగుచున్. 863

క. కనదబ్జేక్షణములఁ గ్రోధనదేక్షణము లొనరించి కపు లలరఁగ న
బ్జనకులనాథుఁడు ఫలభోజనకులనాశన మొనర్చె సంరంభమునన్. 864

క. ప్రత్యాలీఢస్థుఁడు శత్రుధ్వాంతస్ఫోటనరణధికార్యతరం
కృత్యానుపమచాపధరుఁడు, ధృత్యతిశస్తుఁ డయి యేసెఁ దీవ్రాంబకముల్. 865

వ. ఎనుబదియు నద్దివ్యశరంబున ననేకఘోరసాయకంబులు భూనభోంతరాళంబు నిర
వకాశంబుగా నుద్భవించి. 866

సీ. కఠినదానవకాలఖండంబులను జేర్చి పొడవైన యెముకలు పాఁతుచేసి
మేదురమహాస్థిమేదము లరఁగించి కమనీయతరభటాంగములు దఱిగి
తీరథావములులు చిక్కుపలు గావించి సాంద్రశోణితరక్తజలముఁ జేర్చి
యుత్తమయోధులచిత్తంబు లుడికించి కంఖాణఘోణాప్రకరము గాల్చి
ప్రకటఘోరకపాలపాత్రికలు గూర్చి, కూటటింపులు చేసె భూతావళులకు
రణమహానసమున దశరథమహీశ,తనయశరములు చిత్రసూదజనులట్లు. 867

సీ. మానవాధీశ్వర మార్గణావళు లేచి యమరవిరోధికంఠములు వెదకు
భూమీశ్వరునిశరంబులు మట్టుమీఱుచుఁ గట్టిడిదనుజుల బిట్టు ముంచుఁ
బార్థివాధ్యక్షునిపత్రులు బారులై రాక్షసశ్రుతికోటరములు దూఱు
క్ష్మానాయకుని శిలీముఖంబు లలిరేఁగి పలలభోజనముఖాబ్జముల వ్రాలు
క్షత్రియోత్తమ శుభదాశుగములు మీఱి, ఖలనిశాచరకఠినాంగములు స్పృశించు
నద్భుతావహము లగుచు నారఘురామ, చంద్రుసాయకజాలము లార్థకములు. 868

క. వచ్చినవారల నంటఁగ,వచ్చునె యని రాముబాణవర్గ మసురులన్
ద్రుచ్చికొని యొడల నుండక, యిచ్చదనర రక్త మంటకుండఁగ వేగన్. 869

క. గుడుసుపడు వింటి శరములు, దొడుగుట తెవాపుటయును దోఁప దసులపైఁ
బడుటయును దనుజు లవనిం, బడుటయు నిరంతరముగ నొకభంగిన యెప్పుడున్.

వ. వెండియు శ్రీరామచంద్రుండు. 871

సీ. పసుగుర నూర్వర ఖాణరజ్జువులచే గుదిగ్రుచ్చు నొకవేళఁ గోపి యగుచు
మంత్రించి పఱద్రోయు మాడ్కి నేనుంగులఁ బడనేయు నొకవేళ భయదుఁ డగుచు
భూరికదంబము లుంఖానుపుంఖము ల్విగిడించు నొకవేళ నిపుణుఁ డగుచు
దానవోపాకృతతతి మార్గణాగ్ని కాహుతి సేయు నొకవేళ నుగ్రుఁ డగుచు
దనుజశత్రుకవాటపాటన మొనర్చు, ధారుణీనాథుఁ డొకవేళఁ గ్రూరుఁ డగుచుఁ
దాళఫలముల పోలికిఁ దలలు రాల్చు, భూదయితుఁ డొకవేళ సరోషుఁ డగుచు. 872

ప్రస్విన్నశౌర్యమై కీకస్యంబు రేకెత్త సంగ్రామభూమీధరాగ్రస్థమై శస్త్రక
ర్షామితప్రౌఢి దైత్యాటవి నమ్రంచె శ్రీరామరాజన్యధారాధరం బీక్రియన్. 873

వ. అర్ధవర్గ్యశాస్త్రపారంగతుండు దోర్గ్రాహిణపాండిత్యంబుఁ జూపుటయుఁ జతురంగం
బగు నమ్మాల్యబలంబు శల్యసంకీర్ణకంటకక్షితిజాతం బగు దుర్గమారణ్యంబుచుం బోలె
నందుఁ గపాలంబులు శిఖాలంబు లగువారును ప్రభ్రష్టకంబులు ప్రభ్రష్టకంబు లగు
వారును గరంబులు కుంఠితంబు లగువారును ఖండంబు లగు వేదండతుండంబులును
జీర్ణంబులు నగుచర్మాకీర్ణంబులును విరూపంబు లగు రూపంబులును రజంబు లగుధ్వ
జంబులును భూతంబు లగుభూతంబులును గల్గి పుండరీకపుండరీకంబును శిలీముఖ
శిలీముఖంబును రథాంగరథాంగంబును బరాగపరాగంబును భంగభంగంబును రక్తో
త్పలరక్తోత్పలంబును వాలశైవాలంబు నగుసంగరసరోవరంబు రౌద్రబీభత్సాద్భుత
భయానకంబులకుఁ దానకం బై యొప్పె. 874

క. నాయకరకుంభకుచరక్తోరుఘుసృణమూలబలపయోజవదన తాఁ
జేరంజాలదు రాము న్నారపురుషనాయకు వ్రజోవతి యగుటన్. 875

తే. లపనములు పిండి యైన విలపనలగుట, చరణములు నఱుకయిన విచరణులగుట
హస్తములు దెగిపడిన విహస్తులగుట, నద్భుతావహ మయ్యె నయ్యాహవంబు. 876

క. మూలబలమహోద్యన్నాలము రామాశుగప్రమూల మని మహీ
పాలు నెదిరించె రక్షఃపాలుఁ దలఁకి మీఱ సైన్యపాలుర మెచ్చన్. 877

వ. నిజకాంతిపరిహాసచంద్రికావికాసం బగు చంద్రహాసభయుండు నట్టహాసభాసురుండై రామ
చంద్రుపై రావణుం డురవడించుటయుం దనుజభటపరివృతుండై. 878

క. ఎత్తిచని విరూపాక్షోన్మత్తులును సుపార్శ్వుఁడును వనచరబలము ను
ద్వృత్తగతిఁ దలపడిపోరెస, నత్తఱి భండనము గడు భయంకర మయ్యెన్. 879

క. ప్రేవులప్రోవులు పాచలగు, దీవులుగా నెమ్ము లిసుకతిన్నెలుగా బా
ణావలి తరగలుగా రక్తావిలకీలాలసంగరాంబుధి మెఱసెన్. 880

క. ఆక్షణమున వచ్చి విరూపాక్షోన్మత్తుల మహోగ్రాయత్తుల యు
ద్ధక్షోణికి బలిగాఁ దద్వక్షంబులు భానుసుతుఁడు వ్రక్కలు సేసెన్. 881

తోటకము. అంగదుఁ డంతట నంగము పొంగం, దుంగరసాలము తూర్ణము గాఁగన్
బ్రుంగఁగ దానవపుంగవు నేయ, న్భంగము నొంది సుపార్శ్వుఁడు వ్రాలెన్. 882

వ. నిజపార్శ్వవర్తులును మంత్రులు నగు సుపార్శ్వవిరూపాక్షోన్మత్తుల మృతిఁగొనుటం
గనుంగొని రోషాతిరేకంబున. 883

క. దశకంధరుండు కార్ముక, దశకంధరుఁ డగుచుఁ గీశతతి నెంతయు దు
ర్దశనొందింతు ననుచు నిజ, దశనంబులు గీఁటుచును రథంబు మెఱయఁగన్. 884

గీ. వాన గురిసినకైవడి వడిగ నిసుము, చల్లినట్టులు మిడుతలచాలుభంగిఁ
దెఱపిలేకుండఁ దొరఁగించె దివ్యబాణ, పటలి నొక్కట విపినాటభటులమీఁద 885

వ. సంవర్తసమయసంవర్తిం బోలె విజృంభించి. 886

మహాస్రగ్ధర. పదిచండాస్త్రంబులు న్ముప్పదిపదిశితరోపంబులు న్నాల్గుశాత
ప్రదరంబుల్ వైచి శౌరిం బవనతనయునిం బాకభిత్పుత్రు నొంప
న్మదులై యమ్ముప్వురుం దన్మకుటములదర న్మూర్ఛవుల న్ముంప నాదు
ర్హృదయుం డాజ్యాహుతిం బేర్చుహుతవహుఁడో యాతఁ డంచుం దలంకన్.

లలితపదము. పెరిఁగి దివౌకసభీతము గాఁగం, దరుచరవంశవితానము నెల్లన్
శరబహుళాగ్నిజ్వాలల పేర్మిం, దరికొని కాల్చు హుతాశనమూర్తిన్. 888

వ. దశకంఠుం గనుంగొని రాముండు సయిరింపక. 889

లయవిభాతి.

రభసత నెదిర్చి భుజగభ నదముఁ గార్ముకముఁ బ్రభమిగులఁ దాల్చి వరవిభుఁ డభయవృత్తిన్
గుభగుభయనన్గుణము నభము విరియ నున్మద దిగిభములు ఆగి మూర్ఛగొన ఋభుతతికి నెంతే
విభవ మెసఁగం ద్రిదివసుభ వొగడ మీఁటుచును శుభభరితదృష్టిఁ బ్లవగభటతతివార్ష
ప్రభవ మగుచుండ రవినిభశరముల న్విసరెఁ గుభృదధిపుమీఁద నెగుచుభిదుగమట్లున్.

కవిరాజవిరాజితము.

తనపయి నిట్లుమితం బగుబాణవితానము వైచినఁ దా నలుకన్
దనుజవిభుండు నుదాత్తశరంబులఁ దక్షణమాత్రన దాశరథిం
జొనిపిన నిర్వ్యథుఁ జూడఁగ నొప్పిరి శోణితగాత్రు లశోకయుగం
బనయముఁ బుష్పితమై నట్టియుంచె నటంచుఁ దలంపఁగ నట్టిమెడన్. 891

స్రగ్ధర. రౌద్రాస్త్రం బుగ్రలీల న్రఘువరునిపయి న్రావణుం డేయఁ గ్రోధో
న్నిద్రుం డా రాముఁడుం దన్నిశితశరతతి నాగ్నేయ మహాసాయకం బ

త్యుగ్రేకనూస్త్రిమై నేయుఁడు శరయుగళం బుద్ధతిం బోరి కూల
గ్రాగ్రద్వంద్వంబు నాసిర్వారు నిజవిజయార్థ ల్మహోఘోగ్రవృత్తిన్. 892

వసమయూరము.

వెండియు నిశాచరులు వృక్షచరవర్యు, ల్మెండితము మెచ్చ రజనీచరవరుండుం
జండకిరణాన్వయుఁడు శాతశరకోటిన్, దండిమగు లిప్పగిదిఁ దార్కొని పెనంగన్.

క్రౌంచపదము.

దిక్కులఁ జీఁక ట్లెక్కువ యయ్యెన్, దినకరరుచి యలఁతిగఁ గనవచ్చెం
జుక్కలు ధాత్రిం బెక్కులు రాలెన్, స్సురలు మనములను సొలసిరి భీతిన్
నిక్కక కంధు ల్మిక్కిలి యింకెన్, నిగమనిగతి యవని నొరిగిపడియెన్
నిక్కము గాఁగ న్మొక్కలు రాలెన్, నిబిడతరగిరివినికరములందున్. 894

తరళ. అపుడు రావణుఁ డార్చిపేర్చి శితాస్త్రపంచక మొక్కటన్
నృపతిసింహుని వ్రేయ నమ్మహనీయ కార్ముకుఁ డెంతయుం
గుపితుఁ డై పలలాదువక్షము ఘోరదివ్యశరాహతి
న్నిపుణుఁ డై పగిలింప మూర్ఛమునింగె వానరులార్వఁగన్. 895

శుద్ధవిరాటి. అంత న్మూర్ఛితు నద్దశాననుం, జెంతం జేరక చిత్రరూపులై
భ్రాంతిం జెంది యుపాయహీనతఁ, జింతం బొంది కృశించి రాశరుల్. 896

మత్తకోకిల. తేరిమీఁదన మూర్ఛదేఱి యధిజ్యకార్ముకుఁ డై సమి
ద్ఘోరవృత్తి నృపు న్వధింపఁగఁ గోరివచ్చు దశాస్యుఁ గం
ఠీరవంబు గజంబు డీకొనుఠీవి మార్కొనియె న్మహా
వీరవర్యుఁడు లక్ష్మణుండు వివృద్ధవిక్రమసంపదన్. 897

క. అన్నకుఁ గన్నాకై యి, ట్లన్నరభోజను నెదిర్చి యాతనిధనువు
ల్మున్ను విఱిగించి పిదప, న్మిన్ను నొగసి యున్న దాని మేదినిఁ గూల్చెన్. 898

ఉ. అట్టియెడన్ గదాకలితహస్తయుగుండు విభీషణుండు తోఁ
బుట్టువు రథ్యసారథుఁ బొంక మడంగఁగ మోఁది యార్చినం
దొట్టిన చింత నట్లు విరథుండు సహస్తశరాసనుండు నై
కట్టలుక న్విభీషణునిఁ గాంచి బొమ ల్ముడి వెట్టి యిట్లనున్. 899

ఉ. బుద్ధులు చెప్పవచ్చి నను బోయి నరాధము నాశ్రయించి ద
ర్పోద్ధతిఁ దద్ధితంబుగ మదోత్కటు నన్నెదిరించి బంటవై
యుద్ధము సేయవచ్చితి మహోగ్రమృగేంద్రము సారమేయ మే
పద్ధతి మార్కొనంగల దపాయ మెఱుంగ వహో సహోదరా. 900

చ. కనుఁగొని చేరి యుల్లము డుకం గడుఁ గంపితగాత్రుఁ డాన్నృపుం
డును బెనుమూర్ఛ నొంది యతనశ్రమఁ గొండొక తేఱి ధూళిలో
మునిఁగిన తన్ముఖాబ్జమున మోమిడి యశ్రులు వెల్లిగొల్పుచున్
జనకసుతావరుండు కపిసైన్యము దైన్యము నొంద నార్తుఁడై. 912

వ. సహోదరుం బేర్కొని. 913

క. తూలమ్ముఁ జిమ్ము పటువా,తూలమ్మున రిపుబలమ్ముఁ దూలించిన నీ
వాలమ్మున నొరగితివె ని,ట్టాలమ్మునఁ గడునలుకపటుల మలమికొనన్. 914

తే. అధికమదలీలఁ బటుకలహప్రసిద్ధ, విపినభూమి నిరంకుశవృత్తిఁ దిరిగి
శత్రుకిసలంబు లేటి నామిత్రవామ,మత్తకరి పంక్తిముఖపంకమగ్నమైతె. 915

క. భరమయ్యెనె నీ బ్రదుకి,ద్ధరణికిని ధరాధురాధురంధరవరసు
స్థిరుఁడగు నహీనమూర్తిక,సురహితుచేఁ బడఁగవలసెఁ జోద్యము గాదే. 916

క. పుడమిని బంధుల గురులం, బుడమినిసువు విడిచి విపినభూమిఁ దిరుగున
ప్పుడు నినుఁ గని ప్రాణంబులు, విడువక నిల్పుకు విడుతు నిన్ను విడిచినకతనన్ 917

సీ. ఊరిమి నిద్రింపఁ గోరినయప్పుడు పల్లవచారుతల్పం బొనర్తు
వధికనిద్రాసక్తి నందియుండినయప్డు చేరి యల్లనఁ బదసేవసేయు
దాఁకలిగొని పారణాసక్తి నొందినఁ దీయనిఫలములు దెచ్చి యిత్తు
వవనీజఁ దలపోసి యలఁత నొందినవేళ నుచితంపుమాటల నూఱడింతు
వట్టి నీ విట్టివో నను బెట్టి నిదుర, పోక తగునయ్య యదియును గాక చింత
నెంతయుడలిన నూరార్ప వేటిధర్మ, మలుకనొందితె పిలిచినఁ బలుక వనుజ 918

క. తమ్ముఁడ నీపడుటఁ జి,త్తమ్ము శతసహస్రశకలితము గామినిమి
త్తమ్ము పృథుకఠినవజ్రక,తమ్ముగుటం గాదె నిశ్చితం బూహింపన్. 919

చ. నిను విడనాడి ప్రాణముల నిల్పఁగనోపితినేని రావణుం
దునుమఁగనేర నొక్కగతి దున్మఁగనేర్చితినేని వీటికిం
జనుటకుఁ జాల నట్లు చనఁజాలితినేని సుమిత్ర నుత్తమం
గనుఁగొనఁజాలఁ గాన నిటఁ గాలవశమ్మును నొందు టొప్పగున్. 920

గీ. ఒంటినున్నయపుడు సౌఖ్యమొందునపుడు, నాడునప్పుడు బంధులఁ గూడునపుడు
మఱపురాక సహోదరమరణశల్య, మెమ్ములను గీఱుచున్నె నూఱేండ్లకైన. 921

ఉ. భండనభూమి నీపడినభంగిఁ గనుంగొని వానరుల్ భయా
ఖండితరాత్రి నేడ్చుటయ కాదు విషాదసమండపస్థులా

ఖండలముఖ్యులం దెలిపి గానిమూర్ఛ మునింగి రింద్రజి
త్ఖండనుఁ డీల్గె నం చెటులు గాంతును బారము దుఃఖవార్ధికిన్. 922

ఉ. ఏటికిఁ జీమలడ్డముగ నేగి భయంపడునట్లు నీధను
ష్కోటికి నగ్గమై వెఱపుగూరెడు దానవకోటి యెంతయు
న్నేటికి మీఱె నీవు ధరణిం బడఁగా నవి చింతనొందు నిం
కేటికిఁ బ్రాణ మేటికి మహీసుత నాకని మాటిమాటికిన్. 923

వ. అనేకవిధవిలాపంబుల వగచుచు ధూళిధూసరితం బగు సహోదరుశరీరంబు నిము
రుచుఁ గౌఁగిటం జేర్చికొని మానవమాత్రుండునుం బోలె నిశ్చేష్టనుం డై కొంతతడ
వూరకుండి దీనాననం బెగయించి. 924

క. మిగులఁ దవకంబె వగలం, బొగులు కపిబలంబునెల్ల బొదవగ కరుణాం
బుగ వారి కిట్లనియెఁ బెల్లుగ నొదవె మగద్గదిక నెలుఁగు రాలుపడన్. 925

ఉ. కాననవృత్తికంటె జనకక్షితినాథతనూజ రాక్షసా
ధీనత నొందినం గలుగు దీనతకంటె సహోదరుండు ప్రా
ణానకుఁ బాసినం గను ఘనవ్యథకంటె సుమిత్ర పుత్రశో
కానల మైనఁ జూచుట భయం బగుఁగాన మృతుండ నయ్యెదన్. 926

క. అనుటయు బాష్పములలో,చను లవ్వనచరులు రామచంద్రు నధికశో
కనిమగ్నమానసుం గన్గొని దుఃఖించిరి రణంబు ఘోరము గాఁగన్. 927

గీ. అధికశోకమగ్నులై హనుమన్ముఖ్యు, లున్నయెడ సుషేణుఁ డుచితభంగి
డాయఁబోయి మూర్ఛవోయినలక్ష్మణు, నంగకంబులెల్ల నరసి చూచి. 928

క. హృదయము బెదరుట, ధాతువు లదరుట వదనము వికాసమైయుంటయు నె
మ్మది నరసిచూచి రాముఁ, గదిసి సుషేణుండు నిభృతగతి నిట్లనియెన్. 329

మ. అవనీభారధురంధర ప్రవర ధైర్యస్థైర్యచిత్తాబ్జ నీ
వవివేకింబలెఁ జింతనొందకుము మూర్ఛాయత్తుఁడై లక్ష్మణుం
డవశత్వంబున వ్రాలెఁ గాక మృతదేహం బిట్లు నిద్రావిశా
రవపుప్రక్రియ నొప్పునే యితఁడు సప్రాణుండు నిక్కంబుగన్. 930

వ. అని నమ్మం బలికి. 931

ఉత్సాహ. జీవశతసహస్రశేముషీవిశేషలక్ష్మణున్
జీవయుక్తుఁగాఁ దలంపు చిత్తమం దితండు ని
ర్జీవుఁడేని దేహ మిట్లు చెన్నుమీఱ దింకసం
జీవనీమహౌషధంబుచేతఁ దెల్వి నొందెడున్. 932

ఉ. నీవు కృతప్రతిజ్ఞుఁడవు సీతలపోసినదాని కంతరా
యావలి యెన్నఁ డుం గలుగ దర్కకులాగ్రణి పద్మినీ మనో
భావితుఁ డయ్యెనం దుదయపర్వత మెక్కఁగ రాకమున్న సం
జీవనిఁ జేసి లక్ష్మణు సజీవుని జేయుట చాల మేలగున్. 933

క. అని హనుమంతుని విపులజవనిర్జితఫణికృతాంతు స్వామిప్రియకా
ర్యనిరూఢబుద్ధిమంతు న్ననుపమధైర్యహిమవంతు నతిబలవంతున్. 934

ఉ. శ్రీరమణీశుభూధరశరీరుని ధీరుని గీశసైనికా
ధారుని నిర్వికారుని సదాగతిముద్దుకుమారునిం గడుం
గూరిమితోడఁ గన్గొని కవిప్రియదాయకచందనాఖ్యమా
నోపయశంబు గైకొనఁగ నూత్నుఁడ వయ్యెదు రమ్ము చెచ్చెరన్. 935

వ. అని ససంభ్రమంబును సప్రేమంబును సస్నేహంబును సగౌరవంబును సబహు
మానంబునుగాఁ జేరఁ బిలిచి కార్యగతానిరూపణంబుగా నిట్లనియె. 936

గీ. ద్రోణధాత్రీధరము కడుదూరమందు, గలుగుసంధానసౌవర్ణ్యకరణులును వి
శల్యసంజీవకరణులు సరసులుగ, రాత్రు లయ్యోషధీనికరము వెలుంగు. 937

వ. సర్వసేనామూర్ఛాసమయంబున జాంబవంతుం డెఱింగించినచందంబున దూరంబును
మార్గంబును లక్షణంబును నీ వెఱుంగుదువు. 938

సీ. ఈవల నావల కినుమాఱు మున్నూఱు దాఁటనోపుదు పయోపధికడంక
నమితవేగంబగు నర్కుని తేరిగుఱ్ఱంబులతోడఁ బాఱంగ నేర్తు
భూనభోవలయంబు పూర్ణంబుగా మేనుఁ బెరిఁగింపఁ గడు నేర్తు బిగువుగాను
బాలలీలాప్రౌఢి భానుబింబము నైనఁ బట్టి చూడఁగ నేర్తు ఫలముభంగిఁ
దెత్తు వేసీమలోనిప్రవృత్తి నైన, నట్టి నీకెన్ని యంతరాయములు గల్గ
నేని వారించి సంజీవనీనగంబు, నిమిషమాత్రంబులోనఁ దేనేర్తు వనఘ. 939

గీ. అనుచుఁ ముదమంది యతఁ డమ్మహౌషధీవిశేష మారసి తేఁదలంచినఁ దదీయ
ముఖవికాసముఁ గాంచి రాముఁడు ప్రహర్షమగ్నుఁడై యిట్లనియె హనుమంతుతోడ.

శా. చంద్రద్రోణధరాధరాగ్రవిలసత్సంజీవని న్యాంబరీ
సాంద్రద్రోహాల విఘ్న మేమఱక కీశశ్రేణి యగ్గింపఁ బ
క్షీంద్రుం డయ్యమృతం బజయ్యుఁ డగుచున్ హేలాగతిం దెచ్చిన
ట్లింద్రారాతుల గెల్చి తెచ్చి యిపు డిమ్మా దాన విఖ్యాతమ్మునన్. 940

క. భూపాదితము లాఘుగసుము, నోవేగము లాఘుగసుమనోభవ యెట్లు
న్నీవెసకుఁ జాలుననఁదగ, దేవరవున్నైనఁ దీర్పు మీకార్యంబున్. 941

క. అనుటయు మేరువుగతి మే,నునిగిడ్చి నరేశ్వరుం గనుంగొని సంజీ
వని దెచ్చెద నరుణోదయ,మునకు న్మనుగాఁగ నగల మునుఁగను మింకన్. 942

వ. అని యనుజ్ఞ వడసి. 943

క. అక్షణమునఁ గపులక్ష్మీ,ణక్షణులై విజయలక్షణంబులఁ బొగడం
బక్షీంద్రుపగిది నిజవా,లక్షేప మొనర్చి దాఁటె లవణపయోధిన్. 944

వ. దాఁటి యొగసి మిన్నుముట్టి యుత్తరాభిముఖుండై. 945

క. ప్రకటలవణాంబునిధిఁ బ్రి,చ్చకగుంటవిధంబు గాఁగఁ జూపట్ట నగ
ప్రకరంబులు దినకరుం దొం,తికడవలై కనఁబడఁగ నతిత్వరితగతిన్. 946

సీ. బహుదూరగ మాద్రోణపర్వతం బేక్రియఁ జనువాఁడనో యనుసంశయంబు
యక్షరక్షఃప్రభయంబు మార్గం బొక్కరుండ నెట్లొకో యనుగుండెదిగులు
నాలస్యమునకట్టి యంతరాయంబులు తోఁచునో యనెడునాలోచనంబు
నమ్మహౌషధుల రయంబున నెవ్విధిఁ గనుఁగొందునో నిసి ననుతలఁపు
నించుకయు లేక నిజరయాహీనరణమ్ము,బ్రహ్మలోకంబువారికి భయముగూర్పఁ
బూతసంజీవినీసమానీతబుద్ధి, నరుగు పవమాననుతుని లోకైకనుతుని. 947

క. పోరిఁబోరి సుర లగ్గించుచు, విరులు గురిసి రమరదుందుభిధ్వానంబు
ల్గరము మొఱసె త్రైజ్యసమా,కరుఁడై సుతు నెదురుకొనియెఁ గరువలికరుణన్. 948

వ. అంత నయ్యాంజనేయుండు నిరంకుశద్వీపంబు కుశద్వీపంబు గడచి యెడనెడ వినోదంబు
లగు నదీనదంబులను హిమానీపిహితచ్ఛదంబులై పాలసముద్రంబునుం బోని యభిన
వంబు లగువనంబులను విశేషంబు లగుఘోషంబులును మహోత్తుంగంబు లగుమహీ
ధరశృంగంబులను గతమునిజనతాశ్రయంబు లగు నాశ్రమంబులును జూచుచు నేక
నిశ్చయంబునం జనునవసరంబున. 949

గీ. పంక్తికంధరుండు పనిచిఁ కంధర, పఙ్క్తి వానికృతకబహుళమైన
కాఁగూర్చి యుండుఁ గాలనేమి జపంబు, సలిపె నిక్కపుంజటిలునిభంగి. 950

సీ. మకరందరసతుందమధుకరనికరఝంకారశుభకరత్సామగానంబు
సహకారకిసలభక్షణపృథుక్షణప్రతిక్షణకుహూకారపికవ్రజంబు
లంబబింబారుణలసనాళిలంబభాషాకమనీయశౌకాకరంబు
సమబాలతృణభక్షణదక్షసలచంక్రమణసుమనోహరహరిణపృథుకంబు
గావన మొనర్చి యచ్చోటఁ గపటవేషధారియై దనుజాధమాధముఁడు కాల
నేమి తప మొనరించెడు నెలవు గాంచి, యంతరంగంబునం బవనాత్మజుండు. 951

క. మును సంజీవనిఁ దెంబో,యిఁకతఁడె నిర్వహముఁ గాన నే మార్గమునఁ
ప్పినవాఁడనో యిచ్చ్మనికత,మునఁ దెలియుమనఁచు దాసి ప్రమోక్షేనీతిన్. 952

క. ఇక్ష్వాకుకులంబున భీమప్రత్యేపుఁ డపూర్వశైవనాంకురఘో
రత్న్యేశధారి లయానము,యాత్న్యేశగళుండు రాముఁ డసురవరులకున్. 953

క. అతనితమ్ముఁడు లక్ష్మణుఁ, డాతతయూర్ధ్వనశాత్ముఁ డగుటయుఁ దెలుపన్
గూఁత నగుట సంజీవని, దేతెమ్మని పనుప వచ్చితి నన్నని వాధా. 954

వ. అని తదీయ సమయప్రకారంబు సవిస్తరంబుగా నెఱింగించి వెండియు. 955

క. వచ్చితి మార్గము దప్పితి, నిచ్చట నినుఁగంటిఁ గ్రోవ యెఱిఁగించి దయం
బుచ్చి మదిగాక కొలఁకొకఁ, డిచ్చేరువనున్నఁ జెప్పవే దగఁగొంటిన్. 956

చ. అనుటయు సంతసించి దనుజాధముఁ డెంతయు దివ్యదృష్టిచేఁ
గనుఁగొను వానిపోలికి మొగంబొకయించుక యెత్తి చూచి పా
వనిఁ గని సర్వముం దెలియవచ్చెను మామక దివ్యబోధచే
నినవిభ తేజులర్ద్ధశరంధేశుతనూజుల కింక మేలగున్. 957

గీ. వారు పితృవాజ్ఞ చెల్లింప వచ్చినారు, వచ్చి ఘోరాటవిఁ జరింపఁ జొచ్చినారు
తాటకాత్మజపంక్తికంధరులు ఖలులు, హెచ్చి వారి నదటు మోసపుచ్చినారు. 958

వ. వంచించి సీతాపహరణంబు గావించుటయును వనచరసహాయులై సేతుమార్గంబున లం
కాపురంబుపై విడిసి. 959

క. ఉద్ధితవిస్ఫారంబు హ్మ,రిధ్రస్త్రీశుతిఫ్రటుబధిరీభూతగతిన్
యుద్ధ మొనరించి పిదప న్మిద్ధతఁడై లక్ష్మణుండు మృతునివడు వునన్. 960

ఉ. రావణుశక్తిఁ గూల సుకరంబుగ నాతనిఁ దెల్పవేడ్క సం
జీవనిఁ దేర నీవిటుకుఁ జెచ్చెర వచ్చి తెఱుంగుదుం దదీ
యావసరంబు లేదు విమలౌషధరాజము లేనొసంగుదుం
ద్రావుము నీరు నీ వతిమృదంబున నిర్మలాకరంబునన్. 961

వ. అని పలికి తదీయాంతరంబున మకరంబు మెలంగుట దా నెఱుంగుం గావున. 962

క. అకలంకునకామాయికుఁ,డు కరాంగుళిఁ జూపె నటు మడువొక్కండు
న్మకరాకరతుల్యమును హి,మకరాతపఫేన మగ్రమకరాకరమున్. 963

క. చూపుడు రంభాకారం,భాషణసక్రమకతీంభాగం బగున
వ్వాపిఁ గనుంగొని యపుత్రుక్ప్రతాపోశబద్ధి డిగ్గి మున్వేసడిగ్గెన్. 964

క. కడఁగి కొలనఁ గాల్సేతులు, గడిగికొనఁ దలంచి మించి కరువలికొమరుం
డడుగిడు డిగ శాపచ్యుతి, నడిగెడుగతి మకరి యాతని యడుగుం బట్టెన్. 965

క. అలసత వాఁ డెఱుఁగఁడు దృగ్బలముఖుఁడు గూర్మి క్రీతమి రుతమగు మకర్
జలములు రాఁ గుత్తుకఁ ద్రేపుల ద్రోవు బవనజుఁడు దవుల్కాఁ జేరన్. 980

సీ. వనగజంబుల గ్రసించిన నాఁ గావరే యనుభంగిఁ బద్మగంధ్యంబు సొచ్చి
నెలనెలనిరుఁగొల్లు నెలకొన్న కృపఁ గాడ నెల యనుభంగిని నింగిఁ జూచు
ధ దుండు సదయుండై నను దాఁచు ననుమాడ్కి నుత్తరాశ మునింగ నొదిఁగియుండు
జలచరం బలుకొంది స్థలచరం బయ్యెనో యనునట్లు లోనికిఁ జరిగి నిలుచు
రామకార్యంబునకు నంతరాయకారి, నైతివిని పంకనిగ్రహగ్రస్త యై పోల్కిఁ
భ్రాగలు మిగులఁగ వెడవెడబురదఁ ద్రొచ్చు, మొనసియూపిరి వెడలక మ్రుసలి మొసలి

వ. మఱియు ననేకవిధంబులం బరితాపంబు నొందుచుం బరిభ్రమింపం జొచ్చెఁ దత్సమ
యం బర్ధరాత్రం బయ్యె రక్తఘస్మరంబుకతంబునను గుముదకుముదంబువలనను
జక్రప్రబోధకారణ బునను భాస్కరోదయావసరంబునుం బోలె 981

క. వనచరుఁడ నేను మకరము, వనచర మటుగాన దుఃఖవననిధితీరం
బునఁ జేర్పఁగలదె యనుతీ, రునఁ బవనసుతుండు దాని రోధముఁ జేర్చెన్. 982

ఆ.వె. ఇట్టు గట్టుఁ బెట్టి దిట్టు లురుచుసుడి, గొట్టుపట్టి దాని కొట్టుఁ బట్టి
బిట్టు చించి రక్తపిహితశరీరుఁడై, వెడలె నినఁడు మబ్బు వెడలుకరణి. 983

వ. ఉపాయంబున వెడలుటయు నయ్యాపగాతటంబున. 984

సీ. తాటంకరుచిభగద్ధగితంబులగు చెక్కుటద్దములు మకరికా వ్యాప్తములుగ
ముఖసరోజంబున మూఁగెడు భ్రమరకంబులమాడ్కి భ్రమరకంబులు నటింప
వలిపంపుఁ బట్టుకంచెలఁ జిక్కుటిలఁ జేయుతోరంపు హీఁకుఁ జందోయి గుబ్బలు గఁ
గమికొన్న కామాంధకారంబు వెన్నంటు కైవడి నూగారు దలకట్టు దనరఁ
దోవల మకరందబిందుసందోహ మురల, కరణిసంతోష భాష్పముల్ గ్రమ్ముకొన్న
కన్నులమరంగ నన్నుల మిన్న యనఁగ, సౌష్ఠవసుపక్వ బింబాధరోష్ఠ మెప్ప.

క. కాసారలక్ష్మి భువనోల్లాస నొసర్చితివి దుర్జలచరము చావం
జేసి యని వటునిఁగన విచ్చేసెనఁగ మకరి యొక్క చేడియ యగుచున్. 985

ఆ.వె. ఎదుర నిలిచి మ్రొక్కి యేధాన్యమాలిని, నొక్కమౌని కోపయుక్తిఁ జేసి
మకరిరూపుఁ దాల్చి మడువునఁ దుండితి, నిచటనెన్ని యేని యేండ్లు బట్టి 986

వ. అని తనరుం బూర్వసంచిత మునిశాపం బెఱింగింపం దలంచి యిట్లనియె. 987

క. అస్ఖలితాగమవిదుఁడవు, నస్ఖలితాహావునకున్ మహాత్ముండవు శు
ద్ధాస్ఖలితోక్తికీర్తిన, య్యస్ఖలితబ్రహ్మచారి కప్సరస యనున్. 988

క. చండకిరణసంకాశుఁడు, చండక్రోధుఁడు తపోవిచారుఁడు శాండి
ల్యుం డను పేరిటి మునినాథుం డొకతఁడె నన్నుఁ గని పృథుసుమశరహాటక. 991

గీ. మనము గలఁగ ధాన్యమాలినీప్రముఖపువ్వు, మాలినీ తపంబు మాలి నీకుఁ
జిక్కుపడితి నింకఁ జిక్కులు వెట్టకు, తీయవిల్తుబారి కీయకుమని. 992

వ. చిడిముడిపాటునం దమకించిన యద్ధరణీదేవతాసత్తమునకు నుత్తమంబును సంప్రా
ర్థనంబును సవినయంబునుం దేటపడునట్టి హితవచనోపన్యాసంబునం జిత్తంబు
మెత్తపడమి యెఱింగి. 993

క. ఏను రజస్వల నన్నుక, భూసురగుణ యెవ్విధమునఁ బొరసెను స్నానం
బైనఁ జను దెంతుఁగ, వయ్యును, నానట్టులు చేయుమని యనఘుఁ డతఁ డనుగన్. 994

సీ. ఏగాన మిందిరావ్యాదయోళుప్రాదయంబు గరఁచి విమానంబు గలుగఁజేసె
నేగాన మద్భుతం బెసఁగ రాల్గరఁగించి కట్టిమ్రాఁకుల నవల్ల్యుట్టఁజేయు
నేగానము భవాబ్ధి నీఁద నూహించు మానీంద్రులకైన మోహింపఁజేయు
గంధర్వకామినీగణముల నేగాన మించుకేనియుఁ దలఁపొత్త నీదు
దట్టిసంగీతమొకసమయమున గంధమాదనంబునఁ దగుతాళమానముగను
విస్తరింపఁగ నచటికి వేడ్కవచ్చె, రావణుండు త్రిలోకవిద్రావణుండు. 995

క. వచ్చి నను మెచ్చి నలదని, యచ్చపడం దెలుప వినక యనిలహతలతా
వచ్చలిత నన్నుఁ గైకొని, యచ్చపలుఁడు దేలియాడె నభిమతగతులన్. 996

క. అతనికతన నాకదుపున, నతిబలుఁ డతికాయుఁ డనెడునతఁడు వొడమినన్
సుతుఁగొని యప్పటితుఁ డసురపతి సనియెన్ నైజయోధపరివృతుఁ డగుచున్. 997

గీ. అంత నాలవవాఁడు నీరాడి వలిప, తెలిమడుగుఁ దెలిపూఁతయుఁ దెలియలరులు
నలర నేనున్న శాండిల్యుఁ డనియెడి జడధారి చనుదెంచె నలపున్కదారి యనఁగ.

వ. వచ్చి నిజతపోమహానుభావంబున నాదుండగం బెఱింగికొనినవాఁడు గావున నపరిమిత
క్రోధదుర్నిరీక్షుండై. 998

క. ఇంతుల పాపమునకుఁ గుదుఁ, లింతుల యన్నృతప్రవచన లింతుల కఠల
య్యంతు లోకనికిం గూర్తురె, యింతుల నమ్మంగఁ దగునె సుమేధునకైనన్. 999

వ. అని నన్నుం గనుంగొని. 1000

మ. మతి నన్వంచన చేసి రావణు నసుసాక్మన్య న్నవప్రీతిఁ దే
ల్చితి వీవిట్యపరాధహేతువున గాసిం బొంది నక్రంబు నా
కృతి దుఃఖస్థితి ఘోరమూర్తి వగుచుం గ్రీడింపఁ బొమ్మంచు శా
పితఁజేసె న్ననఁగీశవంశకలశాబ్ధిప్రోజ్జ్వలేందూదయా. 1001

గొని యద్భుతాహారశీల యగు న ద్ధాన్యమాలిని యంతర్ధానంబు నొందుటయుం
బరమాద్భుతక్రోధసంభరితహృదయుం డగుచు నాంజనేయుండు కల్మషక్రియా
నిత్యు దైత్యుం గనుంగొనుటయు నెఱుంగమి భావించుచు నతం డతనితో నిట్లనియె.

క. తడసితివి మిగుల నెత్తుటఁ, దడిసితి విది యేమి మంత్రతంత్రౌషధము
ల్వడ చెవవే గురుదక్షిణఁ, బడసెదవే రమ్ము నాకుఁ బావని కిటుకన్. 1017

క. గురుదక్షిణ యొసఁగెద నని, గురుదక్షిణభుజము సాఁచి గ్రుద్దిన నతఁడున్
గురుదక్షిణ నెఱుఁగ నియు, గురుఁ దక్షిణమునఁ జలంబు గొని పోయెనెడన్. 1018

ఉ. వెక్కసమై యొకింతఁ గను విచ్చి శరంతము రూపమూని యు
మ్మెక్కలి రక్కసుండు కపియూథపు శాతనఖాళిఁ జీఱెన్
నుక్కఱపగిల్చి ఱెక్కలను ముక్కలు చేసిన ధంబునిండఁ బె
రుక్కున నక్కపీంద్రుఁడు మహోద్ధతుఁ డార్చెఁ గాలనేమియున్. 1019

క. సింహప్రక్రియ వానర, సింహంబున కడ్డమేగి స్థిరధృతి ననుహా
త్సంహారణకరణఖరనఖ, సంహతుల నొప్పింపఁ బవనసంభవుఁడు వడిన్. 1020

ఉ. పాటవ మొప్ప వాలమునఁ బట్టి పదీమ సటాచ్ఛటా సము
త్పాటన మాచరించి వెస దంష్ట్రిలు దుల్చిన దుష్టచిత్తుఁ డ
త్తాటక మన్మఁ దప్పటివిధంబు దొఱంగి దినేంద్రసూనుఁడై
గాటపువైళి మొప్ప సముఖంబునఁ దం జనుదెంచి యిట్లనున్. 1021

క. అక్రీశుఁడై బాహుబలప, రిక్రశుఁ డగు లక్ష్మణుం డరిప్రకరముపై
వ్యాఘ్రశయముగఁ గనఁ దేజె వృథాక్రశము పోనేల యూనమ థకుధరమునఁదున్. 1022

క. సౌమిత్రి మూర్ఛ దెలిసెను, సామీరిం దోడితెమ్ము చయ్యన ననుచున్
రామాజ్ఞ వచ్చి యియ్యా, రామంబునఁ గంటి మఱలి రమ్మీవనినన్. 1023

ఉ. ఇంచుక సంశయించి మొగ మెత్తి కడుం బరికించి పోల నూ
హించి దినేంద్రసూనుఁ డిటు కేమిటికిం జనుదెంచు వీఁడు న
న్వంచన చేసి యీ కరణి వానరమూర్తి వహించె వీని ఖం
డించెద నంచు నెంతయుఁ గడిందిమగంటిమి యుల్లసిల్లఁగన్. 1024

క. లేలెమ్ము దురాత్మ యనుచుఁ, గోలెమ్ము విటిగాడునట్లు గ్రుద్దినఁ దఁ డీ
కీ లెమ్మియిఁ దెలిసె ననుచుఁ, గోలె మ్మన నోయ దెఱచికొని వివశగతిన్. 1025

క. పడి యుదనుజాధముఁడు గీ, ట్వడి శతకృంతుఁ డయి వేగ వానరపతిపైఁ
బడిన ఖరాయుధములఁ గడ్కవడి నొప్పించుటయుఁ గొంతవడి కద్దనుజుఁడై. 1026

ఉ. అక్కట రామలక్ష్మణుల కాపద వొందెనొ భూమిజాతకే
చిక్కు ఘటిల్లెనో మిగులఁ జెట్టలం గనుఁగొంటి వానరుం
డొక్కఁడు గట్టుఁ బట్టి పుయిలోడక వే కొనిపోవఁ జొచ్చెడు
న్నిక్కము ఘోరరూపరజనీచరభూతము గాఁగ నోపెమున్. 1052

క. ఘనవాలుఁగుబ్ధంబులుఁ, దుదిముట్ట గవచ్చె నిపుడు దుశ్శకునం బి
ట్లొదవునె రాఘవ కేమ్యాపద వచ్చెనొ యనుచు వగచి పదపడి కిమకన్. 1053

శా. కైకాపుత్రుఁడు భూమిభృద్వరధరుఁ డ్యౌరుస్పృశం గాంచి ఘో
రాకారం బిది తాలువంచు ద్విడభేద్యక్రూరసారావ మ
స్తోకక్షిప్రత చేయఁ జూచుడుఁ బరిక్షుణ్ణంబు లయ్యెన్ దిశై
ద్యాకంబుల్ గలఁగెం బయోనిధులు గట్టుల్ ప్రొగ్గె నుల్కల్ వడెన్. 1054

వ. ఆయవసరంబున. 1055

ఉ. అంబరవాణి యోదశశతాంగతనూభవ చూడు వీఁడు నీ
కుం బెఱవాఁడు గాఁడు కపికుంజరుఁ డారఘురాము దూత నీ
విం బరిమార్పఁ జూచుటపునే విడు రోషమటంచుఁ దెల్పన
ట్యాంబరరత్నవంశ్యుఁడు భయాద్భుతసంభ్రమసమ్మదాత్ముఁడై. 1056

క. కోపముతో వ్యాకులపడి, తాపముతో నహితవ్యాదయ వారణరణక
చ్చాపముతోఁ దోనయలఘు,కోపము విడనాడి యారఘుప్రభుఁ డంతన్. 1057

ఉ. పాయక రామమూర్తికి శుభప్రతిపాదక దేవతార్చనల్
చేయుచునుండె నట్లు కపిసింహుఁడు వేచని కాంచెఁ దుంగభం
గాయతదోఃప్రగాఢపరిఘాత్యుపగూహనలబ్ధజాహ్నవీ
ప్రాయికలోహితాంబుజపరాగలసద్ఘుసృణప్రవాళమున్. 1058

క. వనచరకులానుకూలము, వననిధికూలమ్ముఁ గాంచి వనచరుఁడు భవాం
బునిధి దరించుపగిది నం, బునిధి న్వేప సంక్రమించి పోయెను నెడలన్. 1059

క. హనుమంతుఁ గూల్చి ద్రోణము, దధిని వైచి, చిరాన నాగ్యఘ్నుఘణన్
దనుజవిభుఁడు దశకంఠుఁడు, పనిచె న్మతిమంతు మాల్యవంతు న్మంతున్. 1060

వ. పనుచుటయు నయ్యామినీచరవరుండు. 1061

క. పోనఁగినపస నలువదికో, ట్లసమబలాఢ్యు లసురులు సహాయులుగా స
త్తసమృద్ధి వేగి యాఁగె, న్వేప ద్రోణముఁ గొంచుఁ బోవు వీరశ్రేష్ఠున్. 1062

క. ఇట్లాఁగి ద్రోణ మేటికిఁ, బోట్లాడక విడిచి బ్రదికిపొమ్మనన్ సెడలన్
జెట్లొనఁ బిశితాశవ,కో ట్లానిఁ జుట్టుముట్టి కోయని తాఁకన్. 1063

చ. పవనసుతుండు మూర్ధధృతపర్వతుఁ డొందఱ కన్నిరూపులై
జవ మెసఁగం బదాహతుల జర్జరితాంగులఁ జేసి కొందఱం
బ్రవిమలదంతకుంతనఖరక్షురికాతతిఁ జేసి కొందఱన్
రవినిభుఁ డుగ్రదైర్ఘ్యకరంబులఁ గొందఱ బిట్టు చంపుచున్. 1064

క. రంహప్రక్రియ నసుహృత్సంహతి సంహరణలసదశనికై కడి వీ
తాంహుఁడు వాలముఁ ద్రిప్పుచు, సింహధ్వని చేసె దిశలు చెవుడుపడంగన్. 1065

వ. భైరవారావుండై యసురజీవితకాలక్షేపంబుగా వాలక్షేపంబు గావించి. 1066

క. గాలి వసుధాసుపసువుం, దూలించినభంగి నగ్గి దూదితునుకలం
గాలిచినపోల్కి సోఁకుల, గాలిసుతుఁడు వ్రేసె వేడ్కఁ గ్రాలెడునదితోన్. 1067

గీ. ఇట్టు లాకసినైఁ నిట్టట్టు పోనీక, చంపి జలధిలోనఁ జల్లు టరయ
వనచరుండు గాన వనచరంబులకెల్ల, నెరలు వెట్టె ననఁగ నెసఁగె నంత. 1068

మ. అరిమర్దాంతుఁడు మాల్యవంతుఁడు మహాహంకారఘోరాకృతి
స్ఫురితుండై గగనాధ్వ నప్పవనసంభూతుం దలంకింప స
త్వరుఁడై యుద్ధము వోయి పోవ మనుడు న్వాతూలబాలుండు ను
ద్ధురసత్త్వాతిశయంబుమీఱఁ గవిసెన్ దోర్దర్ప మేపారఁగన్. 1069

చ. మొదలఁ బదద్వయిన్ దనుజుమూర్ధము దన్నిన మాల్యవంతుఁడుం
గదలక మాల్యవంత మనఁగా నచలస్థితి నిల్చియుంట కాం
చఁదగ మహీధ్రభృత్పవనసంభవు డొక్కట నెత్తిఁ బెట్టి దు
ర్మదుఁ డగుపంక్తికంధరు సుతుముఁ జేర్పఁ దలంచెనో యనన్. 1070

క. తదనంతరమున భయదప్రదరద్రుఘణాసి ముసలపరశుగదా దు
ర్మదశక్తిప్రముఖంబులఁ, బొదివెఁ బయోధరము ధరముఁ బొదివినయాడ్కిన్. 1071

చ. పొదివిన సింహకేని వెఱఁ బొందని డెందముతోడ నాగముం
గదిసిన పింగదృష్టి యనఁగాఁ బవనప్రియనందనుండు త
ద్వదనబిలంబునన్ రుధిరధారలు గ్రమ్మఁగ బిట్టురంబు పె
ట్టిదముగఁ దన్ని దౌడలు కడిందిబలంబున నూడఁబీఁకుడున్. 1072

వ. తొల్లి గరుడవాహనుండును జక్రధరుండును నగు విష్ణువుతోడం గడంగి పెనంగి యో
హటింపని యమ్మాల్యవంతుండు వివిధమాయాజాలంబులు ప్రయోగించి నిష్ఫలం
బగుటకుఁ జింతించుచు నుగ్రశక్తి విసరి యదియును బొల్లువోయిన నివ్వెఱఁగొంది
యుండఁ బవననందనుండు దుర్ధరతమ్ము నిజవామపాశంబున నటికిఁ గిరగిరం ద్రిప్పి వైచిన

ద్రోణంబు తాఁకునఁ బ్రాణంబులు వదలి తోడి దానవులఁ దోడుచేసికొనం బోవు
చండంబున నంబునిధి మునింగె. 1073

క. హెచ్చి పవమానసుతుఁడు, తెచ్చెను విపులాంచితౌషధీయుతధరము
ద్యచ్చాయులోహితరుచిసముచ్చయముం గాంచి రాముఁ డురుచకితుండై. 1074

వ. అరుణోదయంబనుతలంపున 1075

మ. అనుమాద్యద్రుమభూజమున స్వసోదరుఁడు మూర్ఛాయత్తుఁడై యుండఁగా
నను మాద్యద్గుణభూధరంబునకె నృపతి సింహం బిట్లు చింతించె నో
యి సుమిత్రాసుత సంగరాంగణమునం దీరీతి నిక్కె డించితో
యి సుమిత్రాదిక బంధుకోటి కెమ్మై యేనెట్లు జీవించెదన్. 1076

క. ఏనిన్నుఁ గూడవచ్చెదఁ, గాని బ్రతుకనోపఁ దిక్కకొఁ దుదయింపం
గానున్న వాఁడు మారుతి నూనుం డరుదేక యున్న సుకరుం డగుచున్. 1077

తే. ప్రథితసంజీవనీరసహౌషధములఁ జేసి, వెలయులక్ష్మణముఖ్యప్రాణులు దెలివినొందఁ
బ్రాలఁజొచ్చెనినుఁడు వంశకర్తయయ్యుఁ, దల్లి పిల్లలఁ దినఁ నేమితగవుగలదు. 1078

వ. భగ్నప్రతిజ్ఞుండనైతి నని కపులంగలయంగఁ గొనిన వారలు నవిరళబాష్పధారాపూ
రితలోచనులై రందుఁగొందఱుచితవచనంబుల నాశ్వాసించినం గుదురు వడని డెం
దంబున దినకరునుద్దేశించి కలుషించి. 1079

తే. హరితపనుఁ డుగ్రమూర్తి మాయావినోది, పద్మినీకాముఁ డుఁగు సత్ప్రభాషనోది
లోకహితవర్తి కువలయశోభకారి, తపనుఁ యీతని లోకబాంధవుఁ డనంగ. 1080

ఉ. మిత్రుఁడు గాఁడు నాకితఁ డమిత్రుఁడు నన్నుఁగరంబు భూమి భృ
న్మాత్రుని గాఁ దలంచె నతిమాత్రమదీయ శరాగ్నిహోత్ర మి
ద్ధాత్రివడక నిప్పుడు పతంగము బోలెఁ బతంగు నేర్చి లో
కత్రితయంబుఁ జీకటులఁగమ్మఁగఁ జేయదె యద్భుతాకృతిన్ 1081

క. అనిరౌద్ర మెసఁగ రౌద్రాస్త్రనిరూఢప్రహతిఁ దరణి ధరణింబడనే
యనిరాపి చెదు రాముఁ, గనుఁగొని యిట్లనిరి భల్లుకప్రభుముఖ్యుల్. 1082

మ. నృపచూడామణి వాయునందన సమానీతప్రశస్తౌషధీ
విపరీతచ్ఛవిగాక భాస్కరకరావేశంబుగాఁ దోఁప దీ
నపలాపింపకు దెల్లవారెనని ధైర్యస్థైర్యచిత్తుండవై
విపరీక్షింపుము మూఁడు యామములు వర్తించు నిజంబింతయున్. 1083

క. భూమీశ యిప్పుడు పాల్గవ బాము ప్రవేశించె నుదయసమయం బగునే
నీ మేయిఁ దారకలలరునె, కోమలభూమిరుహకోటిఁ గూయునె పులుఁగుల్. 1084

క. వ్రచ్చెనెదిరించు దనుజులఁ, దెచ్చెను సంజీవనీ లతికలిప్పుడు నీ
కిచ్చెన్మోదము మరల, న్వచ్చె న్మహీనాథలక్ష్మణప్రాణంబుల్. 1085

క. మనమార న్మనమారుతి, వినుమానికమునకు మున్న వినుమావచ్చె
న్మనుమానవపతి లక్ష్మణుఁ, డనుమానము మాను మాత్మ నణుమాత్రంబున్. 1086

క. అంబరమణి సంశ్రితులకు, నంబరమణి కొలఁతు గాని యాతనిఁ బడనే
యం బరికింతువె డింపుచ,లం బెమురఁగఁ బనుపు కపిబలము మారుతికిన్. 1087

ఉ. సందియ మేల యొక్కనిమిషంబునకుం జనుదెంచు నమ్మరు
న్నందనుఁ డౌషధంబులు ఘనంబుగఁ జేకొని వాపు నమ్మహా
నందము నొంది రామనరనాథుఁడు కీశుల భల్లుకేశులం
గ్రందుగ వానరేంద్రు నెదు రన్నియమించె ననేకకోటులన్. 1088

వ. అయ్యుత్తరక్షణంబున. 1089

సీ. ద్రోణధాత్రీధరద్రుమసంచలనపతత్సుమములాచార లాజములు గాఁగ
విపులకర్కశఘోరరిపుభయంకరదీర్ఘతరవాలయష్టి కైదండ గాఁగ
సదమలమణివిభాచ్ఛాదిసంజీవనీక్షోణీధరము వెలిగొడుగు గాఁగ
దగ నెదుర్కొనవచ్చి తనచుట్టు నడిచెడి తరుచరపతులు కింకరులు గాఁగ
నిజరయప్రజనితమహోన్నిద్రభూరి, పవనసంచారములు బరాబరులు గాఁగ
బ్రకటసంజీవనీధనరాశిఁ గొనుచు, క్షిప్రగతి మీఱ వచ్చెఁ గపిప్రభుండు. 1090

వ. వచ్చి యమ్మహామహీధరంబును యథోచితస్థానసుస్థితంబు గాడించి. 1091

క. తివిరి కపు లభినుతింపఁగఁ, బవనసుతుఁడు మోడ్పుఁగేలు ఫాలతలమునం
దవిలిచి సరభసగతి రాఘవునింగని యిట్టు లనియెఁ గడు ముద మొదవన్. 1092

ఉ. విఘ్నము లెన్ని యేని ప్రభవించినఁ ద్వద్దయ వాని మామకో
పఘ్నముఁ జేసనీక యొకభంగిగ మందులు దెచ్చినాఁడ శ
త్రుఘ్నవనౌకసావలికిఁ, దుష్టి కడున్ జనియింప నింక శ
త్రుఘ్నుని తోడఁబుట్టువును దూర్ణము తెల్పెద మేలగా నిలన్. 1093

మ. అనినం బెన్నిధిగన్న పేదక్రియ నయ్యర్కాన్వయాధ్యక్షుఁ డా
హనుమంతున్ బిగియారఁ గౌఁగిటికి దీయం బొంగి మిన్నందె నా
ఘనుఁ డావేళ సుషేణుఁ డోషధులఁ జక్కం జూచి తా నేర్చి తె
చ్చినసౌమిత్రి ససంజ్ఞుఁడై తెలిసె నక్షీణప్రభాపూర్ణతన్. 1094

క. పృథునిద్రితుఁడు మేల్కను,విధమునఁ దెలిపగని రామవిభులసదంఘ్రి
గ్రథితశిరస్కుఁ డగుడు భూ,మ్యధినాథుఁడు కౌతుకమున నాలింగనమున్. 1095

వ. కావించె నయ్యోషధీపతిం గనుంగొని వనచరు లపరిమితపరితోషు లైరంత హనుమం
తుం గని యనుగ్రహాతిశయంబున లక్ష్మణాగ్రజుం డిట్లనియె. 1096

గీ. తొల్లి ఖగనాథుఁ డమరులఁ ద్రుళ్ళడంచి, తల్లి వినతను గుణవతీమతల్లి సంత
తమ్ము ముదమొంద నయ్యమృతమ్ముఁ దెచ్చె, కరణిఁ దెచ్చితి సంజీవకరణి వత్స.

చ. వనచరవర్య నీవబలవంతుఁడవు న్మగవాఁడ వెల్లచోఁ
గనఁగొనిరమ్ము సీత ననఁ గాలిచివచ్చితి పంక్తికంఠుప
త్తన మిపు డౌషధంబులు ముదంబునఁ దెమ్మనఁ గొండఁ దెచ్చి తె
ట్లు నతి యొనర్ప నేరుతు పటుప్రవరా నిను నీగుణంబులన్. 1097

క. మారుతి యేగతి నీఁగుదు, నీ ఋణ మస్మత్కులంబు నిలిపితివి సమి
ద్ఘోరస్థలిఁ మూర్ఛపడిన, యీరాజకుమారు నెత్తి యెంతయుఁ గరుణన్. 1098

వ. రెండవలోకేశుండవై లక్ష్మణప్రాణంబులు సృజియించితివన్న యని కొనియాడు
చుండె, నప్పు డమరు లమృతరసాస్వాదసంబునం బరితృప్తి నొందిన ద్రోణసానుమ
త్సానుప్రదేశంబుల ఫలరసమధురమధురసానుభవంబునం బ్లవంగపుంగవులునుం బ్ర
మోదమగ్నమానసు లైరి. 1099

మిత్రసుపుత్రసుమిత్రాపుత్రాదులు నిజరయంబుఁ బొడఁగని ప్రాగ్దక్
ధాత్రీపతియానతి నా, ధాత్రీధర ముంచివచ్చెఁ దగ నెప్పటిచోన్. 1100

. జంఘాలుండగు నమ్మరున్నందనుండు స్థూలజంఘులకు స్థూలజంఘాదు లనేకులు
పొదివినం జిక్కువడక యెక్కువెుగిఁ జిక్కువఱచి యుక్కడంచి యమ్మహా
షధీమహీధరంబు యథాస్థానస్థాపితంబు గావించి వచ్చినంతట. 1101

క. తన కెంతేవాసి మిగులఁ, దనయంతేవాసి ద్రోణధాత్రీధరముం
గొనితెచ్చి వైచివచ్చుట, విని కనఁగొన వచ్చెననరవి యుదయమయ్యెన్. 11)2

ఇట్లు భానూదయంబైన నెల్లకపులు, నుల్లసంబున రాఘవయుక్తు లగుచుఁ
గయ్యమునకు నాయత్తులై కాలు ద్రవ్వ, చుఁటు చారులచేతను వింటఁ జేసి 1103

. విషాదవేదనాయత్తుండును బశ్చాత్తప్తుండునునగు దశకంఠుండు. 1104

క. విక్రాంతత్వముడిగి వైరక్రమము దొఱంచి విగతరాక్షసుఁడై ని
ర్వ్యగ్రుఁ డన్వచకితశక్రున్, శక్రుం గని యిట్టు లనియె శోకితుఁ డగుచున్. 1105

చ. గురువర రామతోడఁ బగఁగొంటి సహోదరుఁ గుంభకర్ణు సు
స్థిరబలశౌర్యపూర్ణు బలజిజ్జితు నాత్మసుతుం బ్రహస్తభీ
కరతరవాస్తు సైనికనికాయపతిం గడతేర్చికొంటి నీ
తిరతు నిక్షిపణం బడపితి న్వినఁ దోఁటిఁ ఖ్యాతి చెల్లునే. 1106

క. అతికాయమహాకాయా,ద్యతిలోకపరాక్రములు లయంబందిరి నా
గతి నీవ యెఱుక నేనే, గతి నహితులఁ గూల్చి హితులగతి నంపింతుక్. 1107

క. శుంభనిశుంభసదృశులు, కుంభనికుంభు లనిలోనఁ గూలి రహితదో
స్తంభనిగృహీతు లగుచుక్, దంభముగా దెట్లువారిఁ దలఁపఁగవచ్చుక్. 1108

క. హితసుతసోదరబంధుస, హితులహితులచేత దితిజు లీల్గిరి పాపో
హిత యిష్టు నీకుఁ బ్రసమీ,హిత మిది యని తెలుపు మాకు భృగుకులవర్యా. 1109

క. పత్తనముం గాలిచి రఃప్పిత్తముచే ఘోరగతిఁ గపిప్రకరము లా
పత్తున మిత్తికిఁ జిక్కి తి, నిత్తఱిఁ జే పట్టకున్న నెవ్విధిఁ బోదుక్. 1110

వ. అని సరవానరాక్రమణంబును నిజపరాజయంబునుం జెప్పి. 1111

క. స్రగ్విభవము విప్రక్రతు,భుగ్వనితాకృశము సుంతపాలుపఱుపండక్
దిగ్విజయము త్వదనుగ్రహ,దృగ్విభవత గాదె యున్న తేజమునొందెన్. 1112

ఉ. కావున భూమిసుత్చరనికాయసమాశ్రితు లన్నరాధము
ల్లావు దొఱంగి సిగ్గటి చలంబు మహీసుతలోన డించి నా
పోవుచుఁ బోవుకట్లు భృగుపుంగవ యెట్టు లనుగ్రహించెదో
నావుడుఁ బంక్తికంఠువదనంబులు గన్గొని కావ్యుఁ డెంత యున్. 1113

క. బోధించి బుద్ధి చెప్పినఁ, గ్రోధించినయట్టి సురవిరోధిం బ్రమనో
వ్యాధినిరోధిం బంక్తిశి,రోధింగని నవ్వుచుక్ గురుం డిట్లనియెక్. 1114

క. ద్విక్రవభులు దలంకఁగ హుత,భుక్రీతుమగు హోమకర్మము నొకఁడు మాంసా
సృక్ప్రకటిత మొనరిచి యస,కృత్ప్రబలుఁడ వౌదు వింక దివిజులకైనక్. 1115

ఉ. తూర్ణముగాఁగ వేలిమి యదూషితమై విధివంతమై సుసం
పూర్ణమునొంద నం దసురపుంగవ వర్మశరోరుచాపని
స్తీర్ణరథంబు పుట్టు నది చేకొని వైరులబాడి వెట్టినం
జీర్ణపలాశము ల్పవనుచేతఁ బఱెంగడు నోహటింపరే. 1116

క నరు లెంతటివారివా,నరులెంతటివార లీశుఁడయిన నైశ్వా
నరుఁ బూజింపు గుహాలఁగి, న్నరులు పొగలు మిగులఁ బొగుల నరతరసాసీ. 1117

క నిష్ఫ్నకృతిగాక వేల్మి యు, నిష్పంబగు నేని రిపుల వేఁచెదు నవుమ
న్విఘ్నము గల్గిన శమనో,పఘ్నమునకుఁ బోదు విది నిబద్ది తెలియుమా. 1118

వ. అని తన్మంత్రంబును దదాహుతిప్రమాణంబును దత్పకుప్రకారంబును దన్నిధానంబు
ను దద్విధానంబును యథోచితంబుగా నెఱింగించి సమధిగతకాలచక్రుం డగు
శుక్రుం డంతర్ధానంబు నొందుటయు 11

శా. ఉగ్రాంశుప్రతిమానతేజుఁ డగు నయ్యుర్వీసురాగ్రేసర
స్వగ్రాదేశముఁ జాలనమ్మి నిజధైర్యస్ఫూర్తిఁ బోఁద్రోఁచి నీ
లగ్రీవుం బరమేశు నీశ్వరుఁ గడున్ లక్ష్యంబు గావించి పం
క్తిగ్రీవుం డపు డగ్నికార్యకరణాంగీకారచిత్తాబ్జుఁడై.

వ. పెద్దయుఁ బ్రొద్దు చింతించి యేకనిశ్చయుండై.

మ. కుహనోత్కంఠుఁడు పంక్తికంఠుఁ డసదృక్షోణీభృదంచద్గుహా
కుహరం బొక్కఁడు చొచ్చి యందు హుతభుక్కుండంబుఁ గల్పించి దై
త్యహితుం డెల్లెడఁ గాపువెట్టి పలరక్తద్రోణికల్గూర్చి ని
ష్ఠ హుతాశిస్సముకొల్పి వేల్వఁదొడఁగె న్సమ్యగ్విధానంబునన్.

వ. దారుణహోమకర్మఠుండును రక్తగంధమాల్యాంబరధరుండును మాంత్రికుండునై
కుక్కుటమార్జారాదిఖగమృగనివహంబులు సంగ్రహించి.

క. దుర్భగశస్త్రాస్త్రంబులు, దర్భలుగా రక్తమాంసదధ్యాజ్యముల
న్నిర్భీతి శ్మశానమహీ,గర్భాభీలాగ్ని వేల్వఁ గాఁ దొడఁగుటయున్.

క. గ్రహరాజపరిగ్రహణా,గ్రహమున వెల్వకు తమఃప్రకారమున భయా
వహ మగుచు నెల్లయెడ హుత,వహనిర్గతమైన ధూమవర్గము వెడలెన్.

సీ. వనచరుల్మొగలంటు మనలంకఁ గాల్చుమన్నారేమొ యని దైత్యనారు లడల
ఖచరకాంతలు దశకంఠుఁడు పంపిన కాలిసంకెలలంచుఁ గదల కొదుగ
బిలములలో నున్న యెలుకలగతి నద్రిగుహలఁ గిన్నరుల ముక్కులు బిగింప
నసురాధముమహోపహతి మిన్ను ముట్టి ఘనించి రోదసి నాక్రమించె నగ
హోమధూమంబు వెలువడి యుగ్రముగను, గపులు నివ్వెఱపడిరి తత్కారణంబుఁ
గనుపడఁగ విభీషణునివలనఁ దెలిసి, జన్యరిపుమూర్తి రామరాజన్యమూర్తి

శా. తద్ధోమప్రవిఘాతసంఘటనబద్ధస్పర్థుఁడై పంచెనం
చద్ధాత్రీధరభూరిసాయుల మహోద్వృక్షాయుధాగారులం
బద్ధాశ్యంబుధరావళీమళికితాపవ్యధసిరోధశా
వ్యద్దిగ్భ్రమదబ్జసంభవమహాయావ్యాపారవిస్తారులన్.

మ. నలనీలాంగదవాయునందనసుషేణక్రోధనాథు ల్మహా
నలసంకాశులు కీశులాత్మగణము నానాదిక్పరిస్ఫోటనో
పలవిక్షేపులు కామరూపులు దృఢప్రాకారదుర్గాంతమున్
ఖలరక్షశ్శరణస్థితము స్ఫయదలంకాపట్టణప్రాంతమున్.

క. పడిఁ జేరి యాహవంబులఁ, గడిదేఱిన వారి నూరి కావలివారిం
గడతేఱిచి ప్లవగులు బడి, బడిఁ దేఁకుల నద్రిసన్నిభముల నిభములన్. 1129

గీ. విఱిచి ప్రోవులు వెట్టుచు విసరికొనుచుఁ, గోప మొదవంగ ఘోట్టాణకోట్టిఁ జదిపి
యంగడులు రచ్చకొట్టయు లవనిఁ గలిపి, లంక సకలంక నిట్లు కలంచి యాడి. 1130

క. వెండియు వెండియుఁ బైఁడియు, నిండఁగ నుండెడు నిశిథినీచరవిలస
ద్భాండాగారము లసద్భ, త్భాండాగారములు నీఱుగావించి వడిన్. 1131

వ. గృహారామసీమాయనోహరప్రదేశంబులు, గలంచి యాయాయుస్థలంబులఁ ద్రిమ్మరి
యెంతయును దారుణరావణహోమస్థానంబు గనుంగొనలేక తొట్రుపడుచున్నంత.

క. రావణుఁ డీమెడ వేలిమి, గావించెడు ననుచు సరమ కడుఁగొనములవెం
దీని విభీషణు పట్టపు,దేవి యుపాంశుగతిఁ దమకుఁ దెల్పి చనుటయున్. 1132

క. బిలముఖమునఁ గీశులు బిల, బిలఁ జని యొకచోట నైలబిలగర్వహరున్
జ్వలనసమర్పణధృతచరు, కలితకరు న్వింశతికరు ఘటితపరికరున్. 1133

క. కని జెట్టి జీమలుచుట్టినభంగిం బ్లవగు లురవడిం గవిసి చలం
బున నెన్నియేని బాధలు, పొనరిచినఁ జలింప కసుగపుఁ గవుఁడు ధృతిన్. 1134

శా. నిర్విఘ్నంబుగ హోమకార్య మనుసంధింప న్మహోక్రోధు ల
య్యుర్వీసుత్చనాథయోధులు పురస్థోమాకృతస్థాలి కా
దర్వీస్రుక్స్రువసమిద్ధాజ్యపాత్రాదికా
పూర్వప్రాకటహోమవస్తువితతిం బోకార్చి వెల్లార్చిరన్. 1135

క. వదలని మానంబున దశ,వదనుఁడు నిష్ఠ మెయి హవ్యవాహుఁ గృశానుం
బదిలుఁ డయి పూజసేయుచుఁ, గదలక యుంటఁ గని రోషకఠినాత్ములై. 1136

క. కనకాద్రి నినుపసమ్మెటలను గొట్టినమాడ్కిఁ గడుఁ జలంబునఁ గపుల
ద్దనుజాధము దృఢదేహము, ఘనముష్టిప్రహతి నొంచి కదలక యున్నన్. 1137

వ. హోమవిఘ్నముకై యడిచియుం బొడిచియుం గఱచియుఁ గద్దనుజాధముసం దించు
కయు సంచలనంబు గానక కాననచరులు నివ్వెఱఁగంది కంది కుంది రయ్యెడ

క. శుద్ధాంతఃకరణుఁ డగుచు, శుద్ధాంతము సొచ్చి వాలిసూనుఁడు నయసం
వృద్ధాసుర వృద్ధ వయః, శుద్ధాంతముఁ బంక్తికంఠు శుద్ధాంతంబున్. 1138

తే. చేరి తత్సుందరీపరిచారికాస,నాస్రసమగ్రప్రపూర్ణ నేత్రాంత మగుచు
నొదుఁగ మందోదరికబరి నొడిసిపట్టె, భయదయమపాశసదృశోగ్రవాలుఁ డగుచు

వ. మందారకుసుమదామసంబంధం బగు మందోదరీచికురబంధంబు వామకరంబునం
బట్టి రక్షోరాజ్యలక్ష్మిం దిగిచినచందంబున మణిమయోన్నతాసనంబు దిగం బడఁ

ద్రోచి శోణితబిందుసందోహంబు కంఠహారముక్తాఫలయుక్తంబై నేలరాల భద్ర
దంతావళంబు మృణాళనాళంబునుంబోలె నీడ్చికొని పోయి దశకంఠు సమక్షం
బునం బెట్టి నిర్దయుండై. 1142

క. ఆజ్ఞదెలిసి దశముఖు నీ, పజ్జకుఁ గులకాంతఁదెచ్చి పఱచుచునుండన్
లజ్జించి వెనుకఁజూడక, యొజ్జల బుద్ధి విని చనునె హోమము సేయన్. 1139

శా. ఫుల్లాంభోజముఖీనవీన సుమచాపున్ ఘోరచాపుం గృపా
కల్లోలిన్యధినాథు రాఘవు నయుంగా నాత్మనూహించి సం
పల్లాభంబులు పొందెదెల్లు కపటోపాయంబుఁ జంతించి ము
న్నల్లోకంబులమాత సీతఁ గడుమరోన్మోహంబునం దెత్తురే. 1140

వ. అని కరినొత్తు లాడుచు నవనిం బడఁద్రోసిన నమ్మారుతనయు. 1141

క. వలఁ గట్టువడిన పులిఁ గన, నిలఁగు మిగుల దైవమునిషేధించుచుఁ దా
వలిగట్టకఁ గదలక రిపు, నలుగకయున్నధవుఁగాంచి యడలుచునవియెన్. 1142

క. పతి డాఁగురించి సీతా,పతి: దెచ్చితి చేరవృత్తిఁ జర్చింప భవ
త్పతి మందోదరి దీనతఁ, బతిసన్నిధిన కపిచేత భంగముగుడిచెన్. 1143

ఉ. వాలికుమారుఁ డాలి బలవంతముగాఁ దలపట్టి యీడ్వ నా
వాలిఁ దలంకఁ జేయుద్రవిణాధ్యుఁ డితం డని పెంపునొందఁగాఁ
జాలిననాఁడవయ్యు మునిచాప్పిన నూరక చూడఁగాదు నీ
వేలిమి బూదిగాను బడవేయుము మత్పరితాపకారణున్. 1144

క. అని పదరి యింద్రజిత్తుఁ, దనమదిలోఁ దలఁచి పుత్రుఁడా నీవున్న
న్నను దేటి చూడఁగా వచ్చునె మర్కటఘటులికనుచు శోకించునెడన్. 1145

వ. పరిత్యక్తనిజహోమకర్మకలాపుండై 1146

ఉ. ఆయతరోషలోహితదశాననుఁడైన దశాననుండు క్రో
ధ్యేయక మున్గ్రభంగిగమకించుచుఁ గేల నమర్చి యుద్ధకన్
ద్రేయుండు నంగదుండు పిరిపీడిన తాలిమి వీడె నాసురీ
స్వాపు దనర్ఘసత్త్రగనుబంధముఁ దత్సతి కేశబంధమున్. 1147

క. భీమము విచకితఖేచర,భూమము సంపిహిత ఘన నభోవలయ మహా
ధూమము నిజసంకల్పిత,హోమము విఘ్నంబగుడు మహోగ్రుం డగుచున్. 1148

క. హుమ్మనిడాసిదశముఖుఁడు, సమ్మూర్ఛితునంగదున్ని శారింపఁ బ్రబా
త్నమ్మొక్కరింపనెత్తిఁగి త్వరి,తమ్మున నెదసాచ్చి మారుతసుతుఁ డగల్చెన్. 1149

ఉ. ఈకరణిం గడంగిన కపీంద్రుఁ దిరంబుగఁ జూచి దానవుం
డాఁకలిఁ గొన్న మృత్యువు క్రియం బదిపత్తుక లెత్తి వానితో
నాకుల మెల్ల నీఱుగ నొనర్చితి వక్షయపుత్రుఁ జంపి నీ
వేకతినుండ వెల్లకపిపీయులలోన మదం బడంచెదన్. 1150

వ. అని మిట్టిపడి యవ్వాలిసుతుం బట్టిం దొట్టి చెట్టుమనికిపట్టు దిట్టు తిట్టులం గట్టి సెలకట్టి
యలం గొట్టిన నజ్జెట్టులుం దట్టుపుగఁ జలపట్టి చుట్టుచుట్టి మెట్టుల మెట్టియు నెట్టన
మొట్టియు బెట్టుఁ దిట్టియు నిప్పట్టున నెట్టపుట్టం గుట్టు మట్టు వెట్టి. 1151

క. పగతు న్నిష్ఠాధైర్యా,పగతుం గావించి ప్లవగభల్లుకముఖ్యుల్
విగళితమూర్ఛావశగుణుఁ, డగు వాలిసుతుండు తమకు నగ్రేసరుఁడై. 1152

గీ. కడఁగ నడుమ నున్న కావలివారలఁ, దఱిమి తాఁకువగులఁ దన్ని చొచ్చి
పట్టి బిలముఖమున నందఱు వడివడి, న్వెలికి రామధరణి విభునిఁ గాంచి. 1153

వ. తాము పోయివచ్చినకార్యం బెఱింగించి తదీయసంభావనాతిశయంబునం బ్రమోదం
బునొందిరి. అధికక్రతపావనతవదనమ్మై నిజాంతఃపురంబుసొచ్చి

క. దరిగడచిన సిబ్బితి సుం,దరి గంధగజేంద్రయానతగుచానఁ గృశో
దరి కమలనేత్ర మందో,దరి కన్గొని శోకగద్గదస్వరయగుచున్. 1154

ఉ. మన్ననఁ గల్పితాప్తులఁ గుమారులఁ బ్రేయసిభంగిపాటు నీ
కన్నులనిండఁ జూచి గతగర్వతనొందితి మున్న శత్రు ద
ర్పోన్నతిఁ గాంచిశీకతయునొందితి వేటిచలంబు శౌర్యసం
పన్నవరేంద్రు రాముఁగని భక్తి మహీసుతనిచ్చి మ్రొక్కినన్. 1155

క. నినుఁ బ్రాణయుక్తుఁగా వా,రని కృపరతుణమొనర్చి రక్షోరాజ్యం
బున నీతమ్ము విభీషణుల, దనరఁ బ్రతిష్ఠించి చనుఁ గృతక్రియుఁ డగుచున్. 1156

ఆ. వె. సీతఁ దెచ్చి తప్పచేసితిఁ గరుణింపు, మనుచు రామభద్రు నంఘ్రియుగముఁ
బట్టుమింకఁ జలముఁ బట్టఁగ నేటికి, వినుము నాదుపలుకు దనుజనాథ. 1157

క. మానవు గద చలము రిపు,న్మానవుఁ గఁ దలఁచుటయసుమానవుఁ బాటు
న్మానమున కసువులకు నను, మానము నూన మగు ననుపమానవిచారా. 1158

వ. అనిన నిజవల్లభకు దనుజవల్లభుఁ డు. 1159

క. కాయంబులు బహుళసుఖని,కాయంబులు వివిధధననికాయంబు లభి
ప్రాయంబులు ప్రాయంబులు, ప్రాయంబులు సతి తృణాంబురప్రాయంబుల్. 1160

వ. కావున. 1161

క. ఆశల జయించుటుడిగి దు,రాశలన జయించి జనకజాత్మాధీశున్
బాశార్హప్రతినిధి స్వ,ద్దాశరథిం దొడరి పోరఁ దగు నాకెట్లున్. 1162

క. తరణీతచ్ఛరధారా,పరిధారాప్రకటితాత్మ పంకుఁడనై ను
స్థిరపుణ్యలోకసంప్రా,ప్తి రహింపం దలంపుచేసితి స్మదిలోనన్. 1163

వ. అని కృతనిశ్చయుండై. 1164

క. మునితచెయివట్టి మెల్లన, మది తల్లడము డుగునట్టి మాటలు పొసఁగిం
చిదశాస్యుఁ డెట్టకేలకుఁ, దదనుజ్ఞాతుఁడయి కదల తాత్పర్యమునన్. 1165

సీ. బ్రహ్మాండభాండంబు పగిలి బీఁటలువాఱ ద్రుతగతి విజయదుందుభులు మొరయఁ
గల్పాంతబహుళప్రకారఘోరాకార యములునాఖడ్గరోమాదు లరుగ
జలములపై నోడ చలన మందెడుగతిఁ జతురంగబలగతి జగతిఁగదలఁ
బటుహరిద్ధరికర్ణపుటభేదన సమర్థ కలితశంఖారవంబులు సెలంగ
శంకశతకోటి సదృశంబు శాతఘోర,చంద్రహాసంబుచే నిజాంసంబు దనర
రథమధిష్ఠించె లోకవిద్రావణుండు, రావణుండు మదాహతైరావణుండు. 1166

సీ. సలలితకల్యాణశరపరిపూర్ణమై షాణ్మాతురోద్భవస్థానమనఁగ
ఘనరాహుముఖకేతుకలితాంబరంబయి మహనీయతారకామార్గ మనఁగ
నధికసారాక్షబాణాసనకలితమై కఠినకాంతారభాగం బనంగ
వరసువర్ణసహస్రహరిపరిస్ఫురితమై నవచండభానుమండల మనంగ
నగణితమణిప్రభాధగద్ధగిత మగుచు, సదమలోత్తుంగరోహణాచలమనంగ
నొప్పునరదంబు రక్తగంధోత్తరీయ,మాల్యుఁడై గంధమెసఁగ నమ్మాద్రి నెక్కె. 1167

చ. అనుపమశక్తి షోడశరథాంగపరిస్ఫుట నేమి ఘట్టన
ధ్వనియును ఘంటికాపృథురవంబును నొక్కట విస్తరిల్లఁ బె
ల్చన నరదంబుఁ జిత్రగతులం దనసారథి కాలకేతుఁ డో
య్యనఁ గడపం దదశ్వహ్రేషయంబున కెంతయు నాత్మ మెచ్చుచున్. 1168

క. శకునాపసవ్యగతిదు,శ్శకునంబని యాత్మ నద్దశశిరుఁడొకయిం
చుకయేని సంశయము నొం,దక వడితో వెడలి యోధతతి ప్రక్కొనఁగన్. 1169

వ. అనర్గళవీరస్వర్గాపవర్గమార్గ సర్గనిసర్గులరై పెనఁగుఁడని చేయివీచి. 1170

క. రాముం జంపెదఁ జచ్చెద, రామునిచే నింతె కాని రణరంగమునన్
దీమసమేది చలంబతి,యే మగిడి పురంబుఁ జొత్తునే యెబ్భంగిన్. 1171

వ. అని బరవసంబుగావించె. 1172

క. సమవర్త్యయుతము లనుపమ, యమహేశ్వరుని యుక్తమైన వాజి నసులల
స్నమసాహస్రక్రమమున, సమయింపంగలవె పవనజన్ముఁ డిధమునన్. 1206

క. అని తన్ను నీవిధంబున, నామిషు లగ్గింప మారుతాత్మజవృందము వా
రనికిన్క నని యొనర్చుచు, ననితరభేద్యుఁ డయి యున్న యాతనినీరన్. 1207

ఉ. పన్నగరోమ కూఁడాస్పుల నభం బని యం బటితెంచి క్రన్నఁ
బన్నగసా యాంగ మాంసకుంకు నెమక్ప నరోమశార్కపం
పన్నగతిం గడంగుటయు మారుతి వెన్కకుఁ ద్రోచి తానిరా
పన్నగభీకధీరుఁ డరిభంగదుఁ డంగదుఁ డద్భుతాకృతిన్. 1208

తే. సర్పరోమ నీయుదర్పం బడంచెద, నిలుము నిలుము నాఁగ నీలుఁ డేఁచి
వెన్నుదన్ని నిలువ వృశ్చికరోముఁడు, నీలుఁ దాఁకఁ బోరు నిలిచె నమ్మె.

క. వృశ్చికరోముఁడు నీలుని, నిశ్చయమ్మతి నంగమున ఘటీశనూరహముఁడుం
బశ్చాత్స్థితి నుసుచురని, పశ్చిమ్మాయ లసువనువుఁ బ్లవగులుఁ బోగడన్. 1210

వ. తలపడి. 1211

క. విగ్రహ మొనరించునెడ దు, రాగ్రహుఁడై యగ్నివర్ణుఁ డవలించుమ భూ
పాగ్రణి దశరథమహీశా, గ్రాగ్రసుతుం దాఁకెఁ గ్రోధ మధికము గాఁగన్. 1212

వ. ద్వాదశద్వాదశాత్మమండలంబు లేకీభవించిన చందంబునఁ గ్రేతాగ్ని లోకప్రేటి
రైనవిధంబున నిజతేజోనలంబు విరోధివాహినీనీరసాహణ్యంబు దహింపం దాఁకి.

చ. క్రమమున శంఖ మొత్తి నిజకాయ్యకరంకృతి గంటగొట్టి సం
భ్రమము దొలంగి సంశయము మాని సమగ్రకకంకపత్రప
త్రముల శతాంగగంధసహితమ్ముగ నొక్కఁగఁ బూజసేసె న
ష్టు మొనసి యగ్నివర్ణుఁ డను పుణ్యజనాగ్రణి రామమూర్తికిన్. 1214

గీ. వెండి రాక్షసుఁడు పురహాన్ప్రత్తిగహిత, వీరనాకస్థిరావాసవిశదబుద్ధి
యగుచు శ్రీరాము భానువంశాబ్ధిసోముఁ, గప్పె శరకుసుమంబుల నొప్పిమిగుల.

క. లనలీలవ మవలీలఁ బ్రలవదిభము తెయల్చుభంగి లస్తకమునక
య్యవనీవిభుఁడు వలీముఖు, లవలోకింపంగ విఱిచె నద్భుతభంగిన్. 1216

క. విల్లు దునిమి తోడన పటు, భల్లంబున దైత్యరథము భగ్నము సేయం
బెల్లార్చుచు నురవడి నృపు, తల్లజుపై వాఁడు బలుకఁ దాల్చి మొనసినన్. 1217

గీ. అలిగి కాకుత్స్థకులకలశాబ్ధిసోముఁ, డంతకాకారమునఁ బేర్చి యగ్నివర్ణు
మస్తమునఁగ్గభూషాగ్రశస్త్రనవని, డొల్ల గూల్చెను బటుచండభల్లనిహతి.

క. అంతకమున్న విలసనమ, హాంతకనిభు లంకఁ బ్రహస్తాంతకులన్
గంతు లిడిపి యొరించిరి, గంతుగొన న్సర్పవృశ్చికతనూరుహులన్. 1219

గీ. ఖడ్గసర్పవృశ్చికతనూరుహులవారయు, తనయు వాలితనయుఁ దహనతనయు
లురక గూలుచుటయు నుర్వీశుఁ డన్నివ, స్తుంగ్రభారిగొనుట రావణుండు దెలిసి.

క. కనికరముల్ హృదయమునఁ, గనికరముఁ దలంచికొనక ఖలుఁడై దొసఁగుం
గనికరయుగదశకుఁడు ప్లవ,గనికరముం జీల్చికొనుచు గర్వస్ఫూర్తిన్. 1221

సీ. ఖచరవిస్మయవిశిఖశిఖాకలాపమా బడబాగ్నియై వార్ధి నడచినట్లు
కాతాస్త్రకుండాండజప్రభూత్తమునిపైఁ గ్రూరసర్పం బెదురొ్కనినయట్లు
లమితప్రభాజాతపార్కబింబంబుపైఁ బటుకమఃపటల ము ప్పొంగినట్లు
ఖరకరనఖరమా కంఠీరవంబుపైఁ గ్రొవ్వి సామజము కాల్ద్రివ్వినట్లు
క్రోధశతకోటి దంభోళి భూధరంబు, డీకొనిన యట్టులు హుటాహుటిగ దశాన
నుండు గండుమిగిలి కోపప్రచండలీలఁ, దలపడియె రాముఁ గ్రూరశాత్రవవిరాము.

క. నరసింహాకృతిఁ బూనిన, నరసింహు నెదుర్చ రావణపలాదన మ్మా
ర్తిరహించిన కనకకశిపు,కరణిం గపిరూప సురనికర మెుసఁగంగన్. 1223

గీ. స్ఫారవిస్ఫార మంబరస్థలిఁ బఱల్పఁ, బొట్టక్రొవ్వగ నిట్టులు బిట్టుదిర్చి
ములుకులను బోలుపలుకుల మున్నుకొంచి, మొనసి సాయకవృష్టిచే ముంచి నతఁడయు.

క. దర్పముఁ గార్పణ్యంబుఁ ద్యవర్పఁగ నాఱ్పులు దలిర్ప నవనడమహా
సర్పముఖశరావలుల న,హార్పతికులనాథు నొంప నాతఁడు గినుకన్. 1225

క. హమ్మని హుమ్మని కరిసిం,హమ్ముపగిదిఁ బొదివి విగ్రహమ్మున రిపుదే
హమ్మ చినుఁగంగ శరనిన,హమ్ములు నిగిడించి హుంక్రహమ్మ మిగులఁగన్.

క. దాశరథి యిట్టు లనియె, న్నాశరకుల కగ్గమైతి వాశమగుమహీ
నాశర నినుఁగావవశమె, కేశవ లోకేశ గగనకేశుల కైనన్. 1227

ఉ. వానల నెండలంబడి లవంబును క్రోధము లేక సాధులై
కానల నున్న తాపసులఁ గాఁటిమ వెట్టఁగవచ్చు నీలువుం
జానలఁ జోరవృత్తి నిముసంబునఁ బట్టఁగవచ్చు మత్కృదం
బానల మోర్చె దెట్టులు దశానన విప్రవనీవిధూనసా 1228

వ. అని మర్మవిదారణంబుగా నాడి క్రోధోద్రేకంబున. 1229

శా. ఆలీఢాంఘ్రియుతుండు రాఘవుఁడు దైత్యస్వామి నో నేయుచో
గోలీఢాంచితగంబులం దమనగుల్ గ్రూరస్థితి నొంగఁ బ్ర

తే. అంతఁ దత్తూణకుఁ డీకొక యగద మాయు, శక్తి గానించి తెచ్చిన దానినెక్కి
మఱియు వింశతులు పూని రామమహీశకాంతు, నెమకఁ గవన ఖవిస్మయాస్పదమొనర్చె 1243

వ. ఆవశవదనుండు.

క. పదివిండ్లెక్కిడి శరములు, పదిపదునొనిగిడ్చి తూర్పఁ బదపడి శరము
ల్పదినాలు లోకళ్లింటన, పదియుండ్లైనసుర రామభద్రుండు మఱియున్. 1244

క. ముమకొము నైశిమునఁ గ్రము, ఘ్యన నా శరంబులే మ ముకు వైచిన య
మ్మమమవెమక వైచినశరంబులు నిందెము నొక్క నిముసమునఁ జిట్టులగన్. 1245

ఉ. పూర్ణధృతిన్నరేశ్వరుఁ డపూర్వశరంబులు నాఱిఁ గూర్చి తా
ద్దూర్ణముగాఁగ నేయుటయుఁ దూణములోని శరాలిఁ గొంటలు
న్నిర్ణయ మొప్పఁ దోఁప నొక నేర్పున దక్షిణహస్త మొప్పగా
గర్ణముఁ జాయకుంటఁ గనఁగానగుఁ దక్కగలాఘవంబునన్. 1246

సీ. పాదపంబులు కంకపత్రమయములయ్యె నుపవనంబులు బాణమయములయ్యె
నంబరంబెల్ల ఖగాకీర్ణమయ్యెను శరమయంబయ్యె సాగరము కరము
నాళీకపరిపూర్ణమయ్యె రోదసి యయ్యె మందిరంబులు కాండమందిరములు
క్రోశపూర్ణములయ్యె గుహలశోభవనము లతికదంబనూర్చహములయ్యె గిరులు
రామరాజన్యమాన్యధారాధరంబు, పృషత్కవర్షంబు ప్రవీణ మగుచు
సారనీరంధ్రసాయకాసారమునను, మొనసి రావణకుధరంబు ముంచుటయును. 1247

గీ. ఆదరించి మనుపుఁ దరదాబుఁ బంపిఁ, దద్దనుజుల కెండె దవులనీరుఁ
గూడదనుచు మీఁదఁ గూఁడుగట్టినభంగిఁ, బఱపె నంబకములు పార్థివుండు 1248

క. వడిచెడక పోలసుబెండియు, నడివోవనితాల్మికల్మి నొప్ప చిలుకుల
వ్వారు పుదమితీఁ గొంచిక, నడమోముపులగతి దారుణక్షతయుతులై. 1249

వ. ఇరువురు నన్యోన్యవిజయకాంక్షాపరాయత్తులై ప్రసిద్ధసిద్ధహస్తయుగంబుల నొండొంబు
నఁ బరివేషాంకిత్వభాసిరభాస్వద్బింబద్వంద్వంబు దండంబున కిరణంబులు నెఱపుచు
మండలీకృతకోదండదండులై మండలాదిస్థానపంచకంబులు నాటియుం బ్రస్ఫురద్రక్త
పరిషిక్తనానాముఖాయుధంబులు మహోదధితరంగంబులకుం బ్రవాళలతావితాన
ప్రకారంబు గానింప నుద్దండదనుజమనుజగల్లభులు పోరాడుచున్న సమయంబున.

గీ. ధర్మగుణయుక్తిఁ బాసి వక్త్రమున విమతు, చిలుకు రావణు చిలుకులు చేరి రామ
చంద్రుగాఁడి యధోగతిఁ జెందవన్నె, యసఁగ నృపుమాసి పాతాళమంటఁ జొచ్చె.

గీ. శరధిజన్మించి సద్గుణస్పర్శ నొంది, యధికదైత్యారి పాణిగ్రహణ మొనర్చి
నట్టిసాయకలక్ష్మి వెల్లడగఁటయును, గలఁగె దానవఘోరంబు కాపురబ్ధి 1252

క. నిర్ఘాతపాతవిప్రలఘ్వనర్ఘోపము నిప్పట్టిల్ల నాటుశరంబుల్
దుర్ఘటవేగం బొప్పఁగ, దీర్ఘభుజాబలుఁడు రామదేవుఁడు వైచెన్. 1252

సీ. పార్థివుం డేచి సర్పముఖాంబకం బేయ గరుడాస్త్రనిహతి రాక్షసుఁ డడంచు
నాగ్నేయసాయక మసురేంద్రుఁ డేసిన వరుణాస్త్రనిహతి భూవరుఁ డడంచు
సర్వంసహాభర్త పర్వతాశుగ మేయ వజ్రబాణహతి రావణుఁ డడంచుఁ
దివిరి దశాస్యుండు తిమిరాస్త్ర మేసిన భాస్కరాస్త్రహతి భూపతి యడంచు
సింధురశరంబు మానవసింహుఁ డేయ, సింహశరమున దానవసింహుఁ డడఁచు
నివ్విధంబున వడి నితరేతరాస్త్రఖండన మొనర్చుచుండిరి భండనమున. 1253

క. కంధరపృషత్కముం దశకంధరుఁడు నిగుడ్ప నృపతికంఠీరవుఁడున్
గంధవహాశుగమున పరగం ధరణింగూల్ప నలిగి గంధాంధుండై. 1255

క. శూలధరుఁ డోయితం డన, శూలము రాఘవుని యురముఁ జూచి విసరుడున్
భూలోక మెల్ల వహ్ని, జ్వాలాజాలములఁ గప్పి వచ్చెడు నెడలన్. 1256

గీ. పిచ్చలించుచు ఖచరులు విచ్చి చనిరి, యచ్చెరువు నొంది కపులు హాహారవంబు
లిచ్చి రసురులు రావణు మెచ్చుకొనిరి, చచ్చెఁబో దీన శ్రీరామచంద్రుఁ డనుచు.

తోటకవృత్తము. మాతలి మెచ్చ సమానమతేజో, రీతి నరేంద్రవరేణ్యుఁడు కీశ
ప్రీతికరంబుగఁ బిండి యొనర్చె, న్నాతదివస్పతి సంచితశక్తిన్. 1258

క. ఈలీల నద్రిచరవరు, లాలోకింపఁగ భీకరాలోకుఁడై
శూలము సురలోకహృదయ, శూలము బ్రజలోష్ణపటుకృశానుఁ గూల్చెన్. 1259

మత్తకోకిల. శక్తిచే నిజశూలశక్తి కృశత్వ మొందిన సాహసో
ద్యుక్తుఁ డద్దశకంధరుండు మహోగ్రసాయకముం జయా
సక్తి నద్ధతిఁ బూన్చి తన్నృపచంద్రు తేరిసిడంబు సం
సక్తవాసరసంచయంబు వివాద మందఁగఁ గూల్చెన్. 2601

క. సాధ్వసముగ నిజదివ్య రథధ్వజము దశాననప్రదరభీకరధూ
మధ్వజమునఁ బడినఁ బ్లవగధ్వజనీనాథు లడలి రనుఁగొన నలుకన్. 1261

క. రామక్ష్మానాథుఁడు విశ్వామిత్రుఁ డొసఁగిన కటిసాయకములలో
వామఁద్రాపతిదత్తవ, రామోఘశరంబు లేయ నసురపతియున్. 1261

గీ. సకలభేదకరంబైన విస్మయము నిండఁగ రవము కలవ శమనుఁ గడపునిండ
భూనభోంతరమంబరస్ఫురణ నిండఁ, జేర్చి రణమునం బోరొనర్చుచుండ. 1262

గీ. పటులవణవార్ధిఁ బుడిసిలింపంగనైనఁ, గడఁగి వింధ్యంబు నణఁగఁ ద్రొక్కంగనైనఁ
జాలువాఁ డరుదెంచె నచ్చటికిఁ గుంభసంభవుండు శుభగాత్రలాసంభవుండు. 1263

ఉ. వచ్చి నరేశ్వరుల్ జయ శుభవశ్యము నీ కగు నంచుఁ దెల్పుచున్
గ్రుచ్చి కవుంగిలించుకొని ఘోరవిరోధిశరాళి సెంతయు
న్నొచ్చిన కాయము న్నిజసరోరుహహస్తముచే స్పృశించి పెం
పచ్చుపడంగ నిట్లనియె నమ్మహితాత్ముఁడు భక్తి రెక్కఁగన్. 1264

క. దశకంఠు శ్రమంబున, విశసింపఁగ నోపునట్టి వెరవు దెలిపెదన్
దశరథరాజసుతా విను, దశరథరాజాని వినుము దాని తెలుంగున్.

సీ. హరిజగద్బంధుఁ డమోపహారి సహస్రపాదు సత్యాధారుఁ బరమపురుషుఁ
గమలానుకూలుఁ జక్రప్రియుఁ బుణ్యజన ఫలప్రదానుఁ దూర్ణఖగయాను
నమితప్రతాపు విప్రారాధ్య నాళంబు ఘనవిభావస్వభిఖ్యాతునోజ్ఞు
నసఘు దేవోత్తము ఘనవిగ్రహుబృగాంక మిత్రు విశ్వాత్ము విచిత్రచరితు
నితరసాహాయ్యసంచారు నిర్వికారుఁ, బ్రకటనుశీలుఁ బీతాంబరరుచిజాలు
నచ్యుతు ననంతుఁ బుణ్యధీరాగ్రగణ్యుఁ, బ్రస్తుతించినవారికిఁ బ్రాఁతెజయము 1266

భుజంగప్రయాతము.

త్రిమూర్తి స్వరూపు న్సుధీపాపదీపున్, భ్రమాశోకసంతాప రాశీనిరూపు
న్ననీచీనభక్తిప్రజాతాంరరక్తిప్రమోదంబునం గొల్వ భద్రంబు గల్గున్. 1267

క. కస్తి దొలఁగు నుడుకలహ, స్వస్తి యగుం గాన ఖరగభస్తిం దురితా
పాస్తమతిఁ గొల్వ మనుచు న్గస్తి తెలిపి చనిన సమధిక కుతూహలుఁడై. 1268

క. భాస్కరు నాశ్రిత సుశ్రేయస్కరుని సహస్రకరునహస్కరు విపులో
రస్కుఁడు రాముఁడు భక్తిపురస్కరుఁడై వినుమెసఁగఁ బ్రణుతులొనర్చెన్.

వ. అనంతరం బయ్యనంతరత్నవంశరత్నాకరాభినవసుధాకరుండు ప్రభాకరుంగూర్చి
దివిజవిరోధి దశశిరోధిశరధారాపాత్రస్నాతుండును దివ్యరథచిత్రాసనస్థుండును
ధర్మాభిరతుండునై సూర్యాంతర్యాముండు భగుం డనునివి యాదియగు నష్టోత్తరశత
మహానామోచ్చారణంబు గావించి మిత్రరవిసూర్యభాను ఖగపూషహిరణ్యగర్భమరీ
చ్యాదిత్యదితదీయ ద్వాదశనామోపన్యాసంబు నడిపి సౌరసూక్తంబులు పఠించి
యగస్త్యోపదేశప్రకారంబున. 1270

తే. హృదయ మలరంగ నాదిత్యహృదయపఠన, మాచరించి తదీయదయాసమృద్ధి
నధికతరతరుఁ డగుచు నయ్యధిపవరుఁడు, గట్టిగాలుఁ దాల్చె దశకంఠుఁ గొట్టఁగిచ్చ. 1271

శా. మారీచాధము దుస్సహోద్యమమున ఛద్మస్వరూపిపై మున్నా మ
న్నారీరత్నము దొంగిలించితివి కానం గాన నస్మద్ధనుః
స్ఫారామోఘశిలీముఖప్రహతులన్ ఖండంబు లొందింతు నో
రోరీ రావణ దుర్మదాంధ యిఁక మా యోపాయముల్ చెల్లునే. 1272

క. నారీమణి సీత మరు,న్నారీమణిపూత నిచ్చినం దనుజులు మ
న్నారీపుబ్రదికె దేరు,న్నారీవేళ నటుగాక నను మార్కొనఁగన్. 1273

వ. అని కఱకుగొఱకలనఱకులం బోని ముఱుకుఁబలుకు లమ్మొఱకు నెఱకులు గాఁడ నాడి యంతనిలువక. 1274

మ. ఉదితధ్వానధనుర్ధరుండు ప్రధనోద్యోగుండు కాకుత్స్థుఁ డి
ర్వ్యాదిభీష్మప్రదరంబు లేనుటు నూ నిష్వాకుం దశగ్రీవుఁ డి
ర్వ్యాదిభీమాస్త్రముఁ లేసి యొక్కఁ డొగిఁ బైపై నుద్గప్రాస దు
ర్మదశక్తి ద్రుఘణాదులుం బఱప కుంభద్వైధ్య సంరంభుఁడై 1275

గీ. శిఖిశిఖాంకము గ్రవిశిఖ మసురశిఖామణి యూఁబు గాఁడంగ రాముఁ డేయ
విగతధర్ముఁ డశాంతుఁడు నగుచుఁ జావు,వోనిమూర్ఛ మునింగె దశాననుండు. 1276

ఉ. చచ్చె దశాననుం డని విషాదము నొందిరి రాక్షసాధముల్
ముచ్చట లాడుచున్ ఖచరముఖ్యులు సమ్మదము ది రెల్లభూ
భృచ్ఛిఖ లిచ్చ మెచ్చుచు నభిస్తుతి చేసిరి రామునిక్రమం
బచ్చొటు వావె నుద్భట రథాంగశతాంగముఁ గాలకేతుఁడున్. 1277

క. కొంతవడికి దశముఖుఁ డొ,క్కింత తెలిసి యెల్లదిక్కు లీక్షించి సమి
ద్భ్రాంతి సరదంబు ద్రిప్పితి, సుంత కడిమిలేక యనుచు సూతుఁ గినియుచున్. 1278

వ. తదీయప్రతివచనరచనానుకూలుండై. 1279

క. ముఖము లెగయించి కలహో,న్ముఖుఁడై దశముఖుఁడు దేవముఖభయదశిలీ
ముఖుఁడై నిజసారథి కభి,ముఖుఁడై యునరథము నరప్రముఖరాంతకుపై. 1280

వ. అని పలికి యాతం డట్ల చేయ. 1281

గీ. మలయు కీలాలధారలు మదముగాఁగఁ, గరధనుఃకరవిశిఖశీకరనికరము
కరము దనరార దైత్యకుంజరము పేర్చి, తీవ్రగతినన్నృపతి పింగదృష్టి దాఁకె. 1282

ఉ. నిక్కుపుబంటువోలె రజనీచరయోధులు నవ్వఁ గొంచపున్
ద్రుక్కుఁడిమూఁక నేర్చి కడు మోదము నొందెదు నీకు నీవపే
రుక్కుగలాని రావణు మదోద్ధతు మార్కొని వంటుమిల్లు మ
త్తెక్కు శిశంబు చొచ్చుగతి నెల్లిద మైతివి మానవాధమా. 1283

క. పదపడి యొద్దవినవానిం, బదిలుండై కూల్చి యిట్లు బహువారంబుల్
పొదలినఁ గూల్చుచుఁ జిత్రా, స్పదహృదయాంబుజుఁ డధిజ్యచాపుఁడు కడఁకన్.

క. త్రెంచుం గరశిరములు మొలఁ, ద్రెంచుం గ్రమ్మఱఁగ నవి వధించు స్మృతి యే
తెంచు నవి ద్రుంచు వెసవీ, త్రెంచు రణమున రణం బతిస్ఫుటభంగిన్. 12 6

క. త్వరతోరణము మిగుల వి, స్ఫురితోరస్కుఁడు కదంబములు నిగిడింపం
గరతోరణ శిరతోరణ, శరతోరణపంక్తి నాకసము దివి నిండెన్. 1297

క. పుడమిఁ బడి పొరలుతలలుం, బుడమిం బడుతలలుఁ బుడమిఁ బొందనితలల
ప్పుడు తెగినతలలుఁ దెగుతల, లుడుగక వెడలు తలలయ్యె నుగ్రరణమునన్. 12 8

క. లలి నెన్నిమార్లు దునిమిన, మొలతును నీవేటి కష్టముం బొందెదవు
చెలఁగవ్వ నవ్వఁగతి లా, లలఁ గ్రక్కుచు పంక్తిలపనము లొప్పెన్. 12 9

గీ. భరితవిపులచతుర్దిశాపరిసరములు, భయదవేతాళఖేలనపరికరములుఁ
బరమశోణీకృతోయసాగరశరములు, కరముఁ దనరారె దశశిరు కరశిరములు.

గీ. కృష్ణవర్త్మని భాయని కీలలనఁగ, శరధి మునుఁగక వెడలెడు తరఁగలనఁగ
భానుబింబంబుఁ దోఱఁగని భానులనఁగఁ, దఱుఁ వంబకములు నృపు తరకసమున.

గీ. సంగరసరోవరము రామసామజపతి, ఘనసిరంబుశవర్తనఁ గలఁగుచుండఁ
గామ లూఁచిన నెత్తమ్మిగము లనంగ, నప్పొలసుఁబిండిమొగములు నొప్పె నచట.

శా. భూభృచ్ఛాతశిలీముఖాగ్రయుగపద్భుగ్నోజ్జ్వలన్మౌళికా
శోభాభాసురదీర్ఘబాహుపరిఘస్తోమంబునం దత్సమి
ద్భూభాగంబు మణిప్రభావిభవదుస్ఫూర్జన్మహాభోగనా
నాభోగాన్వితభోగిసంకులలసన్నాగేంద్రలోకశ్రియున్. 13

వ. ఒప్పె నయ్యమోఘశిలీముఖకదంబకాండరాశికిం దిప్పలు కుప్పలై మహాపాతపతిఁ
గండోపలతాళఫలోపమానంబులైన శిరంబులుం గనుంగొని తదీయాసన్నవృద్ధిఁ గరం
బు నివ్వెఱఁగంది కందిన డెందంబున. 1304

క. వరశక్తియు పైతామహ, వరశక్తియు గాక పంక్తివదనువదనముల్
కరములు నూడిచియు నూతని, కరణిం బ్రభవించు నొక్కగతిన నిరతమున్. 1305

క. అని కరములు విదిలించుచు, వినిహతమతి నని శరములు విడిచి పక త
జ్జననాథుఁ డున్నఁ జేరం, జనుదెంచి వినీతిభరితసన్మతి యగుచున్. 1306

గీ. ఇద్దనుజునాభిఁ గుండలాకృతి రహించి, యమృత మున్నది పీయుశోర్ధి దాని
నివురఁజేయక రావణుఁ బొవరడఁగక, వెలుఁకరలపనంబులు మొలచు నెన్న.

క. ఆహవ మిద్విధయున స్వస్త్రాహోరాత్రంబు లుగ్రమై చెల్లె జగ
ద్ద్రోహి వధియింపు మిఁక సం,దేహింపకు మనెడి సారథివచనరచనన్. 1316

శా. స్వస్త్రీభ్రూణవిభేదనకు నపటుధ్యానాతిరిక్తంబు ర
క్తస్పృణ్యాదవదావఘోరవిపులాకారంబుఁ బ్రస్విద్విష
చ్ఛస్త్రాజీవనజీవనానిలఫణిటాన్యస్యాం బసాధ్యంబు బ్ర
హ్మాస్త్రం బుద్ధతి నారిఁ గూర్చి ప్రబలాహంకారహుంకారుఁడై. 1317

చ. క్రతుభుగభీష్ట మింక నగుఁ గాక నిఁ డీఁగని దృష్టి ముష్టి సు
స్థితి వెలయ న్సమంత్రకముఁ జేసి సరోరుహసంభవాస్త్ర మ
ప్రతిహతవిక్రమక్రమధురంధరు రావణుఁ గూర్చి పంప నీ
క్షితి నతివిస్ఫులింగములు చిమ్మఁ జలమ్ము బలమ్ము గ్రమ్మఁగన్. 1318

క. నృపతీంద్రకరోద్గతవజ్రపటిష్ఠామోఘమై బ్రహ్మాస్త్రము వై
రిపలాదన తనుగిరిశిఖ, గపరిమితం బైన తచ్ఛిరం బిఁకఁ గూల్చెన్. 1319

శా. ధాత్రా మోఘశిలీముఖాగ్రనిజమూర్ధవ్యస్తమై యెంతయున్
ధాత్రీభాగము గ్రుంగ రావణకబంధం బప్రసంసిక్తమై
చిత్రస్ఫూర్తిని గూలు ఛాప్పె శిఖరచ్ఛిన్నాద్రిధాతుస్ఫుర
ద్ధాత్రీభృద్వరమో యనంగ విబుధాశ్యంతాదృభాస్వాదియై. 1320

ఉ. అంతకమున్న యద్భుతరయాత్మసముద్భవహవ్యభుక్శిఖా
క్రాంతి నరాతిసూతతురగధ్వజసంయుతమైన తేరునిం
తింతలు చెక్కలై పడఁగ నేర్చి మహోగ్రగతి న్రసాతలో
పాంతముఁ జేరి మీఁటి పొదియం దిమిడె న్నృహితాంబకం బొగిన్. 1321

సీ. పర్వతాగ్రములైనఁ బడఁ ద్రోయు దీనిశిగ మెచ్చరే యని చెప్పఁటు నగ
సీతాపహారి నిర్జించితి వగవకు మనుమధాత్రికిఁ దెల్పఁ జనియె నన్నఁ
దానవరక్తసిక్తతఁ బాప భోగవతీసరిత్స్నానంబు చేసె నన్నఁ
బ్రహ్మహత్యాలిరసవార్థ మర్థించి వచ్చి రాముతుణముఁ జొచ్చె నన్నఁ
రావణుని తల గోసి ధరాతలంబు, దూసి పాతాళలోకంబు డాసి రయము
వాసి నృపతినిషంగసంవాసి యయ్యెఁ, బరశ్వరంబగు విశ్వస్పృట్పృచ్ఛకంబు. 1322

క. హర్షించిరి నరులు మునులు, వర్షించిరి సురలు మానిసరులు ముదమునా
కర్షించిరి ఖేచరు లుత్కర్షించిరి జముని సన్నికర్షించి రపుల్

సీ. అమృతపాన మొనర్చినట్లయ్యె సురలకు మునులు బ్రహ్మానందమునఁ బొదలిరి
ఖచరులకెల్ల నొక్కటలు వచ్చినట్లయ్యె భయమేమి పవనుండు బయలు మెట్టె

గ్రహనాయకుఁ డవక్రగతిఁ బొంది మిన్నందె ధరణి యంతయును సుస్థిరతఁ బొలిచె
గొలఁకులు కమలానుకూలతఁ గొమరారెఁ గడుఁ గిన్నరులకు రాగములు బలిసెఁ
దిశలు విశదంబులై యొప్పె దేవదుందుభిధ్వనులు నప్సరోవరప్రభృతుల తాండ
వంబులును జెల్లె నారదుఁ డంబరమున, నాఁడె రావణు పడుటకు నాత్మఁ బొంగి.

క. మందారకుసుమయోగ, స్పందసురభి యగుచు మలయసహితం బగుచు
న్మందానిల మయ్యాశ్రిత, సుందరారుని సమ్ముఖమున మలసె శిశిరతన్. 1825

క. శౌరియు సౌమిత్రియు సామీరియును విభీషణుండు మృదువచనములం
జేరి కపినికరయుతులై, బోరన వినుతించి రాస్యములు వికసింపన్. 1826

క. కంధరములఁ దునుమాడిన, గంధవహాశిమాళిఁ బంక్తికంధరుని లస
త్కంధరములు చిదిమి మహా,గంధవహుం డగుచు నృపతి కడు నొప్పారెన్. 1827

గీ. అంధకార మడంచిన యర్కుఁ డనఁగ, నంధకాసురుఁ దునిమిన యభవుఁ డన మ
దాంధు రావణుఁ బరిమార్చి యప్పుడొప్పె, సాంద్రవిక్రముఁ డగు రామచంద్రవిభుఁడు.

చ. భృశబలు లంజనాసుతవిభీషణముఖ్యులు హర్షనృత్యముల్
విశదముగా నొనర్ప రణవేదిక నంబకవహ్ని విద్విష
త్పశువిసరం బపృక్పృథుపృశస్థలిఁ దగ వేల్చి ప్రీత
ద్దశరథసూతి యాజ్యవభృథం బదినెల్లె మహాంబుధిన్. 1829

వ. అంత నమ్మహీనాయకాగ్రేసరుండు. 1830

గీ. సంతసమునఁ జెలికాని వ్యాసంగుచేత, నొప్పగించిన మదనునియొప్పు గాంచె
నెక్కుడుముదంబుతోడ విల్లెక్కుడించి, లక్ష్మణునిచేత నిడి కృతలక్షణుండు. 1831

ఉ. రాఘవఘోరకేసరి శరస్ఫుటదీర్ఘవిశాలభీకరా
మోఘనఖాహతిం బ్రబలయమ్ముం గను రావణభద్రదంతి వీ
తాఘుఁడు దత్సహోదరుఁ డహంకృతిదూరుఁడు మాన్యసజ్జన
శ్లాఘి విభీషణుం డురువిషాదమునం జని కాంచి దీనుఁడై. 1832

క. పుట్టిననాఁటంగోలెను, దిట్టతనము గట్టి పట్టి దిగ్జాధిపులన్
బిట్టులుకఁ బెట్టు నీకుం, గట్టా కట్టంగవలసెఁ గట్టెఁ డివగుటన్. 1833

క. ఘటకర్ణుఁడు సోదరుఁ డఁట, పుత్రులు నిపుణుఁ డింద్రజిత్తు కొడుకఁట తాను
త్కటబలుఁడు రావణుండఁట, యిటు కటకట పుడమిఁ గూలునే విధిచెయిదిన్.

క. బలవద్విరోధ మేటికి, కలదని నిన్నెత్తి చెప్పి వారింపఁగలే
నిలఘుత్వబుద్ధినగునా, యు లభింపదె బంధుమరణఘోరార్తిఁ బడన్. 1835

క. అని మఱియుఁ గుంభకర్ణున్, దనుజవరుం దలఁచి తలఁచి దనుజుండు విషా
దనితాంతహృదయుఁ డగుచుం, దన బ్లవగులు దేర్పఁ దెలిసె దదవసరమునన్. 1385

సీ. నమికొన్న శోకాంధకారంబు వెనుకొన్న జాడఁ గొప్పులు విరివీడి యూడ
నిట్లు నాథులఁ జేసితే ధాత యని దూఱు నర్తెఱంగునఁ గరోద్వృత్తి దనర
సరసిజాళి మంచు దొఱఁగెడుగతి నయనంబుల నశ్రుజలంబు లురల
నగములపై జలదాళి కడుందూలుభంగిఁ గుచాగ్రములఁ బైఁట వెడల
గొంతు లెండఁ బదంబులు గుదివడంగ, దానవాంతఃపురస్త్రీవితాన మేడ్పు
లంబరమునిండఁ జని కాంచె సమితిభీమ, భూతభూమి జగద్భయాఘాతభూమి. 1386

క. కని యల్లల్లఁ జేరం, జని రక్తము దోఁగి యున్న స్వజనాంగకము
ల్గని యుడుకు మిగులఁ గుయ్యి బోఁగ నేడిచి రొక్కట పెట్ట నంబర మద్రువన్. 1387

వ. వెండియు నద్దశకంధరసుందరీసందోహంబు విపులార్తిం గూరుచున్నప్పటి యవస్థ
మాంసకబళనార్థసమాగతమహాభూతబేతాళవ్రాతంబులకు జాలిఁ బుట్టించు
నట్టిదయ్యె నందు మందోదరి సుందరుం జేర్కొని. 1388

సీ. నిర్జరాంగన దగునిల్వటద్దము చూప మనుజకన్యక యాకుమడుపు లొసఁగఁ
గిన్నరీకాంత సంగీతంబు వినిపింప గరుడసుందరి యడిగము లొసర్ప
యక్షకంజాతాక్షి యక్షకర్దమ మీయ దనుజభామిని కయిదండ యొసఁగ
సిద్ధవిద్యాధరస్త్రీలు సేవలు లూనఁ జెల్వచెల్వ సుకలాచిక వహింప
దైత్యపద్మాస్య పదపీఠుగద మొసఁగ, దఱి గంధర్వసతి పూవుదండ యొసఁగ
నిన్నుఁ గూడి సుఖించు నన్నేలఁ దడిపి, మాలె నేమని దూఱుదు మాయవిధిని.

మ. సకలాశాపతిచిత్తశల్యభయదాచారానుకూలాత్మనిం
దుకళామౌళిపదద్వయీఘటితమస్తున్ రౌప్యభూమీధ్రకం
దుకలీలాలసితోగ్రబాహు పటిఘాస్త్రోఘుం బరుల్గూల్చిరెం
దుకు లౌ వేటికిఁ బౌరుషంబు విధి యొందుండున్ జయం బందగన్. 1340

క. తను నెల్లవనితలకు ముఖ్యనుగా మన్నించు భర్త గడ తేఱినచో
ననుగమనము చేయుఁ దలఁపనికష్ట యటంచు నాకు మార్పలుక వయో. 1341

లలితపదవృత్తము. అమరవిరోధి దశానన నిన్నుఁ గ్రమగురణంబున రాముఁ డెగువంగా
నమరచమూపతి యాగ్రహుఁడై క్రౌంచముసలఁ గూల్చినచందము దోఁచెన్. 1342

క. తమ్ముని వాక్యమ్ములు చిత్తమ్మునఁ దలఁపోయ వక్కతమ్మునఁ బడితే
తమ్ములతోఁ దనయులతో, తమ్మితో బాంధవాయుతమ్ములతోడన్. 1343

గీ. మయతనూజాత యింద్రజిన్మాత విశ్రవోవధూమణి కుంభశ్రవోవధునికి
దేవకంటకు పట్టపుదేవి యనద, యయ్యె భరమేమి బలకంతమైనవిధికి. 1344

క. అని వచియింపఁ బెక్కుతెఱఁగుల, దనుజవిభుం దలఁచి పనివి తద్వల్లభశో
కనిమగ్నయగుచు నటుఁ గనుఁగొని యా నిజపుత్రమిత్రకోటిశవంబుల్. 1245

వ. కని సహింపని దుఃఖాతిరేకంబున. 1346

సీ. పరిపంథికాండాగ్ని పరిపీత మయ్యె నే యయ్యనేఁ డింద్రజిదంబురాశి
విద్విషత్పటుశరవృష్టిని యాఱెనయారె నేల ఘటకర్ణానలంబు
అరికుమారకశక్తి హతిఁ జేసి మాయనా మాయమ్మగునె యతికాయశిఖరి
యభియాతిఘోరాశుగాహతిఁ జెల్లఁబో చెల్లఁబోలుఁ బ్రహస్తసితఘనంబు
దస్యుకోపదవానలదగ్ధమయ్యె, నక్కటకటా నిశాటభటాటవీప్ర
దేశ మని భీమభూతనివేశ మగుఁ గనుంగొనఁగ లేక మూర్ఛ మునుంగఁటయును.

క. వనచరులు దెలుపఁ దెలివొం, దినయట్టి విభీషణుండు ధీరోక్తుల న
వ్వనితకడఁ జేరి తేటిచె, ననయానునయనయసవినయాలాపములన్. 1348

వ. తదనంతరంబున. 1349

సీ. అస్రవాహినులనోలాడుభూతములు నెమ్ములు చవిచూచెడు భూతములును
బిట్టల నాఁద్రను బిల్చుభూతములుఁ బ్రేవులు గబళించెడుభూతములును
మెదడు దేచ్చికొని తిని మదమెక్కు భూతము లొప్పిబ్బలు వెట్టెడుభూతములను
పీనుఁగులను ద్రొక్కి పీఁచుభూతంబులుఁ బొగడుచుఁ ద్రేఁచెడు భూతములును
ఆడుభూతములును బాడుభూతంబులు, నాఁడుభూతములును బాడుభూత
ములుఁ జెలఁగుభూతములు నవ్వుభూతము, లతిమభూతసంచయమును గలిగి. 1350

వ. భూతభయంకరంబు గాకుండియు భూతభయంకరంబై కీలాలపరిషిక్తంబు గాకుం
డియుఁ గీలాలపరిషిక్తంబై హారిశిలీముఖచక్రపుండరీకబహులఘనరసాకరంబు
గాకుండియు హారిశిలీముఖచక్రపుండరీక ఘనరసాకరంబై కబంధప్రసారితంబు గా
కుండియుఁ గబంధప్రసారితంబై యొప్పు నప్పొలికలను నెట్టుకేలకు వెలువరించి. 1351

చ. ధృతి మృతబంధుకోటికి విధిం దగు సాధనయుక్తి వహ్నిసం
స్కృతి పొనరించి యెల్లర కకిల్బిషతం బరలోకసత్క్రియా
దృతి నెగడొందె యొప్పిన సుధీనుతు శావ్యదశాచు వానర
ప్రతతియుతు న్విభీషణుని రాముఁడు గన్గొని సాదరంబుగన్. 1352

వ. సౌమిత్రిం జూచి. 1353

క. రావణుచేఁ జాలి తమగు, దీవికిఁ విభీషణుం బ్రతిష్ఠింపుము రా
జై వెలయఁ గాత నీతం, డాధుగిరిజధితారతార్క్ష్యముగాఁగన్. 1354

వ. అని సత్యసంధుండును గరుణాసింధుండును దీనజనబంధుండును బ్రతిజ్ఞాబంధురుండు
నగు రామభద్రుం డాసతివ్యాటు నుమహాప్రసాదంబని సువర్ణస్వర్ణమహార్ఘవార్ణఃపరి
పూర్ణభద్రకలశహస్తులగు వనచరప్రశస్తులసహాయంబున నమితవైభవాస్పదం బగులం
కాపురంబుఁ బ్రవేశించి యుచితసమయజ్ఞుండై. 1355

క. పుణ్యసతులు సేసలిడఁగఁ, బుణ్యమతులు సన్నుతింపఁ బుణ్యదినమునం
బుణ్యజనసమ్మతమ్ముగఁ, బుణ్యతరాసీనుఁ జేసి పుణ్యవిధి దగన్. 1356

క. లంకాపుటభేదన మకలంక ధృతి విభీషణునకు లక్ష్మణుండు గుణా
లంకారుఁ డెంచు కేరి కలంకగొనక యాభిషేకలక్ష్మిం గూర్చెన్. 1357

క. సరమాపహితు విభీషణు, సరమాపహితుం డఖిలనిశాటపదవికిం
గరుణారససేచనభాసురతరపట్టాభిషేకశోభితుఁ జేయన్. 1358

చ. అమరులలోన నింద్రుఁడు హిమాద్రికులాద్రులలోనఁ దారకా
సముదితమండలంబున నిశాపతి భూరుహకోటిఁ గల్పక
క్రమమున నవ్విభీషణుఁడు రాక్షసరాజికిఁ దా నధీశుఁడై
యమరవిరోధివర్గలసదంతరము న్వెలిఁగించె నెంతయున్. 1359

క. ఈచందంబున సకల నిశాచరరాజ్యాభిషేకసామ్రాజ్యయుతుం
జూచి విభీషణుఁ బొగడిరి, భూచరభూమిరుహచరనభోరాత్రిచరుల్. 1360

వ. అంతంత నిఖిలరాక్షసరాజ్యలక్ష్మీవిరాజమానుండై మండోదరీప్రభృత్యంతఃపురకాం
తాసందోహంబానందించు వర్తనంబునఁ బ్రసిద్ధుండై. 1361

క. పదిమోముల య్యతమ్ముఁడు, పదితేరుల జియ్యకొడుకు పజ్జకుఁజనితాఁ
బదివేల్జేజే లౌరరిం,పఁదివిరి జేజేలు తొని పయి విరివానల్. 1362

తే. వరిని రచ్చరలాడిరి మొరసె దేవ, దుందుభులు మింట నతికమాన్యశచరిత్రుఁ
డతిపవిత్రుఁడు మిత్రవంశాబ్ధిసుధ, మిత్రుఁ డాతని మిత్రతమీఱఁ జూచి 1363

వ. అభినందించె దదనంతరంబున. 1364

చ. సరసబహూకృతి న్వెలవొసంగిన మాతలి తేరుగొంచు వి
స్ఫురితగతిన్ దిశల్వెలుఁగ సూర్యసుతేశ్వర బాహుసాహస
స్థిరధృతి విక్రమాదులు నుతించుచు సత్రతిలీల దేవతా
పథమున నబ్బుమీఱఁ ద్రిదివంబున కేగె ననంతరంబునన్. 1365

సీ. వరవియోగాతపభరకృశయై ఘనోదయముఁ గోరెడులతాతన్వి యనఁగ
వినతకస్పర్శనాపేక్షమై దోషాచరనిబద్ధయైనపద్మిని యనంగఁ

గరిమఫలాఢ్యగ్రఫలితరమై మాధవాకాంక్షిత శ్రీకలకంఠి యనఁగ
నాత్మవివర్జితాహారయై రాజావతంసు నెంచుసతీమతల్లి యనఁగ
రాఘవగతాఘాదగ్ధ నామోఘబద్ధబుద్ధి సద్ధరణీజ జగద్ధితుఁడు మ
రుద్ధితసుతుఁడు వినయావనతుఁ డగుచు, నల్లనల్లన మిగులఁ బ్రియమునఁ జేరి. 1366

చ. కనుఁగొని కేలుమోడ్చి జనకక్షితినాథతనూజ కున్బ్రదోఁ
పనిధృతి వాయునందనుఁ డపాస్తభయుండగు నాంజనేయుఁ డి
ట్లనియెను బూర్ణిమాహిమకరాంశు పరిస్ఫుట యోగఘూర్ణమా
ననిబిడ వార్ధి భంగచయ నవ్య పరస్పర ఘట్టనార్భటిన్. 1367

తే. అమ్మ వినవమ్మ చాలమే లమ్మ నీకు, జాలమేలమ్మ రాముఁ డొక్కనకు సేయు
సమయ మాసన్న మయ్యె నసత్యమాడఁ, జాలమేలమ్మ కస్మైన జలజనయన.

ఉ. సేతువు గట్టి రక్కసులఁ జీల్చి విభీషణు నెల్ల వానర
ప్రీతిగ లంక నిల్పి విపరీత భవన్విరహాభిభూతచి
త్తాతురుఁడైన రాఘవుఁ డహర్పతితేజుఁడు దాఁ ద్రిలోకవి
ఖ్యాతజయోక్తి నీకుఁ దెలియ న్వినిపింపు మటన్న వచ్చితిన్. 1369

చ. మనమున నూఱడిల్లు మనుమాన్యము దక్కుము నాఁ దదీయవా
క్యౌఘకర వారియోగ జనకక్షితినాథ కుమారికా నిశా
ఘనిహతి చారుచారు మతిశాక్లమథంబడఁగన్మరంద బిం
ద్వనుపమ సమ్మగాఢ్రపు నిచయంబులు జాఱె సుమాంబకద్వయిన్. 1370

క. పూని యిటు సంతసించిన, యానిని జనకమహీభృత్కుమారి కుమారుం
బోనివారికుమారునిదరు, నానన మదిఁ గాంచి యిట్లను దెలిసి మెయిన్ 1371

క. ఏకతమ యివ్వనమునన, నేకతమ శ్రమంగ గుంది యిట్లు డిరుము
న్నీకతముఁ బ్రాణంబుల, పోకఁ దమకిఁ గాక యుడిపి పుచ్చితి వత్సా 1372

వ. భవదీయ దయావలోకనంబున నాపత్పయోనిధి మునుంగక వెడలితి నన్నాన
మహానందంబు నొందుచు న్ననసరంబున నవ్యాఘచూడామణి వాక్యరత్నంబులు
మెఱుఁగు నెట్టిన చందంబున విభీషణ ప్రేంతంబగు దానవ పుణ్యకామినీసముదాయం
బు సరమాపురస్కృతం జనకనందనం గదిసి. 1373

సీ. ఘనవేణి కురులకుఁ గమ్మనూనియ రాచి యంబుధారాపూరితం బొనర్చి
మృదువాణి మేనున మేలిసొమ్ములు వెట్టి శరదిందుధవళాంశుకరుచి గూర్చి
గగనావలగ్న ముఖమునఁ దిలక ముంచి తారకానూర్తిఁ జెన్నారఁ జేసి
లలి లతాతన్వికన్నులఁ గాటుకపొనర్చి సుమనోమనోహారస్ఫురణనొసఁగి

గంధగజయానమేనున గంధ మలఁది, పద్మకామిత మృదులీలఁ, బాదుకొల్పి
యశ్వరారోహనౌక విమానాధిరోహఁ, జేసి రాముని సన్నిధి సేసిరపుడు.

క. తడయక జేజేపూజడిఁ, దడియుచు సరమాపతియు సదాగతిసుతుడుఁగా
జడియక మంగలసందడి, జడియుచురా సీతఁ దెచ్చి సమ్మతి నిలుపఁగా. 1874

క. ప్రీత స్మితమృగీవి, స్ఫీత దృగబ్జాత రాతుసీసను పేతఁగా
భూతలసంభూతం బరి, పూతం గని సురలు ముదముఁబొందిరి మిగులఁగా. 1875

ఉ. మాన్యచరిత్ర కజ్జనకమానవనాయక పుత్రి కప్డరా
జన్యునిఁ జూచువేడ్క మహిజానికి జానకిఁ జూచువేడ్కసా
మాన్యము గాక యుల్లములఁ మల్లడి సేయఁగఁ దద్వ్యథాకరా
న్యోన్యము ఖావలోకన మహోముద మొక్కటఁ గ్రొల్లెఁ బెల్లుగఁగా. 1876

క. చిరకాలవిరహదుర్భర, తరచింతానిధులు భూసుతా దాశరథుల్
గరుపారెను మేనుల నొం, డొరులం జూచికొని పొంగి రుల్లములఁ గడుఁగా.

క, నిధిసన్నిధి యగు నధనుల, విధమున జలరాశి నీఁది వెడలిన భంగిం
బృథివీతనయా రాములు, మిథస్సవిధులగుచుఁ గరము మెఱసినయంతఁగా. 1878

క. పావనియు ఖ్యులు లక్ష్మణ, దేవునితోఁగూడి యప్పుడధికహర్షమునం
బావనిఁ బుణ్యసతీసం, భావినిఁ గని నెమ్మనములఁ బ్రబలిరి మిగులఁగా. 1879

సీ. బ్రహ్మాదిదేవతాపటలంబు సనుదెంచి సుమనోభిరామ రక్షోవిరామ
జితపరశ్వధరామ వితతసద్గుణ పికారామ సాత్మారామ రామఁ బొగడి
విపులశుచిప్రవేశపరమశుచిరుచిరరుచి మహీకన్యఁ బ్రస్తుతించి
సారకల్పకసుమాసారపూర్వకముగా నప్పతివ్రతఁ బతికొప్పగించి
యతని మతి వొంగ నప్పుడా యతులరణమృ, తులఁ బ్లవంగపతుల నమృతలలితప్ర
వృష్టిఁబ్రదికించి వెండియు వివిధగతులఁ, బొగడిరి నరేంద్రు రవివంశ పూర్ణచంద్రు.

రగడ. జయజయపూషనుసంతతతతిభూషణ, జయజయరావణ జలధైరావణ
సుజనవిధాయక సుఖసంధాయక, సృజితవికర్తన వేదవికర్తన
సరసనిబంధన సాగరబంధన, భరితనలాంగద బాహుబలాంగద
అరిచయ మారక యాజిసమారక, సురనివహావన సూరిసుహావన
శుకసమవర్తన శోకనివర్తన, సకలవిదూషణ సాధితదూషణ
ప్రసన్న సుదారక సంశయదారక, యసదసనోదన హర్షవినోదన
జనకసుతావర శక్రహితావర, వినుతమహాబల విపుల మహాబల
ఖలఝషధీవర కమ్రేందీవర, కలితసులోచన కారుణ్యలోచన

పృథుభవతారక హితబృందారక, ప్రథననిశాచర పద్మనిశాచర
సమిత విభీషణ నాస్తికభీషణ, విమల యశోధన విద్యాశోధన
వపుజిత నారద వందితనారద, విపులనిరూపక విశ్వసురూపక
నతశశిశేఖర నరపతిశేఖర, శ్రితవరదాంకిత సిద్ధపదాంకిత
భయహరివారణ ప్రథనావారణ, భయదశిలీముఖ భవ్యశిలీముఖ
నిహతశిరోరుహ నేత్రసరోరుహ, బహునుతబాడబ భవవనబాడబ
స్మయఖగనాశన మదపవనాశన నయగుణవర్ధన నరభుగ్వర్ధన
మునిపరిపాలన గ్రీష్మాఘవిఫాలన, యనఘునికేతన యహిరిపుకేతన
వశచతురాగమ భక్తవరాగమ, భృశబలవిక్రమ భీమత్రివిక్రమ
వలిముఖరంజన వరద నిరంజన, సలలితతారక సన్ముఖతారక
కైశికకంధర కంబుసుకంధర, వీశసువాహన విబుధావాహన
అనయకదంబక హననకదంబక, కనకకృతాంబర కాంతివృతాంబర
పాలితగోగణ పావనగోగణ, కాలనిరూపణ కార్యారోపణ
సకలసభాజన సమ్మదభాజన, ప్రకటనమజ్జన పంకనిమజ్జన
తమ వీరుల నెఱుఁగము నీకంటెను, మమ్ముఁ బ్రోచిన ధర్మము నీకంటెను
దీనులకొఱకె త్తితి వవతారము, మానుగ నీ నామము భవతారము
చెదరక నిన్ను భజించెడువారికిఁ, గదలఁగ నేటికి గంగావారికి
కృతకృత్యుఁడవై కీర్తి వహించితి, నతిశయమిా శ్రమ మంత సహించితి
నీవగువారము నీదేభారము, ఏదియు నేరమిఁ కెంచకు నేరము. 1881

సర్వతఃప్రాససీసము.

నిస్తులదురిత నిరస్త సదాభయహస్త విశామ్య ద్విహస్త పిపుల
విస్తీర్ణసంసార దుస్తరాంభోనిధి విస్తారక బుధేష్ట వస్తుదాయి
ప్రస్తుతసుజన సమస్త మునీశ్వర ప్రస్తుత విద్విషాపాస్తగంధ
శస్త్రప్రదశర యశస్తోమ తీక్ష్ణగభస్తి వంశాబ్ధిప్రశస్తసోమ
విస్తరామ్నాయ సువిచార నాస్తికహర, హస్తిరిపుకోటి శౌర్యవిధ్వస్త చౌర్య
త్రస్తలోకోద్ధరణ ఘనోపాస్తికరణ, స్వస్తిపదరామ భక్తవిన్యస్తకామ. 1882

ముక్తపదగ్రస్తకందము.

స్మరసుందర దరసంహర, హరవందిత దితమహారిహారివిభవభా
సురసురపూజిత జితఖర, ఖరశరశరకీర్తినికర కరపదపద్మా. 1883

ఖడ్గబంధోత్సాహవృత్తము. రామనాథ సోమధామ రాజరాజపూజకా
కామితార్థ దాయకా సుఖైక సద్విధాయకా
కామినీ సితాబ్జసాయకా మనోజ్ఞనాయకా
కామశోక మోహలోభ ఖండనాదికారకా. 1384

చక్రబంధ శార్దూలము.

జన్యాలక్షితరాక్షసోత్కర దయాసామగ్ర్య శౌర్యక్రమా
మన్యూత్సర్జన మత్తపామరవిరామా ధ్వస్త శోకక్రియా
యన్యాయాపహ నాగభాస్వరశయానా వంద్య భూభ్రమా
మాన్య స్త్రీజనకామ నిర్భయద రామా శ్రీదయాద్యుత్తమా. 1385

పాదాదిపాదాంత ముక్తపదగ్రస్త సింహావలోకన ద్విప్రాస నిరోష్ఠ్యకందము.

శరధీడిత కీశరథీ శరధీహితకీర్తి నిరత చలితాశరధీ
శరధీద్ధగదాశరధీ, శరధీరార్త్యాతసునూన జయదాశరథీ. 1386

గోమూత్రికాబంధకందము.

సరసీజాక్ష రమాభా, సురసీతాకామ దాసశోకవిరామా
సురపూజా వరశోభా, భరపూతారామవాసపైకపరామా. 1387

క. అని మిగులేని విధంబున, వినుతు లిట్లభివర్ణించి యందఱకును ద
జ్జననాథుఁడు సెలవొసఁగినఁ, జని పొందిరి భీష్మలీల స్వస్థానంబుల్. 1388

వ. అయ్యవసరంబున దశస్యందనుండును నందన సందర్శన సంస్పర్శన సంభాషణ సంభా
వనంబుల నమందానందకందళిత హృదయారవిందుండై 1389

క. మీ కొఱ గోడ్డము లాడిన, నాకొఱ గాములు సహించి నాకొఱకు మదిన్
శ్రీకొఱకు లెక్కసేయని, మీకోరులు సమానులే సమిద్యములారా. 1390

చ. అని పదివేలచందముల నాత్మజులం దడవాడి క్రోధలిం
గనుఁగొని రాముఁ జూచి జనకక్షితినాథతనూజ సాధ్వసౌ
ఖ్యనిహతి కాత్మనోర్చి యనఘస్థితి లోకము కెక్కఁ జేసె నే
మని పలుకంగ వచ్చు నని యాడి కడుం గొనియాడి వేడుకన్. 1391

క. తనయుఁ దనుభంగి మ్రొక్కిన, తనయుల దీవించి దశరథవిభుఁడు మునువ
చ్చిన సురవిమానరాజి, మ్మునఁ గ్రమ్మఱఁ జనియె దివిజముఖ్య సహితుఁడై. 1392

చ. హరిపదబంధురంబుఁ గనలానుగుణం బరుణప్రభాఢ్యమున్
గరుడ సహస్రము వేగ ఘనమ్ము బతిరిక్త విశాలకిన్నరా

మరఖచరాభినంద్య మసమానకళాఢ్య మనంతరత్నవి
స్ఫురితము సూర్యమండలముఁ బోని కుబేరకపుష్పకాగ్ర్యమున్. 1393

మ. అధిరోహించి సతీసహోదరులు దన్నర్థిం గ్రసేవింప సం
బుధిపై బ్రోవ నుదగ్రశాఖిముఖుఁడై పూర్ణప్లవంగావలి
గ్రథితంబైన విమానరాజమున దక్షశ్రేణియున్నిండఁగాఁ
బృథివీనందన సేతుధర్శనము సంప్రీతాత్మఁ గావించుచున్. 1394

మ. చని కిష్కింధయు ఋశ్యమూకము జనస్థానంబు వేర్వేఱ భూ
తనయాసాధ్వికిఁ జూపిచెప్పుచు మృగాంధస్సాంద్రముం జిత్రకూ
టనగేంద్రంబు నతిక్రమించి యధిరూఢ స్వల్పకీరార్భకా
దనబద్ధేష్ట విడారికా తము భరద్వాజాశ్రమోపాంతమున్. 1195

ఆ. కాంచి యచటఁ బుష్పకసమాపతీర్ణుఁడై, రాఘవుఁడు వసుధరాసుతాస
తీసహోదరుల్ నుతింప భరద్వాజు, చరణపీఠమునకు సాఁగి మ్రొక్కె. 1396

వ. అమ్మహానీయు సంయమీంద్రుండు మేదురాదరాశీర్వాదపూర్వకంబుగా నాసంగు
జేవోపచారంబులఁ బరితుష్టుండై యిష్టగోష్ఠీవినోదంబులం దగిలి యుండునంత. 1397

క. హనుమంతునిచే నంతయు, విన సుంద్ర యోపవేశ వృత్తిం దోఁ జెఁగి త
మ్మునితో నందిగ్రామము, మునిసభుఁ డాధరితపభుఁడు మదనుక వెడలెన్. 1398

క. కడలేని వేడ్క యనిమొద, కడలిమునిఁగి తేలి వెడలి కైకకొడుకెదం
గడలుకొనిన పేరిమి నలు, గడలం దగవరులు గొలిచి కదూఁగిపన్. 1399

వ. శత్రుఘ్నుం గనుంగొని. 1400

క. తల్లులకుఁ బౌరజనులకు, నెల్ల సుహృద్బాంధవులకు నెఱిఁగింపుము సం
పల్లలితుఁ డగుచు రాముఁ, డెల్లి యయోధ్య కరుదెంచు నంతయు వేడ్కన్. 1401

క. అని చెప్పి శోభనపదాగ్రనిధి సాకేతరాజధాని నలంకా
రనిరూఢిఁ బెంపు మీఱఁగ, నొనరింపంబంపు మని సముచితభంగిన్. 1402

శా. కైకాసూనుఁ డభీష్టదానహితవాక్యప్రీణితోర్వీసుర
ల్లోకానూనుఁడు దిగ్విభాగశశిసమాలోలప్రశస్తప్రభా
స్తోకానూనయశఃప్రసూనుఁ డహితస్తోమానధీనాస్త్రవి
ద్యాకారుణ్యగుణప్రధానుఁడు సమాధానావధానుం డొగిన్. 1403

తే. పటుజటోత్కటవల్కలపటలితోడ, వినయమూర్తిఁ పూనిన విధముతోడ
హర్ష సంభ్రమ భయవిస్మయములతోడ, సముచితాచార సజ్జనోత్తములతోడ. 1404

మ. చని కాంచెన్ ఘననీలుఁ బింగళజటాజాలున్ సలీలున్ మహీ
తనయాలోలు నలోలు మోక్షపదవిద్యాజాలుఁ బుణ్యాలవా
లు నిరాభీలు సమస్తలోకపరిశీలున్ శంకరోత్కూలకా
లు సదాచాలు ననన్యటాలు సుకృపాలున్ రామభూపాలునిన్. 1405

క. కని మోకాళ్ళఁ గేలు ఫాలమ్మునఁ జేరిచి భరతభూవిభుఁడు మహీతనయా
వర్జాత మఖిలతన్మణ, తనయాన్వితుఁడ సన్నృపతిపదంబుల వ్రాలెన్. 1406

క. వ్రాలి నుదర్శకర్ణుగీర్ప క్షాళిత పదకములఁ జేయఁ గని రామమహీ
పాలుఁడు సోదరుముఖ్యు దృఢాలింగితుఁ జేసి మూర్ధ మాఘ్రాణించెన్. 1407

శా. ఆశీర్వాదపురస్సరంబయిన మూర్ధాఘ్రాణము న్జేసి ధా
త్రీశుం డల్లను పల్లవింపఁ బ్రియవక్తృత్వంబు దీపింప శో
భాశాల్యాత్మకరాంబుజాతపరిస్పృష్టస్వాను జేద్ధాంగక
ప్రాశస్త్యుండయి నేమమే భరత శుంభద్ధైర్య సత్యవ్రతా 1408

క. అని యాడి పిన్నతమ్మునకును మువ్వురు దల్లులకును గురునకును బురం
బునఁగలవారలకు నఖిల, జనపదవాసులకుఁ గడుఁ గుశలమే యనినన్. 1409

వ. భరతుండు మహానంద భరితుండై. 1410

చ. స్మితరుచికాముదీపటు సమృద్ధి వివర్ధితలోచనోత్పల
చ్యుత మకరంద రూప విభవోజ్జ్వల సమ్మదబాష్పసుష్పధా
ప్లుత విలసత్కపోల పరిపూర్ణ భవన్ముఖచంద్రమండల
ద్యుతిఁ గని యెంతయుం గుశల మొందవె యాశ్రితదృక్చకోరముల్. 1411

తే. అట్టి నీదర్శనమున మా యట్టివారి, కెల్ల నేమంబు గల్గుటకేమివింత
యడవి నీవున్న పదునాల్గుహాయనములు, లారయఁ జతుర్దశయుగంబు లయ్యెనాకు.

చ. కుశలము నీసహోదరునకు న్గురువర్గులకు న్ముదంబు భూ
పశుభము పౌర జానపద బాంధవకోటికి సమ్మదంబు ని
త్యశుచికరుంధతీపతి కహార్పతివంశ పయోధిచంద్ర నీ
కుశలము సర్వభూతములకుం గుశలంబు తలంచిచూడఁగన్. 1413

క. తెలిదఁడ్రోల మదికోరికి, దెలిసి యడవికరిగి కొండ్రదిమ్మరిపోవుక
లుఁ వుగొని పీకసోఁకుం, గొల మణఁచిన నీకుసరియగుదురే సామ్యుల్. 1414

క. అని మఱియుఁ బెక్కుభంగులఁ, దనుఁ బొగడుచునున్న యట్టి తమ్ముని భరతు
న్మనమున హర్షించి పునః, పున రాలింగనములవ్విభుం డొనరించెన్. 1415

వ. తదనంతరంబున వసుంధరానందనానందగపదారవిందంబులకు మ్రొక్కి యాకొల్చు
లిడి యెక్కుడుగుణంబు లగ్గించి మిక్కిలి దీవనలు వడసి సమస్తంబు కుశలంబ యని
యపుడు. 1416

క. ఆతఁ డతఁడైన విధమునఁ, గౌతూహల ముప్పతిల్ల గాఢస్నేహా
పేతమతిఁ గౌఁగిలించిరి, ఖ్యాతిసుమిత్రాసుతుండుఁ గైకాసుతుఁడున్. 1417

తే. అచట శత్రుఘ్నుచే రాఘవాగమనము, విని వసిష్ఠుఁడు ముదమంది విన్నుముట్టి
దశరథాంగనలును దోనఁ దగినయాన, పంక్తితోఁ జనుదేఱఁగఁ బయలుదేఱి. 1418

క. పరమోత్సవం బయోధ్యా, పురమునఁ గావింపఁ బంచి భూరిద్యుతివి
స్ఫురితాంబరపుష్పకమున్, దమ భరద్వాజనియమిధన్యాశ్రమమున్. 1419

ఉ. చేరి వనాటరాత్రిచరసేవితు నాతఁడు భ్రాతృయుక్తు ధా
త్రీరమణీసుతాయుతుని శ్రీరఘురామమునీంద్రవంద్యుఁగ
న్నారఁగఁ జూచి జన్మము కృతార్థత నొందె నటంచుఁ దన్నమ
స్కారము లర్ఘ్యపాద్యములుఁ గైకొని కైకొని యాదరంబునన్. 1420

వ. ఆశీర్వదించి యభినందించి. 1421

క. దశకంఠుని బాధల దుర్దశఁ గంతఁగానులైన ప్రజల దివిజుల
న్విశదగతిఁ బ్రోచు మతిమను,జశరీరం బూనినట్టి శార్ఙ్గి సుమూర్తి 1422

త్రిమూర్త్యాత్మక స్తవకందకము. శివవిప్రవినుత యవ్యయ,భవభయమోచన శశిప్రభాకరరాజీ
వవిలోచన దేవముఖవి, భవభాషానాథవంద్య భవ్యనిధానా. 1423

వ. అని యనేక విధంబుల నతని విపినవాసకథాసేతువిధానుగకథాదిక ప్రయోజనం
బు లుగ్గడించి సౌమిత్రి యుచితవర్తనంబుఁ గీర్తించి జానకి యుత్తమగుణంబు లెత్తి
పొగడి యానందించుటయు. 1424

క. అంతకుమున్న సుమిత్రా, సంతత్యవరజనితుండు శత్రుఘ్నుఁడు ఫా
లాంతాంజలిపుటుఁడై సకృ,త్సంతోషమునుం దా రామచంద్రుపదములన్. 1425

క. తననయనచకోరంబులు, దనివోవఁగ నాఁటియున్న తమ్ముని శత్రు
ఘ్నుని నప్పుడు గాఢాలిం,గన మొనరిచి చిరంబుఁ గడుమూర్కొనుచున్. 1426

క. దీవించుచుఁ దమ్ముని సం,భావించుచు నివ్విధమునఁ బరిరంభణసౌ
ఖ్యావహమున మేను మఱచి, భూవిభుఁ డసకృత్ప్రమోదమున మునుఁగుటయున్.

వ. లక్ష్మణానుజుండు నుప్పొంగియుండె నంత రాముండు వనజసమేతుండై. 1428

క. మొగిచిన చేతులు ఫాల, మ్మొగిఁ జేర్చి విభూతినారఘూత్తమమణి వే
ముగురమ్మలఁ బోలిన యా,ముగురమ్మల పాదపద్మములకున్ మ్రొక్కెన్. 1429

ఉ. మ్రొక్కిన రామలక్ష్మణుల మోముల మోములు చేర్చి చేర్చి యా
యక్కలు నక్కుమారకుల యక్కుల నక్కులు మోపి మోపి చ
న్మక్కుల దుగ్ధబిందువులు మోముల సమ్మదబాష్పపూరముల్
గ్రక్కుచుఁ బారవశ్యమున గాంచి మునింగిరి సమ్మదాంబుధిన్. 1430

క. బుడుతలు తమకు న్మ్రొద్దులఁ, బుడుకుచు మ్రొక్కు శిరములు మూర్కొని మేనుల్
పుడుకుచు ముద్దులు నప్పుడు గాల్చిరి చింతలనెడు పుడుకల నెల్లన్. 1431

వ. వెండియు నపరిమితానంద భరితలగుచుఁ గుమారుల ముహుర్ముహుర్నమస్కారంబులకుం బునఃపునరాశీర్వచనంబు లొసంగుచుఁ దదీయవనవాసాదిక్లేశంబు లుగ్గడించి కన్నీరు నించుచుం బ్రత్యేకకుశలప్రశ్నంబు సేయుచు. 1432

తే. కటకట కటిక క్రొగ్గంటి తుటుముతోడ, నోడల వ్రేలెడు నిడుద కుంజడలతోడ
మురువు దఱిగిన మెట్టుఁదామరలతోడ, వచ్చి కన్నులఁ బడినార వత్సలార. 1433

వ. అని యిట్టి ప్రేముడి పలుకులం బాలకులం బొదివికొనియుండి రట్టి యెడ సీత యత్తలకు మ్రొక్కుటయు. 1433

ఉ. గ్రుచ్చి కవుంగిలించుకొని కోడలి దీవనలిచ్చి మచ్చిక
ల్మెచ్చు పెరుంగ నాపె గుణబృందము లెంతయు నచ్చి మెచ్చి వా
పుచ్చి పతివ్రతామణివో భూసుత పుట్టిన యిల్లు వేడ్కమైఁ
జొచ్చిన యిల్లుఁ గీర్తులకుఁ జొన్పితి నిన్వినుతింప నేర్తుమే. 1434

క. దాసీనివహం బెల్లను, దాసీనివహంబు గాఁగఁ దలఁచి సుఖములం
బాసి మది విసువవైతి సెబాసిఁక నినుఁ బోలునట్టి పడఁతులు గలరే. 1436

క. పొంగెడు గతి నలవాణియు, మంగళదేవతయు సర్వమంగళయును గా
కంగనలు నీకుఁ బురుడే, మంగళదేవతవు సర్వమంగళవాణీ. 1437

సీ. క్రౌశికసంవ్యాప్త కౌశికపరిపూర్ణవనములు క్రీడోపవనములనుచుఁ
బటుపలాశపలాశ భయద కంటకలతా భవనము లేకేళీభవనము లనుచు
వ్యాళసంవేష్టిత వ్యాళమహాద్రిగుహాలు విలాసాంతర్గృహంబులనుచుఁ
గ్రవ్యాదపంచకక్రవ్యాద సంకలితతామ్రులం చత్కృతకామ్రగులనుచుఁ
గఠినకాసరధూసరాగాధదుర్ఘ, రీకదంబంబు దీర్ఘికానేక మనుచుఁ
[illegible]చి యెదఁదాల్మి నెఱపొల్పి ధవుని పిఱుఁద, విపినములఁ దిరిగి వచ్చితివి గదమ్మ.

క. నినుఁ గోడలవని మన్నించిన శతమున మామలము ప్రసిద్ధి వహించెన్
నినుఁ బుత్రిగాఁగ మహిఁ బడసిన జనకుని భాగ్యమహిమ చెప్పన్వశమే. 1439

వ. అని సీతం బొగడి కన్నులం గప్పికొని పురుషార్థ చతుష్టయంబుం బోని పుత్రచతుష్ట
యంబుం గని ప్రమదం బావహింపం దమమనంబుల. 1440

క. వసురాశిఁ గనిన చక్రము, లసకృత్స్వసు రాశిఁ గనిన యధనులుఁ గడుసం
తసమందు రీతిఁ బుత్రుల, వసునిభులం గాంచి యుత్సవము నొందు నెవఱ్. 1441

వ. భరతుండును భృత్యామాత్య పురోహితాది సముచితపరివార బంధుసమేతంబుగా
యుక్తక్రమంబున భరద్వాజ సందర్శనంబు నడిపి పవనతనయాదుల సాహాసోపకార
ప్రకారంబు లగ్గడించె నపుడు. 1442

క. జాను మెఱయు రాఘవుఁ డాజానుభుజుఁడు రాముఁ డుల్లసను మీఱ మహీ
జానుజులతో భరద్వాజానుమతిం బడసి కపిచయం బగ్గి పఱ్. 1443

సీ. కువలయానందమై గురుశైశ్యకరమయి నవనూత్న చంద్రమండల మనంగ
నమితచంద్రామోద మైసద్విభూతియై పరమేశ్వరుని జటాభాగమనఁగ
నవిరళ నీలమై భువ ప్రశస్తమై యుచితప్రావృడ్ఘలము చమనంగఁ
గంధోత్తమయమయి కలితావదాతమై మేరుకైలాసప్రకారమనఁగ
ారిసార ప్రవాళ విస్తార మగుచుఁ, బ్రకట పారిపూర్ణతరవనరాశి యనఁగ
దనరారు పుష్పకారూఢుఁడగుచు, రాముఁడును సమస్తజగదభిరాముఁ డగుచు.
హరికోటి రయమునఁ, జని నందిగ్రామము న్విశాలమతిశసా
డిగ్రామము నెమరం గని భూమివిభుండు పుష్పకముఁ దగ డిగియెఱ్. 1445

సుధామరులమణియభిన, వసుధామయవాఙ్నితతుఁడు భరతుఁడు భక్తి
స్వసుధా రాజ్యభరముతో, నొసఁగిన పాదుకలు దోడి చుహోజ్జ్వలభంగిఱ్. 1446

వ. నందిగ్రామంబున కపూర్వవిలాసం బావహింప భరతావాసంబు నకుం జని. 1447

సీ. కోటిబాంధవవృక్షకోరంబులకు మందహాసచంద్రిక సముల్లాస మొసఁగి
సన్మునీశ్వరసాధుసహాకారబృందంబు విపులదయానువృత్తవృష్టిఁ దనిపి
శలిముఖధ్వజినీకువలయమండమునఁ గటాక్షాంశు యోగంబున నలరఁ జేసి
పౌరజానపదస్తాసస్యము వాఘిహంబు పూరమున దైన్యంబు వాపి
సరగ భరతాదిసోదర సమ్ముఖాంబు, రాశి నిజరాక మహాప్రగఁ జేసి రామ 1448
చంద్రభూజాని భూలోకచంద్రుఁ బోని, కాంతినొప్పారె నరివారకతనుఁ డగుచు,

అఖండాఖండల వైభవాధికుండై సమస్త బంధుపరివారంబుఁ బరివేష్టింప సుఖోపవి
ష్టుండై యిష్టగోష్ఠీ సంతుష్టాంతరంగుం డగు రాముండు నిజపాదుకామూల భరతమ
హీపాలకృతవిశాలమహీపాలన సౌష్ఠవం బభివర్ణించు పౌరజానపదలోకాలోకనంబు
నం గుతూహలుండై. 1349

క. బహుమానపూర్వకముగా, గుహునిం బోఁబనిచి యారఘుప్రభుఁడు మహా
మహుఁడపుడు సోదరత్రయ, సహితుండై పటు జటావిసరము గదిర్చెన్. 1450

చ. ఇటులు జటోత్కటుం బపనయించి పృథుస్తనయిత్నుమండలో
ద్భట పటలంబుఁ బ్రోఁదిన సుధానిధిచందము నొంది సద్భటా
ర్భటు లలియంగ నంత రఘుభర్త మహార్తము నిశ్చయించె ని
స్ఫుట పటుశోభనంబులను జొన్పెను గాని నరోనాథ్య కేగఁగన్. 1451

క. కడుకొని నినుఁ దలఁచిన యప్పుడు వత్తువు గాని కదలి పొమ్మని పూజ
లడు నొనరించి కుబేరుని, కడ కనిచె న్నృపుఁడు పుష్పకము సాదరుఁడై. 1452

వ. తదనంతరంబున.

శా. స్ఫాయద్భక్తిరసుల్ సహోదరవరుల్ ప్రాఙ్ఙ్యాంబులం గొల్వఁ బా
దాయుగ్మోచ్చ మహోత్తమాంగుఁడు మరుత్పుత్రుండు మున్నెగ దై
తేయస్వామి విభీషణుండు గసుభక్తిం జేరి రా నప్పు డా
త్రాయత్తంబగు చిత్తవృత్తి రఘువంశ్యస్వామి యుత్సాహియై

క. కుండల దీప్తిక్షాళిత, గండస్థలుఁ డగుచు రథముఁ గైకొని యొప్పెం
జండకిరణుండు పొడుపుం, గొండ వయిన్వెలుఁగు గతి రఘుప్రభుం డంతన్. 1354

శా. చక్రానందప్రభానురుపరోచ్చస్యంద నారూఢిప
చ్చక్రాలి న్వెలయింపఁ జేయుచు మనోజ్ఞ ప్రక్రియాలోలుఁడై
శక్రాద్యష్ట దిగీశభావితయశోజాలప్రతీతుండునై
శక్రాశ్మప్రహసత్తనుండు వెడలె న్సాకేతవీక్షార్థియై. 1455

వ. తదవసరంబునం గౌసల్యయు సపత్నీద్వయసహితంబుగాఁ బుణ్యానితంబినీకదంబవల
యితం బగు జనకనందన కర్ణీరథంబు ననుసరించి సముచిత యానంబున వెడలె నంత.

మ. హితవృత్తిం జని రాఘవుండు గనియెన్ హేమప్రభాజాలని
ర్జిత పక్షద్వయచక్రవాక మిథునాక్షేపప్రచారంబుఁ జా
రుతరంగోద్గత వాతకంపితమహీరుట్శాఖికాడోలికా
స్థితకీరంబు లసన్మనోజ్ఞ సరయూతీరంబు దూరంబునన్. 1457

క. కని తత్సమీపమునకుఁ, జనునప్పుడు కుముద కమల సౌరభము పెం
గొనిన మలయానిలమున, న్మనిఁగిన రామునకు లక్ష్మణుం డిట్లనియెన్. 1458

సీ. కలిత రక్తోత్పల కళికావిశేషవారతి దీపకళికాప్రతతులతోడ
నధిక వాఃకేళీసమాయాత భద్రేభపటుకుంభభద్రకుంభములతోడ

